ప్రకాశకులు
అఖిల భారత సర్వసేవాసంఘ పక్షమున
సర్వోదయ సాహిత్య ప్రచార సమితి
సంచాలకుడు
శ్రీ రామకృష్ణ ధూత్
భూదాన కుటీరము
సుల్తాన్ బజారు, హైద్రాబాదు.

తొలి ముద్రణ : సెప్టెంబరు 1956
ప్రతులు : ఐదువేలు
వెల :—రూపాయి పావలా

ముద్రణ :
అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.

# ప్రస్తావన

మరాటీ సాహిత్యముతో అల్పమాత్ర పరిచయము గలవారుకూడ శ్రీ పి. వై. దేశపాండేను ఎఱుగుదురు. అతడు గ్రంథకర్తయగుటయేగాక, మధ్యప్రదేశము లోని రాజకీయరంగమున ప్రముఖుడై యున్నాడు. అతడు నా కాప్తమిత్రుడు. పురాతన కాంగ్రెసు సోషలిస్టుపార్టీని స్థాపించిన కొద్దిమంది మిత్రులలోను అత డొకడు,

నిర్మల దేశపాండే అతని కుమార్తె. తండ్రి ప్రతిభ కుమార్తెయందు స్పష్ట ముగా ప్రకాశించుచున్నది. ఈ దినచర్యలోని ప్రతిపుటయు దానికి ప్రమాణముగా నుండగలదు. సాహిత్య ప్రతిభ, విద్వత్తు దీనిలో గోచరించుచుండును. అట్లే ఉండ వలెనుకూడ. చిరంజీవి నిర్మల విద్వాంసులగు తల్లిదండ్రుల బిడ్డ. ఆమె ఉన్నత విద్యకూడ అభ్యసించి యున్నది. శ్రీ వినోబాజీ దగ్గఱకు రాకపూర్వము ఆమె నాగపురములోని ఒక కళాశాలలో అధ్యాపకత్వము చేసియుండెను.

వినోబాజీ ఉత్తర ప్రదేశ్‌లోను, బీహారులోను పాదయాత్రలు చేసినప్పుడు నిర్మల నెలలకొలది వారితోనుండెను. వారి పాదయాత్రలు భారతీయులమయిన మనకు పరమ సౌభాగ్యకరములు. కారణమేమనగా వినోబాజీ ఒక విలక్షణమయిన వ్యక్తి. ఆధ్యాత్మిక విభూతులతోపాటు ప్రకాండ పాండిత్యము, నిరుపమాన అనుభవములు వారియందు మూర్తీభవించియున్నవి. వారు ప్రతిదినము మాట్లాడు చుందురు. కాని నిత్యనూతన విషయమునే ప్రసంగించుచుందురు. కేవలము ఉప న్యాసములలోనే గాక, నిలిచినప్పుడు, కూర్చుండినప్పుడు, లేచినప్పుడు, పరుండి నప్పుడు, మందహాసము చేసినప్పుడు అమూల్యవిషయములను చెప్పుచుందురు. వానిని నోటు చేసికొనగలిగినవారు సమీపములో ఎవరును లేనియెడల, ఆ రత్న ములు మనకు లేకుండపోవును. ఒకప్పుడు వినోబాజీ సామాజిక ప్రశ్నల మీమాంసను అనాయాసముగా చేయుచుందురు. ఒకప్పుడు ఏదయినను కఠిన ప్రశ్నకు సమాధానము ఒక్క వాక్యములో చెప్పివేయుదురు. ఒకప్పుడు పురాతన ఋషుల వాక్యములకు నవ్యార్థములు బోధచేయుచుందురు. ఇవన్నియు విని తీర వలెనేగాని చెప్పుటకు సాధ్యముకాదు. ఒకప్పుడు ఏ ముసలమ్మ కుటీరములోనో ప్రవేశించి ఎంతో హృదయపూర్వకముగాను, అత్యంతానురాగముతోను మాట్లాడు చుందురు. ఆ మధురవాణి విశ్వసంపదగానుండదగినది. ఒకప్పుడు అనాయాసము గాను, అకస్మాత్తుగాను ఏదో పావన ప్రసంగము ప్రారంభమగును. ఒకప్పుడతి రమ్యమయిన చమత్కారము.

దౌర్భాగ్యమువలన వీని అన్నిటికి రికార్డులేదు. కారణమేమనగా వినోబాజీ ఎల్లప్పుడు తమవెంట మిక్కిలి తక్కువజనము ఉండవలెనని కోరుకొనుచుందురు. ఎవరయినను కొంచెము ఉపయోగకారులుగా కనిపించినయెడల వారు వారిని వెంటనే తమ దగ్గఱనుండి తప్పించి ప్రత్యక్ష కార్యక్షేత్రమునకు పంపివేయగోరుచుందురు. భారతీయ ప్రచారసాధనములు వారికి అంతగా ఉపయోగిపడలేదు. నగరములలోను, లేదా ప్రత్యేకావసరములందును ఇచ్చిన వారి ఉపన్యాసములు ప్రకటింపబడుచునేయున్నవి. కాని ప్రతిదినము వారు విరజిమ్మ అణిముత్తెములను ఏరి, కోరి, దండగ్రుచ్చి భద్రముచేయువారు తఱచుగానుందరు. ఆ మంచి ముత్యముల పరిశీలకులుకూడ నుండవలెను. ఆంగ్లేయ విద్య నభ్యసించిన మనము భారతీయ చింతనధారనుండి ఎంతోదూరమున పడియున్నాము. బాతుదెక్కలమీద నుండి నీరు జాఱిపోయినట్లు వినోబాజీ చింతనలోని బహు సూక్ష్మాంశములు మనకు బొత్తిగా అందకుండ జాఱిపోవుచున్నవి.

ఇటువంటిస్థితిలో ప్రతిభావంతురాలయిన పరిశీలనాదక్షతగల నిర్మలాబహన్ అప్పుడప్పుడు వినోబాజీతో ఉండగలుగుట మనపరమసౌభాగ్యమనియే చెప్పవలెను.

ఈ దినచర్య గ్రంథములో వినోబాజీ ఉత్తర ప్రదేశమును, బీహారులోను నాలుగు మాసములకాలము సలిపిన యాత్రావివరము వర్ణింపబడియున్నది. వర్ణన యెంత ముద్దుగానున్నదో, ఎంత సజీవముగానున్నదో, దానిని చదివినప్పుడే ఆ విషయము తెలియగలదు. యాత్రావివరములు సినీమాలోవలె మన కన్నులకు కట్టినట్లుండును. మనముకూడ వినోబాతో యాత్రచేయుచున్నట్లే, వారి ఉపన్యాసములను స్వయముగా వినుచున్నట్లే తోచుచుండును. మధ్య మధ్య నిర్మలదేవి వ్యాఖ్యానించుచుండుటవల్ల చిత్రము ఇంకను హృదయంగమముగా నుండుచుండును. ఈ దినచర్య గ్రంథములో అనేక గంభీరవిషయములపై వినోబాజీ బహిర్గత మొనర్చిన భావములు సమకూర్చబడినవి. అవి అంతకుమునుపు ప్రకటింపబడియుండలేదు. ఈ గ్రంథమువల్ల భూదానోద్యమము క్రమక్రమముగా ఎట్లు వికాసము పొందినది తెలియగలదు. అంతేగాక అహింసాత్మకమగు సమాజ క్రాంతికిని, సమాజ నిర్మాణమునకును గల అమూల్యతత్త్వము లిందు పొందుపఱుపబడియున్నవి.

ఈ గ్రంథము తప్పక పఠింపదగినది.

సర్వోదయాశ్రమము, సుఖదేవర
గయ (బీహారు)
19 జనవరి, 1955

జయప్రకాశ నారాయణ

# విషయసూచిక

## మొదటి భాగము



## రెండవ భాగము



## మూడవ భాగము

## నాలుగవ భాగము



## అయిదవ భాగము

## ఆఱవ భాగము



## ఏడవ భాగము



## ఎనిమిదవ భాగము







భూదాన యజ్ఞమువల్ల నవ్యవాతావరణ మేర్పడుచున్నది. జనుల హృదయసీమలలో నైతిక మూల్యములకు ప్రతిష్ఠ ఏర్పడుచున్నది. సామాజిక అన్యాయములను సహింపము అన్యాయము నుండి విముక్తి పొందగోరెదము అను తీవ్రభావనలు గలుగుచున్నవి. అందఱకంటెను, వెనుకబడి ఉన్నవారి విషయము ముందుగా శ్రద్ధతీసికొనవలెనని ప్రజలకు తోచుచున్నది నేను దీనినే ప్రజాసూయ యజ్ఞమని, ధర్మచక్ర ప్రవర్తనమని, నోరులేని కూలివాని సమాధానమని చెప్పుచుండును. దీనిముందు భూమి సమస్యా పరిష్కారము విశేష మహత్త్వముగలది కాదు. ఈనాడు నూతన వాతావరణమేర్పడి యున్నది. అందు ప్రాణశక్తియున్నది. దాని స్పర్శ అందఱకును తగిలిన యెడల కేవలము భూమి సమస్యయే పరిష్కృత మగుటయేమి? సమస్యలన్నియు పరిష్కరింపబడును. కారణమేమనగా మానవ సమాజములో ఇన్ని సమస్యలు పుట్టుటకు కారణములయిన కుప్రవృత్తుల పైన దీనిమూలమున గొడ్డలిపెట్టు పడుచున్నది. అందువలన నీ సమస్య ఎన్నడు పరిష్కరింపబడునా అన్న ఆలోచనయే నా మనస్సులోనికి రాదు.

— వినోబా



## మొదటి భాగము

# దానధార మఱియు జ్ఞానధార

భదోహీ (బనారస్)
20—4—1952.

*ఓం పూర్ణమదః పూర్ణమిదం....*

రాత్రి గడిచిపోయినట్లే. కాని ఉదయము ఇంకను కాలేదు. ప్రాతఃకాల ప్రార్థనయందు ఈశావాస్యోపనిషత్తు చదువబడెను. బాపూజీకి ఆత్మజులయిన వినోబాజీ బాణమువలె ఱివ్వున కదలి పోయిరి. అది చూడగా 'నవకాళీ'లో అసమగ్రమయిన యాత్ర ఈనాడు పూర్తిచేయబడు చున్నదా యని మావంటి వారికి తోచెను.

నిత్యక్రమము ననుసరించి ఉదయము నాలుగు గంటలు కాగానే సేవాపురి ఆశ్రమమునుండి మాయాత్ర ప్రారంభమయ్యెను. పదునాలుగుమైళ్ళ దూరమున 'భదోహీ' అను గ్రామములో మా మొదటి మజిలీ. వినోబాజీ మిక్కిలి వేగముగా నడుచుచుందురు. కాని నా జీవితము సుఖమయమయినది. శ్రమను గుఱించి పుస్తకము లలో మాత్రమే చదువుకొంటిని, కల్పనా జగత్తులోను, భావ జగత్తు లోను శ్రమనిష్ఠగలదానను. కష్టసహనముగల దానను అయితే కావచ్చుగాక! అయినను వాస్తవిక జగత్తులో మాత్రము నాస్థితి అందుకు భిన్నమయినది. ఈ రెండు జగత్తుల అంతరమును పోగొట్టు కొనుటకేగదా, నేను ఇచ్చటికి వచ్చితినని ఆలోచించుకొంటిని.

మా యాత్రీదళములో చిరకాలమునుండి అనుభవము గడించిన బాటసారులు కొందఱును, అథము శుభము ఎఱుగని నావంటివారు

కొందఱును ఉండిరి. యూనెస్కోలో పనిచేయుచున్న దక్షిణ అమెరికా నివాసినియగు ఒక సోదరియు, పత్రికా విలేఖరియగు ఒక ఫ్రెంచి సోదరియు, సేవాగ్రామమునుండి వచ్చిన విద్యా బహెనును నావలెనే క్రొత్తవారు. అందువలన మజిలీకి చేరుకొనగనే, మాలో ఎవ్వరమును పనిచేయు స్థితిలో లేకుంటిమి. కాని రెండవ వంక చూడగా, మాతోనే యాత్రసాగించిన మృదు, గౌతముడు మొదలయిన చిన్నపిల్లలు వెంటనే పనిపాట లందుకొనిరి. వినోబాజీ "లోక నాగరిలిపి మైపు రైటరు"పయిన ఇద్దఱును సంతోషముతో మైపు చేయుచుండిరి.

నిత్యక్రమము ననుసరించి సాయంకాలమున నూలు వడకుట, ప్రార్థన, ప్రవచనము మొదలయిన కార్యక్రమము ఆరంభమయ్యెను. నూలు వడకుటను గుఱించి వినోబాజీ ఇట్లు చెప్పిరి. "పిల్లవాడు బోధ వల్లగాక, చూచుటవల్లనే విషయములను గ్రహించుచున్నాడు. అందు వల్లనే బాపూజీ, మనవంటి పిల్లలకు పాఠము నేర్పుటకయి నిత్యము నూలు వడకుచుండెడివారు. గాంధీజీని స్మరించుకొన్నందువల్లనే మనము మన జీవితమును సుఖమయముగా చేసికొనగలుగుదుము"

నాలుగువైపుల లంచగొండితనము, దొంగ అమ్మకములు సాగు చున్నవి. యావత్తు సమాజముయొక్క నైతిక ప్రమాణము పడిపోయి యున్నది. ఈ రోజులలో సర్వత్ర ఈమాటలే వినవచ్చుచున్నవి. వినో బాజీ సన్నిధికి వచ్చెడి చాలమంది జనులు వారి కీమాటలనే వినిపించు చుందురు. కాని వినోబాజీ ఇట్లు చెప్పుచుందురు. "నేను పవనారు నుండి కాశీవఱకు వేయిమైళ్ళ దూరము.యాత్రచేసితిని. కాని నేటి వఱకు నాకు ఒక్క దుర్జనుడుకూడ కనపడలేదు..."

నాకు మహాభారతములోని కథ ఒకటి జ్ఞాపకమునకు వచ్చి నది. ఒక పరిషత్తు జరుగుచుండెను. అందు ధర్మరాజునకు ఒక్క దుర్జ నుడుకూడ లభింపలేదు. ఆ సభయందే దుర్యోధనునకు ఒక్క సజ్జనుడు కూడ కనబడలేదు. అప్పుడు నా మనస్సులో ఒక శంక బయలుదేరినది.

"ఏమి, మన మందఱము దుర్యోధనులు అయిపోతిమా ? కనుకనే మనకు నాలుగువంకల కేవలము దుర్జనులు మాత్రమే కనబడుచున్నారా ? దీని సారాంశ మిదియేనా" అని. ఈ శంక గదర్భాన్నే దానికి వినోబాజీ చెప్పిన ఈ సమాధానము వినగలిగితిని; "మానవుని హృదయము శుద్ధమయినది. కాని నేటి సంఘపద్ధతి చెడిపోయియున్నది. ధనమునకు ప్రాధాన్యము ఎక్కువయి పోయినది. ప్రతి ఒక్కరు బంగారు రూపమయిన ఎండమావుల వెంటబడి పరుగులు పెట్టుచున్నారు. కాని మానవునకు సద్వస్తువుయొక్క జ్ఞానముకలుగ జేసినయెడలను, అతని హృదంతరాళమునందు గర్భితమయి యున్న మంచితనము వెలికివచ్చుటకు అవకాశము కలుగజేయబడిన యెడలను, అతని మంచితనము తత్క్షణమే బహిర్గతము కాగలదు. భూదాన యజ్ఞముద్వారా ఈ పనియే జరుగుచున్నది.

అనంతరము, వినోబాజీ హృదయమునకు సూటిగా తగులునట్టి ఒక విషయమును గురించి వివరించిరి. "ఒక నిఱుపేదరైతు ఉండెను. అతనికిగల మొత్తము భూమి ఒకటిన్నర బీగాలు (బీగమునకు సుమారు 62 సెంట్లు) అతడు నావద్దకువచ్చి దాన మిచ్చెదనని కూర్చుండెను. అతనితో నేనిట్లంటిని. "నీవు స్వయముగా బీదవాడవు. కాబట్టి దానము ఇవ్వవద్దు." నేనట్లు అనగా అతడు ఏడువసాగెను. "దాన మియ్యకుండ ఉండలే" నని. ఇంత మహాయజ్ఞము ప్రారంభమయినదయి యుండగా భారతీయుడనయినందుకుగాను తానుకూడ కొంత ఆహుతి అర్పణ చేయనిదే వెడలిపోవుట భావ్యమని అతనికి తోచలేదు. అతడు బీదవాడయితే నేమి ? కుచేలునివలె పిడికెడు అటుకులు సమర్పించుటకు అతనికి అధికారము లేదా ? చివరకు, అతని భక్తికి వశీభూతుడనయి అతని దాన పత్రమును తీసుకొంటిని. అప్పుడతడు సంతోషించెను...ఇటువంటివి ఎన్నో కథలున్నవి. అటువంటి మహనీయులను స్మరించుటవల్లనే హృదయము పవిత్రమయి పోవును"

ఈ చివరిమాటలు చెప్పుచుండగా వినోబాజీ కంఠధ్వని కంపించి పోయెను. వారినేత్రములు కన్నీళ్ళతో నిండిపోయెను. కొంచెముసేపు ఆగి, వారు గ్రామీణులతో ఇట్లు చెప్ప నారంభించిరి. "భారత దేశములో రెండు ధారలు నిరంతరము ప్రవహించుచునే ఉన్నవి. గంగా యమునా ప్రవాహములవలె ప్రాచీనకాలమునుండి నేటివఱకు ఇచ్చట జ్ఞానధారయు, దానధారయు నిరంతరము ప్రవహించుచునే యున్నవి. దానధారలో స్నానముచేసి మీరు మీమీ జీవితములను పునీతములు గావించుకొనండి." ఈ సందేశమును వినిపించుటకే వారి యాత్ర సాగుచున్నది. వారు దానధారతోబాటు జ్ఞానధార మహత్త్వమునుకూడ వినిపించుచున్నారు. "ప్రతి దినమును జ్ఞానము సంపాదించుచుండవలెను. మీరు చదువురాని వారయిన యెడల కొంచెము శ్రవణము చేయవలెను. జ్ఞానము సంపాదించకుండ ఒక్కదినముకూడ గడవరాదు. ఏదినమందు మనకు జ్ఞానసమాచారము వినబడదో, ఆ దినము మనకు వృధాగా పోయినట్లే."

## రాజారామ్ – ప్రజారామ్

రాంపూర్ (జౌన్‌పూర్)
21—4—1952

ఒక దినమున నేను కూర్చుండి దినచర్యను గుఱించి ఆలోచించుచుంటిని. ఒక విధముగా చూచిన, కూర్చుండుటకు అవకాశమెక్కడ ? అయినప్పటికిని, ఎప్పుడయినను ఏకాంతముగా నుండు అవకాశము దొరికిన యెడల, వెనుకటి నా జీవితములోని చిత్తములన్నియు ఎట్ట ఎదుట తిరుగుచునే యుండును. నేటి విద్యా విధానమును గుఱించి కొంచెము ఆలోచింప సాగితిని.

నేటి విద్యా పద్ధతిలోని గొప్ప లోపమును ఇప్పుడు గట్టిగా గ్రహింప గలిగితిని. నేను గత పదునెనిమిది సంవత్సరములు చదువు నేర్చుకొనుటలో కాలము గడిపితిని. ఆ రోజులలో నేను ఎన్నడును అడవినుండి కట్టెలు తెచ్చియుండుటగాని, ఆవులను మేపియుండుట గాని యెఱుగను. అందువలన నా శరీరము ఏవిధమయిన దేహపరి శ్రమకు పనికిరానిదయ్యెను. వినోబాజీ యాత్రలో ప్రవేశించిన మొదటి దినముననే నా ఆరోగ్యము చెడిపోయెను. గడచిన పదు నెనిమిది సంవత్సరములలో, ఏవిషయములోను ప్రవీణురాలను కాలేక పోతిని. ఆసంగతి స్పష్టమే. కాని వర్ధా మహిళాశ్రమ నివాసినియగు నర్మదాబేను నావలె క్రొత్తదే అయినప్పటికిని, వినోబాజీతో కూడ మిక్కిలి చులుకుగా నడచుచుండెడిది.

నేను పనికిమాలిన దానసని తెలిపోయినది. అందువలన మఱు చటి దినమున, నేను సామానులు మోసికొనిపోవు జీపుకారులో కూర్చుండి ముందు మజిలీకి పోవలసినదాన నయితిని. అందటి మన స్సును ఆకర్షించుటకు రోగముకంటె మించిన సాధనము వేఱొకటి ఉండబోదు. వినోబాజీ మొదలుకొని ప్రతి ఒక్కరు నన్నుచూచి, 'నీ ఆరోగ్యము ఎట్లున్నది, ఎట్లున్నది' అని అడుగుచుండెడి వారే. వెంటనే నాకు చికిత్స కూడ ప్రారంభమయ్యెను. వినోబాజీ, 'నాయనా ! ఇప్పుడు నీ ఆరోగ్యమెట్లున్నది' అని నన్నడిగిరి. ఆమాటలు వినగానే నాలో ఎక్కడలేని బలము వచ్చినది. తరువాత తరువాత కొందఱు నాతో ఇట్లు చెప్పుచుండెడివారు. 'ఆమె శరీరము దుర్బల మయి పోయినప్పటికిని, మానసిక బలము వల్లనే అన్ని పనులు చేయ గలుగుచున్నదని వినోబాజీ నిన్ను గుఱించి చెప్పుచున్నారమ్మా !' ఈమాటలు విన్నప్పుడు నాకు నడచుటకేకాదు, పరుగెత్తుటకు కూడ శక్తికూడ వచ్చెడిది.

మా నివాసస్థానము ఎల్లప్పుడును గ్రామమునంతటికిని ఆకర్షణ స్థానముగా ఉండుచుండెడిది. ప్రభుత్వోద్యోగులు, వేలువేలు రాజకీయ పక్షముల కార్యకర్తలు, గ్రామములోని గొప్ప గొప్పవారు ఇంకను ఇతరులు మమ్ము సేవించుటకయి వచ్చుచుండిరి. గ్రామములో మా నివాసము శిథిలమయిన ఏ పాఠశాలా భవనములోనో అగుగాక! అయినను మాకది మహారాజ భవనముపలె తోచుచుండెడిది. వినోబాజీ ఎల్లప్పుడు చెప్పుచుందురు. 'నేను లోకములోని చక్రవర్తులందరికంటెను గొప్ప చక్రవర్తిని. సామాన్యముగా చక్రవర్తులకు ఏదో ఒక రాజభవనము లున్నయెడల మిక్కిలి ఎక్కువగా ఉన్నట్లే లెక్క. కాని నాకో నిత్యము నూతన రాజభవనము తయారగుచున్నది.' మేము కూడ వినోబాజీ తోడి యాత్రికుల మగుటవల్ల, చక్రవర్తి కుటుంబమునకు చెందిన వారమే అయిపోతిమి. సాధుపుంగవుని దర్శనము కోఅకువచ్చు జనులు మా దర్శనము కూడ చేసికొని పోవుచుండిరి.

మా యాత్రీ దళములోనున్న ఫ్రెంచి మహిళ భారతీయ దుస్తులను ధరించుచుండెడిది. భారతీయ జీవితములో పూర్తిగా ఏకమయి పోవుటకు ఆమె చేయుచుండెడి ప్రయత్నములు చూడగా, సూటు బూటు ధరించెడి మన 'బాబులు' జ్ఞాపకము వచ్చెడివారు. నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్చుకొనగానే మనవారు ఇంగ్లీషు వారిని అనుకరింప జూతురు. కాని యూరపు దేశస్థులయిన సోదరీ సోదరులు ఇక్కడకు వచ్చి, భారతీయులగుటకయి యత్నములు చేయుచుందురు. ఆ ఫ్రెంచి సోదరి మాతోపాటే కాలినడకను వచ్చుచుండెడిది. నేలమీద బాసికపట్టు వేసికొని కూర్చుండెడిది. పాశ్చాత్యుల కలవాటైన చెంచా మరియు ముళ్ళచెంచా లేకుండ చేతితో అన్నము తినుచుండెడిది. ఆమె భూదాన కార్యములు చూచుటకయి వచ్చియుండెను. ప్రజలు తమ ప్రాణములకంటె ప్రియమయిన

భూమిని దానముగా ఎట్లివ్వగలరు ? ఇది ఆమెకు ఒక గొప్ప సమస్య అయిపోయినది. భూదాన యజ్ఞము ద్వారా అహింసాయుతమగు సంఘ వ్యవస్థ ఏర్పడగలదు అన్నమాట ఆమె నమ్మలేకపోయెను. యుద్ధ మను పేరుతో మానవుని పశుప్రవృత్తులన్నియు, ఎంత ఉగ్ర రూపమును ధరింపగలవో వాని నన్నిటిని ఆమె ఇంత వఱకు చూడ గలిగెను. కాని ఇక్కడ మానవుడు పేదవాడగు తన పొరుగువాని నిమిత్తము తన భూమిని ఇచ్చివేయు చున్నాడు. అదికూడ ఒక సాధు పుంగవుని ప్రేమ పూరితమగు కోరికపైన...ఇదంతయు ఆమెకు ఇంద్రజాలమువలె కనబడుచుండెను. కనుకనే నమ్మలేకపోయెను. కాని ఆమె కన్నులతో సర్వము చూడగలిగెను. దారిలో వినోబాజీ అప్పుడప్పుడు దర్శనమునకయి వచ్చినవారి మధ్య నాలుగు నిమిష ములు ఆగి నాలుగు మాటలు చెప్పుచుండిరి. అంతట భూదానము వర్షాపాతమువలె వచ్చుచుండెడిది. ఒక దినమున ఆమె నాతో ఇట్లనెను. "మీ భారతీయులు చాల మంచివారమ్మా ! కాని స్వప్న లోకములో అధికముగా విహరించుచుందురు." అందుకు నేనిట్లు జవాబు చెప్పితిని. "అమ్మా ! నీవు వేనిని స్వప్నములనుచున్నావో, అటువంటివి ఎన్నిటినో మా కన్నులతో మేము చూచియున్నాము. గాంధీజీ కార్యకలాపములు చూచినవారెవ్వరు భావి కాలమును గుఱించి ఆశాపూరితులు కాకుండ ఉండజాలరు."

వినోబాజీ గ్రామీణుల యెదుట మాట్లాడునప్పుడు తన్మయులై పోవుచుందురు. వక్త, శ్రోత అను ద్వంద్వమే నశించిపోవును. హృద యమునుండి వెల్వడు భాషను హృదయమే గ్రహింప గలదు. మిక్కిలి నూతనమైన, క్రాంతిపూరితములగు భావములను వినోబాజీ ఎంతో సరళముగా బోధించినప్పుడు, ప్రజలు ఇట్టే ఆ సంగతిని గ్రహించు చుందురు. వారు ఒక పర్యాయము ఇట్లు చెప్పిరి. "నేను ఈ సంఘ వ్యవస్థను ఒక్క క్షణముకూడ సహింపజాలను. మనము రామరాజ్య

మును స్థాపింప గోరుచున్నాము. ఆ రామరాజ్యములో రాజు రాముడు, ప్రజ రాముడు. అంతా రామమయమే.'' ఈ భావముల మేళవింపు ప్రజల మనస్సులో తమకు తెలియకుండగనే ప్రవేశించుచున్నది. చదువరులమయిన మనము క్రాంతి గ్రంథములు చదువుచుందుము. సామాన్యులగు భారతీయులు అజ్ఞానులనియు, కొద్దిచూపు గలవారనియు, చాదస్తులనియు దోషారోపణచేయుచుందుము. సామాన్యులగు భారతీయులను క్రాంతిమయులుగా చేయుట ఎట్లు సాధ్యమో నేర్చుకొనవలెనన్న, ఈ సాధుపుంగవుని ఆశ్రయింపవలసినదే.

ప్రజల సాంగత్యమును అత్యధికముగా పొందుటకుగాను, ప్రస్తుతము మా భోజనపు ఏర్పాటులు వారి యిండ్లలోనే చేయబడినవి. యాత్రీ దళములోని వారు ఇద్దరో ముగ్గురో, ఒక్కొక్క యింటికి భోజనమునకయి పోవుచుండెడివారు. అందువలన వంటయింటి వరకును క్రాంతి సందేశమును అందజేయుటకు అవకాశ మేర్పడెను. కాని ఉదయము 14, 15 మైళ్లు నడచినవెనుక, అది కూడ ఉత్తర ప్రదేశములోని మలమల మాడ్చే ఎండలో, కేవలము భోజనము నిమిత్తము ఒకటిరెండు మైళ్లు నడవవలసి వచ్చెడిది. ఆ సమయమున ''ఉదర భరణము'' కేవలము యజ్ఞకర్మవలె తోచెడిది. నేను ఈరోజున ఒకరియింటికి భోజనమునకై పోతిని. ఆ యింటి స్త్రీలతో మాట్లాడుటకయి పొయ్యి యొద్దకు పోవుచుంటిని. ఇంతలో ఆ స్త్రీలువచ్చి, 'అమ్మగారూ ! దగ్గఱకు రాకండి. ఆ వస్తువులు తాకవద్దండి' అనిరి. వారు మాయెడల ఎంతో ఆదరము, శ్రద్ధ చూపుచుండిరి. కాని పరంపరాగతమగు ఆచారమువలన మమ్ము దగ్గఱకు రానీయరయిరి. ''వీరందఱు సాధుపుంగవుని చెంతనుండు స్త్రీలు. వీరిది ఏజాతియో తెలియదు. బహుశా, వీరిలో ఒకరిద్దఱు హరిజనస్త్రీలున్నను ఉండవచ్చును'' అని ఆ స్త్రీలు ఆలోచించి యుండవచ్చును... ఒక మానవునినుండి వేఱొక మానవుని దూరముగా ఉంచుటయే ఆచారమయి పోయినది.

# శబరి రేగుపండ్లు

మడియాహూ (జౌన్పూర్)

22—4—1954

నడచునప్పుడు ఆరంభములో కొంచెము సేపు శాంతిగా ఉండెడిది. దిన మంతయు కార్యక్రమము అన్నిటిలోను మునిగియుండెడి వినోబాజీకి అప్పుడే శాంతముగా చింతన చేయుటకు సమయము దొరకెడిది. అటుపిమ్మట దారిలో చర్చలు, కలయికలు ఆరంభమయ్యెడివి. ఆ చర్చలు కూడ ఇంగ్లయందు జరుగునట్టివిగా ఉండుటవల్ల ఎంతో రుచికరముగా ఉండెడివి. ప్రతి ఒక్కమాట వినిపించిన ఎంత హాయిగా నుండును అనిపించును. కాని అందుకుగాను, వినోబాజీ నడక అందుకొనుట మిక్కిలి కష్టసాధ్యముగదా !

ఈ రోజున సోదరి ప్రేమాదేవితో సంభాషణ జరుగుచుండెను. వినోబాజీ ఇట్లనిరి: "శంకరాచార్యులవంటి తేజస్వి, వైరాగ్యమూర్తి జ్ఞాన నిష్ఠురాలయిన స్త్రీ జన్మింపవలెనని నేను కోరుకొనుచుందును. అటువంటి స్త్రీ జన్మింపనిదే, స్త్రీ జాతి ఉద్ధరింపబడదు." "స్త్రీ జాతికి బ్రహ్మచర్యమునకు, సన్యాసమునకు అధికారము గల"దని సేవాపురి సమ్మేళనములో వినోబాజీ చెప్పినప్పుడు పెక్కండ్రు సనాతనులు "శివ శివ" యని చెవులు మూసికొని యుందురు.

గ్రామము సమీపమునకు వచ్చుచుండెను. రామధున్ యొక్క ఘోష, వాద్యముల ధ్వని, మఱియు భూదానమును గుఱించిన నినాదములు అన్నియు కలిసి వినవచ్చుచుండెను. స్వాగతము నిమిత్తమై అచ్చటచ్చట ద్వారములు నిర్మింపబడెను. బాట లన్నియు పరిశుభ్రము చేయబడెను. మామిడి మండల తోరణములు కట్టబడెను. పూలవాన

కురియుచుండెను. దారికి రెండువైపుల చిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు అసంఖ్యాకముగా నిలబడియుండిరి. "భూమి దానయజ్ఞమును సఫలము చేసెదము." "మహాత్మా గాంధీకీ జై" అను నీ రెండు నినాదములు ఆకాశ మందంతటను ప్రతిధ్వనించెను. ఈ రెండు నినాదములకును మూలములో సంబంధము కలదని ప్రజలు సూచించుచున్నట్లునాకు తోచినది.

ఈ రోజున మేము ఒక కళాశాలలో బస చేసితిమి. చర్చ జరుగుచున్నప్పుడు కొన్నిప్రశ్న లడుగబడెను. అవి మంచివి కూడాను. "భూదానయజ్ఞము ట్రస్టీషిప్ (ధర్మకర్తృత్వము) లోనికి వచ్చునా, రాదా" అని ఒక సోదరు డడిగెను.

వినోబాజీ: అవునవును. వచ్చును. కాని భూమిని గురించి మాత్రము దానికి మనము ట్రస్టీలమని చెప్పజాలము. కారణమేమనగా భూమి పరమేశ్వరుని ప్రసాదము. 'మన ఆస్తిపాస్తులకు మనము ధర్మకర్తలము. యజమానులము కాము' అన్న భావన యేర్పడవలెను. ఏవస్తువు నైతిక దృష్టినుండి దోషపూర్ణముగా కనబడునో, అది సమాజదృష్టినుండి దండింప దగినదని గ్రహింపవలెను. ఈరోజున దొంగతనము మంచిదని చెప్పువారు సంఘములో ఒక్కరును ఉండరు. అందువల్ల చట్టములో కూడ దొంగతనము పాపమని అంగీకరింపబడినది. దొంగతనము వలెనే, భూమిని కూడబెట్టుట కూడ నైతిక దృష్టినుండి పాపమని, జమీందారులు స్వయముగా గుర్తింపవలెనని నేను కోరుకొనుచుందును. జనులందఱును ఈ నా మాటలను అంగీకరించెదరు. కారణమేమనగా ఈరోజున ప్రజలందఱు దొంగతనమునకు వ్యతిరేకులు. కనుక రేపటి దినమున సంఘము పిసినిగొట్టుతనమును దోషమని చెప్పవచ్చును. నిజమునకు పిసినిగొట్టులు దొంగలకు తాతలు. ధనమును కూడబెట్టుట వల్లనే దొంగలు బయలుదేరుచున్నారు. ఉపనిషత్తులో రాజు చెప్పుచున్నాడు: "న మే స్తేనో

జనపదే న కదర్యః" (నా రాజ్యములో దొంగవాడును లేడు. ధనమును కూడబెట్టువాడును లేడు.) దొంగతనము వలెనే కూడబెట్టుట కూడ దోషమని ఏనాడో ఒకనాడు సంఘము అంగీకరింప గలదని నమ్ముచున్నాను. కారణమేమనగా, అది సద్భావన.

నిత్యము జరుగు చర్చలలో వినోబాజీ వినూతన భావములను ప్రవేశపెట్టుచుందురు. ఆకళ, ఆనేర్పు ఎంతో ఆకర్షణీయముగా ఉండును. ఈరోజున వారు ఇట్లనిరి: "రాజశక్తియొక్కయు, ఋషి శక్తియొక్కయు లక్షణములు వేరువేరుగా నుండును. ఋషులు ప్రజాభిప్రాయమును సృష్టిచేయగలరు. ఆ విధముగా ఏర్పడిన ప్రజాభిప్రాయమును ఆధారముగా గొని రాజశక్తి పనిచేయగలదు. రాజశక్తిద్వారా, క్రాంతి ఏస్నడును రాజాలదు. ఋషులే క్రాంతిని తేగలరు. సంఘములో మూడు రకముల మనుజులున్నారు. (1) సంఘమును ముందుకు నడపింప గలిగిన క్రాంతిని దర్శించునట్టి ఋషులు (2) సంఘముతోపాటు పయనించు సంఘ మిత్రులయిన సంఘ సంస్కారులు. (3) సంఘము అడుగు జాడలను బట్టి నడుచునట్టి సేవకులు అనగా ప్రభుత్వము. ప్రభుత్వమువారు మన నౌకరులు. మనము నౌకరులను ఎంచుకొనుచున్నాము. కనుక ఎవరు ప్రభుత్వములో ప్రవేశించుచున్నారో వారు మన నాయకులుగా ఉండజాలరు. సేవకులుగా ఉండిపోగలరు. ప్రజల ఆజ్ఞ ననుసరించి ప్రభుత్వము పనిచేయుచుండును. కనుక సమాజమునకు అభ్యుదయ పరంపరల సాధింపగల నాయకులు ఋషులే అయియున్నారు."

నా చెవులయితే ఈ భావనను విన్నవి. కాని మెదడులో ప్రవేశించుటకు కొంతకాలము పట్టినది. స్వరాజ్యము వచ్చిన తరువాత, ప్రభుత్వము వారు మనకు వైకుంఠమును ఒరిగింతురని ఎంతో ఆశపెట్టుకొనియుంటిమి. ఆ ఆశకు గొడ్డలిపెట్టువలె ఈనాడు వినోబాజీ

పలికియున్నారు. భూమిపైన స్వర్గమును ప్రతిష్ఠింపవలసిన పని సర్కారుదే యని మనము భావించుచుంటిమి. ఒకవేళ ప్రభుత్వమువారు ఈపని చేయజాలనియెడల దానిని తిట్టిపోయుట మన కర్తవ్యమని తలచితిమి. కాని వినోబాజీ ఇప్పుడు చెప్పుచున్నారు. "మీరు ఏ ప్రజలను ఎన్నుకొని యున్నారో వారు మీ నాయకులు కారు, సేవకులు. అందువలన వారు నేడు సంఘమునకు దారిచూపజాలరు." ఈ భావనలు మెదడులో పనిచేయ సాగినవి. ఇంతలో వినోబాజీ వాక్యమొకటి తటాలున నా స్మృతిపథమున తగిలినది. "మీరు చిలుకను ఎప్పుడు విడిచివేయుచున్నారో, అప్పుడే మీ సంకెళ్లు కూడ తెగిపోయినవి." శోషణ పద్ధతి ఎట్లు అంతమొందగలదు. అన్న దానికి ఇంతకంటె సుందరమయిన సమాధానము ఏమి కాగలదు ? చర్చ ఇంకను సాగుచుండెను. "ప్రజలకు సదసద్వివేకబుద్ధి కలుగవలెను. ఈరోజున ప్రజాభిప్రాయము యుద్ధమునకు గాని, హత్యాకాండకు గాని వ్యతిరేకముగా లేదు. సారాంశమేమనగా సదసద్వివేక బుద్ధిని వికసింపజేయవలసి యున్నది. యుద్ధ మను పేరుతో సామూహిక హింస జరుగుచున్నది. దానిని వ్యతిరేకించునట్టి ప్రజాభిప్రాయములను మనము కలుగజేయవలెను. మానవ సమాజము నిరంతరము వికాసమును పొందుచునేయున్నది. కనుక నేడు మానవ హృదయములో యుద్ధమునకు గల స్థానము రేపు నష్టమయిపోగలదు. లోకములో మరల యుద్ధమునకే స్థానము లేకుండపోవును."

"ముద్రణ యంత్రములు లేని రోజులలో సయితము తులసీ రామాయణము ఎంతగా విస్తరించినదో, అంతగా ఏ ఆధునిక గ్రంథము విస్తరించి యుండలేదు. ఏ చక్రవర్తి సామ్రాజ్యమును విస్తరించి యుండలేదు. ఎన్నో సామ్రాజ్యములు వచ్చినవి, పోయినవి. కాని తులసీ రామాయణ సామ్రాజ్యము మాత్రము నేటివఱకును అవిచ్ఛిన్నముగా సాగుచున్నది."

సమీపమున 'టికారడీ' అను గ్రామమొకటి గలదు. అందున్న భూస్వాము లందఱును కలసి ఈనాడు తగినన్ని భూదానములు చేసి యున్నారు. ఆ కారణము వలన ఆ గ్రామములోని భూమిహీను లందఱకును తగినంత భూమి లభించియున్నది. ఆ భూస్వాములు భూమితో పాటు విత్తనములు, నాగళ్లు మొదలయిన సాధనములను గూడ దానముగా ఇచ్చివేసిరి. భూదానముతో పాటు ఇతర సాధనములు కూడ ఇవ్వబడినయెడల వినోబాజీ ఆ దానమును సాలంకృత కన్యాదానమని చెప్పుచుండెడివారు. నేటి ప్రార్థనా సమావేశమునందు టికారడీ వాసులకు గొప్ప స్వాగతమొసంగబడెను. వారిని ఊరేగించి సభాస్థలికి గొనివచ్చిరి. భూదానములు ఇచ్చినవారిలో బీదవారి సంఖ్యయే అధికముగా నుండెను. వారి శరీరములు చినిగిపోయిన వస్త్రములచే కప్పబడియుండెను. వారి ముఖమండలములు చింతచే వాడియుండెను. కాని వారి నేత్రములనుండి దాతృత్వము చేయుచున్నామను అపారతృప్తిని వెల్లడించు జ్యోతిస్సులు వెలికి వచ్చుచుండెను. వారిలో ఒక ముసలివాడుండెను. అతడు మధ్య మధ్య సాధుపుంగవుని (వినోబా) వంక చూచుచుండెను. అతని నేత్రముల నుండి భక్తిభావము గోచరించుచుండెను. అప్పుడప్పుడు ఆనందాశ్రువులు సయితము రాలుచుండెడివి. కాని అతడు మఱియొక వంకకు చూచుచు, ఏదో గంభీర చింతనయందు మునిగియున్నవానివలె కనబడెను. అతడు తన జీవితములోని ఈ చివరిదినములలో క్రాంతి పూర్ణమగు నిర్ణయమొకటి చేసికొనియుండెను. అందు వలన అతడు తన వెనుకటి జీవితమును స్మరించుకొనుచుండెనా, యేమి ? భూమాత ఒడిలో నుండి గోధుమ, సెనగమొక్కలతో ముచ్చటలు చెప్పి చెప్పి, ఆట పాటల యందు గెలుపును, ఓటమిని అనుభవించి అనుభవించి అతడు తన బాల్యకాలమును గడపియుండెను. పసుచుదనములో చిన్న పొలముచెక్క కొఱకై తన సోదరునే మోసము చేసియుండ

వచ్చును. లేదా తనతమ్ముని, కన్నబిడ్డవలె పెంచి, పోషించి పెద్దవానిగా చేసియుండవచ్చును. హిందూస్తానములోని మామూలు రైతునకు అతని జీవితములో ఎన్ని సుఖ దుఃఖములు గలుగుచుండునో, వాని నన్నిటిని అతడు అనుభవించియే యుండెను. ఈనాడు అతడు ఒక సాధుపుంగవుని పిలుపు విని, తనకంటె బీదలయిన భూమిహీనులగు సోదరులకుగాను, శబరి రేగుపండ్లు అర్పించినట్లు, తన భూమిని ధార పోసి బహుశా తన జీవితములోని యశస్సును, అపయశస్సును తూచు కొనుచున్నాడేమో! సుఖదుఃఖములు రెండిటిని అతడు అనుభవించు చుండవచ్చును. జీవితము మునుపటిదే. కాని ఈ ఒక్క దానమువల్ల అతని జీవితము మెఱసిపోవుచున్నట్లుండెను. తన జీవితములోని ఈ చివరి గడియలలో అతనికి ఈశ్వర సన్నిధానము ప్రాప్తమైనట్లు తోచి యుండవచ్చును. ఏమయినను, అతడు కేవలము సుఖియైయున్నాడని చెప్పజాలము. కాని ఆలోచనా పరవశుడయినట్లు మాత్రము కనబడు చుండెను. ప్రవచనమయిన పిమ్మట రామధున్ ప్రారంభమయ్యెను. అతని పెదవులు రామనామజపములో కదలుచున్నప్పటికిని మనస్సు మాత్రము ఏదో గంభీరవిషయమును చింతనచేయుచున్నట్లుండెను. ఈనాడు జరిగిన సంగతివల్ల అతని దృష్టి ఏదో చిరంతన తత్త్వమువు వంకకు పోయినట్లు కనబడెను.

నేటి ప్రవచనములో వినోబాజీ ఇట్లు చెప్పియున్నారు: "భారత దేశములో మాట్లాడుటకంటె మౌనధారణ వల్లనే అధిక ఫలము కలుగు చున్నది. ఇచ్చోట పదివేల వత్సరములనుండి ఆంతరంగిక ఐక్య భావన నిండియున్నది. విద్యావంతుడు కానీ, కాకపోనీ, ఈ సృష్టి అంతయు ఒక్క వస్తువుచేతనే నిండియున్నది అని ప్రతివాని హృద యము గుర్తించు చున్నది. బాపూజీ సంచారము చేయుచుండిరి. జనులు వారి భాషను అర్థముచేసికొనుచుండిరి. జనులు విద్వాంసుల మాటలకంటె హృదయమునుండి వెలువడిన భాషనే సులభముగా

గ్రహించుచున్నారు... ఈరోజున నాకు ఎక్కువగా మాట్లాడవలసిన పని ఉండదు. నాభావన జనుల హృదయములోనికి చొచ్చుకొని పోయినది. ఇప్పుడు మాటల అవసరమే ఉన్నట్లు కనబడదు. శబ్దాతీత మయిన కార్యము ఆరంభమయినట్లున్నది. అవ్యక్తమగుశక్తి ప్రతి హృదయమును స్పృశించుచున్నది. ప్రబోధము కలుగజేయుచున్నది. ప్రేరణ కలుగజేయుచున్నది. ఈ యజ్ఞములో శ్రద్ధాభావముతో అర్పణయగుచున్న అసంఖ్యాకములగు ఆహుతులే దాని వ్యక్త స్వరూపము"...జనులు భూదానము నెట్లుచేయగలరు ? ఇదేదో చిక్కు సమస్యగా విద్యావంతులను బాధించుచుండును. దీనికి సమాధానము కావలెనన్న భారతదేశములోని అనేక వేల సంవత్సరములనాటి ప్రాచీన సభ్యతను, తత్త్వజ్ఞానమును, చింతన మొదలయిన వానిని అధ్యయ నము చేయవలెను. ఈనాడు భూదానమును సమర్పించు నిఱుపేద రైతు, లోకములోని మానవ శాస్త్రజ్ఞులకును, రాజనీతి కోవిదుల కును, అర్థశాస్త్ర పండితులకును గొంతుక దిగని పచ్చి వెలగకాయ వలె తోచుచున్నాడు.

## బాపూజీ అడుగు జాడలలో

జౌన్‌పూర్

23—4—1952.

మార్గ మధ్యమున వినోబాజీకి అర్పించుటకై జనులు పలు రకములయిన వస్తువులను తెచ్చుచుందురు. వినోబాజీని మేము "అభోజన దేవత" అని పిలుచు చుందుము. వారికి కేవలము మట్టియే (భూదానము) కావలెను. కనుక జనులు మంచిపాలు, పెరుగు, మిఠాయి, పండ్లు మొదలయిన వస్తువులు తెచ్చినప్పుడు ఆ వస్తువు లన్నియు మావంటి "భోజన దేవతల" పరమగుచుండును. కాని

ఈ భోజన దేవతలు, ఆ అభోజన దేవతతోపాటు అతివేగముగా నడచి పోవలసియున్నది. అందువలన వీరు తఱుచుగా తమకంటితో మాత్రమే ఆ యాకర్షక వస్తువులను చూచుచు పైకి సాగిపోవుచుందురు. ఈ రోజున వినోబాజీ దారిలో ఒక పర్యాయము జనులకు మిఠాయి పంచిపెట్టుచు "ఎవరయితే మిఠాయి తిందురో, వారు భూమిని ఇవ్వవలెను," అనిరి. అందుకు ప్రజలుకూడ కలకలలాడు నెమ్మొగము లతో ఆ విషయము నంగీకరించిరి.

జౌన్పూరులో రాష్ట్రీయ స్వయం సేవక సంఘమును అంగీక రించు జనులు కొందఱు గలరని వినియున్నాము. వారు ఈ రోజున వినోబాజీ స్వాగతము నిమిత్తమై అచ్చటచ్చట ద్వారములు నిర్మించిరి. మఱియు ప్రతి ద్వారము చెంగట జనులు హారతి, పూలదండలు మొదలయినవి తీసికొని నిలబడియుండిరి. ఇక్కడ ప్రతి రాజకీయ పక్షీయులు స్వాగతము కొఱకై వేఱువేఱుగా ఏర్పాటులు చేసి కొనిరి. అందువలన మధ్యమధ్య "భారతీయ సంస్కృతికి జయమగు గాక!" "మహాత్మా గాంధీకి జయ్" ఈ మొదలయిన నినాదములు వినవచ్చుచుండెను. వానితోపాటు "భూదాన యజ్ఞమును సఫలము చేసెదము" అను కేకలు కూడ వినబడుచుండెను. మధ్యమధ్య తెల్ల, నల్ల, ఎఱ్ఱటోపీల వారును; మఱియు కొందఱు అసలు టోపీలే లేని వారును కనబడుచుండిరి.

జౌన్పూరు రాజు ఈ నాడు వినోబాజీని కలిసికొనుటకయి వచ్చియుండెను. అతడు మిగుల భక్తిశ్రద్ధలతో రెండువేల యకరముల భూమిని దానముగా అర్పించివేసెను. అతడు ఉత్తరప్రదేశములోని రాష్ట్రీయ స్వయంసేవక సంఘమునకు ప్రముఖ నాయకుడు. ఆ సంస్థ వారు, ఉత్తర ప్రదేశములోని తమ కార్యకర్తలందఱకు వినోబాజీ కార్యక్రమమునకు సాయపడవలసినదని ఆదేశించియున్నారు. భిన్నభిన్న రాజకీయపక్షీయులందఱు భూదానోద్యమమునందు జేరిపోవలెనని వినో

బాజీ కోరుచుందురు. ఎన్నికలలో పరస్పరము విరోధులుగా పనిచేసిన వారందఱు ఈనాడు భూదానము నిమిత్తమయి కలిసి పనిచేయుచుండుట చూడగలిగితిమి. అందువలన ఆశాజ్యోతి అఖండ తేజమున వెలుగొందుచున్నట్లు గోచరించినది. స్వరాజ్యము వచ్చిన తరువాత గాంధీజీ ఈ లోకమును విడిచిపోయినారు. అందువలన ఎన్నో చిక్కువాదములు బయలుదేరినవి. ఎవరికిని తిన్నని దారి గోచరింపలేదు. స్వరాజ్యమునకు పూర్వము మనకు గల స్వప్నములన్నియు మటుమాయములగుట చూచిన పిదప మనలో విఫలత, నిరాశ, కటుత్వము అలముకొన్నవి. ఎక్కడ చూచినను అసంతోషము, అసమాధానము కనబడుచుండెను. కాని ఆ దుర్దశనుండి తప్పించుకొను ఉపాయము మాత్రము దొరకదయ్యెను. అందువలన దిక్కు మొక్కులేని దీనదశ యేర్పడినది. మనమేదో ప్రవాహములో బడి కొట్టుకొనిపోవుచున్నట్లు గోచరించెను. ఆ ప్రవాహమునుండి బయటపడవలెనను కోరికయితే గలదుగాని, బయటపడలేకపోవుచుంటిమి. ఈ వెనుకదెబ్బ, ముందు దెబ్బలవలన ముఖ్యముగా యువకులమనస్సులుచివుక్కుమనిపోయెను. కాని వినోబాజీతో నాలుగైదు రోజులున్నతరువాత యావత్తు నిరాశ, దైన్యము దూరముగా తొలగిపోయినట్లున్ను, జీవితములో ఏదో ఒక నవ్యకాంతి ప్రవేశించినట్లున్ను తోచగలదు. మా యాత్రీదళములో నున్న యువక కార్యకర్తలకు సంజీవని ఓషధి లభించినట్లే తోచెను. గుజరాతులోని నారాయణ దేశాయి ( కీ. శే. మహాదేవ దేశాయి కుమారుడు ), రాజేంద్రభాయీ, మలబారులోని జనార్దన పిళ్లె, తమిళనాడులోని వెంకటేశయ్య, ఆంధ్రలోని విద్యాబహాను, ఉత్తర ప్రదేశములోని హరిమోహనభాయీ, శివదాసు త్రిపాఠీ మొదలయిన వారందఱకు భూదానయజ్ఞము వలన నవ్యప్రేరణ, నవ్యస్ఫూర్తి లభించియుండెను. వీరివద్ద సంఖ్యాబలము గాని, జ్ఞానము గాని, అనుభవము గాని లేవు. ఈ విశాలదేశములోని సమస్యలన్నిటిని పరిష్క-

రింపవలెనను కోరిక గలిగియుండుట పిచ్చితనముగా తోచవచ్చును. అయినప్పటికిని వీరందఱు పిచ్చివారే. భూదానము ద్వారా జరుగనున్న క్రాంతిని దర్శించి, వీరందఱు పిచ్చివారయిపోయిరి. తాము చిన్నలము, శక్తిహీనులము అన్న సంగతి మరచిపోయిరి. ఒక చిన్న అగ్నికణము పెద్ద దూదిగుట్టను తగులబెట్టగలదు. వినోబాజీ తమ "స్థితప్రజ్ఞ దర్శన" మందు ప్రజ్ఞను అగ్నికణమనియే చెప్పియున్నారు. నవ్యభావన మూలమున మన హృదయములో ఒక అగ్నికణము ప్రవేశించినది. లోకములోని అసత్యమును, అన్యాయమును దగ్ధముచేయగల శక్తి ఆ నిప్పురవ్వలో గలదని మా విశ్వాసం. మనము భావి కార్యక్రమమును గుఱించి ప్రణాళికలు వేయుచుందుము. మేము హోస్టలు గదులలో కూర్చుండి, భారత స్వతంత్రము నిమిత్తమయి గంభీరముగా చింతనచేసి ప్లానులు వేసిన దినములు జ్ఞాపకము వచ్చినవి. కాని స్వరాజ్యము రానేవచ్చినది. 'అయ్యో, తొందరగా వచ్చినదే, చచ్చి అమరవీరులు కాదగు అవకాశము జాఱిపోయినదే' అని తోచుచుండును. కాని ఇప్పుడు మనము పరాక్రమించుటకొక నవ్యక్షేత్రము మన యెదుట గానవచ్చుచున్నది. ఇప్పుడు మనము ఉప్పపాటు మాత్రమే తళుక్కుమను మెఱపుతీగలము కారాదు. అణువణువు ఆహుతి యగుచుండెడి దీపములము కావలెను...

నారాయణ మఱియు రాజేంద్రభాయీ గుజరాతులోని దూరాటవులందు ఆదివాసుల మధ్య నిర్మాణకార్యములు సాధించుచున్నారు. విద్యాబహాను అయిదు సంవత్సరములు ఆంధ్రదేశములో కస్తూర్బా ట్రస్టునకు ఏజెంటుగానుండి గ్రామ గ్రామము తిరిగియున్నది. వీరందఱు పెద్ద చదువులు చదువుకున్నవారే. అందువలన ఎన్నో విమోహాత్మకమగు పదవులు వీరి నాకర్షించు చుండును. అయినను వీరు మిక్కిలి సంతోషముతో తపస్యా మార్గమునే అవలం

బించిరి. వీరందఱిలోను నేనే కేవలము జన్మవల్లనేగాక కర్మవలన కూడ అధిక "బూర్జువా" నయి యుంటిని.

ఈ రోజున మేమందఱము రాజుగారింటికి భోజనమునకు పోవలెను. వినోబాజీ కేవలము పాలు, పెరుగులు మాత్రమే పుచ్చుకొను చుందురు. అదికూడ చిన్నపిల్లలవలె మూడు మూడు గంటలకు ఒకపర్యాయము ప్రతి తులము, గిద్ద తూచుకొని, కొలుచుకొని ఆరగించు చుందురు. అందువలన భోజనమునకు పోవలసి వచ్చునప్పుడు ప్రతిచోటను, మేమే వారికి ప్రతినిధులుగా వ్యవహరించుచుందుము. ఈరోజున మేము భోజనమునకయి రాజమహాలులోనికి పోవలసి యున్నది. కాని మాలో ఎవ్వరికిని అందుకు తగిన దుస్తులు లేవు. రాజమహాలులో ఫకీరు అనుచరులమయిన మాకు ఎంతో వినయ విధేయతలతో స్వాగత మిచ్చిరి. ఇది యుగపరివర్తనకు గుర్తు. అధికారము, సంపత్తి జీవితమునకు పరమలక్ష్యములుగా ఎంచెడి నేటి సమాజము నష్టమయి పోనున్నది. ఇప్పుడు నిజమయిన జీవిత లక్ష్యము స్థాపితము కానున్నది. దానికి ఇదియే అంకురార్పణ.

సాయంకాలము ప్రార్థన సభయందు సమావేశ మయిన పెక్కంద్రుజనులు ఒక గంటసేపు మంత్రముగ్ధులయి ఋషి వాక్కును వినుచుండిరి. భారతీయ సంస్కృతిని పునరుద్ధరించుటకై ఈ ఋషి అవతరించెనా యేమి, అని తోచెను. ఉపన్యాసారంభమే ఎంతో ఆకర్షణీయంగా నుండెను. వినోబాజీ ఇట్లుచెప్పిరి: "మనకు ఇప్పు డిప్పుడే స్వరాజ్యము వచ్చియున్నది. కనుక ఒక విధముగా మనము శిశువులము. వేఱొక విధముగా చూచినయెడల పదివేల వత్సరముల అనుభవముగల ప్రాచీనులము. ఎన్నోమార్పులు జరిగినప్పటికిని కూడ మన భారతీయ పరంపర తైలధారగా సాగుచున్నది. ఆ పరంపరయే మనలను ప్రాచీన కాలముతో కలుపుచున్నది. ఎన్నో లెక్కలేనన్ని భేదభావములు ఉన్నప్పటికి కూడ ఇక్కడ ఆంతరంగిక ఐక్యము

గోచరించుచుండును. ఆ రోజులలో ప్రయాణ సాధనము లేవియు లేక పోయి నప్పటికిని, ఋషులు భారతదేశమును ఏకరూపములోనికి తెచ్చిరి. కాని ఐరోపా ఈ నాటివఱకు ఏకరూపము పొందలేకపోయెను. ఏయే విషయములలో మనము ప్రవీణులమో వాని సహాయముతో మనము ముందునకు అడుగులు వేసికొనుచు పోవలెను. ఇచ్చట సమాజ శాస్త్రములో ఎన్నో ప్రయోగములు జరిగియుండెను. ఈవిష యములో ఐరోపా మనకంటె వెనుకబడి యున్నది. కనుక ప్రాచీన సమాజ శాస్త్రములోని మూలభూత సిద్ధాంతములను ఆధారము చేసి కొని, వినయభావముతో పశ్చిమ దేశముల నవ్య విజ్ఞానమును పరి గ్రహించి మనము నూతనమగు సంఘ నిర్మాణమును చేయవలసి యున్నది. మన చాతుర్వర్ణ్య విభాగము స్పర్థారహిత సంఘ నిర్మా ణముకొరకే ఏర్పడియున్నది. ఈనాడు మనము దాని వికృతరూప మునే చూచుచున్నప్పటికిని, దాని మూల సిద్ధాంతములను మాత్రము విడిచి పెట్టరాదు. ఆ నిర్మాణములో ఒక వర్ణము అపరిగ్రహ వ్రత మవలంబించి విద్యాదానము చేయునదిగా ఉండెను. బ్రాహ్మణులు ఏనాడు అపరిగ్రహమును విడిచి పెట్టినారో, నాటినుండియే వారి పతనము ప్రారంభమయ్యెను. విద్వాంసులు ధనము వెంటబడినప్పుడు వారు సమాజ రక్షకులుగాక, శోషకులగు చున్నారు. క్షత్రియులు బ్రహ్మచర్యము నవలంబించి గురు సన్నిధికి పోయి సామాన్య జనుల వలె నడచుకొనవలసి యుండెను. గురుసేవ చేయవలసి యుండెను. అటుపిమ్మట కొంతకాలము రాజుగానుండి ప్రజాసేవ చేయవలెను. అనంతరము వానప్రస్థాశ్రమములో మరల అరణ్యమునకు పోవలసి యుండెను. అందఱును తమతమ పనులు చేసికొనుచు పరస్పరము సహకారము చేసికొనుచుండిరి. స్పర్థారహిత నిర్మాణమునందు అందఱ కును సమాన వేతనములుండుట అవసరము. అట్టి వేతనము లుండి నచో అది వర్ణవ్యవస్థ అనిపించుకొనక వర్గ వ్యవస్థ అనిపించుకొనును.

వర్గనాశమనగా అందఱకు సమాన వేతనములుండుట. వర్గహీన సమాజమనగా వర్ణ వ్యవస్థ. వర్ణవ్యవస్థలోని మూల సిద్ధాంతములలో వీరు గొప్ప, వీరు కొద్ది అను భేదములేదు. అట్టి భావములుండుట వల్లనే నేటి వర్ణ వ్యవస్థ దూషితమయి పోయినది. అందఱు సమానులే. ప్రతి ఒక్కరు తమతమ పనులను నిష్కామ భావముతో చేసిన యెడల మోక్షప్రాప్తి గలుగును. ఈ భావమే ఆ నిర్మాణమునకు మూలాధారము. ఆ విధముగా తమ గ్రామములో ఉత్పన్నమయిన వస్తువులను వాడుకొనుట కూడ ఆ వ్యవస్థలోని మూలభూత సిద్ధాంతమే. ఈనాడు చెడిపోయిన సంఘనిర్మాణమును పోగొట్టి, వర్ణవ్యవస్థకు మూలభూతములయిన సిద్ధాంతములను ఆధారముగా గొని నూతన సంఘ నిర్మాణమును చేయదలచియున్నాము. భూదానయజ్ఞము దానికి ఆరంభమాత్రమే. భూమి సమస్య లోకమంతటను ఉన్నది. ఇతర దేశములలో హత్యల వల్లను, శాసనముల వల్లను ఈ సమస్యను పరిష్కరింప జూచినారు కూడ. కాని ఆ పద్ధతులు మన సభ్యతకు వ్యతిరేకము. కనుక మన సభ్యతకు అనుకూలమయిన కరుణ ద్వారా ఈ సమస్యను పరిష్కరింప జూచుచున్నాము.''

ఇట్లు చెప్పి వినోబాజీ, చివరకు భారతదేశములోని అన్ని పక్షముల వారిని కల్యాణకారియగు ఈ భూదాన కార్యమునందు వచ్చి ప్రవేశింప వలసినదని ఆవాహనము చేసిరి. ఆ పద్ధతి ఎంతో కళాపూర్ణమయి యుండెను. ఇంతటి జీవితకళను నేర్చిన ఈ మహా కళాకారుని సృష్టిచేసిన బాపూజీ జ్ఞాపకము వచ్చియుండుటవలన నాకు సంతుష్టి గలిగినది. వినోబాజీ ప్రతి పలుకులోను, ప్రతి పనిలోను వారి ప్రేరణ కనబడును. వినోబాజీ సాధించుచున్న మహత్కార్యమును ఒక్క మాటలో చెప్పవచ్చును. ''వారు గాంధీజీని తలపించుచున్నారు'' అని.

# సాధువు లిద్దఱు కలిసికొనుట

గోరా బాదుషాపూర్

24—4—1952

"కాననము"లో ఒకపాట ఉన్నది. అందు ఈ లోకము "తుపాను మెయిలు"తో పోల్చబడినది. రైలుబండిలో క్రొత్త బాటసారులు ఎక్కుచుందురు. ప్రాతవారు దిగిపోవుచుందురు. కొందఱు ప్రయాణీకులు ఒక స్టేషను వఱకే పయనింతురు. మఱికొందఱు దీర్ఘప్రయాణము చేయుచుందురు. మా యాత్రకు కూడ ఈ ఉపమానమే సరిపోవుచున్నది. వచ్చేవారు వచ్చుచుందురు; పోయేవారు పోవుచుందురు. కాని వినోబాజీ యాత్రమాత్రము నిరవధికముగా సాగుచునే యుండును.

గాంధీజీ, వినోబాజీ వంటి మహాపురుషులతో ఉండుట అనగా మాట, పలుకు లేకుండ ఎల్లప్పుడు గంభీర ముద్రతో నుండుట అని తఱచుగా జను లనుకొనుచుండ వచ్చును. కాని ఇది వట్టి భ్రాంతి. గాంధీజీ వినోదమును ప్రాణవాయువనియే చెప్పుచుండిరి. వినోబాజీ కూడ ఈ విషయములో తమ గురువునకు శిష్యులు అయి యుండిరి. వారి గంభీరముద్ర. పొడుగుపాటి గడ్డము, ప్రఖర తేజస్సులు గల నేత్రములు చూచి వారు నవ్వుచు, త్రుళ్లుచు ఉండగలరనిగాని, నవ్వింపగలరనిగాని ఎవరును ఊహింప జాలరు. కాని కల్పనా జగత్తునకును, వాస్తవిక జగత్తునకును అంతరము ఉన్నది. కనుకనే జీవితములో ఆనందము ఏర్పడుచున్నది. పొడుగుగడ్డముగల ఈ సాధుపుంగవుని ముఖమునుండి వచ్చు వినోద పూర్ణమగు వాక్కు వినుటకు ఎంతో ఇంపుగా ఉండును.

మా యాత్రీ దళమునకు కర్ణధారుడు కరణభాయీ. అతడు ఉత్తర ప్రదేశములోని భూదాన సమితికి సంయోజకుడు. కార్యము

నతి సమర్థతతో నిర్వహింపగలడని అతనిని అందఱు ప్రశంసించు చుందురు. మేమాతని ప్రశంసించుటకుగల కారణము వేఱొకటి. మా శరీరములు నడక బడలిక వల్లను, పనిపాటుల వల్లను అలసి సొలసి ఉండుచుండును. అట్టితఱి కరణభాయీ, "నవ్వండి, గంతులు వేయండి, చిందులు త్రొక్కండి" అని మాకు బోధించుచుండుటవల్ల మా శ్రమ అంతయు పోవుటయేగాక, మేమాతనిని తలమీద పెట్టు కొనుచుందుము. అతడు ఒకప్పుడు ఎం. ఎల్. ఏ. కాని అతనికి క్రాంతియుతమగు భూదానము కనబడగానే, దానిముందు రాజకీయ రంగము నీరసముగా తోచెను. అందువల్ల అతడు దానిని విడిచి పెట్టెను. స్వరాజ్యము రాకపూర్వము తీవ్రముగా రాజకీయములలో పనిచేసినవారు, స్వరాజ్యము వచ్చిన తరువాత అధికార వాంఛలో తగులుకొనజాలక, రాజకీయ రంగమును విడిచిపెట్టి అన్యత్ర జీవిత ములు గడపువారు ఎందఱో గలరు. ఇప్పుడీ విషయమును గొప్ప గొప్పవారే అంగీకరించుచున్నారు. అట్లయినను కరణభాయీవంటి వారి మహత్తు నిలిచియేయుండును. వీరు పునాది రాళ్ళవంటివారు. బాబా రాఘవదాసు కూడ పునాది రాయి వంటివారు. వారి మూలముననే ఈ భూదానము దృఢముగా నున్నది. బాబాజీ తమ సాధుత్వము వలన ఉత్తరప్రదేశమం దంతటను ప్రసిద్ధికెక్కియే యున్నారు. కాని వినోబాజీ వారి సాధుత్వము వల్లగాక, నిర్మ లత్వము వల్లను, ఋజుత్వము వల్లను ముగ్ధులయిపోయిరి. ఈసాధువు లిద్దఱును ఒక్కచోటచేరి సంభాషించుచుండగా చిన్నవాడగు గౌత ముడు "ఇప్పుడు సాధువులిద్దఱు కలిసికొన్నారు. ఇక వారికి లోకము యొక్క స్మృతియే ఉండదు" అనుచుండును.

నిన్నటి మజిలీకిని, ఈనాటి మజిలీకిని ఉత్తరధ్రువము దక్షిణ ధ్రువమంత భేదమున్నది. నిన్నటిది గొప్ప నగరము. దినమంతయు నాలుగు వంకలనుండి జనులు గుంపులు గుంపులుగా వచ్చుచుండిరి.

ఎందఱో మహానుభావులు కలిసికొనుటకు వచ్చుచుండిరి. చర్చలు నడచుచుండెను. మా దర్వాజావద్ద మోటారుబండ్లు పంక్తులు తీరిచి నిలిచియుండెను. ఈరోజు సంగతివేఱు. చిన్న గ్రామము. ఏకాంత-శాంత ఆశ్రమము. ఒక సుందరమయిన తటాకము. దానికి నలువంకల ఎత్తయిన చెట్లు. ఆశ్రమములోని చిన్నచిన్న కుటీరములు. పక్షుల కలకల ధ్వనులు, ఆకుల గలగలలు మినహా అక్కడ అద్భుత శాంతి రాజ్యమేలుచుండెను. మేము ఏదో ఒక చెట్టునీడను కూర్చుండవలెననియు, ఎదుటగల తటాక సౌందర్యమును తిలకింపవలెననియు చెవులతో పక్షుల కలకల ధ్వనులు, ఆకుల మరమర ధ్వనులు వినవలెననియు కుతూహల పడితిమి. గ్రీష్మఋతువునందలి ఆ మండుటెండలలో సయితము శీతల, సుమంద, సుగంధవాయులు శరీరమునకు ఎంతో చల్లదనమును ప్రసాదించుచుండెను. అటువంటి సమయములో జీవితములోని గూఢసమస్యలను గుఱించి చింతన చేయవలెననియు, చేతిలోనికి కలము తీసికొని అప్పుడప్పుడు స్ఫురించు భావపరంపరలను వ్రాయవలెననియు, లేదా ఆ ప్రకృతి సౌందర్యమును మంత్రముగ్ధులమయి ఆనందింపవలెననియు బుద్ధిపుట్టెను.

అట్టి సమయములో వినోబాజీకి గల ప్రకృతిప్రేమ వర్ణనాతీతము. వారు గంటలకొలది సృష్టి సౌందర్యమును చూచి ఆనంద పారవశ్యమును పొందుచుండిరి. ఇంకను ప్రకృతివర్ణనకు సంబంధించిన వేదములలోని ఋక్కులను పఠించుచుండిరి. కాని సంస్కృతము యొక్క ముక్కు మొగము ఎఱుగని మావంటి శుద్ధబుద్ధ స్వరూపులకు అవి ఏవో ఆత్మ పరమాత్మలకు సంబంధమయినవిగా తోచుచుండును.

# ఆధ్యాత్మిక కర్మయోగము

మహిరావా

25—4—1952.

• వినోబాజీ అంతరంగ కార్యదర్శియగు దామోదరజీ ఉత్సాహమునకు, ఆసక్తికి మూర్తివంటివాడు. వినోబాజీ సందేశము ప్రతి హృదయమునకును అందజేయవలెననియే అతడు నిరంతరము తహతహలాడు చుండును. వినోబాజీ పలికిన ప్రతిశబ్దము అతడు కలముతో వ్రాసికొనుచుండును. నాకు అతనివద్ద పనికుదిరెను. వినోబాజీ ఉపన్యాసములకు నోట్సు వ్రాసికొనుట టైపిస్టుచే టైపుచేయించుట, పత్రికలకొఅకు రిపోర్టులు తయారుచేయుట ఈ మొదలయిన పనులు నాకు వప్పగింపబడెను. అవి నాకు ఎంతో ఇంపుగా ఉండెను. ఈ పనుల మూలమున నాకు వినోబాజీ భావములను గుఱించి గంభీరముగా చింతన చేయవలసిన అవకాశ మేర్పడెను. ఈ రోజులలో, యాత్రీదళములో ఇద్దరు టైపిస్టు లున్నారు. తమిళనాడు నివాసియగు వెంకటేశయ్య, ఉత్తరప్రదేశపువాడయిన శ్రీవాస్తవ్; ఇద్దఱును తమతమపనులను సరిసమానముగ పంచుకొని టైపింగుపనులు చేసికొనుచుండిరి. కాని క్రాంతి వీరులెవరికిని వారు తీరిపోరు. వారు విశ్రాంతి తీసికొనవలెననిగాని, నిద్రపోలేదనిగాని చింతింపరు. ఎంతపని ఉన్ననుసరే, నవ్వుచు నవ్వుచు చేసివేసెదరు. వెంకటేశయ్య పాటకుడు కూడ అగుటవల్ల మధ్య మధ్య పాటలు పాడుచు పనులుచేసివేయు చుండును. అతని హిందీ టయిపింగు వేగము మెచ్చుకోదగినది. ఇద్దరును వయస్సులో చిన్నవారయి యుండియు ఎంతో బాధ్యతతో పనులు నిర్వహించుచుందురు. అదిచూచి గొప్పవారుకూడ వారి సమర్థతను ప్రశంసించుచుందురు.

'విన్సెంటు షీన్' అను నతడు గాంధీజీ జీవితమును గుఱించి "లీడ్ కైండ్లీ లైటు" అను గ్రంథమొకటి వ్రాసియుండెను. అది నాకు మిక్కిలి బాగుండెను. వినోబాజీకూడ దానిని చదివిన బాగుండు నని నేను తలచితిని. వారికి ఆ పుస్తకము ఇచ్చునప్పుడును నా మనస్సులో భయమేర్పడెను. కాని వారాపుస్తకమును చదువుటయేగాక, తమ "సేవక" మాసపత్రికకు దానిపయిన ఒక మంచి అభిప్రాయమును కూడ వ్రాసియిచ్చిరి. వారికి ఆ పుస్తకము నచ్చినది. అందువలన నాకును సంతోషము కలిగినది. వారు ఆ పుస్తకమును గుఱించి ఇట్లు వ్రాసిరి.

"గాంధీజీ జీవితమునుగుఱించి ఒక అమెరికను సోదరుడువ్రాసిన పుస్తకమును నేను చూచుట సంభవించినది. నాగపూరు నివాసియగు దేశపాండే, అతని కుమార్తెయగు నిర్మల, (ఈమె ప్రస్తుతము నాతో సంచారము చేయుచున్నది) ఆ పుస్తకమును నాకు కానుకగా సమర్పించిరి. అందువలన దానిని చదువవలసి వచ్చినది. అమెరికనుల స్వభావానుసారముగా, అందు సత్యముతోపాటు కొన్ని బయటి విషయములుకూడ చేర్చబడినవి. ఏమయినను, నాకాపుస్తకము మిక్కిలి నచ్చినది. కారణమేమనగా లేఖకుడు గాంధీజీ జీవితములోని భారతీయ సంస్కారములను లెస్సగా గుర్తించినవాడయి స్పష్టముగా దర్శించి యున్నాడు. గాంధీజీ తమ ఆత్మకథకు "సత్యశోధన" మని నామకరణము చేసియున్నారు. ఈ లేఖకుడు వారి జీవితమునకు "కర్మయోగ మార్గము" అని పేరు పెట్టి యున్నాడు. ఆ గ్రంథ ప్రారంభములో గీతాసారము నంతయు బోధింపగల అధ్యాయమొకటి చేర్చియున్నాడు. దానిపేరు "యుద్ధమనగా నేమి ?" చివర, గీతను సంక్షేపముగా బోధింపగల అనుబంధమొకటి చేర్చబడియుండెను. దానిపేరు "గీత — గాంధీ గీత" ఈ విధముగా లేఖకుడు గ్రంథము నంతటిని గీతా మయము చేసియుండెను. గీతలో బోధింప

బడిన ఆధ్యాత్మిక కర్మయోగమునకు గాంధీజీ జీవితములో కంటె, చరిత్రలో మఱియెక్కడను ప్రమాణములు దొరకవని లేఖకుడు వ్రాసి యున్నాడు. ఈ రోజులలో కర్మయోగ శబ్దప్రయోగము తేలికగా చేయుబడు చున్నది. కాని తన జీవితమంతయు విశ్వసేవకై అర్పించుట, అహింస, సత్యము మొదలయిన సిద్ధాంతములను తు, చ, తప్పకుండ పాలించుట, అహంకారముగాని, ఆసక్తిగాని, లవలేశమయినను లేకుండ ఉండుట, నిరంతరము ఆత్మశోధన, జీవితములోని ప్రతి క్రియను ఈశ్వరార్పణ బుద్ధితో చేయుట వీని అన్నిటి కూడిక వలన తప్ప, గీతలో బోధింపబడిన కర్మయోగము సాధ్యము కాదు... గీతానుసారియయిన ఆధ్యాత్మిక కర్మయోగమునకు ప్రమాణములు అల్పముగా నున్నవి. అట్టి ప్రమాణముల ప్రత్యక్షప్రగతి మనము గాంధీజీ రూపములో చూచియున్నాము. అది మన మహాభాగ్యము. మనము ఈ ప్రమాణమును మననముచేసి మన జీవితములో ప్రవేశ పెట్టుకొనుటకై యత్నించెదము గాక.''

దామోదరదాసుజీ కుమార్తె మృదుల, కీ. శే. జమ్నాలాల్ బజాజ్ కూతురు కుమారుడయిన గౌతముడు ఇద్దఱును కేవలము పిల్లలు. కాని నడకలో మా అందఱకు గురువులు. వినోబాజీ ఆదేశానుసారముగా ప్రస్తుతము వారిద్దఱు తమతమ వస్తువుల నన్నిటిని రెండుమూడు సంచులలో వేసికొని, సంచులు పట్టుకొని 15 మైళ్లు నడచుచున్నారు.

## ఒంటరిగా పొమ్ము

షాహగంజి

26—4—1952.

నాలుగైదు రోజులు విశ్రాంతి తీసికొన్నపిదప, ఈ రోజున నేను నడక ప్రారంభించితిని. నిత్యమువలె (రాత్రి) మూడు గంటలకు

లేచి నాలుగు గంటలకు నడచుట మొదలుపెట్టితిమి. వినోబాజీ వెంట పోవుచుండుటవల్ల చెప్పరాని ఆనందము కలుగుచుండెను. ఈ రోజు దారి పొలములగుండ పోవుచు, ముండ్లతో నిండియుండెను. వినోబాజీకి రెండువైపుల మృదుబాలికయు, గౌతమబాలుడును చేతియొక లాంతరు పట్టుకొని నడుచుచుండిరి. అంతేకాంతి. మిగిలిన నాలుగు వంకల చిమ్మచీకటులు. వినోబాజీతో సమానముగా నడవగలిగిన యెడలనే వెలుతురు దొరకగలదు. లేనియెడల చీకటిలో ఏ గోతిలో పడినను పడిపోవచ్చును. ఒకవేళ కవియే ఉన్నయెడల ఆ ఘట్టమును గురించి సుందరమయిన కవిత చెప్పగలిగియుండును. తత్త్వజ్ఞాని ఉన్నయెడల "వినోబాజీ గమనము, వెలుతురు, చీకటిలో ఎచ్చటనో పడుచుండుట" మున్నగు విషయములను గురించి ప్రబంధము వ్రాసి యుండును. కాని మేము కవులముకాము. తత్త్వజ్ఞానులముకాము. అందువలన మేము ఎక్కడ పడిపోవుదుమో యను భయముతోను, ముండ్లనుండి తప్పించుకొనవలెనను దృష్టితోను, వినోబాజీ వెంట పోవుటకు యత్నించుచుంటిమి.

ఉదయము కాగానే, దారిలో కమలములతో నిండిన తటాక మొకటి కనబడినది. దానియందు తెల్లనికమలములు పాన్పుపఱచినట్లు శోభాయమానముగ నుండెను. సూర్యోదయము అగుచుండెను. సూర్యకిరణములు కమల దళములను నిద్దురనుండి మేలుకొలుపు చుండెను. ఒక్కసారి పరుగెత్తుకొనిపోయి వానినికోసి తెచ్చుకొందమా యని బుద్ధి పుట్టుచుండెను. కల్పవృక్షపు నీడను కూర్చుండగానే కోరికలు నెరవేరినట్లు, ఈ సంగతికూడ అట్లే పరిణమించెను. వినోబాజీకి సుందర కమలములు కానుకగా సమర్పించుటకై ఎందఱో గ్రామీణులు వానిని పట్టుకొనివచ్చిరి. కాని వినోబాజీ దూరముగా సాగిపోయిరి. అందువలన గ్రామవాసులు తాము తెచ్చిన పూలను, మమ్ము వినోబాజీకి ప్రతినిధులముగా ఎంచుకొని, మాకు సమర్పించి వెడలి

పోయిరి. ఈ పూలు ఎట్లయినను వినోబాజీకి అందగలవని వారు తలచు చుండిరి.

ఈ రోజులలో మా యాత్రీదళములో రాష్ట్రీయ స్వయం సేవక సంఘమునకు చెందిన కొందఱు కార్యకర్తలు కూడ ఉండిరి. ఈనాడు వారిలో ఒకడు "హిందుత్వము, రాష్ట్రీయత"ను గుఱించి వినోబాజీని ఒక ప్రశ్న అడిగెను. అంతట వినోబాజీ వాక్సలిలము ప్రవహింప నారంభించెను. "మనము మతములన్నిటిలోని మంచి సంగతులను గ్రహించి వానిని సమన్వయించుకొనవలెను. అన్నిటి యందును కనబడు సమానతకు మనము అధికముగా ప్రాధాన్యమును ఇవ్వవలెను. సంస్కృతికి సత్యము, అహింస, త్యాగము మొదలయినవి మూలతత్త్వములు. మతములన్నిటియందును మనము ఈ మూల తత్త్వములనే చూచుచున్నాము. కేవలము ఉపాసనయందు మాత్రమే వేఱువేఱు మార్గములు కనబడుచున్నవి. వానిని మనము అంగీక రింపవలెను."

ఒక సోదరుడు, "మీరేదయినను సంస్థను నిర్మింపరాదా" అని అడిగెను.

వినోబా : "సంస్థయొక్క బంధన నాకు వలదు. ఇటువంటి బంధనములు అప్పుడప్పుడు మార్గభ్రష్టుని చేయగలవు. మహమ్మదు ప్రవక్త లోకమునకు శాంతిని, మానవత్వమును బోధించియున్నారు. అప్పుడు వారి అనుచరుల సంఖ్య తక్కువగా నుండెను. 'స్వయముగా చావండి. కాని చంపకండి.' అని వారికి చెప్పుచుండిరి. హజరతు మహమ్మదు ఎన్నో కష్టముల ననుభవించిరి. అందువలన వారు మక్కా విడిచి పాఱిపోవలసిన వారయిరి. అప్పుడు వారు "పాఱిపోవుటకంటె శస్త్రములతో ఆత్మరక్షణ చేసికొనుట మంచిది," అని చెప్పిరి. ఈ పద్ధ తిని అంగీకరించుచు వారు తమకు తెలియకుండనే శస్త్రోపయోగ మును సయితము అంగీకరించిరి. యుద్ధసమయమందు కూడ నమాజు

వేళ ఆయినప్పుడు యుద్ధము ఆపి నమాజు చేయవలెనని వారు తమ సేనకు బోధించిరి. అట్లు చేయుటవలన విరోధులకు లాభము కలిగెను. వారి సేనకు నష్టము కలిగెను. కనుక తమ సేనను రెండు భాగము లుగా చేసిరి. ఒకటి యుద్ధము చేయుచుండెను. రెండవది నమాజువేళ నమాజు చేయుచుండెను. ఈవిధముగా హింసకు ప్రవేశ మేర్పడెను. రక్షణ అను పేరుతో శస్త్రము వచ్చినది. 'ఇతరులపైన దండెత్తుట వల్లనే మంచి రక్షణ గలుగును' అనుభావము ఏర్పడెను. ఇంక దేనిని రక్షణ అనవలెను. దేనిని దండయాత్ర అనవలెను, అను ప్రశ్న కలిగెను. ఒక్కసారి చేతిలోనికి ఖడ్గము తీసికొన్న యెడల అది దాని శక్తిని చూపక మానదు. ఏమతమునకు రహీమ్, రహమాన్ (అత్యంత దయాళువు) భగవానుడుగా నున్నాడో, దేనిపేరు ఇస్లాము (శాంతి) అయియున్నదో, దేని జెండాపైన చంద్రుడు, నక్షత్రములున్నవో (అనగా సూర్యుడువంటి తీక్ష్ణస్వభావుడుగాక, చంద్రుడువంటి సౌమ్య శీతల వస్తువు ఉన్నదో) ఆ ఇస్లాము ధర్మ ప్రచారమునకయి అక్కడక్కడ ఖడ్గము ప్రయోగింపబడెను. అనగా పదమూడు వందల సంవత్సరములకు పూర్వము, హింసకు ఒక్కసారి ప్రవేశము ఇచ్చిన తరువాత ఎట్టి పరిణామము కలుగునో పైగంబరు ఊహింప జాలక పోయిరి. కాని ఇప్పుడు మనము వారి అనుభవములను బట్టి కొంత నేర్చుకొనవలసి యున్నది. ఒకవేళ నేను పైగంబరు కాలములో జన్మించియుండిన యెడల వారికంటె గొప్ప తప్పులు చేసియుండును. కనుక పైగంబరు హింసను అంగీకరించి తప్పుచేసినారని ఈరోజున మనము చెప్పలేము. కాని వారి అనుభవము మన యెదుట కనబడు చున్నది. కనుక హింస అన్నివిధముల త్యాజ్యమని మనము గ్రహింప వలెను...సంస్థ స్థాపించుటను గుఱించి నేను అనేక పర్యాయములు బాపూజీతో మాట్లాడి యుంటిని. వారికి నాభావములు నచ్చినవి. అందువల్ల నన్ను సంస్థలన్నిటినుండి విముక్తుని చేసినారు. ఈరోజున

నేను లోకములోని ఏసంస్థకును సభ్యుడనుకాను. నేను పూర్తిగా ముక్తుడను... 'పాటిపోవుటకంటె హింస శ్రేష్ఠము' అన్నదానికి విపరీతార్థములు తీయవచ్చును...సంస్థలేకుండ పనులు ఎట్లు కాగలవు అని చాలామంది అనుచుందురు. కాని ఈ విషయములో నా భావములు అత్యంత స్పష్టమైనవి. నేను ఎల్లప్పుడు మానవుని కలిసికొనుచున్నాను. ఏసంస్థయొక్క ప్రతినిధిని కలుసుకొనుటలేదు. ప్రతి ఒక్కని మానవునిగానే గుర్తించుచున్నాను. మానవులుగానే ప్రతి ఒక్కరు భూదాన కార్యమును చేయదగుదురు."

"సాధువుల ఉద్దేశములు మహోన్నతములుగా నుండును. కాని వానిని వాస్తవిక జగత్తులోనికి తెచ్చుటలో అప్పుడప్పుడు సమాధాన పద్ధతి అవలంబింప వలసి వచ్చును. అందువలన వారు విఫలులయినట్లు కనబడుచుందురు. కాని వారి విఫలతకూడ లోకమునకు మేలు చేయునదియే. అట్టి విఫలతవల్లనే విశ్వమునకు కల్యాణ మార్గము ఏర్పడగలదు. సాధారణమగు ఆదర్శమును ఎదుటఉంచుకొని సఫలతపొందుటకంటె ఉన్నతాదర్శము ఉంచుకొని విఫలత పొందుట శ్రేష్ఠము."

"హిందూ ముసల్మాను మతములను గంభీరముగా పరిశీలించి రెంటికిని దారిమాపు మహానుభావుడొకడు అవతరించుట ఇప్పుడు మిక్కిలి అవసరము. భగవానుడు ఈపనిని ఎవరివల్ల చేయించనున్నాడో తెలియదు. కాని ఈపని తప్పక కాగలదని నావిశ్వాసము.'

దారిలో ఒక గ్రామము వచ్చినది. అక్కడి ప్రజలు స్వాగతమునకై బ్రహ్మాండమయిన ప్రయత్నములు చేసిరి. పూలదండలు హారతులు మొదలయినవి పట్టుకొని జనులు దర్శనము నిమిత్తము నిలబడి యుండిరి. పూలతోను, ఆకులతోను అలంకరించబడిన ఎత్తయిన ప్రదేశము సిద్ధము చేయబడెను. వినోబాజీ అక్కడ ఆగి రెండుమాటలు మాట్లాడవలసి వచ్చెను. పూలదండలతోపాటు తగినన్ని భూదానములు కూడ లభించెను. కనుక ఆగుట సార్థకమే అయ్యెను.

మజిలీ దగ్గఱకు వచ్చుచుండెను. కాని నాలో శక్తి అంతయు తఱిగి పోవుచుండెను. ముందునకు ఒక అడుగయినను వేయుట కష్ట మనిపించుచుండెను. ఇంతలో గ్రామప్రజలు రామనామ సంకీర్తన చేసికొనుచు మాకు ఎదురు వచ్చిరి. అందువలన నాలో నూతనశక్తి ఉదయించినది. వెంకటేశయ్య, "భూమి దాన యజ్ఞము సఫలము చేసెదము" అని పాడనారంభించెను. మేమందఱము ఆ పాట అందు కొని పాడసాగితిమి. దారికి రెండువైపుల వందలకొలది జనులు నిలబడి జయజయ ధ్వనులు చేయుచుండిరి. పూలవాన కురియుచుండెను. ఆ దృశ్యము ఎంతో ఆకర్షణీయముగా నుండెను. "విశ్వకలహము అంత రించుగాక! శాశ్వతశాంతి ఏర్పడుగాక" అను పాటను మేము కేవలము పాడుచుండుటయేగాక, మామా హృదయసీమలలో అందుకు తగిన శ్రద్ధాజ్యోతిని వెలిగించుకొంటిమి. వందలకొలది కంఠముల నుండి "మహాత్మా గాంధీకి జయ్" అని ఒక్కటే స్వరము బయలుదేరి నది. నా హృదయములో ఆ స్వరమే ప్రతిధ్వనించినది. భారతదేశ ములో అహింసకు ఒక నూతన ప్రయోగము ఆరంభమయ్యెను. మానవ హృదయములో నిద్రాణమయియున్న సత్ప్రవృత్తులను మేలుకొలిపి, పురాతన లోకములోని పురాతన జీవితమూల్యములను నష్టపఱచి, నవ్యలోక నిర్మాణముకొఱకు నవ్యజీవిత మూల్యములు స్థాపించుకార్యము ఆరంభమయ్యెను. గాంధీ శిష్యుడు మార్గము చూపుచుండెను. మఱియు గాంధీజనులు అతని వెంటనుండిరి. పర మాణు యుద్ధమువలన భయభ్రాంతులయిన, శ్రద్ధాహీనులయిన, ఈలోకప్రజలకు ఇదెంతటి ఆశాపూర్ణమగుఘట్టము. నిరాశారూపమగు భయానక అంధకారమును తొలగించుటకు ఆశారూపమగు చిన్నదంచా దీపము చాలును. భారతీయులు తమ మూక వాణితో ఈసందేశమును లోకమున కందించుచున్నట్లుండెను. "మహాత్మా గాంధీకి జయ్" అను జాలుగు మాటలలోనే వారు తమ అభిప్రాయమును చెప్పివేసినారు.

మజిలీకి చేరగానే స్వాగతముకొఱకు వచ్చిన జనులకు వినోబాజీ తఱుచు రెండుమూడు మాటలు చెప్పుచుందురు. అసలు ప్రధానమైన ప్రవచనము సాయంప్రార్థనయందు జరుగు చుండును. కాని ఉదయము రెండుమూడు వాక్యములలోనే అప్పుడప్పుడు వారు సర్వము చెప్పి వేయుచుందురు. ఈరోజున వారిట్లనిరి. "భావము శక్తిమంతమయినది. ప్రాచీన సంఘవ్యవస్థను నాశనమొనరించు నవ్యనిర్మాణముచేయు శక్తి భావములోనే ఉన్నది. లోకములో భావముకంటె మించిన శక్తిశాలి యయిన వస్తువు మఱియొకటిలేదు. నేను మీకొక భావమును చెప్పు చున్నాను. మీరందఱు దానిని గ్రహింపవలెనని కోరుచుందును. భావ రూపముగానే నేను ప్రతి ఒక్కరి హృదయములోను ప్రవేశింప గోరు చున్నాను."

నేటి సాయంకాల ప్రార్థనసభయందు వినోబాజీచేసిన ప్రసంగము సాధు ప్రవచనమువలె లేదు. కళాకారుని కళాకృతివలెనుండెను. నవ్య జీవితముయొక్క సుందర కల్పనా చిత్రమది. "మనము గ్రామము లను నూతనముగా నిర్మింప జూచుచున్నాము. మన గ్రామములు నవ్య జీవితమునకు ఆదర్శమాత్రముగా నుండుటయేగాక సంత్రస్త, సమ్మో హిత, సంభ్రమిత జగత్తునకు శాంతిమార్గము చూపగలవు." వినోబాజీ ఈ మాటలను ఎంతో విశ్వాసముతో చెప్పియుండెను. క్షణమాత్ర ములో ఆ కల్పనాచిత్రము మా యెట్టయెదుట సాక్షాత్కరించినట్లు తోచెను. "మఱియు దీనికి అధిష్ఠానము భూదానయజ్ఞము. భూమి అంతయు గోపాలునిది. ఈ తత్వము ననుసరించి గ్రామభూమి అంతయు తిరిగి పంపిణీ చేయబడును. భూమితోపాటు బుద్ధి పంపిణీ కూడ జరుపబడును. అట్లు చేయుటవలన ప్రతిఒక్కరు స్వతంత్రముగా తమ బుద్ధిని వికసింపజేసికొనగలరు. గ్రామ వ్యవహారమంతయు గ్రామ పంచాయతీ చేయగలదు. అందువలన ప్రతి ఒక్కరికి పరిపాలన శిక్షణ పొందుటకు అవకాశమేర్పడును. అందఱకు పనులు దొరకును. అంద

ఐకు జ్ఞానము లభించును. ప్రతి దినము సాయంకాలమున గ్రామీణు లందఱు ప్రార్థనా మందిరములో సమావేశము కాగలరు. అక్కడ శ్రవణము, జ్ఞానచర్చ జరుగగలవు. అప్పుడప్పుడు సంగీతము, నృత్యము మొదలయినవికూడ ఉండును. మన గ్రామములు కళకు, సంస్కృతికి, సత్యమతమునకు కేంద్రములుగా నుండగలవు. అయిదులక్షల గ్రామ ములలో అయిదులక్షల గ్రామములుకూడ ఈ విధముగానే తయారు కాగలవు. అక్కడి సౌందర్యము, కళ, ధర్మము (మతము) చూచు టకు వెలుపలనుండి జనులు వచ్చుచుండగలరు...నిజమయిన స్వరా జ్యము లేదా రామరాజ్యము స్థాపితము కాగలదు.'' ఏమి, ఇది కేవలము స్వప్నమా? మనము ఇటువంటి స్వప్నములెన్నిటినో చూచి యుంటిమి. గాంధీజీ ఆదర్శ భారతదేశమును, గురుదేవుల కవితా చిత్రిత భారతదేశమును నిర్మాణము చేయవలెనని అనేకులు స్వప్నము గాంచియుందురు. కాని వినోబా స్వప్నము కేవలము కల్పనాచిత్రము కాదు. కర్మతూలిక, విశ్వానుభూతి పటలము అను నీ రెంటి ఆధారము పైన వారి చిత్రము సజీవమయియుండగలదు. ''కనుకనే నేను కాలి నడకను తిరుగుచున్నాను. మీకొక భావనను అందించుచున్నాను. మీకీ భావన అనుకూలమని తోచినయెడల ఆ ప్రకారము మీమీ జీవిత ములలో మార్పుతెచ్చుకొనండి. ఈ విధముగా అనేక వ్యక్తుల జీవిత ములు మార్పుచెందిన యెడల సంఘములో మార్పు రాగలదు. హృదయపరివర్తనము, జీవిత పరివర్తనము, సమాజ పరివర్తనము- ఇవి క్రాంతికి త్రివిధ ప్రక్రియలు. క్రాంతి మొదట హృదయములో ఆరంభమగును. పిమ్మట సమాజములో''. ఒక జ్యోతినుండి వేఱొకటి ప్రజ్వలితమగునట్లు, ప్రబోధితమగు హృదయము ఇతర హృదయము లను ప్రబోధింప గలుగును. క్రాంతి మార్గము, క్రాంతి దర్శియగు కవి మొదటనే చూపించి యుండెను. నీ హృదయమును వెలిగించు కొని ఒంటరిగా ముందునకు సాగిపొమ్ము.

# రెండవ భాగము

## పూల బాట

సురహుర్ పూర్ (ఫైజాబాదు)
27—4—1952.

కనుచీకటి గల ఆ ప్రశాంత వాతావరణములో లాంతరు యొక్క మసక కాంతిలో అతివేగముగా నడచిపోవుచున్న వినోబాను చూడగా 'స్థితప్రజ్ఞుడెట్లు మాట్లాడును, ఎట్లు కూర్చుండును, ఎట్లు వర్తించును' అను ప్రశ్నకు సహజముగా సమాధానము లభింపవచ్చును. భూదానము అధికము లభింపవచ్చును. అల్పము లభింపవచ్చును. స్వాగతము కొఱకు నలుగురు రావచ్చును. నాలుగు వేల మంది రావచ్చును. కొందఱు స్తుతిచేయవచ్చును. కొందఱు నిందింపవచ్చును. కాని ఇవేవియు వినోబాజీని కదిలించుచున్నట్లు కనబడదు. వారి నిష్కామ కర్మయోగము సతతము సాగిపోవుచునేయున్నది. వారు సుఖదుఃఖములకు అతీతులయి అనాసక్త అవస్థయందు సతతము సంచరించుచున్నట్లు తోచుచుండును.

నేడు మజిలీచేసిన గ్రామము ఆకారములో చిన్నదే అయినను, భక్తియందు మాత్రము దొడ్డది. గ్రామములో ప్రవేశింపగానే మాకు కనబడిన విశేషములివి: పరిశుభ్రము చేయబడిన మార్గములు, దుకాణములు, ఇండ్లు వాకిండ్లు స్వచ్ఛములు, సుందరములు. అచ్చటచ్చట నిర్మింపబడిన ద్వారములు రంగవల్లులచే నలంకరింపబడిన ముంగిళ్లు, గోడలపైన పెద్దపెద్ద అక్షరములతో వ్రాయబడిన సాధుపుంగవుని వాక్యములు. వినోబాజీ ముందునకు సాగిపోయిరి. నేను వెనుకబడి

పోతిని. వారిమీద కురియింపబడిన పూలవాన మూలమున మార్గ మంతయు పుష్పాచ్ఛాదిత మయిపోయెను. వెనుకబడివచ్చుటవలన నాకది పూలబాట అయ్యెను.

ఫైజాబాదు జిల్లాలో గాంధీ ఆశ్రమము వారి నిర్మాణకార్యములు కనబడుచుండును. అచ్చటచ్చట వారి ఆశ్రమములు, ఖాదీ ఉత్పత్తి కేంద్రములు గోచరించును. గాంధీ ఆశ్రమము మూలమున ఇక్కడి ప్రజలలో ప్రబోధము కలిగినది. ఆ సంగతి మేము నిత్యము గ్రహించుచుంటిమి. గాంధీ ఆశ్రమ కార్యకర్తలు తమతమ రుచిననుసరించి స్వతంత్రముగా రాజకీయములలో జోక్యము కలిగించుకొనవచ్చును. ఈ సంస్థలో ప్రముఖులు ఆచార్య కృపలానీజీ. వీరొక రాజకీయపక్షమునకు నాయకులు. వీరి కుడిభుజము శ్రీవిచిత్రభాయీ. వీరు కాంగ్రెసు ప్రభుత్వములో ఒక మంత్రి.

## పూర్వజన్మ — విజ్ఞానము

అక్బర్ పూర్ (ఫైజాబాదు)

28—4—1952.

దారిలో జనులు వినోబాజీని అనేక ప్రశ్నలు అడుగుచుందురు. ఈ రోజున నేను భయపడుచు, భయపడుచు చాల ప్రశ్నలడిగితిని. ఒక వంక వినోబాజీ ప్రకాండ పాండిత్యము, వేఱొకవంక నా అగాధ అజ్ఞానము. ఇది చూడగా వెలుతురు, చీకటివలె తోచెను. కనుకనే ఇంతవఱకు నేను వారిని ప్రశ్నలడుగుటకు సాహసింపలేదు. కొందఱు వారిని ఇట్లడుగుచుండిరి: 'తమరు యజ్ఞోపవీతమును ధరింపరెందుకు? తమ గడ్డము తెలుపు, జుట్టు నలుపు ఏల?' ఇట్టి ఉబుసుపోక ప్రశ్నలడుగబడుటచూచి నేను కూడ నాశంకలకు సమాధానములు పొందుటకయి ఇట్లడగితిని:

ప్రశ్న : హిందూ ధర్మములోని పూర్వజన్మ, కర్మసిద్ధాంతములలో కేవలము నియతివాదము (Determinism) ఉన్నదా లేక స్వేచ్ఛకు కూడ అవకాశమున్నదా ?

వినోబా : ఒకనికి వ్యాపారము చేయుటకయి కొంత మూలధనము ఇచ్చితివనుకొనుము. అతడా సొమ్మును నష్టపఱుపవచ్చును. లేదా పెంపుచేయవచ్చును. దీనిలో అతనికి స్వతంత్రమున్నదా లేదా ! ఆమాత్రము స్వతంత్రమే మనకుకూడ ఉపలబ్ధమయియున్నది. ఒకవేళ మనకు ఎద్దుపుట్టుక ప్రాప్తించిన యెడల ఏనుగు పనులు చేయజాలము. కాని వృషభమువల్ల కాగలిగిన పనులనన్నిటిని చేయవచ్చును. ఒకసారి మేము జైలులోనుండగా పంచదార దగ్గఱకు కొన్ని చీమలు పోగయినవి. అంతట సరసముగా నా మిత్రులతో 'ఈ చీమలు స్వతంత్రములా? అస్వతంత్రములా ?' అంటిని. ఈ చీమలు ఎన్నటికిని జైలు వెలుపలకు పోకపోవుట సంభవమే... అట్లే మనుష్యుడు పూర్వజన్మమునుండి కొంత మూలధనమును తీసికొని జన్మించుచున్నాడు. అనంతరము అతడు ఇష్టమువచ్చినట్లు వ్యవహరించుటకు స్వతంత్రము కలిగియున్నాడు.

ప్రశ్న : కాని మానవుడు స్వతంత్రుడు కాడని మార్క్స్ చెప్పుచున్నాడు. పూంజీపతులును (Capitalists), శ్రామికులును (Proletariates) తమతమ వర్గబోధ (Class consciousness) ననుసరించి పనులు చేయుచు ఉందురు.

వినోబా : ఆధునిక శాస్త్రజ్ఞులలో ఒక విచిత్ర పద్ధతి ఏర్పడినది. వారు ఒకటిరెండు ఘట్టములను చూచి, ఇంక ఊహను ఆధారము చేసికొని ఒక మూసను తయారుచేయుదురు. అంతట మానవజాతి చరిత్రనంతయు ఆ మూసలో పోయుచుందురు. సారాంశ మేమనగా, భారతము పరతంత్రముగా నున్నప్పుడు ఒకవేళ భారతదేశ చరిత్ర వ్రాయబడిన యెడల, "భారతదేశము వేదకాలమునుండియు నేటి

వఱకు అస్వతంత్రముగానే ఉన్నది. కారణమేమనగా ఈ దేశములోని జలవాయువులలోను, మనుష్యులలోను దోషమున్నది. అందువల్ల ఈదేశము సర్వదా బానిసఅయి యున్నది,'' అని వ్రాయబడ వచ్చును. ఇప్పుడు భారతము స్వతంత్రమయి పోయినది. ఇకచరిత్ర వ్రాయుదు రనుకొనుము. ''భారతదేశము వేదకాలమునుండియు నేటి వఱకు స్వతంత్రముగానే ఉండిఉన్నది. ఎన్ని విపత్తులువచ్చినను రానీ, దేశము మాత్రము స్వతంత్రముగానే ఉన్నది అని చెప్పుటకు చరిత్రలో ఆధారములు గలవు. ఎందువల్లననగా ఈ దేశములోని జలవాయువులలోను, మనుష్యులలోను అటువంటి గుణమున్నది. అందువలన బ్రిటీషు సామ్రాజ్యమువంటి ప్రబలమయిన సామ్రాజ్యముతో ఢీకొని ఈదేశము స్వతంత్రము సంపాదించినది,'' అని వ్రాయవచ్చును. ఈ విధముగా ఏదో ఒక దృష్టిని పెట్టుకొని దానిని చరిత్ర నంతటిపైన ఆరోపించు ప్రవృత్తి ఇందు కానవచ్చుచున్నది. 1, 2, 3, 4, 12, 24 ఈ అంకెలు మన యెదుట గలవనుకొనుము. ఒకవేళ మనము వానినుండి 1, 2 ను మాత్రమే చూచియున్న యెడల సృష్టి రచన అంతయు 1, 2, 3, 4 క్రమము ననుసరించి ఉన్నదని అంచనా వేయుదుము. ఒకవేళ మనము 1, 2, 4 అంకెలను చూచియున్న యెడల సృష్టిరచన యావత్తు 1, 2, 4, 8 - ఇట్లు రెట్టింపు చేయబడియున్నదని ఊహింతుము. ఒకవేళ మనము 1, 2, 4, 12 చూచినయెడల సృష్టిరచన అంతయు రెట్టింపు, మూడు రెట్లు, నాలుగు రెట్లుగా చేయబడినదని తలంతుము. ఈ ప్రకారముగా పరిమితమయిన జ్ఞానమును ఆధారము చేసికొని ఒక నియమమును **(Law)** ఏర్పఱచి దానిని అనంతత్వముతో సమన్వయింప జూచునట్టి ఆధునిక శాస్త్రజ్ఞుల ప్రవృత్తి మూలతః దోషయుత మయినది.''

ప్రశ్న : మనము విజ్ఞానమును ఆధారముగాగొని పూర్వజన్మ సిద్ధాంతము సరియయినదని ఋజువు చేయవచ్చునా ?

వినోబా : విజ్ఞానము మూలతః ఇంద్రియ గమ్యమయినది. కనుక దానికి ఒక సునిశ్చితమయిన హద్దు ఉన్నది. విజ్ఞానము అత్యంత నమ్రమయినది. పరమేశ్వరుడు లేనేలేడని అది చెప్పదు. కారణ మేమనగా ఇట్టి నిషేధవాక్యమును చెప్పుటకు కూడ జ్ఞానము కావలెను. విజ్ఞానము ఇట్లనును : "పరమేశ్వరుడు ఉండను వచ్చును. లేకను పోవచ్చును. కాని మేము ఇప్పటి వఱకు దానిని గుఱించి ఏమియు ఎఱుంగము...మనుష్యుని ఇంద్రియములు కూడ తగినంత జ్ఞానమును సంపాదించును. మనచేతికి ముఱికి అంటుకొన్న దనుకొనుడు. దానిని ముక్కువద్ద పెట్టిన యెడల, ముక్కు సహింపజాలదు. వెంటనే మనము చేతిని అక్కడనుండి తీసివేయుదుము. అప్పుడు విజ్ఞానము ఇట్లు చెప్పును: "ముఱికిలో అతి సూక్ష్మజంతువు లున్నవి. అందువల్లనే మన ముక్కు సహింపలేక పోయినది." ఈ విధముగా అనేక విషయములు విజ్ఞానమునకు తరువాతనే తెలియుచుండును...విజ్ఞానము ఇంద్రియముల సహాయముతో ముందునకు సాగిపోవుచున్నది. ఎంతటి శ్రేష్ఠమయిన దుర్భిణి యయినను కావచ్చును. చివరకు దానిని మన కంటితోనే చూడవలసి యున్నది. ఏసిద్ధాంతమయినను ఇంద్రియముల ద్వారా సరియయినదని ఋజువు కానిదే విజ్ఞానము దానిని అంగీకరింపదు. కాని ఇంద్రియములకంటె మనస్సు శక్తిశాలి అయినది. దాని కంటెను శక్తిశాలి యయినది ఆత్మ. కారణ మేమనగా మనస్సు వ్యాపారముల నన్నిటిని నేను (ఆత్మ) తెలిసికొన గలుగుచున్నాను. ఎంత వేగముగల సాధకము లున్నప్పటికి ఒక చోటునుండి మఱియొక చోటునకు పోవుటకు కొంత సమయము పట్టుచున్నది. కాంతి కిరణము యొక్క వేగము ప్రతి సెకనుకు పాతిక తక్కువ రెండు లక్షలమైళ్లు అనగా చంద్రుని నుండి బయలుదేరిన కాంతికిరణములు ఇక్కడకు చేరుటకు ముప్పది సెకనులు పట్టును. కాని మన మనస్సు ఒక సెకనుకు లోపుగానే చంద్రుని దగ్గఱకు పోవుచున్నది.... ఈ సమయములో

మనము చూచుచున్న ధ్రువ నక్షత్రము వాస్తవముగా ఇప్పటికి కూడ అక్కడనే ఉన్నదందురా ? కాంతి కిరణము ధ్రువతారనుండి బయలు దేరి ఇక్కడకు వచ్చుటకు ముప్పది సంవత్సరములు పట్టును. అనగా ఇప్పుడు మనము చూచుచున్న ధ్రువతార ముప్పది సంవత్సరములకు అక్కడ ఉండెనన్నమాట. 29 సంవత్సరములకు పూర్వమే అది నష్ట మయిపోయి యుండవచ్చును. కాని మనము ఒక సంవత్సరమువఱకు దానిని చూచుచుండగలము. అనంతరము అది నష్టమయిపోయిన దందుము. కాని వాస్తవముగా అది ముప్పది సంవత్సరములకు పూర్వమే నష్టమయిపోయి యుండెను. ధ్రువతార తగినంత సమీప ములో నున్నది. కాని ఎన్నో నక్షత్రములు మనకు ఎంతోదూరములో ఉన్నవి. ఎన్నో "ప్రకాశ వర్షముల" దూరములో ఉన్నవి. కనుక అక్కడనుండి బయలుదేరిన కాంతికిరణములు ఇక్కడకు చేరుటలో వందలకొలది సంవత్సరములు పట్టుచున్నవి. ఈ విధముగా సృష్టిలోని లఘుత అనంతమే. విశాలత అనంతమే. అట్టి స్థితిలో తర్కముపైన మానవ జీవితమునకు, ఆది అంతములు ఎందుకు కలుగుచున్నవో చెప్పగలమా ? ఒకసారి ఒక ముసల్మాను మిత్రునితో మాట్లాడుచు ఇట్లంటిని : "ఒక బాలుడు జన్మించి రెండు నిముసములలో మరణించి నాడు. చివరి దినమున న్యాయముచేయునప్పుడు అల్లా రెండు నిముస ముల పాప పుణ్యములనే విచారించి న్యాయము చేయునా ?" ఒక జీవి అనంతకాలము వఱకు అవ్యక్తముగా ఉండును. ఇది తర్కమువల్ల తెలియదగినదికాదు. ప్రస్తుతము కొందఱు క్రైస్తవులుకూడ పునర్జన్మ నంగీకరించుచున్నారని వింటిని. కనుక విజ్ఞానము ద్వారా పూర్వజన్మ సిద్ధాంతము సరియయినదని ఋజువు కానంతవఱకు దానిని అంగీక రింపకూడదని చెప్పరాదు.

యోగులసంగతి వేఱు. కాని సామాన్యమానవుల జీవితములలో కూడ పునర్జన్మకలదని తెలియదగిన ఘట్టము లెన్నో కనబడుచుండును.

నేను నా స్వంత అనుభవమునే చెప్పుచున్నాను. అప్పుడు నేను అయిదేండ్లవాడను. నేను మాతల్లితోగూడ మాతామహుని యింటికి పోవుచున్నాను. మేము ప్లాటుఫారముపైన కూర్చుండి రైలు రాకకు ఎదురుచూచుచుంటిమి. ఆకస్మికముగా నాకన్నులయెదుట ఒక దృశ్యము కనబడెను. ఒకయిల్లు, దానికొక పెద్ద దర్వాజా, ఒకతోట కుడిచేతివైపున ఒక మెట్టు ఉన్నవి. అప్పటివఱకు ఎన్నడును నేనా యింటిని చూచి యుండలేదు. కాని నేను తరువాత తాతగారింటికి పోగా నాకు ఆశ్చర్యము కలిగినది. తాతగారిల్లు సరిగా నేను చూచిన ఇంటివలెనే ఉండెను. అంతట నేను మా తల్లిని ఆవిషయము అడుగగా ఆమె, "నాయనా! పూర్వజన్మములోని కొన్ని ఋణానుబంధములు ఇట్లే ఉండును," అనెను. నే నా సంగతిని ఇప్పటివఱకు మఱచియుండలేదు. మనము పూర్వజన్మ నంగీకరింపనియెడల జీవితములో రుచియే ఉండదు. ఇప్పుడు నన్నొక సర్పము కఱచినదనియు, నేను మరణించితిననియు అనుకొనుడు. ఏమి, నేనింతవఱకు సంపాదించుకొన్న జ్ఞానమంతయు వృథాపోయినట్లేనా? ఒక బుద్ధి శూన్యమయిన క్షుద్ర జంతువు కఱచుటవల్ల నా జ్ఞానమంతయు ఒక్క క్షణములో నష్టమయిన యెడల నా జ్ఞానలాలస అంతయు వృథాయే గదా! కాని పునర్జన్మ యందు నమ్మకముగలదు గనుకనే ఇంకను జ్ఞానము సంపాదింపవలె నను ఇచ్ఛ నాలో బలీయమగుచున్నది.... చాలమందికి సిగరెట్టు, బీడీ త్రాగవలె నను కోరికగలుగుచుండును. గొప్పగొప్పవారు కూడ వానివల్ల ఆనందము పొందుచున్నారు. కాని ఎన్నడును వానిని త్రాగవలె నను కోరికయే నాకు కలిగియుండలేదు. నామనస్సు ఆవంక పోనేపోదు. నేను వెనుకటి జన్మలలో ఈ విషయమున కొన్ని అనుభవములు కలిగియుండుట దీనికి కారణము కావచ్చును. నేను కొన్ని ప్రయోగములు చేసియుండవచ్చును. అవి వృథాయని నేను నిష్కర్ష చేసికొనియుండవచ్చును. ఇదంతయు ఇట్లు సంభవించియుండవచ్చును.

దీని తాత్పర్య మేమనగా మానవుడు తన పూర్వజన్మలోని అనుభవ రూపమయిన మూలధనమును గొని క్రొత్త జన్మ ఎత్తుచున్నాడు.... కాని మిత్రుడా ! విజ్ఞానమునకు పూర్ణ ప్రమాణము (Full proof) కావలెను. Full అనండి లేక Fool అనండి. కుశాగ్ర బుద్ధులకు కొంచెము ప్రమాణమే(Proof)చాలును. కాని వైజ్ఞానికులకును, సామాన్య జనులకును పూర్తిగా (Full proof) కావలెను.'' ఇది వి: మేము పొట్ట చెక్కలగునట్లు నవ్వితిమి.

అక్బర్ పూరులో నొక గొప్ప ఖాదీ ఉత్పత్తి కేంద్రము, ఆశ్రమము కూడ ఉన్నవి. ఆ నగరములో ప్రవేశింపగానే జనులు మిక్కిలి ఉత్సాహముతో స్వాగతము ఇచ్చిరి. కాని ఆశ్రమద్వారము వద్ద ఇచ్చిన స్వాగతము సర్వశ్రేష్ఠము. ఆశ్రమమంతయు మామిడి ఆకు తోరణములతోను, కదళీ స్తంభములతోను అలంకరింపబడియుండెను. ద్వారముచెంగట ఖద్దరు ధారిణులయిన స్త్రీలు వినోబాజీ నుదుట కుంకుమ పెట్టి హారతి ఇచ్చిరి. ఎక్కడయితే స్త్రీలు నిర్భయముగా తిరుగుచుందురో అక్కడ సమీపములో నిర్మాణ కార్యకర్తల ఆశ్రమము గలదని మేము వెంటనే గ్రహింపగలుగుచుంటిమి. ప్రాచీనకాలములో హోమ ధూమమువల్లను, గంతులు వేసెడి లేడి పిల్లల వల్లను సమీపములో ఆశ్రమము గలదని తెలిసికొనుచుంటిమి. కాని నేడో హోమధూమమునకు బదులు స్వచ్ఛతయు, సువ్యవస్థయు, లేళ్లకు బదులు ఖాదీదారులగు యువతీ యువకులే ఆశ్రమమునకు గుర్తులు.

ఆశ్రమ వాతావరణము ప్రశాంతము సుందరమునై యుండెను. అందమయిన తోటలు, కలకలధ్వనితో జాలువారెడి కొండవాగులు, చీనీలు, మారేళ్లు, నీలగిరి వృక్షములు అతి మనోహరముగా నుండెను. వేసవి దినములలో మారేడు షర్బతు దొరకినయెడల ఆ సంతోషము వేఱే చెప్పవలయునా ? చీనీ వృక్షములు పండ్లతో బరువెక్కి

యుండెను. చెట్లమీద అన్నిపండ్లు చూచినప్పుడు మాలో ఎవ్వరికిగానీ, ముఖ్యముగా గౌతమునకుగాని నోరూరకుండ ఎట్లుండగలదు ? కాని చీనీపండ్లు ఇంకను పండియుండలేదు. అందువల్ల గౌతముడు గాంధీ ఆశ్రమ ప్రముఖ కార్యకర్తయయిన కపిలభాయినుండి 'రేపు ఎట్లయినను నీకు చీనీ తెచ్చియిచ్చెదన'ని ప్రతిజ్ఞ తీసికొనెను. కపిలభాయి వినోబాజీ కోరికనయినను ఒక విధముగా ఉపేక్షచేయ వచ్చునేమో గాని, గౌతముని కోరిక నెట్లు త్రోసిపుచ్చగలడు ? కారణ మేమనగా, అతడందఱకంటెను పసివాడు.

సాయం ప్రార్థనయందు వినోబాజీ గాంధీ ఆశ్రమకార్యములను ప్రశంసించిరి. సర్వోదయ సిద్ధాంతములను వివరించిన మీదట చివరకు భూదానప్రశంస చేయకుండ వినోబాజీ ఉపన్యాసము పూర్తి కాజాలదు. వారు ఇట్లు చెప్పిరి: "నేను మిమ్ము భిక్షమడుగుటకు రాలేదు. మీకు దీక్ష నిచ్చుటకు వచ్చితిని...మీరు పంచపాండవులయినచో మీకు ఆఱవ సోదరుడు కూడ ఉన్నాడు. కాని అతడు వ్యక్తముకాడు. వివేకానందుడు ఎవనికి దరిద్రనారాయణు డని పేరుపెట్టెనో, గాంధీజీ జీవిత పర్యంతము ఎవని సేవచేసియుండెనో ఆ దరిద్రనారాయణుడే మీకు ఆఱవ సోదరుడు. అతని వాటా అతని కివ్వండి."

వేదములు, ఉపనిషత్తులు, గీత అనునట్టి మహాసాగరములో వినోబాజీ లోతుగా ప్రవేశించి మంచి ముత్యములను వెదకి తెచ్చియున్నారు. కురాను, బైబిలు మొదలయిన గ్రంథములతోకూడ వారికి గొప్ప పరిచయము గలదు. కురాను మూలగ్రంథమును చదువుటకుగాను, వారు అరబ్బీభాషను నేర్చుకొనిరి. అంతేగాక కురానులోని కొంత భాగమును కంఠస్థముకూడ చేసిరి. అవ్యక్త దరిద్రనారాయణునిపక్షమున వకీలువలె వాదించుచు నేడు కురానులోని ఒకకథను వినిపించిరి. "ఒకసారి పైగంబరు ఇద్దఱు మిత్రులతో కలసి ఎక్కడకో పోవుచుండిరి. వెనుక నుండి విరోధి సేన వచ్చుచుండెను. అంతట ఒక

మిత్రుడు,'అయ్యో! అదిగో పెద్దసేన. మనము ముప్వురమే ఉన్నాము. ఏది దారి ?' అనగా పైగంబరు, "వెఱ్ఱివాడా ! మనము ముగ్గురము కాదు, నలుగురము. ఆ నాలుగవవాడు కనబడడు. కాని అతడు ఉన్నాడు. సర్వశక్తిమంతుడు కూడ." అనిరి.

## దుర్లభం భారతే జన్మ

*గుసాయీ గంజ్ (ఫైజాబాదు)*
29—4—1952.

దారిలో ఒక రిట్లడిగిరి : "సత్యాగ్రహ ఆందోళనము లేదా అటువంటి ఇతర ఆందోళనలలో నిర్భయతకు ప్రాధాన్యముండును. అందు ఆత్మవిశ్వాసము కూడ కనబడుచుండును. కారణ మేమనగా అక్కడ సంఘర్షణ కలదు. కాని భూదాన కార్యక్రమమందు సంఘర్షణ లేనందువల్ల, ఆ గుణములకు చోటెక్కడ ?

వినోబా : భూదాన యజ్ఞములో మనము బీదల నుండి కూడ దానములు పరిగ్రహించుచున్నాము. ఇందు దానము ఇచ్చువారును, పుచ్చుకొనువారును తమతమ హక్కులను గుర్తించుచున్నారు. అందువలన ఆత్మవిశ్వాసము కనబడుచున్నది. సత్యాగ్రహము మొదలగు ఇతర ఉద్యమములలో ఉండెడి నిర్భయత అభావాత్మకమైనది (Negative). ఇంగ్లీషువారితో పోరాడుటకు మనము నిర్భయుల మయితిమి. కాని భూదాన యజ్ఞమందు ఏర్పడెడి నిర్భయత భావాత్మకమయినది (Positive). దేహాభావ నష్టము కానిదే ఐక్యభావన సంభవింపదు. ఐక్యము వల్లనే మనము నిర్భయత వంకకు సాగిపోగలము."

నేడు మా నివాసస్థానమున ఒక కళాశాల. దినమంతయు ఉపాధ్యాయులతోను, విద్యార్థులతోను చర్చలు జరుగుచుండెను. నేటి ప్రవచనములలో వినోబాజీ విద్యావిషయమయి మూలభూత సిద్ధాంత

ములను బోధించిరి. "ప్రభుత్వమువారి చేతిలో విద్య ఉండరాదు. వారు అందఱకును ఒకటే రకమయిన చదువును నేర్పుచుందురు. అందువల్ల జనులు వేఱువేఱు విధములగు పాఠశాలలను నడపవలెనను కోరుచుందును. విద్యపైన ఋషుల పెత్తనము ఉండవలెను. రాజులది ఉండరాదు. ప్రాచీన భాషలో చెప్పవలెనన్న, విద్య అపరిగ్రహులు, జ్ఞాననిష్ఠులయిన బ్రాహ్మణుల చేతిలో నుండవలెను. విద్య, పాలకుల చేతిలో ఉన్నయెడల, ప్రభుత్వము ఎటువంటి పౌరులను తయారుచేయవలెనని కోరుకొనుచుండెనో, దానికి అనుగుణమగు విద్యా విధానము రూపొందించబడును. దేశమునకు ఇంతకంటె భయోత్పాతము వేఱు కాదు. విద్యార్థి శరీరము, మనస్సు సుదృఢమగుటకును, శీలవంతుడును, సమాజ సేవకుడు అగుటకును విద్యను బోధింపవలెను."

ప్రాంతాభిమానమును గూర్చి ఒక రొక ప్రశ్న యడుగగా, వినోబాజీ ఇట్లు సమాధానము చెప్పిరి : "తన మాతృభాషను అభిమానించుట దోషము కాదు. కాని భారతీయతను ఎన్నడును మఱచియుండరాదు. రాకపోకలసాధనలు లేకపోయినప్పటికిని ఋషులు, కాశ్మీరము నుండి కన్యాకుమారివఱకు హృదయైక్యమును కలుగ జేసిరి. సంస్కృత సాహిత్యమం దంతటను"దుర్లభం భారతే జన్మ"అని చదువుచుందుము. కాని ఎచ్చటను "దుర్లభం మహారాష్ట్రే జన్మ" "దుర్లభం ఘూర్జరదేశే జన్మ" మొదలయిన వాక్యములు పఠింపము. ప్రతి ఒక్కరు తమ మాతృభాషను, రాష్ట్రభాషను (హిందీ) నేర్వవలెను. హిందీ మాతృభాషగా గలవారు తమ పొరుగు ప్రాంతీయభాషను నేర్వవలెను".

తఱచు ఉపన్యాసాంతమందు వినోబాజీ ఇట్లు చెప్పుచుందురు :

"రైన్ బసేరా కర్ లే డేరా ఉఠ్ చల్ నా పరభాత రే"

(రాత్రి డేరాలో బసచేయుము, ఉదయముననే లేచి పయనము కట్టుము). ఇదే నా జీవితము. అందువలన ఇదే మన మొదటి సాంగత్యము, చివరిది కూడ. రేపు ఉదయము నాలుగు గంటలకు

ఇక్కడ నుండి పయనించెదము. పరమేశ్వరుని కటాక్షమున్నచో కదలిపోయెదము, లేనిచో ఇక్కడనే నా సమాధి ఏర్పడును. అందు వల్ల ఇదే నా తుది ప్రణామము.''

# హింస సర్వదా త్యాజ్యము

పూరా బాజార్ (ఫైజాబాదు)
30—4—1952

ఈ రోజున కొంతసేపటివఱకు చేతిలాంతరు పట్టుకొని దారి చూపవలసినపని నామీదపడెను. కొంచెముసేపటిలోనే చర్చప్రారంభ మయ్యెను.

ప్రశ్న : రక్తముతోకూడిన క్రాంతియందు సంఘర్షము ఎట్లు అనివార్యమో, అట్లే అహింసాక్రాంతియందు అయ్యది అనివార్య మగునా, కాదా ? సంఘర్షము లేనియెడల కసితీర్చుకొనుట ఎట్లు సాధ్యమగును ?

వినోబా : మానవ స్వభావమును మొదలంటజూచిన యెడల సహకారభావన కనబడునుగాని సంఘర్షముకాదు. ఒకవిధముగా అహింసక ఆందోళనములోకూడ అక్కడక్కడ సంఘర్షమురావచ్చును. ఉదాహరణముకొఱకు ఇంగ్లీషు వైద్యమును ప్రకృతి వైద్యమును తీసికొనండి. ఇంగ్లీషువైద్యములో రోగముతో సంఘర్షము ఏర్పడు చున్నది. కాని అందు ఒక రోగముపోగానే, వేరొకటి పుట్టుచున్నది. ప్రకృతివైద్యములో మూలతత్త్వముల సహకారమువల్ల రోగము తొలగిపోవుచున్నది. కనుక ఇందుకలుగుచున్న సంఘర్షము భిన్న మయినది... నిజమునకు హింసాక్రాంతి క్రాంతికాదు. జీవితపద్ధతి లోని పరివర్తనమునే క్రాంతియనవలెను. హింసకక్రాంతి జరుగుచోట భయపద్ధతి ఏర్పడుచుండును. అక్కడ భయపెట్టి క్రాంతిని అమలు

జరిపెదరు. దీనిసారాంశ మేమనగా మనకంటె బలమయినశక్తి ఉద్భవమయినచో అది మనలను ఓడించగలదు. అనగా "హింసాక్రాంతియందు వెనుకటిపద్ధతులే స్థిరముగానుండును.భయపద్ధతి నశించిపోదు."

అంతట నేనిట్లడిగితిని: శారీరికహింస (Physical violence) కంటె కూడ మానసికహింస (Psychical violence) అధికభయంకరమనియు, నేటి డిక్టేటర్లు అట్టి ప్రయోగము జేయుచున్నారనియు, అందువలన దానిని నిషేధింపవలెననియు ప్రజలు చెప్పుచుందురు. మీరేమందురు ?

వినోబా : అవును. నిషేధింపవలసినదే. హింస, తక్కువా. ఎక్కువా అను ప్రశ్నకు చోటులేదు. రెండును భయంకరమయినవే. ఏవిధమయిన హింస అయినను చెడ్డదే. ఊాతికంటె ఇటుక మెత్తనిది కావచ్చును. కాని ఆకలిగొన్నవానికి రెండును నిరుపయోగములే. కారణమేమనగా వాడు ఊాతినిగాని, ఇటుకనుగాని తినజాలడు. ఏసంఘములో హింసకు ప్రాధాన్యము ఏర్పడునో, ఆసంఘములో ఆపద్ధతియే పనిచేయుచుండును.

నేను : సేనా ప్రభావము ఎల్లప్పుడు చెడ్డదని దీనితాత్పర్యమా?

వినోబా : అవును, తప్పక. సేనవల్ల పుట్టెడి ప్రవృత్తి, జీవితమంతటిలోను కనబడకుండ ఉండజాలదు. సేనద్వారా మనుష్యునకు క్రమశిక్షణ, వ్యవస్థాపద్ధతి ఏర్పడగలవని చాలమంది చెప్పుచుందురు. మన సమాజములో ఇటువంటి గుణములు విస్తరిల్లవలెననియే కోరుచుందును, కాని సేనద్వారా కాకూడదు. సేన, సర్వాధికార ప్రభుతాపద్ధతి (Totalitarian method) వంటిది. "చీనా ప్రభుత్వము ఇటువంటిపద్ధతి అవలంబించుటవల్ల, అక్కడ చిటికలో పనులన్నియు జరిగిపోవుచున్నవి. కాని మనదేశములో ప్రజాతంత్రము నడచుచున్నందువల్ల పనులు ఆలస్యమగుచున్నవి. అందువల్ల వారికంటె మనము వెనుకబడిపోతిమి." అని మనదేశములోని గొప్పగొప్పవారే

చెప్పుచుందురు. కాని ఇది కేవలము తప్పుభావన. సర్వాధికార ప్రభుతా పద్ధతిలో దేశమునకు కొలదిమంది జనుల బుద్ధి విశేషలాభమే కలుగుచుండును. ఆ కొలదిమందిజనులు విశేషప్రజ్ఞాధురీణులు అయితే కావచ్చునుగాక. కాని దేశప్రజ లందఱి ప్రజ్ఞకంటెను, వారి ప్రజ్ఞ తక్కువదే కదా! సారాంశ మేమనగా దేశమునకు జనులందఱి ప్రజ్ఞాలాభము కలుగదు. అందువలన దేశమునకు నష్టము కలుగును. ఇది పూర్తిగా గణితశాస్త్ర విషయము. కనుక నేడు మేము ఏప్రజాతంత్ర పద్ధతికి నష్టముచేయు పద్ధతియని చెప్పితిమో, నిజముగా ఆ ప్రజాతంత్ర పద్ధతి వల్లనే మనకు శుభము కలుగగలదు. ఈ రోజున మన దేశమునకు చిన్న, పెద్ద అను భేదములేక అందఱి ప్రజ్ఞాలాభము కలుగుచున్నది. ప్రయోగము లన్నిటిని చేయుచున్నారు. మనకు ఇది యొక మంచి అదను. మనకు దీని వల్లనే వికాసము కలుగగలదు. ఎక్కడ నియంతృత్వము నడచుచుండునో అక్కడి స్థితిగతులు భయంకరములుగా నేఉండును. కారణ మేమనగా అక్కడ ఒకరియొక్కయూ, పదిమందియొక్కయూ బుద్ధివలన పనులుజరుగుచుండును. భగవంతుడు ప్రతిఒక్కనికి కొంచెముకొంచెము బుద్ధిని ప్రసాదించియున్నాడు. కనుక ప్రతిఒక్కరికి తమ తమ బుద్ధిని ఉపయోగించుకొనునట్టి అవకాశమును ఇవ్వవలెను.

ఆ మాటల మీద నేను ఇట్లంటిని: "అందఱకు అవసరము కలుగవలెనన్న మాట అంగీకృతమే. కాని జనులు హిట్లరువంటి నియంతల మాటలను, ప్రలోభములను నమ్ముచున్నారు. దీని కేమి చేయవలెను.

వినోబా: ఈ మాట నిజమే. కాని ఈ విషయములో భారత దేశ స్థితి ఇతరులకంటె భిన్నమయినది. భారతము నేటివఱకు ఎన్నడును నియంతల అధికారమునకు దోసిలి యొగ్గి ఉండలేదు. భారతీయులు నిరంతరము సాధువులు, సత్పురుషులు, మఱియు పరోపకార పారీణు

లనే అనుసరించియున్నారు. భారతప్రజల జీవితాదర్శములు ఉన్నతము లయినవి. వేలకొలది సంవత్సరముల అనుభవము పైన ఆ యాదర్శ ములు నిర్మితములయినవి. ఐరోపా, అమెరికా దేశములలో నేటికిని ధనము, పశుశక్తి, పుస్తక పాండిత్యమే గౌరవింపబడుచున్నవి. వారు నేటివఱకును నిజమయిన జీవితాదర్శములను గుర్తింపనేలేదు. ఈ విష యములో వారు మనకంటె వెనుకబడియున్నారు. మన జనులు అశోకుడు, అక్బరువంటి మహాచక్రవర్తులను మఱచిపోయినారు. కాని బుద్ధుడు, కబీరు, తులసీ మున్నగువారిని జ్ఞాపకముంచుకొనియున్నారు. ఒకసారి నే నొక ముసల్మానులసభలో "అక్బరు ఎవరు"అని అడుగగా, వారు "అల్లా హో అక్బరు" అనిరి. చూడుడు! వారికి అక్బరే జ్ఞాపకము లేనప్పుడు, ఇంక చిన్న చిన్న రాజుల సంగతి చెప్పనేల? కాని వారు కబీరును ఎఱుగుదురు. మఱియు తమ గ్రామమునకు చెందిన ఏ మహాత్మునైనను స్మరించెదరు. సారాంశ మేమనగా భారతీ యుల జీవిత పద్ధతిలో ఉన్నతాదర్శముల ప్రతిష్ఠ ఏర్పడియున్నది. ఇది విశేషము. ఈనాడు మనము వ్యవహారములో ధనమును, పశుశక్తిని గౌరవించవచ్చును గాక! కాని మన హృదంతరాళములలో ఈ వస్తు వులను గుఱించి ఆదరభావన లేదు. ధన ప్రలోభమువల్ల గాని, బల ప్రయోగ భయమువల్ల గాని ఈ రోజున మనము మన వ్యవహారము లలో క్షుద్ర ప్రసంగములను అంగీకరించుచున్నాము. ఒక యెద్దు మన యెదుటకు వచ్చినది. మనము పాఱిపోయితిమి అనుకొనుడు. అంత మాత్రమున దాని ఆధిపత్యమును మనము అంగీకరించినట్లా? ఒక ఆంగ్లేయుడు, "మేము నేటివఱకు హిందువులను నిజమయిన అర్థములో జయించనే లేదు. కారణ మేమనగా వారు మనలను ఇంకను అంట రానివారుగా చూచుచున్నారు" అని వ్రాయగా, దానిపయిన నేను ఇట్లంటిని: "మేము మీ ఘనతను అంగీకరింపగల ఘన కార్యమును మీ ఆంగ్లేయులు ఏమి చేసి మాకు చూపించియున్నారు. పశుశక్తిలో

మీరు మాకంటె దొడ్డవారని మేము అంగీకరించుచునే యున్నాము. కనుకనే మీరు హిందువులను ఓడించినారు. కనుక ఆ వృషభమువలె మిమ్ముకూడ శ్రేష్ఠులని గౌరవింపుమందురా ? మీరు గనుక నైతిక శక్తిని ప్రదర్శించియుండిన యెడల, ఆ సంగతి వేఱుగా ఉండెడిది. ఏమి, మేము ధర్మజ్ఞుడగు యాండ్రూసును గౌరవింపలేదా ? అతడు కైస్తవుడేగదా ! తాత్పర్యమేమనగా మేము నీతిమార్గమును, సదాచారమును తలమీద పెట్టుకొని పూజింతము. పశుశక్తిని మాత్రము కాదు.

అంతట నేనిట్లడిగితిని : అయితే మన ఉన్నత జీవితాదర్శముల ప్రతిష్ఠాపన ఐరోపా, అమెరికా మున్నగు దేశములలో ఏ ప్రకారము కాగలదు ?

వినోబా : అందుకుగాను భారతీయులు తమ స్వంత జీవితములలోనే ఆ ఉన్నతాదర్శములను ప్రతిష్ఠించుకొని చూపవలసి యున్నది. ఈ రోజున మనము నిర్భయులముగా లేము. కనుకనే మనము ధనమును, పశుశక్తి మొదలగువానిని వ్యవహారములో అంగీకరించుచున్నాము. మనము నిర్భయులము కాగలిగినప్పుడును, ఉన్నతాదర్శములను మన జీవితములో ప్రతిష్ఠించుకొన గలిగినప్పుడును ఇతర దేశములు మనలను అనుసరింపగలవు.

మరల నేనింక ప్రశ్న అడిగితిని : సర్వాధికార ప్రభుతా పద్ధతి **(Totalitarian System)** లో సర్కారుతో కసి తీర్చుకొనుట సర్వథా అసంభవమని కొందరు చెప్పుచుందురు. ఆంగ్లేయులు కొంత ఉదారులు గనుకనే భారతీయులు అహింసా పద్ధతిని ఆంగ్లేయ సామ్రాజ్యముపై కతు సాధింపగలిగిరి. ఏమందురు ?

వినోబా : ఈ విధముగా చెప్పుటవల్ల ప్రాచీన బ్రాహ్మణులవలె ఆంగ్లేయులుకూడ ఉచ్చవర్ణము వారని అంగీకరించినట్లగును. ఈ ఆలోచనా పద్ధతియే తప్పు. 1857 తిరుగుబాటు సమయమున ఆంగ్లేయులు తక్కువ అత్యాచారములు చేసియుండలేదు.

నేను ఇట్లంటిని : నేను మనుష్యుల సంగతి చెప్పుచుండుటలేదు. పద్ధతిని గురించి చెప్పుచున్నాను. సర్వాధికార ప్రభుతా పద్ధతి (Totalitarian System) లో ప్రభుత్వమునకు వ్యతిరేకముగా ఒక్క పలుకు ఉచ్చరించిన మాత్రాననే శరీరనాశము కలుగగలదు.

వినోబా : అనగా ఆ పలుకు అమరవాణి అయినదగుటయే. శరీరము పడిపోయినది. ఇదేమంత గొప్పసంగతి; పోనిమ్ము. దేహాసక్తిని విడిచిపెట్టకుండ మానవుడు నిర్భయుడు కాజాలడు. ఆయా దేశ ప్రభుత్వములు తమ విద్యాలయము లన్నిటిలోను తమ ఆలోచనా పద్ధతినే వ్యాపింప జేయుచుందురు. అప్పుడక్కడివారు తమ బిడ్డలను పాఠశాలలకు పంపకుండ ఇంటివద్దనే చదివించుకొనుచుండవలెను. ఫలితమేమగును ? జెయిలో, మృత్యువో : కానిమ్ము.

నేనిట్లంటిని : కాని అక్కడి జనులు ఎంతో భయగ్రస్తులయిపోయిరి. అందువల్ల ఏమిచేయుటకును వారికి ధైర్యములేదు. మనమాట వారిచెవిని సోకుటకుకూడ సావకాశములేదు. అట్టి స్థితిలో వారి సమస్యలు ఎట్లు పరిష్కరింపబడగలవు ?

వినోబా : అందువల్ల మనదేశములలో జరుగుచున్న Regimentation (వర్గవిభాగము)ను అడ్డగింపవలెను. ఇదీ మొదట జరుగవలసిన పని.

నేనిట్లంటిని : మన దేశములలో అనగా స్వతంత్రదేశములలోనా?

వినోబా : అవునవును. ఏయేదేశములలో సర్వాధికార ప్రభుతా పద్ధతియందు విశ్వాసము లేదో ఆయాదేశీయులు తమ స్వంతజీవితములలో ఉన్నతజీవితాశయములను ప్రతిష్ఠించుకొనవలెను. ఒకవిధముగా ఈరోజులలో ఐరోపాఅంతయు భయగ్రస్తమయి యున్నది. కారణమేమనగా వారందఱును శస్త్రపరాయణులును, (యుద్ధ) సాధనపరాయణులును అయియున్నారు. చేతియందు ఆయుధమున్నయెడలనే వీరుడనిపించుకొనును. లేనిచో లేదు. సింహమును వీరుడనుచుందుము.

కాని కొంచెము దీపము కనబడగానే పాఱిపోవును. ఈవిధముగానే ఐరోపాజనులుకూడ పిఱికిపందలు. మనము స్వతంత్రమును నిలబెట్ట దలచుకొన్నయెడల, మనము నిజమయిన అర్థములో నిర్భయులము కావలెను.

అటుపిమ్మట ఒకరు వేఱొక విషయముపైన చర్చనారంభించిరి. వేదాంతములోని తత్త్వజ్ఞానమును గుఱించియు, హిందువుల సహిష్ణుత మున్నగువానిని గుఱించియు ప్రశ్నలడుగబడెను.

వినోబా : మనము హిందువులము ప్రాచీనులమును, అనుభవజ్ఞులమును అగుటవల్ల కొంచెము అధిక సహిష్ణులముగా నున్నాము. ఇది స్వాభావికమేగదా! అందువల్ల మనము ఇతరుల విషయములో ఉదారదృష్టిని కలిగియుండవలెను. 'మానవుడు పాపముతోనే జన్మించుచున్నా'డని క్రైస్తవధర్మము బోధించుచున్నదని ఒక ఫ్రెంచి మహిళ నాతో చెప్పినప్పుడు ఆమాట నామనస్సునకు పట్టనేలేదు. దానివల్ల నాకెన్నడును శాంతి కలుగలేదు. కాని నేను కఠోపనిషత్తును, నాచికేతుని కథయు చదివినప్పుడు నాకు శాంతి కలిగినది. ఆ సోదరి చెప్పిన మాటనిజము... క్రైస్తవమతములోని తాత్త్విక విషయములను ఎన్నిటినో తప్పులని విజ్ఞానము నిరూపించినది. కాని ఉపనిషత్తులలోని తత్త్వజ్ఞానము విషయమయి "ఇది తప్పు" అని నేటివఱకు వ్రేలు మడచి చూపినవారులేరు. మనకు ఉపనిషత్తుల తత్త్వజ్ఞానము ప్రసాదింపబడియున్నది. అందువలన మనము మానవజాతినంతటిని మనవలెనే చూచుకొనవలెను. బుద్ధుని అవతారముగా అంగీకరించి బౌద్ధధర్మమును మనదిగా అంగీకరించినట్లు మనము పైగంబరును, ఏసుక్రీస్తును అవతారములుగా అంగీకరించి ఆయా ధర్మములను మనవిగా చేసికొనవలెను. ముసల్మానులను స్వజనులనుగా చేసికొనియే యుంటిమి. "ఈశ్వర్ అల్లా తేరే నామ్" అను వాక్యము ఆ ప్రక్రియకు సంకేతము. మనము భారతదేశములోని నిఱుపేదలను గుఱించి చింతించునట్లు

పాకిస్థానులోని నిరుపేదలను గుఱించికూడ చింతింపవలెను. మనము దేశభేదములను మఱచిపోవలెను. అక్కడకూడ భూదానయజ్ఞము చేయవలెను. నేను ముసల్మానులకు సేవచేసి వారిప్రేమనుకూడ పొందియుంటిని. నేను వారికి ఘోషాపద్ధతికి వ్యతిరేకముగా ఎన్నో మాటలు చెప్పితిని. వారుకూడ ప్రేమతో వినియున్నారు. వారు నన్ను తమవానినిగా ఎంచెదరు. కారణమేమనగా నేనుగూడ వారిని నావారినిగా ఎంచెదను. ఏది సత్యమో దానినే పలుకుచుందును. దానివల్ల నాకు పోయెడిదేమియులేదు.

ప్రశ్న : 'రాముడు, కృష్ణుడు మానవులయియుండగా మీరు వారిని ఈశ్వరులని ఏల కొలిచెదరు,' అని ఇతరమతస్థులు అడుగు చుందురు. ఏమందురు ?

వినోబా : మహాపురుషులు మరణించిన పిదప వారి ఆత్మను వారిదేహమునుండి వేరుచేసి దానిని పరమాత్మలో విలీనము చేయుట మన సనాతన ప్రక్రియ. కనుకనే రాముడును, కృష్ణుడును ఇప్పుడు మానవులు కారు. ఈశ్వరు లయిపోయిరి.

# భూదానము - కార్మికుల ఆందోళన

ఫైజాబాదు
1—5—1952.

ఫైజాబాదుకు పోవు రోడ్డుమీద ప్రభు రామచంద్రులవారి అయోధ్యా నగరమున్నది. అయోధ్యకు పోవు దారికూడ మిక్కిలి సుందరముగానుండెను. వినోబాజీ ఈ జిల్లాలో ప్రవేశింపగానే ఇట్లనిరి : "అయోధ్యా నగరము మనుష్యుల హృదయములో నున్నది. ప్రేమ ఉన్నచోట వైరము, జగడములు, ద్వేషము ఉండవని చెప్పుదురు. అటువంటి అయోధ్యా నగరములోనే రామచంద్రులు నివసించు

చున్నారు. కాని ఆయన ప్రతివారి హృదయమునందును రమించు నట్టి రాములు అయియున్నారు. ఆ హృదయస్థుడయిన రాముడే సత్కార్యములు చేయుటకు ప్రేరణ గలుగ జేయుచున్నాడు.

అయోధ్యలో ప్రవేశింపగానే విద్యాకుండము కనబడెను. కుండము యొక్క నిర్మాణము సుందరముగా నుండెను. నాలుగు వంకల ఎత్తయిన మామిడిచెట్లు ఉండెను. శ్రీరామచంద్రులు ఇక్కడనే విద్య నభ్యసించిరని చెప్పుదురు. కాని ఆ కుండములోని నీరు మిక్కిలి మురికిగా నుండెను. చెడు వాసన వచ్చుచుండెను. మన తీర్థ క్షేత్రము లన్నిటిలోను ఇటువంటి విరోధాభాసమే కనబడుచుండును. నేటి మన తీర్థ క్షేత్రములలో ఎంత మురికి, కపటము, ధనలాలస ఉండునో చెప్పజాలము. అందువల్ల అక్కడకుపోయినవారు నాస్తికులు అయినను కావచ్చును.

తులసీదాసు ఏ చోటున కూరుచుండి రామాయణము వ్రాసి యుండిరో అక్కడ యిప్పుడొక మందిరము ఉన్నది. ఆ మందిర ప్రాంగణమున వినోబాజీకి స్వాగతమివ్వబడెను. అభినందన పద్యములు, స్వాగత పద్యములు నిత్యము చదువబడుచుండును. వినోబాజీ తులసీ రామాయణమును విశేషముగా ప్రేమింతురు. అందువల్ల వారు ఇక్కడ ఉపన్యాసము చెప్పునప్పుడు గద్గద కంఠము గలవారయిరి. తులసీదాసువారి నామమును ఉచ్చరించునపుడు వారికి కంఠావరోధ మగుచుండెను. మఱియు కన్నీరు స్రవించుచుండెను. మాట్లాడు నప్పుడు ఒక్కొక్క మాట చెప్పి ఆగిపోవుచుండిరి. ఒక సాధుపుంగవుడు నిలిచిన చోట మఱియొక సాధుపుంగవుడు భావమగ్నుడగుట స్వాభావికమే గదా. అందువలన వారి ఉభయుల ఏకాత్మభావన ప్రకటిత మగుచుండెను. ఆ దృశ్యము చిత్తములో గట్టిగా నాటుకొని పోవుట వలన హృదయసీమయం దది శాశ్వతముగా నిలిచిపోయెను. అక్కడనుండి బయలుదేరగానే గాలి జోరుగా వీవసాగెను. వాన చిను

కులు కూడ పడుచుండెను. ఈ ఉభయుల ఆంతరిక సంయోగమువల్ల ఈశ్వరుడు కూడ ఆనందభరితుడయినట్లు గోచరించెను.

ఫైజాబాదు నగరములో ప్రవేశింపగానే ఒక చిన్న బాలిక హారతి యిచ్చి విచ్చిన మల్లెపూల దండను సమర్పించెను. ప్రతిదినము వినోబాజీకి తఱుచు ఎన్నో చిత్రవిచిత్రములయిన పూలదండలు దొరుకు చుండును. అచ్చట కవికుమారు డొకడుండిన యెడల సుందరమయిన కవిత చెప్పియుండెడివాడే. కొన్ని హారములు తెల్లని పూలమొగ్గలతో కట్టబడినవి. మఱికొన్ని మొగ్గలు, పూలు కలిపి గుత్తులు గుత్తులుగా కట్టబడినవి. ఇంకను కొన్ని ఎఱ్ఱపూలు, తెల్ల పూలు కలిసినవి. వేఱొక కొన్ని రంగురంగుల పూలతో కట్టబడినవి. ఒకటి రెండు దండలు ఎఱ్ఱ గులాబులతో కట్టబడినవి. కొన్నిదండలు ఆకులు, పూలు కలిపి కట్టినవి. మఱికొన్ని చమకీ వేసి కట్టినవి. అవి ఎంత మనోహరముగానుండునో చెప్పలేము. ఇంక పువ్వులు ఎన్నెన్ని విధములో వర్ణింపలేము. మల్లె, జాజి, గులాబి మొదలయినవి. ఇంకను ఎన్నో పూలున్నవి. వారి పేరులే నేను ఎఱుగను. గ్రామములోని అడవి పూలదండలు విచిత్ర మయినవగుటవల్ల మిక్కిలి రమ్యముగా నుండును. అంతేగాక చిత్తా కర్షకములుగా నుండును.

ఈనగరము గొప్పది. మానివాసస్థానము ఒక ధనవంతుని భవన ములో. కనుక ఏర్పాటులన్నియు భవనమునకు తగినట్లుండెను. ఆ మేడ రోడ్డు ప్రక్కనే ఉండుటవల్ల ఎదురుగానున్న దుకాణములోని "లౌడు స్పీకరు" నుండి సినిమా సంగీతము వినవచ్చుచుండెను. దానిమూల మున మా చెవులు చిల్లులుపడుచుండెను. ఇది అక్కడ ఉన్నకష్టము. వినోబాజీకి క్రింది అంతస్థులో బస ఏర్పాటు చేయుటవల్ల వారి కీకష్టము లేకపోయెను.

పూలదండలవలెనే మానివాసస్థానములును ఎన్నోవిధములుగా నుండెను. ఒకప్పుడు కుటీరము, ఒకప్పుడు మహలు, ఒకప్పుడు నగము

పడిపోయిన గ్రామపాఠశాల, ఒకప్పుడు పూర్తిగా ఆధునిక సాధనములతో అలంకృతమయిన రహదారి బంగళా, ఒకప్పుడు నేటుబంగళా, ఒకప్పుడు సత్రము, ఒకప్పుడు మధ్యమతరగతి కుటుంబమువారి చిన్న యిల్లు.

తఱుచుగా వినోబాజీని, "మీరు ధనవంతుల యిండ్లలో ఎందుకు దిగెదరు" అని అడుగుచుందురు. దానికి వినోబాజీ సమాధానము శంకలన్నిటిని పోగొట్టునదిగానుండును. "గాలి, అగ్ని ప్రతియింటిలో ప్రవేశించునప్పుడు నేను మాత్రము ఎందుకు ప్రవేశింపరాదు. అగ్ని, పోయినచోట జ్వలించుటకే పోవుచున్నది. అట్లే నేనుకూడ ధనవంతుల ఇండ్లలో ప్రవేశించి అగ్ని అంటించుచున్నాను. దీనిలో దోష మేమున్నది?" వినోబాజీ ప్రవేశించిన యింటిలో క్రాంతి అను నిప్పుపుట్టకుండ ఎట్లుండగలదు? ఇంటి యజమానుడు భూదానమిచ్చును. స్త్రీలకు, ఘోషాను విసర్జింపు డను ఆదేశము లభించును. ఇంటిలోని బాలురకు క్రాంతిదీక్ష గలుగును. వినోబా సాహిత్యమంతయు ఇంటిలో ప్రవేశించును. రాటము ప్రవేశించును. వినోబాజీ యాత్రీదళములో అన్నిప్రాంతముల, అన్నిజాతుల జను లుందురు. మఱియు గ్రామములోని చిన్న, పెద్దలందఱు వినోబాజీని కలిసికొనుటకు వచ్చుచుందురు. అందువల్ల ఆ యింటివారికి సమానతపాఠము బోధింపబడును. అస్పృశ్యతను, జాతిభేదమును నిర్మూలించునట్టి ప్రత్యక్షప్రమాణము దొరకగలదు. అట్లయినను కొందఱు తీవ్రవాదులకు వినోబాజీ ధనవంతుల యిండ్లలో బసచేయుట గిట్టదు. ఇది చూచి వినోబాజీ "ఇదికూడ ఒకవిధమైన జాతిభేదమే" అనుచుందురు.

నేటి దినమంతయు చర్చలు సాగుచుండెను. భిన్నభిన్న శాఖల జనులు వచ్చి, సందేహాము లడిగి, వినోబాజీ సమాధానములతో తృప్తిపడి పోవుచుండిరి. కొందఱు ముసల్మాను సోదరులు ధర్మ నిరపేక్షరాజ్యమును గుఱించి ప్రశ్న లడుగగా, వినోబాజీ ఇట్లు చెప్పిరి:

"రాజ్యము కొందఱికొఱకు మాత్రమే గాక అందఱి కొఱకును ఏర్పడుచున్నది. ధర్మ నిరపేక్ష రాజ్యము, 'మీ ఈశ్వరునకు వ్యతిరేక మయినది కాదు. కాని అది చెప్పునది ఏమనగా మేము ఈశ్వరుని మాకు పునాది అని చెప్పము. మతము పేరు పెట్టి మానవులకు, మానవులకు మధ్య అంతరమును ప్రవేశ పెట్టజాలము. అందఱకును సమానావకాశములు ఇచ్చెదము. అందుకుగాను మేము స్వర్గమునకు పోయినను సరే, నరకమునకు పోయినను సరే' అని చెప్పును. ధర్మ నిరపేక్ష రాజ్యము నాస్తికము కాదు, కాఫిరు కాదు. అది కేవలము సేవా పరాయణుల రాజ్యము."

అటుపిమ్మట ఒక ప్రగతివాది వచ్చి, 'అయ్యా! మేము మీ భగవంతుని, మతము మొదలయినవానిని నమ్మము' అనగా, వినోబాజీ, 'పోనిండు మీరు భగవంతుని నమ్మని యెడల తంటా లేదు. కాని సత్యము, నీతి, సదాచారము మున్నగువానిని నమ్ముచున్నారు గదా' అని అడిగిరి.

ప్రగతివాది : అవునండి. తప్పక నమ్ముచున్నాను.

వినోబా : ఆ పక్షములో మీరు ఆస్తికులే. ఒకవేళ ఎవరయినను తాము భగవంతుని యందు భక్తిశ్రద్ధలు గలవారమని నొక్కి చెప్పుచు, అసత్యము, టక్కరితనము మొదలగు లక్షణములు కలిగియున్నచో, వారికంటె భగవంతుని యందు నమ్మకములేదని చెప్పుచు, సత్యనిష్ఠాపరులయియున్న వారు అనేకరెట్లు ఆస్తికులు.

ఉత్తరప్రదేశమునకు ముఖ్యమంత్రి (నేడు కేంద్రీయ గృహమంత్రి) గోవిందవల్లభ పంత్‌జీ భూదాన యజ్ఞమునకు మిక్కిలి అనుకూలురు. సేవాపురిలో జరిగిన సర్వోదయ సమ్మేళనములో వారిట్లనిరి. 'భూదానమువల్ల మన ఆర్థిక సమస్య విడిపోవుచున్నది. కాని దానికంటె, ఇప్పుడు ఏర్పడుచున్న నైతిక వాతావరణము అధిక ప్రధానమయినదని తలచెదను.' భూదాన యజ్ఞమునకు సాయము

చేయుటకు, పంతుజీ వ్యక్తిగతముగా సర్కారు ఉద్యోగు లందఱకును అనుమతి నిచ్చెను. అందువలన చిన్న, పెద్ద ఉద్యోగులు భూదానకార్యములు నిర్వర్తించుచుండగా చూడగలము. ఈ రోజున ప్రభుత్వ వ్యతిరేక పక్షమునకు చెందిన కార్యకర్త ఒకడు వచ్చి వినోబాజీతో, "సర్కారు ఉద్యోగులు భూదానములు అడుగుచున్న యెడల, దాని మూలమున అనుచితమైన ఒత్తిడి గలుగును," అనగా వినోబాజీ ఇట్లు సమాధానము చెప్పిరి: "ప్రభుత్వము జాతీయమయినప్పుడు 'సర్కారు, గైరు సర్కారు' అను భేదము ఉండరాదు. సముద్రములో గంగా, యమునల వంటి నదులు కలియుచోట కాలువలుకూడ పోయి కలియుచున్నవి. సముద్రము దేనినీ కాదనదు. భూదాన కార్యము కూడ సముద్రమువంటిది. సర్కారు ఉద్యోగులు భూదాన కార్యములు చేసిన యెడల ఈ ఉద్యమము దూషిత మయిపోవునని నేను అంగీకరింపను. ఒక విధముగా నా మూలమున గూడ నైతికమైన ఒత్తిడి గలుగుచున్నది గదా. ఒకసారి మథురలో ఒక సోదరుడు శ్రద్ధతో దానమిచ్చుటకు వచ్చెను. అతడు తన శక్తికంటె తక్కువ దానమిచ్చుచుండెను. అప్పుడు నేనతనితో ఇట్లంటిని: 'నేను బిచ్చమడుగుటకు రాలేదు. బీదవారి తరపున వారి హక్కును అడుగుటకు వచ్చితిని. మీరు ముగ్గురు సోదరులు. నేను నాల్గవవాడను. నా వాటా నాకు ఇవ్వండి.' ఆ సోదరునకు నా మాట నచ్చినది. అతడు నన్ను తన నాల్గవ సోదరునిగా ఎంచుకొని సరిగా నాలుగవ భాగము అయిదు వందల యకరముల భూమి దాన మిచ్చెను. ఇటువంటి అవకాశములు ఎన్నో వచ్చినవి. ఏమి, దీనిలో ఒత్తిడి ఉన్నదా ?"

ప్రశ్న : కాని ఎందఱో చెడ్డమనుష్యులు భూదానకార్యముచేసి ప్రతిష్ఠ సంపాదించుచున్నారు.

వినోబా: మనుష్యునిలో దోషము లుండవచ్చును. కానిమానవుని యందు అవిశ్వాసముంచుట నాకు సరిపడదు. నేను అందఱి సహా

యమును పొందగోరుదును. నేను ఏవ్యక్తి యందయినను అపనమ్మక ముంచినయెడల నా పునాదియే పాడయిపోవును. సర్కారు ఉద్యోగు లను పనిచేయవద్దనుట అనగా జాతీయ ప్రభుత్వమును పనిచేయగూడ దనుటయే. భూదానకార్యము చేయవలసినదని ప్రభుత్వము తన ఉద్యోగులకు ఆదేశమిచ్చినయెడల మిక్కిలి సరియయిన పని చేయు చున్నదన్నమాట. కారణమేమనగా ప్రజాసేవ చేయుటయే ప్రభుత్వ కర్తవ్యము.

ప్రశ్న : కాని చాలమంది జనులు భూదానకార్యము సగము విశ్వాసముతో (Half-heartedly) చేయుచున్నారు.

వినోబా : ఏ ఆటంకములేదు. ఏదయిన మంచిపనిని సగము వఱకు ఎందుకు, ఒక అణా విశ్వాసముతోచేసినను చేయవచ్చును. నేను ఎవరినికూడ దూరముగా విసరివేయను. నేను అందఱను సంస్క రింపవలెను. నాతోపాటు పనిచేసినందువల్ల చెడ్డవానిపైన నాప్రభా వము తప్పక కనబడును. కాని అతని ప్రభావము నన్నేమియుచేయ లేదు. ఇందు నాకు పూర్ణవిశ్వాస మున్నది. అందువల్లనే నేను నిర్భయు డనయి అందఱి సాయమును పొందుచున్నాను.

సాయంకాలప్రార్థన సభయందు విశాలజనసముదాయము ఎదుట మాట్లాడునట్టి వినోబాజీ ముఖమునుండి బయల్వెడలిన ప్రతిమాట హృదయసీమపైన అంకితమయిపోవుచుండెను. గురుదేవులు ఇట్లనిరి— 'భగవానుడు అనంతహస్తములతో ఇచ్చుచునేయుండును. కాని మన చిన్న రెండు చేతులతోనే తీసికొనగలుగుచున్నాము. అతడు ఇచ్చుచునే ఉండును. మనకు గ్రహించునట్టిశక్తిమాత్రము ఉండదు.' వినోబాజీ వెంట ఉన్నందువల్ల నాకు ఈ విషయము స్పష్టముగా గోచరించు చున్నది. జ్ఞానదానమునకు సంబంధించిన నవ్యభావములను వారు అఖండముగా ప్రసాదించుచుండిరి. కాని వానిని గ్రహించునంతటి శక్తి మనలో ఉండుటలేదు. ఈరోజున వారు ఇట్లనిరి: "వ్యక్తికి

మనస్సు ఉన్నట్టువలె సమాజమంతటికిగూడ ఒకసామూహిక మనస్సు కూడగలదు. అందువల్ల భూమి అంతటిపైన మానవుడు సుమారుగా ఒకేవిధముగా మాట్లాడుచున్నాడు. రెండున్నరవేల సంవత్సరములకు పూర్వము మానవునకు సంఘమును నిలబెట్టుటకుగల మూలతత్త్వమును వెదకవలెనను కోరిక గలిగెను. భారతదేశమందు బుద్ధుడు, మహావీరుడు; చీనాలో లావోత్సే, కన్‌ఫ్యూషియస్; పాలస్తీనాలో జరతుస్త్ర, ఏసుక్రీస్తు; మిశ్రదేశములో మూసా జన్మించి యుండిరి. ఈవిధముగా మానవులందఱకు ఒకేవిధమయిన ప్రేరణ కలిగెను. ఆకాలములో ఒకరిమాట ఒకరికి తెలియుటకు సంవత్సరములు, సంవత్సరములు పట్టుచున్నమాట మీకు తెలిసినదేగదా! అట్లయినను ఒక అవ్యక్తరూపమగు వాయువు విస్తరించుచుండెడిది. దానికి కారకుడు సర్వాంతర్యామియు, సర్వప్రేరకుడును నయిన పరమేశ్వరుడే అయియున్నాడు. అటుపిమ్మట, నేటికి వేయిసంవత్సరములక్రిందట మానవునకు సర్వత్ర ఆధ్యాత్మిక సంశోధనచేయుటకు ప్రేరణ గలిగెను. ప్రతిదేశములోను ధ్యానచింతనమందు మునిగి మనస్సునందు నిద్రాణమయియున్న శక్తులకు ఆవాహనముచేసి జీవితమును శక్తిమంతము చేయునట్టిపని జరుగుచుండెను. దీనినే ఆధ్యాత్మిక విద్యాయుగమని చెప్పవచ్చును. ఈనాడు మానవుడు అన్నిచోట్ల సమత, స్వతంత్రము, న్యాయము కలుగవలెనని తహతహలాడుచున్నాడు. ఆత్మ అందరియందును సమానముగా నివసించుచున్నది. ఈ సంగతి తత్త్వజ్ఞానములో ఉండనే ఉన్నది. దాని నిప్పుడు జీవితములోనికి తేవలెను.

ఈ రోజు 'మే దినము' **(May Day)** సందర్భమున ఈ ఉద్యమము నా కార్మికాందోళనమని మీతో చెప్పగోరుచున్నాను. అందఱికంటెను దుర్బలులగు కార్మికులెవరో, ఎవరికి భూమిగాని, హక్కుగాని లేదో వారిమాట నా నోటినుండి ప్రకటితమగుచున్నది. అహింసాపద్ధతియందు అందఱికంటె చివరవానిని ముందుగా ఉద్ధరింపవలెను.

అతనితోపాటు మిగిలిన వారందఱు ఉద్ధరింపబడుదురు. నేనుకూడ ఒక కూలివాడనే. నేను నా జీవితములోని పడుచుకాలములో ముప్పది రెండు సంవత్సరములు కార్మిక వృత్తి చేయుచు గడపియుంటిని. వ్యవసాయము, వడుకుట, నేత, పాకీపని మొదలగునవి చేసియున్నాను.

భూ సమస్య పరిష్కరింపబడక తప్పదు. లోకములో ఆ సమస్యను పరిష్కరించుటకు ఎన్నో అస్తవ్యస్తమయిన పనులు చేయబడినవి. ఈ సమస్యను శుద్ధమగు పద్ధతిని, మన సభ్యతకు అనురూపమగు అహింసాత్మకమగు మార్గమున పరిష్కరింపవలెనని నా సర్వశక్తుల ప్రయత్నము చేయుచున్నాను. కారణమేమనగా దీని మూలమున మానవునకు కల్యాణము సిద్ధించును. నేతి డబ్బాకు నిప్పు అంటించినా, లేక వేదమంత్రములతో యజ్ఞకుండమునందు నేతిని ఆహుతిగావేసినా రెండింటను నెయ్యి దగ్ధమగుచున్నది. కాని ఒకదానివల్ల భావన కాలిపోవును. దానితో లోకము నశించిపోవును. మఱియొకదానివల్ల భావము పునీతమగును. దానితో లోకమునకు మంగళము గలుగును.

## బాలుడు కూడ భూదాన ప్రసంగమే చేయుచున్నాడు

**సుచేతాగంజ్ - ఫైజాబాదు**

**2—5—1952.**

నిన్న రాత్రి పన్నెండు గంటలకుగాని నిద్రపోవుటకు అవకాశము కలుగలేదు. కనుక నేటిఉదయము కన్ను విప్పుడుపడలేదు. కాని మూడుగంటలకు గంట వినబడగానే మేము మా ప్రక్కలు చుట్టబెట్టితిమి. రాత్రి తొమ్మిది గంటల తరువాత మేలుకొనియే యుండరాదని వినోబాజీ చెప్పుచుందురు. కాని ఏదోపనివల్ల మాకు ఎల్లప్పుడు నిదు

రించుటకు ఆలస్యమే యగుచుండెను. వ్యాధిగ్రస్తుని సేవించుటకు తప్ప మఱియేకారణమువల్లను రాత్రిప్రొద్దుపోవువఱకు మేలుకొని యుండరాదని వినోబాజీ స్పష్టముగా ఆదేశించియుండిరి. రాత్రి తొందరగా నిద్రపోయి ఉదయము పెందలకడ లేచుటవల్ల అనేక లాభములున్నవి. ఈసంగతిని రుజువుచేయుటకు వారు వేదముల నుండియు, ఉపనిషత్తులనుండియు ఎన్నో శ్లోకములు చదువుచుందురు. "యో జాగార తం ఋచా కామయన్తే" ఉదయమున పెందలకడ లేచువానికే జ్ఞానము ప్రాప్తించును.

వినోబాజీ ఒకసారి మేలుకొనుటను గుఱించి మంచిరుచికరమైన మాటను చెప్పియుండిరి. అది విన్నపిమ్మట రాత్రి ప్రొద్దుపోవువఱకును మేలుకొనుటకు ధైర్యము లేకుండెను. వారిట్లనిరి: రాత్రి తొమ్మిది గంటలకు సర్వసామాన్యముగా జనులు మేలుకొందురు. తొమ్మిది నుండి పండ్రెండు గంటలవరకు భోగులు మేలుకొందురు; పండెండు గంటలనుండి మూడు గంటలవఱకు దొంగలు; అటుపిమ్మట మూడు నుండి ఆఱుగంటలవఱకు మేలుకొనువారు యోగులు.

వినోబాజీ భాష్యము ననుసరించి మాకు ఇక్కడ వారిసహవాసమువల్ల యోగి బిరుదము సంప్రాప్తమగుచుండెను. కాని విద్యార్థి జీవితములో మేము ఎన్నో రాత్రులను పన్నెండునుండి మూడువఱకును మేలుకొని గడపియుంటిమి. వారిలెక్కప్రకారము మేము దొంగలమే అయియుంటిమి. ఇది తలచుకొన్నప్పుడు మాకు నవ్వువచ్చుచుండెను. కాని ఆరోజులలో ఈవిధముగా దొంగలయిన విద్యార్థులకు గౌరవము ఉండెడిది.

మజిలీకి చేరగానే వినోబాజీ స్వాగతమిచ్చుటకయి వచ్చిన బాలురలో నొకనిని పిలిచి ఇట్లడిగిరి : "మీరెందరు సోదరీ సోదరులు."

బాలుడు : నలుగురు.

వినోబా : మీ తల్లి కేవలము నిన్నే ప్రేమించునా; లేక అందఱను సమముగా ప్రేమించునా ?

బాలుడు : అందఱను సమానముగా ప్రేమించును.

వినోబా : భూమి మన కేమగును ?

బాలుడు : తల్లి.

వినోబా : ఆ తల్లిపయిన బాలురందఱకు సమానాధికారము ఉండవలెనా, లేదా ?

బాలుడు : ఉండవలెను.

అటు తరువాత వినోబాజీ జనులతో ఇట్లనిరి— 'చూడండి. ఈ పిల్లవాడు భూదాన ప్రసంగమే చేయుచున్నాడు. బాలుర ముఖము నుండి భగవానుడు మాట్లాడుచుండును. కనుక ఈ పని జరిగియే తీరును.' ఈ విధముగా పిల్లలతో సంభాషించి వినోబాజీ భూదాన ప్రభావమును బోధించుచుండును. దానివలన ఎంతోపని జరుగుచున్నది. వారు దీనిని "నాటక" మనుచుందురు.

నేటిసాయంకాలము మామూలుగా సంభాషణ జరుగుచుండెను. అంతట వినోబాజీ పూరాబజారులో జరిగిన ఘట్టమును వినిపించిరి. మొన్న పూరాబజారులో రెండుజాముల సమయమున వినోబాజీ ఒంటరిగా చదువుకొనుచుండిరి. వారివద్దమాలోఒక్కరుకూడ లేకుండిరి. ఎదురుగాఉన్న రోడ్డుమీద ఒకమోటరు బస్సు నిలిచెను. అందుండి కొందఱు బాటసారులు దిగి, 'వినోబాజీ దర్శనమునకయి వచ్చిరి. వారిలో ఒకడు చదువుకొన్నవానివలె కనబడెను. అతడు చాలసేపటి వఱకు నిలబడి వెళ్ళిపోవు సమయమున, వినోబాజీతో ఇట్లనెను: 'ఒకడు (గాంధీజీ) దేశమును ముక్కలుచేసిపోయెను. అందువల్ల జనులతనిని స్వర్గమునకు పంపియున్నారు. ఇప్పుడు మీరు భూమిని ముక్కలు చేయుచున్నారు. కాబట్టి మిమ్ములనుకూడ అక్కడకే పంపవలెను.'' వినోబాజీ అతనికి నమస్కరించిరి. కాని అతడు చూడకయే వెడలి

పోయెను. ఇదివిని మేమెంతో ఆందోళన పడితిమి. నేటివఱకును ఇటువంటి ప్రవృత్తిగల జనులున్నారా అని తలచితిమి. మాకు దుఃఖము గలిగెను. కాని వినోబాజీ ఎప్పటివలె చలింపకుండ ప్రశాంతముగా నుండిరి.

## అమర మహాత్ములు

*షుజాగంజ్ (బారాబంకీ)*

3—5—1952

ఉత్తరప్రదేశములో మే నెల ఎండలు రోజురోజుకు తీవ్రమగుచుండెను. ఈరోజున 17 మైళ్ళు నడవవలసివచ్చెను. అందును దారి మిక్కిలి వడిదుడుకులుగా నుండెను. ఏడుగంటలు కొట్టకమునుపే సూర్యుడు ప్రచండకిరణములతో బయలుదేరుచుండెను. కనుక చివరి మైళ్ళను ప్రాణములు బిగబట్టుకొనియే నడచుచుంటిమి. ఉదయము నాలుగు గంటలకు బయలుదేరినందువల్ల అటుపిమ్మట రెండు గంటల వఱకు ఆనందముతో గడచుచుండెను. ఈరోజున అందఱమును సాంతముగా అలసిపోతిమి. బడలికవలన వినోబాజీ నోటినుండిమాటయే రాలేదు. మజిలీకి చేరగానే నాలుగుమాటలు ఎట్లో చెప్పి ప్రక్కనాశ్రయించిరి.

నేటి మజిలీ ఒకచిన్న గ్రామములో శాంతమైన, రమణీయమైన స్థానము. ఒకసుందరమయిన చెఱువు. దానిబడ్డున ఒక దేవమందిరము. అందు మా నివాసస్థానము.

అటువంటి దూరగ్రామములకు ఎవరుపోయెదరు ? నాయకులందఱు మోటారు రోడ్లపైగల గ్రామములకుపోయి పది పన్నెండు నిముసములు మాట్లాడి తుఱ్ఱున ఎగిరిపోవుచుందురు. కాని ఈసాధు పుంగవుడట్లుకాదు. రైలుగాని, మోటారుగాని పోలేని గ్రామములకు

పోవుచుండును. అతడు కాలినడకనుపోయి, చిన్న గ్రామమయినను దినమంతయు నిలిచి, గ్రామీణుల సుఖ దుఃఖములను వినుచుండును. అందువల్ల వారికొక మిత్రుడు వచ్చినట్లు తోచుచుండును. ఈ సాధు పుంగవునివద్ద తమ కష్ట సుఖములు చెప్పుకొన వచ్చుననియు, అతడు సుఖమయమగు మార్గము చూపగలడనియు తలచు చుందురు. ఆ గ్రామీణులను పలుకరించువారుగాని, కష్టసుఖము లడుగువారు గాని, వారి దగ్గఱకు పోవువారుగాని ఉండరు. అటువంటి పీడిత, దళిత, దుఃఖిత మానవుల చెంతకు 'గాంధీబాబా శిష్యుడే' పోగలడు.

అతడు గాంధీకార్యమును సాధించుచున్నాడని గ్రామీణులు వెంటనే గ్రహించుచున్నారు. ఒకసారి మేము గ్రామస్థులతో 'వినోబా, మహాత్ముల వారి శిష్యుడు' అంటిమి. ఇది వినగానే ఒక రైతు 'శిష్యుడు కాదు. వీరుకూడ మహాత్ములే' అనగా, మేము, 'మహాత్మాజీ ఈలోక ములో లేరు' అనగా, అతడు వెంటనే 'మహాత్ము డెన్నడయినను మర ణించునా ?' అనెను. అదయితే ఒక చిన్న వాక్యమే. కాని అందు ఒక మహాకవికి ప్రేరణ గలిగింపగల శక్తి ఇమిడియున్నది. 'మహా త్ముడు అమరుడు, మా కన్నీళ్లు తుడుచువాడు, మాకు దారిచూపు వాడు, ఎవడు వచ్చినను అతడు మహాత్ముని కార్యమే చేయుచుండును. అతని ద్వారా మహాత్ముడే పనిచేయు చుండును.' మహాత్ముడు ఏదో శరీరమును ధరించు మానవుడు కాడు. త్రిభువన వ్యాపకుడయిన పరమాత్మయే లోకకల్యాణము కొఱకు మహాత్ముని వేషము ధరించి వచ్చియుండెను. మహాత్ముడు మరణింపడు. కారణ మేమనగా మహా త్ముడు మానవుడుకాడు. కాని పరమాత్మ సందేశమే అతడు,' అని ఆ రైతు చెప్పుచుండెను.

ఈ రోజు సాయంకాల ప్రార్థన సభలో వినోబాజీ మిక్కిలి ప్రసన్నులుగా నుండిరి. ధ్వనివిస్తారక యంత్రములను (లౌడుస్పీకర్లు) తొలగించిరి. అంత గ్రామీణుల మధ్య తిరుగుచు ప్రసంగించుచుండిరి.

వారిట్లనిరి. "ధ్వనివిస్తారక యంత్రములు నాకును, జనులకును మధ్య గోడవలె ఉన్నవి. ఈ రోజున ఆ గోడ తొలగిపోయినది." అందువలన వినోబాజీయు, గ్రామీణులును హృదయము విప్పి మాట్లాడుకొనిరి.

## అఖండ జ్ఞాన లాలస

*సఫదర్ గంజ్ (బారాబంకీ)*

4—5—1952.

మార్గమధ్యమున వెంకటేశయ్య వినోబాజీని మదరాసు విశేషము లేమని యడిగెను. వినోబాజీ ఇట్లనిరి: 'రాజాజీ మదరాసునకు ముఖ్యమంత్రులయిరి. మంచిపని జరిగినది. వారి రాకవల్ల మదరాసు ప్రాంతము బ్రతికిపోయినది. రాజాజీ మేధావి, చతురుడు, తగినవ్యక్తి. వారా పదవి నందుకొన్నారనగా సరియయిన స్థానమునకు సరియయిన వ్యక్తి దొరికినారన్నమాట.' వేంకటేశయ్య తమిళనాడునివాసి యగుట వల్ల రాజాజీ ప్రశంస విని మురిసిపోయెను.

ఈ గ్రామములో ముసల్మానులు ఎక్కువమంది కనబడిరి. పురాతనమైన మసీదులు, శిథిలములయినద్వారములు మొదలయినవి అక్కడక్కడ గోచరించెను. స్త్రీలకు చీర గట్టుకొను అలవాటు లేదు. నక్కి వేసిన లంగాలు కట్టుకొనియుండిరి.

ఈ రోజున వినోబాజీ ఘోషా ఆచారమును కఠినముగా విమర్శించుచు ఇట్లు మాట్లాడిరి: "నేను దక్షిణమున తెలంగాణాలో సంచారము చేయునప్పుడు సభలోనికి పురుషులెందఱు వచ్చుచుండిరో స్త్రీ లందరు వచ్చుచుండిరి. అక్కడి స్త్రీలు నిర్భయముగా సభలో లేచి నన్ను ప్రశ్న లడుగుచుండిరి. ఇక్కడ ముసల్మాను రాజులు పరిపాలించిరి. అందువలన ముసల్మాను రాజులను సంతోషపెట్టుటకయి హిందువులు కూడ వారి ఘోషా ఆచారమును అవలంబించిరి. ఇతరుల మంచి

అలవాటును పరిగ్రహించుటలో దోషమేమియు లేదు. కాని ఘోషా పద్ధతి మిక్కిలిచెడ్డది. ముసల్మానులు కూడ ఈ పద్ధతిని విడిచిపెట్టవలసి వచ్చును. నేను అజ్మీరులోను, దరగాలోను, ముసల్మానుల సభయందును చెప్పియుంటిని. ఈ సభలోకూడ స్త్రీలెవ్వరును కనబడుచుండుట లేదు. అల్లా నివసించెడి మసీదులో కూడ స్త్రీ పురుష భేదమెందుకు ? మీరు ఘోషాను విడిచిపెట్టవలసివచ్చును. ఏ సంఘములోని స్త్రీలు ఘోషాలో నుందురో ఆ సంఘము అభివృద్ధి పొందజాలదు' అన వారు నా మాట లను ప్రేమతో ఆలకించిరి. కారణమేమనగా, ఇది సత్యమయిన భావన. పైగా నేను వారిని నాకంటె భిన్నులుగా చూచుటలేదు. హిందూ ధర్మము స్త్రీ పురుషుల సమానతను అంగీకరించుచున్నది. హిందువుల ధర్మకార్య మేదియు పత్ని లేకుండ సాగదు. రాముడు యజ్ఞము చేయవలసి వచ్చెను. సీత అంతకుపూర్వమే అరణ్యములకు పంపబడెను. 'అందువల్ల సీత లేకుండ యజ్ఞము సాగ' దని ఋషి బోధించెను. అంతట బంగారు సీతను చేయించవలసివచ్చెను. అనంతరము యజ్ఞము జరిగెను. వేద కాలములో గొప్ప జ్ఞానము గల స్త్రీలుండెడివారు... యాజ్ఞవల్క్యుని సభలో చర్చ సాగుచుండెను. అప్పుడు గార్గి లేచి, నిలబడి యాజ్ఞవల్క్యునితో ఇట్లనెను: 'కాశీ క్షత్రియ వీరుడు గాని, విదేహా క్షత్రియ వీరుడు గాని బాణములు కొట్టునట్లు నేనును నిన్ను ప్రశ్నరూపమగు బాణములను విడుచుచున్నాను. నీ వక్షము నెదురుగా నుంచుము. నేను ప్రశ్నలతో బ్రద్దలు కొట్టెదను.' అనంతరము ఆమె రెండు ప్రశ్నలడిగెను. వానికి యాజ్ఞవల్క్యుడు సరియయిన సమాధాన మిచ్చెను. అప్పుడామె ధైర్యముతో పండితులతో ఇట్లనెను: "విద్వాంసులారా ! యాజ్ఞవల్క్యునితో చర్చ చేయకుడు. ఇతనికి నమస్కరింపుడు. ఇంతకంటె కఠినప్రశ్నలుండబోవు." గార్గి వీరునివలె నిలబడి ధైర్యముతో 'నాకంటె కఠిన ప్రశ్న లెవరడుగగలరు ?' అను చుండెడిది. అది వేదముల, ఉపనిషత్తుల కాలము. నేడో ?

గార్గికథ విన్నమీదట మనస్సులో ఎన్నో ఆలోచనలు పుట్టినవి. ఆ కాలములో గార్గి వేసిన ప్రశ్నలు అన్నిటి కంటెను కఠినములయి యుండెను. అయినను యాజ్ఞవల్క్యుడు సదుత్తరముల నీయగలి గెను. ఈ యుగములోను ఒకానొక గార్గి జన్మింప కూడదా? ఆమె ప్రశ్నలకు ఏ యాజ్ఞవల్క్యుడో సమాధానము చెప్పలేక ఓటమి నంగీ కరింపకూడదా?

వినోబాజీ ప్రత్యేకము స్త్రీలకు ఇట్లు సందేశము ఇచ్చును: "అఖండ జ్ఞాన లాలసను కలిగియుండండి. జ్ఞానతృష్ణను ఎన్నడును నష్టము కానీయకండి, జ్ఞానమును ఉపాసించినందువల్లనే మీరు లోక మును జయింపగలరు."

# సమయము ఉండగానే లభించినది

*సఫదర్ గంజ్ (బారాబంకీ)*

5—5—1952.

మార్గమధ్యమున, విద్యా బహానుతో ఆంధ్రదేశ సమస్యలను గుఱించి చర్చ సాగుచుండెను. ఆంధ్రలో తగినంత కమ్యూనిస్టుల ప్రాబల్య మున్నది. అందువల్ల అక్కడ భూదాన కార్యములెట్లు సాగ గలవు అన్న విషయమై చర్చసాగుచున్నది. వినోబాజీ ఎల్లప్పుడు ఇట్లు చెప్పుచుందురు: "సామ్యవాద మొక భావన. మీకు ఆ భావన నచ్చని యెడల దానిని సేనలతో ఎదిరింపరాదు. ఒక భావనను ఎదిరించుటకు మఱియొక భావనయే కావలెను. లోకములో జరుగనున్న అంతిమ సంఘర్షము సర్వోదయము, సామ్యవాదము (సర్వనాశము) నకే అయి యున్నది. కారణమేమనగా ఈ రెండును బలీయమయిన భావ నలు." వినోబాజీ ఇంకను ఇట్లు చెప్పుచుందురు: "హింసతోకూడ నాశము వచ్చుచు యున్నది. హింసపయిన ఘనమగు తత్వజ్ఞానము

కూడ అల్లబడినయెడల ఇంక సర్వనాశము గాకేమి? ప్రస్తుతము లోకములో సామ్యవాదమునకు విజయము గలుగుచున్నట్లు గోచరించినను చివరకు సత్యమునకే జయముకలుగును. ప్రకాశము ఎదుట అంధకారము నిలువజాలదు. అట్లే సత్యము ఎదుట అసత్యముకూడ.'' ఇది వారి అమర విశ్వాసము. ''కాని ఈరోజున సత్యమును కఠినముగా పాలించుటలేదు. దానిలో అసత్యమును కలుపుచుందుము. అట్టి స్థితిలో మనకు సఫలత కలుగనియెడల లోకములో సత్యమునకు స్థానములేదని బొబ్బలు పెట్టుచుందుము. మన అపజయమునకు కారణము సత్యాహింసలు కావు. కాని వానిని మనము సరిగా అనుష్ఠింపలేక పోవుటయే.''

విద్యాబహాన్ ఇట్లు చెప్పుచున్నది: 'ఆంధ్రలో ప్రస్తుతము సర్వోదయ కార్యములు ఎక్కడ జరుగుచున్నవి? కాని ఒక్కసారి వినోబాజీని అక్కడకు వెళ్ళనివ్వండి. అటు తరువాత చూతురుగాని. మా ఆంధ్ర అన్నిటికంటెను ముందుపోగలదు.' ఆమె ఆశావాదము వల్ల నాకును ఉత్తేజము గల్గెను. ఈలోకములో నిజమయిన మూల్యములయిన శ్రద్ధ, నిష్ఠ మొదలయిన వానిపయి గొడ్డలిపెట్టు తగులుచుండగా ఉన్నతాదర్శములను గుటిగా పెట్టుకొని జీవితము గడుపుట అసంభవమువలె తోచుచున్నది. ఆధునిక మానవుని మనో విశ్లేషణ చేయుచు చీనా తత్త్వవేత్తయగు లిన్‌యుటాంగ్ ఇట్లు చెప్పియుండెను: 'మానవుడు జీవించుటకును మరణించుటకును, ఏదో ఒక లక్ష్యము ఉండవలెను. ఒకప్పుడు మానవుని మనస్సులో ఈశ్వరుని యెడలను, ధర్మము నెడలను శ్రద్ధ యుండెడిది. కాని మనము ఈశ్వరుని మన మనోవీధులనుండి తటిమివేసితిమి. అతనితోపాటు శ్రద్ధకు కూడ వనవాసమును ఘటించితిమి. 19 వ శతాబ్దిలోని మానవుడు శూన్యమయిన తన మానసిక ఆసనమున విజ్ఞానమును, ప్రగతి వాదమును ప్రవేశపెట్టెను. కాని ఈ భయంకర మహా యుద్ధముల

మూలమున అతని శ్రద్ధ అంతయు మొదలంట నశించిపోయెను. నేటి మానవుల దుఃఖము లన్నిటికి 'శ్రద్ధాహీనత' ఒక్కటే కారణము. తాను ఎందుకు జీవింపవలెనో అతనికి తెలియనే తెలియదు.

గాంధీజీ దేశములో పుట్టియుండని యెడలను, క్షణమాత్ర మైనను నిజమయిన అర్థములో గాంధీజీ దర్శనము చేసియుండని యెడలను మనము కూడ శ్రద్ధాహీనత అను తుపానులోబడి మన జీవితమును వృథాచేసికొనుటతప్ప అన్యమేమియు జరిగియుండక పోవును. కాని జనులు '*మహాత్మా గాంధీకి జై*' అని గర్జించుచుండిరి. అందువలన మనకేది కావలసియుండెనో లభించి యున్నది. అందును సమయము ఉండగనే లభించినది.



## మూడవ భాగము

# మనము నిమిత్తమాత్రులము అగుదుముగాక

బారాబంకీ
6—5—1952

క్షితిజముపైన తూర్పు దిక్కున ఉషఃకాంతులు ప్రసరించుచుండగా వినోబాజీ మజిలీని చేరుకొనిరి. 'తమరీ రోజున పెందలకడనే చేరుకొన్నారే' అని ఒకరు అడుగగా, వినోబాజీ మోటారుమీద, విమానముమీద పయనించువారు ఆలస్యముగా చేరగలరు కాని, కాలి నడకను పయనముచేయువారు సమయమునకు కొంచెముముందుగానే వచ్చి చేరుకొనవలెను. తఱచుగా సాధనములగతి పెరుగుచున్నది. కాగా మనుష్యునిబుద్ధి మందగించుచుండును. మనము మందగతిగల సాధనముల నంగీకరింప నయినను వచ్చును. కాని సాధనముల గతిని పెంపుచేసి, బుద్ధికి మాంద్యము కలుగజేయుటనుమాత్రము అంగీకరింపజాలము,' అని సమాధానము చెప్పిరి.

వినోబాజీ నేడిచ్చట ఉపన్యాసము ప్రబోధముతో కూడియుండెను. వారిట్లనిరి: 'నావంటి సన్యాసి ఏడుమాసములనుండి మీ ప్రాంతములో తిరుగుచున్నాడు. మీరు, కార్యకర్తలని పేరుపెట్టుకొన్న వారెవరును ఇప్పటివఱకును మేలుకొని యుండలేదు. ఏమి, మీరందఱు శవసమానులు అయిపోయినారా? కార్యకర్తలలో కొందఱు సర్కారు ఉద్యోగములలో చేరుకొనిరి. కొందఱు తమ సంసారములలో మునిగి తేలుచుండిరి. మఱికొందఱు సాహిత్యసేవ చేయుచుండిరి. నిఱుపేదలను సేవించుటకు ఎవరికిని తీఱిక లేదు. కాని మీరు పనిచేయండి, మానండి. నేను మాత్రము చేసుకొనుచునే పోవు

చుందును. నేను గోరక్‌పూర్ సభలో ఇట్లు చెప్పియున్నాను— 'భగవంతు డర్జునునకు ఇట్లు చెప్పియున్నాడు: ఓ అర్జునా! కౌరవు లందఱు ముందుగానే మరణించి యున్నారు. కాని నీవిప్పుడు నిమిత్త మాత్రుడవుకమ్ము. 'నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్.' ఆప్రకారము గానే నేనిట్లు చెప్పుచున్నాను: 'ఈ భూమి అంతయు నాదయి పోయి నది. భూమి యావత్తు భూస్వాముల చేతులనుండి జాఱి శ్రమచేయు వారి దగ్గఱకు పోయి చేరుకొన్నది. కనుక మీరు నిమిత్త మాత్రులయి యశమును గడించండి' అని మీకు చెప్పుచున్నాను.''

ఈ ఉపన్యాసమును విని అక్కడనున్న కార్యకర్తలు ప్రబోధ మును పొందియుండిరి. మఱికొందఱు నిరంతరము భూదాన కార్యము చేయుచుండుటకే సంకల్పించుకొనిరి.

వినోబాజీ ఇట్లనిరి: 'ఈరోజున అందఱకు పరీక్ష అగుచున్నది. ఈ సమయములో నిమిత్త మాత్రులగువారు యశస్సును పొందుదురు. కాని నిమిత్త మాత్రులగుటకు కూడ అర్జునుని ఋజుత్వము, హరి శరణాగతి ఉండవలెనేగదా!'

## విశ్వ ఐక్యమునకు చతుర్విధ ప్రణాళిక

చనహాట్ (లక్నో)
7—5—1952.

ఈరోజున దారిలో రెండువైపుల పంక్తులు తీర్చిన చెట్లు స్వాగతము కొఱకు ధనురాకారముగా నిలిచినట్లుండెను. ఇప్పుడిప్పుడే సూర్యోదయ మగుచున్నది. బారాబంకీ జిల్లా దాటి లక్నోజిల్లాలో ప్రవేశించుచున్నాము. రెండు జిల్లాల సరిహద్దున రెండు జిల్లాల కార్యకర్తలు సమావేశమయి యుండిరి. ఇటునుండి వీడ్కోలు, అటునుండి స్వాగతముకొఱకు అపూర్వ సన్నాహములు చేయబడెను. ''మీరు

సంతతము పనిచేయుచు ఉండండి'' అని వినోబాజీ బారాబంకే జిల్లా ప్రజలకు సందేశమిచ్చిరి. అక్కడకు సమీపములోనే కూర్చుండియున్న జిల్లా అధికారితో నవ్వుచు నవ్వుచు, ఇట్లనిరి: ''ఇప్పుడు మీరుకూడ భూదాన కార్యములు చేయవలెను. కాని ఒక షరతు మాత్రము ఉన్నది. మీకు వేఱుగా భత్యములు రావు.'' ఆ మాటలువిని అందఱు నవ్వసాగిరి. జిల్లా అధికారి మాత్రము సిగ్గువల్ల తలయెత్తలేక పోయెను.

'ఈచోటు రెండు జిల్లాలకును సరిహద్దున ఉన్నది,' అని ఒక రనగా వినోబాజీ, 'ఇక్కడ సరిహద్దు ఎక్కడ ? పైన అనంతమగు ఆకాశము, క్రింద అఖండమగు పృథివి నాకు కనబడుచున్నవి,' అనెను.

ఒకానొక వార్తాపత్రికలో వినోబాజీని విమర్శించుచు ఇట్లు వ్రాసియున్నారు: ''ఈ అహింసావాదులు కమ్యూనిస్టులకంటెకూడ అధిక భయంకరులు. కారణమేమనగా, వీరు ''గీత''ను ఆధారముగా తీసుకొందురు.'' ఈవిషయమును గుఱించి ప్రసంగించుచు వినోబాజీ ఇట్లనిరి: 'ఈ విషయమును వ్రాసినవారెవరోగాని, వారు మాశక్తిని లెస్సగా గుర్తించి యున్నారు. నా ''గీతా ప్రవచనములు'' ఇంటింటను ప్రవేశించుచు, వారికి ప్రబోధము కలుగ జేయుచు క్రాంతి దీక్షను ప్రసాదించునదై యున్నది.''

అటుపిమ్మట నేను తల, తోక లేని ప్రశ్నలడుగ సాగితిని. ఈచర్చ మజిలీ చేరువఱకు సాగుచునే యుండెను. నేనడిగితిని: ''మంచి, చెడ్డల విషయములో తక్కువ చెడును అంగీకరించుట ఎంతవఱకు ఉచితమో సెలవియ్యండి. ఈలోకములో మన ఆదర్శము వఱకు చేరుకొనగల వ్యక్తులు దుర్లభులు. మనము ఈ సంఘర్షణములో పకొంచమయినను అంగీకరింపని యెడల, అసలు సంగ్రామము విడచి పాఱిపోవలసి వచ్చును.

వినోబాజీ : 'తక్కువ చెడు' అను శబ్దప్రయోగమే తప్పు. ఇది కేవలము దార్శనికులమాట. ఈ లోకములో మనము స్థితిగతులను చూచి కొన్ని వస్తువులను తీసుకొనుచున్నాము. మఱికొన్నిటిని వదలి వేయుచున్నాము. కాలయవనుడు వచ్చినట్లయితే దేశము ధ్వంసమై పోగలదను భయముతో శ్రీకృష్ణ భగవానుడు సంగ్రామము విడిచి పాఱిపోయినాడు. అట్లయినను మన మాతని "రణ ఛోడ్" అను పేరు పెట్టి కీర్తించుచున్నాము. కనుక అప్పుడప్పుడు చెడ్డవస్తువు నంగీకరించుటకంటె కృష్ణునివలె పలాయనము చేయుటగూడ ఎక్కువ ఉచితముగా కనబడును. మహాభారత యుద్ధములో ధర్మరాజు పాఱిపోయినప్పుడు శ్రీకృష్ణునివలె పాఱిపోయినాడని కవి అతనిని ప్రశంసించినాడు. ఒకవిధముగా మన శరీరముకూడ "తక్కువ చెడుగు" లోనిదే. మనము శరీరమును స్వీకరించినప్పుడు కొంత చెడుగునుకూడ అంగీకరించితిమన్న మాటయే.

నేను : ఇప్పటి మీ భావపరంపర ననుసరించి అంతఃరాష్ట్రీయ రాజనీతిలో మనమెట్లు నడచుకొనవలెను ?

వినోబా : వ్యాపక క్షేత్రములో మనము చెడుగును ఏకాంచెమయినను అంగీకరింప రాదు. దేశములన్నిటిలోని జనులు మంచివారు. మనవారేకూడ. కాని ఆ జనులపేరిట మాట్లాడు సర్కారువారు మాత్రము మనవారు కారు.

నేను : సర్వాధికార ప్రభుత గల దేశములలోని జనుల చెవి వద్దకు మన సందేశము పోదుగదా. వారి కొరకయి మనమేమి చేయదగుదుము అని కొంద అడుగుదురు. దాని కేమి చేయవలెను ?

వినోబా : అందఱి తండ్రులను సేవించుట మన కర్తవ్యము. మనతండ్రిని సేవించి, తండ్రులందఱిని సేవించిన వారమగుచున్నాము. అందువల్లనే గాంధీజీ, భారతీయులను సేవించుటయే ఎక్కువ ప్రధానమనుచుండెడివారు.

నేను వినోదముగా ఇట్లంటిని : అన్ని దేశములలోని ప్రజలు మనవారే గదా. ఆ పక్షమున అమెరికానుండి వచ్చిన ధాన్యము మనదే యని ఏల అనుకొనరాదు. ?

వినోబాజీ నవ్వుచు నవ్వుచు ఇట్లనిరి : అక్కడి జనులు ఆ ధాన్యము తిన్నారుగా. మనమే తింటి మని ఏల అనుకొనరాదు ? ఆత్మీయతాభావనను అంగీకరించితిమేని పూర్తిగా ఆత్మీయతను అంగీకరింపవలెను. కాని సగము సగము కాదు.

అటుపిమ్మట వినోబాజీ చెప్పసాగిరి: ఒకవేళ మన మీ నియమమును అనగా ఒక చోటునుండి మఱియొక చోటునకు ధాన్యము తీసికొనిపోవుట మంచిదని అంగీకరించితిమేని, దాని ఫలిత మేమగుననగా, ఏ ప్రదేశమున ఏవస్తువు ఎక్కువగా ఉత్పత్తియగునో, అదే అధికముగా పండింపబడుచుండును. మఱియు వస్తువు లన్నిటిని ఇచ్చి పుచ్చుకొనుట జరుగుచుండును. బంగాళములో కేవలము ధాన్యమే పండింపబడును. పంజాబులో ప్రత్తి మాత్రమే. ఈ విధమయిన ప్రణాళికలో ఇచ్చిపుచ్చుకొనునట్టి ఏజెన్సీకి అధిక ప్రాధాన్యము ఏర్పడును. మన జీవితము దానిపైన ఆధారపడును. కాని అహింసాయుతమగు సమాజవ్యవస్థలో ఏజెన్సీకి చోటు లేదు. కారణ మేమనగా ఏజెన్సీ అమలు జరుగుచున్న చోట అహింస నిలువజాలదు. అహింసా పద్ధతికి స్వయంపూర్ణత అనివార్యము. నేను సేవాపురిలో ఇచ్చిన ఉపన్యాసములో ఇదే చెప్పితిని: క్రమక్రమముగా రాజ్యము (State) యొక్క అవసరమే తగ్గిపోయినట్లు మనము జాతీయ ప్రణాళికను సిద్ధము చేసికొనవలెను. శాసన హీన సమాజ వ్యవస్థ మన లక్ష్యము. చాలమందికి ఈ విషయము నాటదు. ఇదేదో అసంభవ వస్తువని వారు చెప్పుచుందురు.

నేను : లోకములోని ప్రశ్నలన్నిటిని పరిష్కరించుటకు ఏకమేవ మార్గము విశ్వ సంఘరాజ్యము (World State) అగునా, కాదా ?

వినోబా : లోకములోని దేశములన్నింటిలోను అహింసాయుత సమాజ వ్యవస్థ ఏర్పడిన గాని లోకములో శాంతిస్థాపన గలుగుట అసంభవము.

నేను : 'దేశమను వస్తువే లేదు. మనమందఱము మానవులము. ఈ దృష్టితోనే ప్రశ్నల నన్నిటిని పరిశీలింపవలెను' అని కొందఱు చెప్పు చుందురు. దీని కేమందురు ?

వినోబా : దేశమే కాదు. లోకమను వస్తువే లేదని కొంద అను చుందురు. మానవ సమాజము ఒక్కటే యని మాత్రము ఎందుకు చెప్పవలెను. ఇంతకంటె ఇంకను ముందునకు పోయిన ఆటంకమేమి ? శని, మంగళ మొదలయిన వారిని కూడ తీసికొని ఒక రాజ్యము చేయవచ్చునని మఱియొక రనవచ్చును. ఈ గందరగోళ మంతయు ఎందుకు ? మనకు శని, మంగళ మొదలయిన వారితో విరోధమే లేదు. కాని అందఱను కలిపి ఏక రాజ్యము చేయవలసిన అవసరమేమి వచ్చినది ?

నేను : భారత రాజ్యము ఏర్పడినందువల్ల ప్రాంతవాదము నశించిపోయినట్లు లోకములో ఒక రాజ్యము ఏర్పడినందువల్ల జగడ ములకు మూలమయిన దేశవాదము నష్టమయిపోదా ?

వినోబా : భారతము ఒక రాజ్యముగా ఏర్పడినందువల్ల ప్రాంతవాదము తగ్గినదా, పెరిగినదా ? మఱియు భారతమును ఒక రాజ్యముగా ఎవరు చేసిరి ? ఎవరును పైనుండి బలవంతముగా రుద్ద లేదు. లోకములో ఏకరాజ్యస్థాపన కావలెనంటే అది ఏకత్వ భావన నుండి ఉద్భవించునా, లేక ఎవరయినను పైనుండి బలవంతముగా రుద్దుదురా ? బలవంతముగా రుద్దబడిన ఏకత్వము నిలువజాలదు.

నేను : అవునండి. మానవులలో ఏకత్వ భావన కలుగజేసి అప్పుడు లోకరాజ్యస్థాపన చేయుదుము.

వినోబా : కాని ఈ విషయము కొందఱు జనులు ఇట్లను చుందురు: 'నేడు భారత వ్యవహారములన్నియు ఢిల్లీనుండి నడచు చున్నవి. ఆ విధముగానే లోకమున కంతటికి న్యూయార్కు లేదా లండను లేదా ఢిల్లీ రాజధానిగా ఉండును. అక్కడనుండియే లోక వ్యవహారమంతయు నడచుచుండును,' అని. కాని నిజమయిన ఐక్యము భావైక్య మని వీరు గుర్తింపరు. నేను నా ప్రణాళికను గుఱించి చెప్పెదను. అన్నము, వస్త్రము మొదలయిన జీవితావసరములకు గ్రామము స్వావలంబమయి యుండవలెను. పిమ్మట లోకములోని ఐక్యమునకు ఇట్లు చేయవలెను:

1 లోకమందంతట భావముల ఆదాన ప్రదానము జరుగు చుండవలెను. దానివల్ల మానవులలో ఐక్యభావన కలుగగలదు.

2. వస్తువుల ఆదాన ప్రదానము జరుగుచుండును. కాని అది ప్రీతి పూర్వకమగు కానుకగా నుండును. అదిగాక ఆ వస్తువులు లేక పోయినను మనకు ఇబ్బంది కలుగునట్టి వస్తువులే కానుకగా ఒసంగ బడుచుండును. ఆవశ్యక వస్తువుల విషయమయి గ్రామము స్వావ లంబముగానే యుండును.

3. లోకములోని వివాదము లన్నియు పరిష్కరించుటకు అంతర్జాతీయ న్యాయమండల మొకటి యుండును. **(International Tribunal)**

4. ఎక్కడెక్కడ సహాయము చేయవలసిన అవసరముండునో అక్కడకు వెంటనే ఇతర దేశములు పరుగెత్తి పోగలవు. ఎక్కడ నయినను కఱవు కాటకములు వచ్చిన వనుకొనుడు. అప్పుడు చప్పున అన్ని దేశములు అక్కడకు ధాన్యమును రవానా చేయగలవు.

మీకు అంగీకార మయిన యెడల ఈ చతుర్విధ ప్రణాళికను విశ్వసంఘ రాజ్యము **(World state)** అని చెప్పవచ్చును.

నేను : అయితే ఈ వ్యవస్థలో పోలీసు, సేన మున్నగువాని అవసరము ఉండునా ?

వినోబా : బొత్తిగా ఉండదు. గ్రామ పంచాయతీల వద్ద కొద్దిగా పోలీసుదండు ఉండును. కాని అంతర్జాతీయ వ్యవస్థ దగ్గఱ కేవలము నైతిక శక్తి తప్ప భౌతికశక్తి బొత్తిగా ఉండదు. దానివద్ద సాధ్యమయినంత అధికముగా నైతిక శక్తియు, వీలయినంత తక్కువగా భౌతిక శక్తియు ఉండును.

నేను : న్యాయమండలము (Tribunal) ఏవిధముగా ఎన్నుకొనబడును.

వినోబా : ప్రతి దేశ ప్రజలు తమ దేశములోని జ్ఞానవంతులను సదాచారపరులను అక్కడకు పంపుచుందురు. వారికి కేవలము నైతిక అధిష్ఠానమే (Moral Sanction) ఉండగలదు. దానిపని కేవలము జగడములుతీర్చుటయేగాక, సలహాలు చెప్పుటకూడ ఉండును. దీనిని జ్ఞానుల సత్తాఅనిగాని ప్రాచీన భాషలో చెప్పవలెనన్న బ్రాహ్మణ సత్తా అనిగాని చెప్పవచ్చును.

ఈనాడు ఐక్యరాజ్యసమితి న్యాయాలయము ఒక ఆట క్రింద తేలినది. దానికి నైతిక అనుష్ఠానము (Moral Sanction) గాని, శాసన అనుష్ఠానము (Legal Sanction) గాని లేవు. ఆ విధముగా చూచిన యెడల, ఈనాడు ఐక్యరాజ్య సమితి ఒక్కటే కాదు. భిన్న భిన్న దేశములలోని ప్రభుత్వములు కూడ ఆటల క్రిందనే లెక్క. ప్రస్తుతము ఎన్నికలు జరుగుచున్నవి. అవి కూడ ఆటలే. ఆటలు, పాటలు, నాటకములు మున్నగువానికి జీవితములో స్థానము గలదని నేనంగీకరింతును. కాని ఆ యాటలు, పాటలు ఎక్కువ ఖరీదు గలవిగా ఉండరాదని గుర్తింపవలెను. ఒకవేళ ఒకానొకడు తన సంవత్సరాదాయమంతయు ఒక్క నాటకము చూచుటకే వ్యయపఱచిన యెడల వాని

కంటె మూఢుడు ఇంకెవడు ? ఆడండి. తప్పక ఆడండి. కాని ఆట యొక్క హద్దులను మఱచిపోకండి.

ఇది విని దామోదరజీ, "తమరు కల్పించిన ఈ విశ్వసంఘ రాజ్యము (World State) కొంతఅస్పష్టము (Abstract) గా నున్నది. కొంచెము స్పష్టము (Concrete) చేసి చెప్పండి. ఇప్పుడున్న విధముగా మాకు బోధపడుట లేదు" అని అడిగెను.

• దానిమీదట వినోబాజీనవ్వుచు ఇట్లుచెప్పిరి."మీరు స్పష్టవస్తువును కోరినట్లయితే ఆటంబాంబును తీసికొనండి. ఒకసారి పైనుండి పడగానే హీరోషిమా నగరము సర్వనాశనమయిపోయినది."

హీరోషిమాలోని వీర పౌరునివలె ఈ ఆటంబాంబును శిరమున ధరించుచు దామోదరజీ మరల తన సందేహమును ఈ విధముగా వెల్లడించెను. "ఏమండీ, తమ విశ్వసంఘ రాజ్యకల్పన రేఖాగణితము లోని బిందువువలె తోచుచున్నది. కాని బోధకుడు తన విద్యార్థులకు బిందువును బోధించుటకుగాను నల్లబల్లమీద బిందువును సాకారముగా ఏర్పఱచును."

వినోబా : అవును. దీనినికూడ అట్లే సాకారముచేయవచ్చును. కాని అంతమాత్రముచేత బిందువునకు గల మూలవ్యాఖ్యలో మార్పు రాదు. బిందువు వ్యాఖ్యలో మాత్రమే నిలువదగినవస్తువు. అంతకంటె వెలుపలకు తీసినయెడల బిందువే నిలువజాలదు. నల్లబల్లమీద బిందువు నకు ఆకార మేర్పఱచుటకు బోధకుడు దానిని కొంతవఱకు సాకారము చేయుచున్నాడని నే నంగీకరింతును. దానిని ఎంత పెద్దదిగా వ్రాయ వలెను అన్నది విద్యార్థి దృష్టిమీద ఆధారపడి యున్నది. విద్యార్థి తీక్ష్ణదృష్టి, మంద దృష్టి ననుసరించి ఆ బిందువు ఆకారము మార్పు చెందుచుండును. మందబుద్ధి విద్యార్థియే యున్నయెడల బిందువు పేరున ఒక చిన్న వర్తులమే వ్రాయవలసివచ్చును. కాని విద్యార్థికి కూడ

'అది వర్తులమే గాని బిందువు కాదురా' అన్నంత పెద్దదిగా బిందువును వ్రాయరాదని గుర్తుంచుకొనవలెను.

అంతట వినోబాజీ, మా వంటి మందబుద్ధి విద్యార్థులకు కూడ బిందువనగా ఏమో తెలియునట్లు పెద్ద వర్తుల మేర్పఱచి బోధించెను. అందువల్ల ఈ చర్చ ముగిసినది. అటు పిమ్మట అన్యవిషయములను గుఱించి, చర్చ ఆరంభమయ్యెను.

ప్రశ్న : పూర్వకాలములో అందఱకును వేదాధ్యయనమునకు అధికారము ఉండెనా ?

వినోబా : ప్రాచీనకాలములో కేవలము బ్రాహ్మణులకే వేదాధ్యయనాధికారము ఉండెనని చెప్పరాదు. కాని ఆ కాలములోగల వ్యవస్థ ఆ విధముగా నుండెను. బ్రాహ్మణులే వేదాధ్యయనమువంటి దుష్కర కర్మ ఆచరింపవలసి వచ్చుటయు దానితోపాటు అపరిగ్రహులుగా ఉండవలసి వచ్చుటయు సంభవించెను. సంస్కృత ఉచ్చారణ శుద్ధము చేసికొనుటకు వారు అనేక సంవత్సరములు గడపుచుండెడివారు. కనుక ఇతరులకు ఈ కఠిన జీవితమును నడపుటకు ఇచ్ఛలేక పోయి యుండవచ్చును. లేదా ఇచ్ఛ ఉన్నను వారాపని చేయుటకు అసమర్థులయిపోయి యుండవచ్చును. "సంవత్సరముల తరబడి సంస్కృత శబ్దములు వల్లించుచు కూర్చుండుట ఇది ఒక గొప్పశిక్ష. పాపము బ్రాహ్మణుల కీశిక్ష యనుభవింపవలసి వచ్చుచున్న"దని వారికీ తోచియుండవచ్చును. కాని వేదాధ్యయనము చేయగోరుచున్నవారికి ఆ అవకాశము లేకుండచేయుట దోషమని నేనంగీకరింతును. వేదాధ్యయనాధికారము సర్వులకు ఇవ్వవలసినదే. దాని వలన లాభము పొందుట, పొందకపోవుట వేఱేసంగతి. నేను 1917లో ఇట్లు ప్రకటించితిని: "నేను స్వయంగా వేదాభ్యాసపరుడనయిన బ్రాహ్మణుడను. వేదాధ్యయనము చేయుటకు అందఱకు హక్కుగలద అంగీకరింతును. శూద్రులకు, స్త్రీలకు వేదాధ్యయనము చేయుటకు

అధికారములేనికాల మొకటి యుండెను. కాని ఈ విషయము నాకు అంగీకారము కాదు. కనుక నేను అందఱకు వేదము నేర్పుటకు సిద్ధముగా నున్నాను. ఏ జాతివారయినను సరే, వేదాధ్యయనము చేయ దలచుకొన్న యెడల నావద్దకు రావచ్చును,'' అనినేను 1917 లో ఈమాట చెప్పియుంటిని. ఇప్పుడు 1952 నడచుచున్నది. కాని నేటి వఱకు వేదము చెప్పుకొనుటకు ఎవరును నావద్దకు వచ్చియుండలేదు. కనుక అందఱకు అధికారమిచ్చుట కే యాటంకమును లేదు. అధికారము ఇచ్చినప్పటికిని, దానివలన లాభము పొందగోరువారు ఒకరో, ఇద్దఱో మాత్రమే ఉందురు. దేవాలయ ప్రవేశవిషయములోకూడ ఈమాటయే అన్వయించును. ''కొంచెము అందఱకు దేవ మందిర ప్రవేశపు హక్కును గలుగజేయండి. తరువాత ఒకరో, ఇద్దఱో అనన్య భక్తులయినవారు బహుకష్టముమీద దేవమందిర ప్రవేశము చేయ గలరు,'' అని నేను అనేక పర్యాయములు చెప్పియున్నాను. పాపము వారు నేటికిని చాటుచాటుగా మాత్రమే దేవాలయములోనికి పోవుచుండవచ్చును. ఈదినములలో దేవమందిరములోనికి పోవువారెవ్వరు? కాని అందఱకు అధికారమివ్వనియెడల, తిని, కూర్చుండి జగడములు తెచ్చుకొనుట మాత్రము సంభవించును. అందఱకును వేదము నేర్పుటకు సిద్ధముగా ఉన్నానని ప్రకటించినప్పటికిని ఎవరును నేర్చుకొనుటకు నాయొద్దకు రాలేదు. కాని నేనందఱకును మిత్రుడనయితిని.''

నేటి వఱకు స్త్రీలుగాని, శూద్రులుగాని వేదాధ్యయనము చేయు కోరికను వెల్లడించి యుండలేదని వినినప్పుడు నా కేదో దెబ్బ తగిలినట్లయినది. సమానాధికారములు కావలెనని అఱచుటకు బదులుగా సమానాధికారముల లాభము పొందదగు యోగ్యతను సంపాదించుటకు యత్నము చేయుట అవసరమని నాకు తోచినది. విజ్ఞాన క్షేత్రములో 'క్యూరీ' అను నామె బయలుదేరగలిగినప్పుడు ఈ క్షేత్రములోకూడ కొందఱు స్త్రీలు బయలుదేరి తమఅధికార

మును స్థాపింపగలరని తలంచు చుందును. కాని ఆ పనికి అన్నిటికంటె ముందుగా జిజ్ఞాస కావలయును. "అథాతో బ్రహ్మ జిజ్ఞాస" ఇదే మొదటి పాఠము.

నేడు వినోబాజీ చెప్పినమాట నాకొక సవాలువలె తోచినది. అందువల్ల నాకు తెలియకుండగనే ఈశ్వరు నిట్లు ప్రార్థించితిని. 'ఓయి, భగవానుడా! బ్రహ్మజ్ఞాన రంగమందు వినోబాజీని పరాభవింపగల స్త్రీ జన్మించుగాక !'

నేటి మజిలీ చన్‌హట్ గ్రామము. ఇది 1857 స్వాతంత్ర్య యుద్ధములో గొప్ప వీరత్వమును చూపించియుండెను. నేటి దినమంతయు మేము ఇక్కడి వీరుల చరిత్రలనే వినుచుంటిమి.

రేపు మేము లక్నో నగరములో ప్రవేశింప నుంటిమి. దాని సూచన నేడే మాకు గోచరించెను. గొప్పగొప్ప ఆఫీసర్లు, పత్రికా విలేఖర్లు, ఫొటోగ్రాఫర్లు, ఫిలుములు తీయువారు, రేడియోవారు ఈ మొదలయిన వారందఱు కనబడసాగిరి.

భగవాన్ సహస్రరశ్మి ఆగమనమును సూచించు అరుణరాగము వలె నేటి వినోబాజీ భాషణము ఒప్పారియుండెను. "నేను ధర్మచక్ర ప్రవర్తన చేయగోరుచున్నాను. భగవాన్ బుద్ధునికంటె మామహత్త్వాకాంక్ష తక్కువదికాదు," అని వారు చెప్పియుండిరి.

# "జాగియే రఘునాథ కువర్"

లక్నో
8—5—1952.

సూర్యోదయము కాకపూర్వమే రాజధానిలో ప్రవేశించితిమి. ప్రతిచోటున మంత్రులు, సర్కారు ఉద్యోగులు, ప్రతిష్ఠిత పౌరులు స్వాగత మిచ్చిరి. గోమతీనది వంతెనను దాటునప్పుడు మనోహర

దృశ్యములు కంటబడినవి. గోమతి ఒడ్డున దట్టమయిన పొదరిండ్లు ఉన్నవి. ఆ ముదురాకు పచ్చరంగు ప్రక్కనేగల తెల్ల తెల్లని మహా హర్మ్యములును, భవనములును, ఎంతో సుందరముగ గన్పట్టెను.

నగరములో ప్రవేశింపగనే మేము ఉచ్చైస్స్వనమున పాడ దొడగితిమి. పాశ్చాత్య సభ్యతా వ్యామోహములో చిక్కిన నగరమును మాసంగీత గర్జనలచే మేలుకొలుపుచుంటిమి. అధికారము మఱియు సంపత్తి అను కాంచన మృగము వెంటబడి పరుగులు బెట్టెడి పౌరులను కాలినడకను పోవు ఈ ఫకీరును, "ఏ వంకకు పరుగులు పెట్టుచున్నారయ్యా, కొంచెము ఆగండి. ఆలోచించుకొనండి" అని హెచ్చరిక తెలుపుచుండెను.

వెంకటేశయ్య మధుర స్వరమున ఇట్లు పాడుచుండెను:

"ద్వార ద్వార నగ్నపద జో దీనహేతు జా రహా
యహ్ బుద్ధహై యా గాంధీహై జో ప్రేమగీత గారహా"

( దీనుల కొఱకు ద్వార ద్వారమునకు నగ్నపదములతో పోవుచు, ప్రేమ గీతములు పాడుచుండు నీతడు బుద్ధుడా, గాంధియా ? )

పశ్చిమదేశములలోని ఒకానొక లేఖకుడు ఇట్లు వ్రాసియుండెను: "Whoever may deserve to be the President of World Federation, he will be an heir to Gandhi" (విశ్వసంఘ రాజ్యమునకు అధ్యక్షు యోగ్యతగలవారు ఎవరయినను కావచ్చు గాక, గాంధీకి వారసులయ్యెదరు). లోకములోని ఏ క్రాంతికారి యయినను సరే, సత్యశోధకు డయినను సరే తెలిసి గాని, తెలియక గాని గాంధీ గీతమును పాడుచుండును:

"ఉఠ్ పడో ఐ భారతీయ జగ జగాయేంగే"

( భారతీయులారా ! లేవండి. లోకమును మేలుకొలుపుదము.)

ఇట్లు గాంధీజీ భారతదేశమునకు ఆవాహనము వచ్చినది.

నేటి మా నివాస స్థానము ఉత్తర ప్రదేశ కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డు కార్యాలయము. అక్కడకు చేరగానే జనులు గుంపులు గుంపులుగా వచ్చిరి. నాకు దినమంతయు ఒక్కటే కార్యక్రమము. ఎదురుగా నోటుబుక్కు. చెవులు వినోబాజీ శబ్దములు వినుచుండెను, చేతిలోని కలము తన పనిని చురుకుగా చేసివేయుచుండెను.

సర్కారువారు శాసనము ద్వారా భూదాన కార్యములకు ఏ విధముగా తోడ్పడగలరో తెలిసికొనుటకై అందరికంటె ముందుగా గొప్పగొప్ప సర్కారు ఉద్యోగులు వచ్చియుండిరి. అంతట వినోబాజీ ప్రస్తావవశముగా ఇట్లనిరి : 'మేము జనుల హృదయములలో పరివర్తన తేగోరుచున్నాము. కేవలము భూములు పొందగోరుటలేదు.' తమ సర్కారు ప్రణాళికలు తమ స్వంత యింటికి సంబంధించినవి మాత్రమే అయియున్నవి. కాని సర్కారువారు నా ప్రణాళికకు సాయము చేయుదురా, వారి ప్రతిష్ఠ ఇనుమడించును. లేదా సర్కారువారు ఉపేక్ష చేయుదురా, అసంతృప్తి పెరుగగలదు. సర్కారువారు వినోబాకు సాయము చేయుటలేదని ప్రజలు చెప్పుకొందురు. కాబట్టి మాకు సహాయము చేయుట మీ మేలుకొఱకే.

ప్రశ్న : బీదల నుండి భూమి తీసికొన్నయెడల చిన్న చిన్న ఖండములయిపోవును. ఇది మఱియొక సమస్యగా ఏర్పడును.

వినోబాజీ నవ్వుచు, నవ్వుచు ఇట్లనిరి : "సమస్యలను లేవదీయువారము మేము. పరిష్కరించువారు మీరు అయియున్నారు. అయితే నేనే మీ కొఱకు గొప్ప సమస్యనయి యున్నాను." ఆ మాటలు విని అందఱును గొల్లున నవ్వసాగిరి.

ప్రశ్న : మీ పని భావనపైన ఆధారపడి యుండగా దానిని శాసనములో నిబంధించుట యెట్లు? శాసనము ద్వారా దానికి సహాయము కలుగ జేయుటెట్లు ?

వినోబా : ఈమాట నిజమే. శాసన దృష్టితో చూచినయెడల దాన మిచ్చిన భూమి సర్కారువారిది కాగలదు. కానిసర్కారు వారు శాసనముద్వారా దానిని పంచిపెట్టు అధికారం మా భూదానసమితికి ఇవ్వగలరు. హైదరాబాదు సర్కారువారు అటువంటి శాసనమును చేసియున్నారు. ఇక్కడి సర్కారువారు కూడ అటువంటి శాసనమును చేయనియెడల నేను దానపత్రము లన్నిటిని త్రిప్పివేసి బీహారువైపు పోగలవాడను. దానివలన నాకు చెఱు పేమి ? నేను సన్యాసిని. కాని దీనివలన సర్కారు వారే అపకీర్తిపాలై పోవుదురు. అంతేగాక జనులలో అసంతృప్తి ఏర్పడును. నేనయితే సర్కారుపైన పూర్ణవిశ్వాస ముంచి పనిచేయుచున్నాను. సర్కారువారును ఈ కార్యమునకు అనుకూలముగా శాసనము చేయుదురని నాకు విశ్వాసము కలదు. ఒక వేళ వారు చేయనియెడల వారికే భయస్థితి ఏర్పడును. కాని సన్యాసికి వచ్చెడి దేమి, పోయెడి దేమి ? అతనికి చెఱుపు చేయున దెవరు ?

ప్రశ్న : మీరు చెప్పుచున్నమాట లన్నిటినిబట్టి చూడగా ఏవో ఉత్పాతములు కలుగగలవని తోచుచున్నది.

వినోబా : "నేనే మీ రాజ్యమున కొక గొప్ప ఉత్పాతమును కలుగజేయుచున్నాను. ఇటువంటి దానిని కమ్యూనిష్టులుకూడ కలిగించియుండరు. కారణ మేమనగా, నేను అహింసావాదిని. తిన్నగా జనుల హృదయములలో ప్రవేశించెదను. మఱియు భూమి ఈశ్వరునిదని చెప్పెదను. నే నీ భావనను చీనానుండిగాని, రష్యానుండిగాని తీసికొనియుండలేదు. ఈశ్వరుని నుండియే తీసుకొనియున్నాను."

"ఒకసారి దారిలో నాకు పూలదండలు అర్పింపబడినవి. అప్పుడు ప్రజలతో నే నిట్లంటిని - 'ఒక మనుజుడు వర్ధానుండి వేలకొలదిమైళ్లు ఈ పూలదండలకొఱ కేనా వచ్చినది ? ఏమి వర్ధాలో దండలు దొరకవా ?...నాకు స్వాగత మివ్వగోరినయెడల భూమి ఇచ్చి

స్వాగతము అనండి. మీతోకూడ ఈమాటయే చెప్పుచున్నాను. భూదాన కార్యమునకు సాయము చేయుటవల్ల సర్కారువారికే మేలు కలుగును.''

వినోబాజీ మాటలు వారి కెంతో నచ్చినవి. ముఖ్యమంత్రి ఇట్లనిరి: 'మహారాజా! ఈ పనియందు వచ్చెడి ఇబ్బంది లన్నిటిని మేము తొలగించెదము. కారణ మేమనగా, అట్లుచేయుట మా విధి.'

దిన మంతయు చర్చలు, సభలు జరుగుచుండెను. భోజనము చేయుటకు సమయము దొరకుట కష్ట మయ్యెను. అక్కడనుండి రాగానే, ముఖ్యమంత్రి పంత్‌జీ వినోబాజీని కలిసికొనుటకై వచ్చి యుండిరి. పంతుజీ పత్రికా విలేఖరులతో, ''మా ప్రభుత్వమువారు భూదాన కార్యములకు పూర్తిగా సహాయము చేసెద''రని చెప్పెను. పంతుజీ మఱియు వినోబాజీ పరస్పరము గాఢముగా ప్రేమించి యుండిరి. అందువలన వారి సమావేశము ఎంతో చిత్తాకర్షకముగా నుండెను.

ఈ ముసలితనములో పంతుజీ ఎంతదీక్షతో పనులు చేయు చుందురో చూచినయెడల పడుచువారగు మాకు తలవంపులు కలుగు చుండును. సంతకము చేయుచుండగా వారిచేయి వణకుచుండుటను నేను కనిపెట్టితిని.

రెండుజాములకు పత్రికా విలేఖరుల సమ్మేళనము జరిగెను.

ప్రశ్న: ఏమి, మీకు అక్కడక్కడ చాల పేచీకోరు భూములే లభించినవా?

వినోబా: అనేక పర్యాయములు ఇటువంటి అపవాదులు పుట్టు చుండుట నే నెఱుగుదును. హైదరాబాదులో కొంతభూమి పంపిణీ జరిగినది. కనుక అక్కడి అనుభవమునుబట్టి మనము కొంత చెప్ప వచ్చును. అక్కడ పేచీలుగల భూములుకూడ లభించినవి. కాని మా సంపర్కమువల్ల ఆ జగడములు మబ్బువలె విడిపోయినవి. అందువల్ల

కొంత లాభమే గలిగినది. ఎవరయితే చెడ్డభూమిని ఇచ్చి యున్నారో, వారు తెలిసి, అట్లు చేయలేదు. గొప్ప జమీందారులకు తమ భూములు ఎక్కడ ఉన్నవో తెలియవు. వారు తమ గుమాస్తా చెప్పిన ప్రకారము భూదానములు చేయుదురు. తఱుచుగా జరుగుచున్న పని యిదియే. ఒకసారి పంపిణీ సమయములో ఒకసోదరు డిచ్చిన అయిదువందల యక్కరాలభూమి చెడ్డది అని తెలియవచ్చినది : అంతట మేము అతనితో 'ఏమయ్యా ! ఈ చెడ్డభూమిని తీసికొని పరటాగా మంచిభూమి యిచ్చె దవా ? లేక చెడ్డభూమి దానము చేసితివని ప్రకటింపుమందువా' అనగా అతడు దానికి బదులు మంచిభూమిని ఇచ్చుటకు అంగీకరించెను. తఱుచుగా ఎవరును తాము అపకీర్తి పొలగుటకు అంగీకరింపరు. సాత్త్విక, రాజస, తామసికము అని దానములు మూడు విధములు. దానము లన్నియు సాత్త్వికములు కావు. కనుక ఎక్కడనయినను ఒకవేళ చెడ్డభూమి దొరికినను బాధలేదు. 'నేను పర్వతమునుకూడ తీసికొనుటకు సిద్ధముగా నున్నాను,' అని చెప్పియేయున్నాను. ఇచ్చే వా రున్నయెడల హిమాలయమును గూడ దానము పట్టెదను. భూమి యాజమాన్యమును నశింప జేయుటయే నా లక్ష్యము.

ప్రశ్న : మీ కార్యము సామాజిక క్రాంతి కొఱకు లాక్షణిక ప్రయోగమా ?

వినోబా : గ్రుడ్డివాడు ఎదురుగా నున్న స్తంభమును గుర్తింప జాలడు. కాని కన్నులున్నవాడు గుర్తించుచున్నాడు. కనుక ఆ స్తంభ మునకు కొట్టుకొనకుండ ముందునకు సాగిపోవుచున్నాడు. ఈవిధము గానే ద్రష్టలకు వర్తమానకాలములోనే భవిష్యద్దర్శనము గలుగు చుండును. కాని అయ్యది సామాన్యజనులకు దుర్లభమై యుండును. ఈ కాలములో భూమి పంపిణీకాకుండ వ్యవహారము నడవదని గుర్తించి తిని. అందువల్లనే ఈ పనిని పెట్టుకొంటిని. తెలంగాణాలో ఏ దినమున నాకు మొదటి భూదానము లభించెనో ఆ రాత్రికి నేను దానిని గుఱించి

ఇట్లాలోచించితిని : 'ఈ విధముగా దాన మడుగుటవల్ల హిందుస్తానము లోని భూమిహీనుల సమస్య పరిష్కరింపబడునా ?' నా మనస్సయితే 'కాదు' అని చెప్పుచుండెను. చరిత్రలో ఎక్కడను నేటివఱకు ఇట్టిపని జరిగియుండలేదు. దేవ మందిరములకు, మసీదులకు కొలది భూములు అడుగబడినవి. అంతేకాని భూమిహీనులకొఱకు లక్షలాదియకరములు దానమడుగుట అసంభవమని తోచుచున్నది. అదియుంగాక, నేను దాన మడుగగలుగుటకును, లోకులు నాకు దానమిచ్చుటకును నాలో గల గొప్ప శక్తియేమి ? అది కూడ లేదు. భూమివంటి ప్రీతికర్మైన వస్తువును దానమిమ్మని యడుగుట నాకు సంభవమని తోచలేదు. నేను అల్పుడను గదా, నాకు దాన మెవరిచ్చెదరు ? కాదు. ఈ పనిని నీవు చేయజాలవు అని నా బుద్ధి నన్ను గుఱించి నిర్ణయము చేసినది. ఇంతలో అంతరంగము నుండి ఒకవాణి వినవచ్చినది: 'నీవీ పనిని చేయ వలసియే యున్నది. నీకు అహింస యందు శ్రద్ధలేదా ? నేడు అహింసకు పరీక్షాదినములు వచ్చినవి. ఒకవేళ భూమిసమస్య అహింసాపద్ధతిని పరిష్కరింపబడనియెడల అహింసకు శాశ్వతముగా ఓటమిని అంగీకరించి, హింసకు చోటు ఈయవలసియుండును. ఏమి, ఇట్టి సమయములోకూడ నీవు మౌనము వహించి కూర్చొండెదవా ?' కాదు. నేను మౌనముగా కూర్చుండజాలను. నాకు అహింసపైన అపరిమితమగు శ్రద్ధగలదు. లోకములోని సమస్యలన్నియు అహింసా మూలముననే పరిష్కరింప బడగలవని నమ్మియుంటిని. అహింసా-పరీక్షకు సమయము వచ్చినది. నేను దుర్బలుడను. క్షుద్రుడనే అయినను నాకు ఒక్కటే దారి కన బడుచున్నది. నా దుర్బలత్వము వలన వెనుకకు తగ్గుట కూడని పని, అని చింతించినవాడనై భగవంతుని పైన పూర్ణవిశ్వాసముంచి ముందునకు అడుగు వేసితిని. ఏ పరమేశ్వరుడు దానమడుగుటకయి నాకు ప్రేరణ గలుగజేసెనో, ఆతడే ఇతరులకు దానమిమ్మని ప్రేరణ చేయ గలడు అని నా విశ్వాసము. శిశువు కడుపులో ఆకలి పుట్టించిన

ఈశ్వరుడు తల్లి వక్షమునందు పాలను సృజించినాడు. భగవానుని కార్యములు పూర్ణములే అయితీరును. అసంపూర్ణములు కావు. ఈ విశ్వాసముతోనే నేను దానములు అడుగ నారంభించితిని. నాకు దానములు కూడ దొరకుచున్నవి.''

ఇక్కడకు సమీపములో నున్న అమీనుద్దౌలా పార్కులో సాయంకాల సభ యేర్పాటు చేయబడెను. కలిసికొనుటకయి వచ్చి పోయే వారి సంఖ్య ఇంకను తగ్గిపోలేదు. అప్పుడే యెవరో వచ్చి, 'బాబా (వినోబాజీ) వెళ్లిపోయినారు' అని చెప్పిరి. అందువల్ల నేను చేతితో రాట్నము పట్టుకొని వెంటనే పరుగెత్తిపోవలసి వచ్చెను. పోయి చూడగా ఎత్తయిన వ్యాసపీఠముపైన వినోబాజీ రాట్నముపై నూలు తీయుచుండిరి. వడకుట పూర్తి అయినది. ఇక ప్రవచనము ప్రారంభమగును గదా యనుకొని నేను కలము పట్టుకొని ఆసక్తితో కూర్చుంటిని...''పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణ ముదచ్యతే'' అను గంభీరధ్వని వినబడెను. ఈ ధ్వని చూడగా ఇరువదియవ శతాబ్ది నాటిదిగా లేదు. వేలకొలది సంవత్సరముల క్రిందట ఒకానొక ముని, గుహాంతర్గతుడయి, తపస్సునందు లీనుడయి వేదమంత్రములు గానము చేయుచున్నాడా యనునట్లు తోచెను. ఉలికిపడి తలయెత్తి చూడగా, వారు వినోబాజీయే- కాని ధ్వని మాత్రము వారిది కాదు... 'అసతో మా సద్గమయ' నేత్రములు మూసికొని ధ్యానస్థులయి కూర్చుండి యున్న వినోబాపైన నా కన్నులుపోయి ప్రాలినవి. నిత్యము ప్రవచనానంతరము మహాదేవి తాయీ ప్రార్థనచేయుచుండెడిది. కాని నేడు స్వయముగా వినోబాజీయే ప్రవచనమునకు ముందుగా ప్రార్థన నారంభించిరి. ప్రార్థన ఎప్పుడు ప్రారంభమయ్యేనో మాకు తెలియనేలేదు. నేను వినోబా వంక ఱెప్ప ప్రాల్పకుండ చూచుచుంటిని. కన్నుల యెదుట ధ్యానస్థమగు వినోబాజీమూర్తి. వారి ముఖమునుండి గంగా ప్రవాహమువలె స్రవించెడి ఋషివాక్కు. వీరి యెదుట లోకమును

మఱచిపోతిమి. గీతలోని స్థితప్రజ్ఞ లక్షణములుగల పాఠము (రెండవ అధ్యాయము లోని చివరిభాగము) పూర్తిఅయ్యెను. కురాను షరీఫ్ లోని పాఠము ప్రారంభమయ్యెను. నేను మరల ఉలికిపడితిని. ఇప్పు డితడు వైదికకాల ఋషివలె లేడు. పైగంబరు ప్రథమ శిష్యులలో శ్రేష్ఠశిష్యు డొకడు నమాజు చదువుచున్నట్లుండెను. పూర్తిగా విశుద్ధ మయిన, స్ఖాలిత్యములు లేని ఉచ్చారణ వినవచ్చుచుండెను. కురాను పాఠమును పూర్తిఅయ్యెను. మతములన్నిటిలోని ఒక్కొక్క ప్రార్థ నాంశము చదువబడెను. 'ఆ చదువుచున్నది వినోబా కాదు, వేఱొకరు' అని మాటిమాటికి తోచియుండెను. ప్రత్యేక మతమునకు చెందిన ఆద్య ప్రచారకు లెవరో అజ్ఞాత భూతకాలము నుండి ఆ వాక్కులు వినిపించుచున్నట్లుండెను.

ప్రార్థన పూర్తిఅయినది. ప్రవచనము ప్రారంభమయ్యెను. వారి నేత్రము లింకను మూతపడియే యుండెను. విశాల జన సముదాయము లోని ప్రతి ఒక్కరి హృదయము పైనను ప్రవచనములోని ఒక్కొక్క శబ్దము ముద్రిత మగుచుండెను.

"మన ఆరాధ్యదేవతలు అక్కడ పొలములలో, ఎట్టని ఎండలో పాటుపడుచున్నారు. వారు స్వయముగా పస్తుండి మనకు అన్నము పెట్టుచున్నారు. వారు మనకుచేసిన ఉపకారములు అసంఖ్యాకములు. వారిని సేవించుట మన ధర్మము. ఎవరు స్వయముగా కష్టపడి పని చేయుచున్నారో వారి ఆశీర్వాదము ఏ పొలములకు లభింపవో, అవి ఏమంత వృద్ధిపొందును? వారి ఆశీర్వాదము వల్లనే మనము జీవించు చున్నాము. వారి ఆశ, వారి తృష్ణ ఆ ధ్యానముపైన ఉండును. వారు పంటను పండించుచున్నారు. కాని ఆ పంటను కేవలము కన్ను లతో చూచుకొనుటయేగాని, అది వారి పొట్టలోనికిపోదు. వారు మిక్కిలి సహనము గలవారు. మనము వారి కష్ట నష్టములను గురించి విచారింపగల మని నేటికిని వారు ఆశాపూర్ణ మగు దృక్కులతో మన

వంక చూచుచున్నారు. తల్లి, పిల్లలవల్ల వాంఛతీరగల దని ఎట్లు ఆశించుచుండునో అట్లే వారును మనమీద ఆశ పెట్టుకొని యున్నారు. మేలు కొనండి. ఎంత ఆలస్యముచేసిన, అంత దోషు లగుదురు. నేను మీ హృదయస్థు డగు ఈశ్వరుని మేలుకొలుపుటకై వచ్చియున్నాను.

"జాగియె రఘునాథ కుఁవర్, పంఛీ బనబోలే"

(పక్షులు అడవిలో కూయుచున్నవి. రామచంద్రా, మేలు కొమ్ము,) నా ఈశ్వరుడా! మేలుకొనుము. సేవామగ్నుడవు కావలసినది.

ఈ రోజులలో బాపూజీ ఉన్నయెడల నేను బయటికి రానివాడనే. వారు నాకు వప్పగించిన పనివల్ల నాకు ఆనందము గలుగుచున్నది. కాని వారు పోయినారు. నేను ఆశ్రమము విడిచి రావలసి వచ్చెను. వారి కొఱకే!... నేను నాయకుడను కాను. అందఱకు సేవకుడును. నే నందఱను భక్తిభావముతో చూచుచుందును. నా యొద్దకు ఎవరినయినను రానిండు. నాహస్తములు భక్తిభావములతో నమస్కరించును. నా హస్తములకు నమస్కరించుటయే అలవాటు. ఎవరు నా యెదుటకు వచ్చినారో, నాకు గుర్తుండదు. నా యెదుట భగవంతుని మూర్తి నే చూచుచుందును."

అశ్రుధారలు ఆగలేదు. ప్రవహించుచునే యున్నవి. "బాపూజీ ఉన్నట్లయితే నేను బయటికి రానివాడనే." చెప్పువారును, వినువారును ఏకస్వరూపు లయిపోయిరి. అశ్రుధారల పోటీ జరుగుచుండెను. నేటికి నాలుగు సంవత్సరముల పూర్వముకూడ ఈవిధముగనే లోకములోని జను లందరు సమావేశ మగుచుండిరి. ఎక్కడ చూచినను కన్నీటి ధారలే గోచరించినవి. కాని ఆ అశ్రువులు వియోగమువల్ల, దుఃఖము వల్ల వచ్చినవి. నేనుకూడ వారిని స్మరించుటవల్ల అశ్రువులు వచ్చుచున్నవి. కాని నేటి అశ్రుధారలు పునర్దర్శనమువల్ల వచ్చిన ఆనందాశ్రువులు.

# ధర్మచక్ర ప్రవర్తనము

లక్నో
9—5—1952.

ఉదయము ఆఱుగంటలకు విశ్వ విద్యాలయమునందు గ్రామ పంచాయితీ ఆఫీసర్ల ఎదుట వినోబాజీ ఉపన్యాసము జరిగెను. ఆ సమయముననే ఆటల పోటీలలో గెలుపొందిన వారికి బహుమానములు ఇచ్చునట్టి మీటింగుకూడ ఏర్పాటు చేయబడినది. కనుక వినోబాజీ ఉపన్యాసారంభమున ఇట్లుచెప్పిరి: "జీవితమే ఒక ఆట. కనుక ఆట యొక్క జయాపజయములను సమానమని యెంచండి. ఆటవలె ఈ లోకముకూడ మిథ్యయే. ఈ విషయము గుర్తుంచుకొనవలెను. మనము ఆడుచున్నాము, అనగా ఫలనిష్పత్తి కొఱకు కాదు. ఆటలోని ఆనందము కొఱకే. జీవితములోకూడ ఈ తత్త్వజ్ఞానమునే అమలు పఱచుకొనవలెను."

అక్కడనుండి నివాస స్థానమునకు తిరిగిరాగానే రాష్ట్రీయ స్వయంసేవక సంఘ కార్యకర్తల సమావేశములో వినోబాజీ ఉపన్యసించిరి. వారి క్రమశిక్షణ, వినోబాజీయెడల వారికిగల ఆదరభావము చూడగా సంతోషముగలిగినది. వినోబాజీ వారితో ఇట్లనిరి: "మానవుని శక్తి పరిమితమైయున్నది. అందువలన సేవారంగము సహితము పరిమితమైయున్నది. కాని ప్రవృత్తిమాత్రము పరిమితముగా నుండరాదు. సేవారంగము పరిమితముగా నుండవచ్చుగాక. కాని భావనయొక్క సహానుభూతియొక్క క్షేత్రము అపరిమితముగా నుండవలెను. సంకుచితముగా నుండరాదు. మనము లోకములోని జనులందఱను సేవింపజాలము. కాని ఆ జనులందఱను మనవారనియే యెంచవలయును. జాతి, శాఖ, మతము, వర్ణము మున్నగు వాని ననుసరించి మానవులు ఖండ ఖండములుగా నున్నారు. ఈ విషయము మనము సహింప

రాదు. 'నే నొక పరిశుద్ధ ఆత్మను. దేహము కాదు,' అని స్పష్టముగా జ్ఞాపక ముంచుకొనవలెను. భేదము లన్నియు దేహమువల్లనే పుట్టు చున్నవి. మతము, దేశము మున్నగు పేరులుపెట్టి మానవులలో భేద మెంచితినా, నా ఆత్మ భిన్న భిన్నమైపోవును. నాలోఉన్న అనంతశక్తిని పోగొట్టుకొన్నవాడనై అంతము కాగల శక్తిగలవాడను కాగలను. మనము మానవులను మానవులుగా చూడనియెడల హిందూధర్మము యొక్క ఆత్మనే పోగొట్టుకొందుము. హిందూమతము సముద్రము వంటిది. అది సర్వమును తనగర్భములో ఇముడ్చుకొన గలదు.''

అటుపిమ్మట ఒక కార్యకర్త, ''ఒక సంఘము వారిపైన వేఱొక సంఘమువారు దండయాత్ర చేసినయెడల ఆ సంఘమును కూడగట్టుకొనగూడదా'' అని అడిగెను.

వినోబాజీ ఇచ్చిన జవాబు శంకా సమాధానముగా మాత్రమే ఉండక ఆత్మ సంశోధనకు ప్రేరేపించునదిగా నుండెను. వారిట్లనిరి: ''ఈ ప్రశ్న గాలిలోగాక భూమిపైన అడుగబడినది. ఈ రోజులలో ముసల్మానులు హిందువులను నాశనము చేసెదరని హిందువుల భయము. కాని లోకములో హిందువులను నాశనము చేయగలవా రెవ రయినను ఉన్నయెడల వారు మనమే. ఈనాడు మనలోగల జాతిభేదములు, అంటరానితనము, వైషమ్యము మున్నగు వానివల్ల మనకు వినాశము కలుగగలదు. నేడు భారతీయ ముసల్మానుల మనస్సులోగల కటుభావము మన మనస్సులోని ప్రతిబింబమే. లోక మంతయు మనలను మిత్రులవలె చూడవలెనని మనము కోరుకొన్న యెడల మనము లోకమును మిత్రమువలె చూడవలెను.

''మిత్రస్య మా చక్షుషా సర్వాణి భూతాని సమీక్షంతమ్
మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే''

ఉపన్యాసాంతము మనస్సును కదలించివేసినది. ''మనవిరోధులు వెలుపల లేరు. మన మనస్సులోనే ఉన్నారు.''

ఉపన్యాసము సమాప్తము కాగానే వినోబాజీ సరసముగా "మీ నిజాము ఎక్కడ ?" అని అడుగగా అందఱును నవ్వసాగిరి. స్వయముగా నిజాము కూడ నవ్వుచున్నవారయి వినోబాజీ వద్దకు కదలివచ్చిరి. అంతట ఉభయులకును సంభాషణ ప్రారంభమయ్యెను.

ఈసభ సమాప్తము కాగానే కొందఱు కిసాన్ మజదూర్ ప్రజా పార్టీ కార్యదర్శులు కలిసికొనుటకై వచ్చియుండిరి. అతివాదులు, మితవాదులు, మధ్యవాదులు ఈ మొదలయినవారడుగు ప్రశ్నలకు సమాధానములు ఇచ్చునట్టి వినోబాజీ నేర్పుచూడగా వారి గురువులు శంకారాచార్యులు తలపునకు వత్తురు.

ఒక సజ్జనుడు, "ఏమి, మీరు కమ్యూనిస్టుల క్రాంతిని అడ్డగింప గోరుచున్నారా ?" అని యడిగెను.

వినోబా - నేనొక (హింసక) క్రాంతిని అడ్డగింప గోరుచున్నాను. కాని మఱియొక దానిని (అహింసక) ప్రవేశపెట్ట గోరుచున్నాను. ఉన్నది ఉన్నట్లుగా ఉంచుటకు **(Status Quo)** నేను కాలి నడకను తిరుగుచుండుటలేదు.

కమ్యూనిష్టులకును మనకును కేవలము సాధనములలో మాత్రమే భేదముకాదు. తత్త్వజ్ఞాన విషయములో కూడ మూలభూతమగు అంతర మున్నది. అట్లయినను, వారిలో పరివర్తనము కలుగవలెననియు మరియు వారు నాలో పూర్తిగా మిళితమై పోవలెననియు కోరుకొనుచుందురు. తెలంగాణాలో వారితో ఇట్లంటిని— "మీరు ఈ విధముగా రాత్రిపూటవచ్చి ఏల దోచుకొందురు. నావలె పట్టపగలే ప్రేమతో దోచుకొనుట నేర్చుకొనండి." ఇక్కడి కమ్యూనిస్టులు మనవారేగదా ! ఎప్పుడో ఒకప్పుడు వారిలో పరివర్తనము రాగలదని నా విశ్వాసము. వారు భూదాన కార్యములు చేయగలిగిన యెడల నేను వారికి స్వాగత మిచ్చెదను. నేను సముద్రుడను. సముద్రము ఏ నదినీ కాదనదు. కాని అది నదులతో, 'మీరు నాలోనికి

వచ్చినయెడల మీ ఉదకముకూడ నావలె ఉప్పపడి పోవును,'' అని చెప్పుచుండును.

ఒక సజ్జనుడు: ఏపని కయినను ధర్మప్రచారకుల తీవ్రోత్సాహము (Missionary fire), మఱియు పిచ్చితనము (Madness), కావలెను. అటువంటి ఉత్సాహము (Fire) కేవలము మీలోను, కమ్యూనిస్టులలోను ఉన్నది. కనుక వారిని ఆహ్వానించండి.

వినోబా: నేను మానవు లందఱను ఆహ్వానించుచున్నాను... ఈ విషయమున వారిలోను, నాలోను చాలసామ్యము ఉన్నది. వారికి స్వయముగా ఒక లక్ష్యము (Mission) ఉన్నట్లే నాకుకూడ ఒక లక్ష్యము ఉన్నది.

తెలంగాణాలో కమ్యూనిస్టులు ఎన్నో అత్యాచారములు చేసి యున్నారు. 'మీరు హింసక ఆందోళనను విడచిపెట్టండి. అట్లుచేసిన యెడల శాసనబద్ధసంస్థగా ఎన్నికలకు నిలువ వచ్చును' అని వారితో ఎప్పటినుండియో చెప్పుచున్నాను. వారిలో చాలమందికి ఈ విషయము నచ్చినదికూడ. కాని వా రీ లోపల చాల సమయమును వృథా చేసిరి. ఇప్పుడు వారు హింసక ఆందోళనను మానుకొను నిర్ణయము చేసికొనిరి. వారు ఇంతకాలమును ఎందుకు పోగొట్టిరో ఎఱుగుదురా? వారికి అక్కడనుండి (రష్యానుండి) ఆజ్ఞ రావలెను. వారి మెదడు (Brain) అక్కడే ఉన్నదిగదా !''

అతివాదులు వెడలిపోగానే విద్వాంసులు వచ్చిరి. లక్నో విశ్వవిద్యాలయమునకు ఉపకులపతి (వైసు ఛాన్సలరు) ఆచార్య జుగల్ కిశోర్ జీ, డాక్టరు రాధా కమల ముఖర్జీ, ఇంకను విద్యాపీఠమునకు చెందిన ఇతర ప్రొఫెసర్లు వచ్చుచుండగాచూచి వినోబాజీ చిఱునవ్వు నవ్వుచు ''విద్వత్సమాజమా !'' అనిరి. అంతటచర్చ ప్రారంభమయ్యెను.

డాక్టరు ముఖర్జీ: అర్థశాస్త్ర దృష్టితో చూచినయెడల, సర్వోదయ ప్రణాళిక ఎంతవరకు సఫలము కాగలదు ?

వినోబా : అర్థశాస్త్రము, గణితశాస్త్రమువలె పూర్ణశాస్త్రము (Absolute Science) కాదని మన మంగీకరింపవలెను. అది సమాజ స్థితి ననుసరించి మారుచు వచ్చుచుండును. సర్వోదయ ప్రణాళికలోని అసలు మూలగతసిద్ధాంత మేమనగా గ్రామము స్వావలంబము కావలెను. మఱియు గ్రామములోని ముడిసరకు అక్కడనే తయారు పదార్థము కావలెను. ఇదియొక మూలగత సిద్ధాంతము. యంత్ర మునుగురించి మేము స్వమతాభిమానులము (Dogmate) కాము. పెద్దపెద్ద యంత్రములు వచ్చినయెడల స్వంత యాజమాన్యము చెల్లరాదు. సంఘ యాజమాన్యమే చెల్లవలెను. అందఱకు పనులు ఏర్పడవలె ననుటయే మా గాఢాభిమతము.''

నేటి విద్యాపద్ధతిలో మొదలంట పరివర్తన గలుగుట అవసర మని వినోబాజీ బోధించిరి. చర్చా సమయమందు డాక్టరు ముఖర్జీ, హిందీ రానందువల్ల, ఇంగ్లీషులో మాట్లాడసాగిరి. అంతట వినోబాజీ, "మీకు హిందీ రానియెడల బెంగాలీలోనే మాట్లాడండి'' అని బెంగాలీ భాషలో చెప్పిరి. ఆ మాటలువిని ముఖర్జీ ఆశ్చర్యపడి 'మీకు బెంగాలీ కూడ వచ్చునా ?' అనగా వినోబాజీ అవుననిరి. అప్పుడు ముఖర్జీ సంతోషముతో బెంగాలీలో మాట్లాడిరి. వినోబాజీ సామాన్యముగా హిందుస్థానములోని భాషలన్నిటిని ఎఱుగుదురు. కనుక వారు ప్రతి ప్రాంతీయునకు ఆత్మీయుని వలెనే కనబడుచుండెదరు. వారు దక్షిణ భాషలనుకూడ తమవిగా చేసుకొనిరి. ఇది గొప్పసాధనయేఅని తలచితిని. తమిళభాషలోని గలగలధ్వని విన్నప్పుడు కనీసము ఈ జన్మలో నేనీ భాష నేర్వజాలను అనుకొంటిని. ఇంకను ఆశ్చర్య మేమనగా వినోబాజీ చీనాభాషను నేర్చుకొనుటకు యత్నించిరి. చీనాభాష ఉచ్చారణ విన్నప్పుడును, దాని వ్రాత పద్ధతిని చూచినప్పుడును నాకు చీనాభాష తెలిసిన వారియెదుట సాష్టాంగ దండ నమస్కారములు చేయవలయు ననిపించును. చీనాభాషలో కేవలము అ, ఆలు వ్రాయు

టకుకూడ సాక్షాత్తు రవివర్మ దిగి రావలసినదే. నాకీ భాష ఇంతకఠిన మని తోచగా, వినోబాజీ కొన్ని నెలలలో దాని పరిచయమును పొంద గలిగిరి.

రెండుజాములకు ఇక్కడున్న మహారాష్ట్రమిత్రు డొకడు మమ్ము భోజనమునకు రమ్మని ఆహ్వానించెను. అక్కడ విస్తరికి నాల్గుగు వైపుల ముగ్గులు పెట్టిరి. అగరువత్తులు వెలుగుచుండెను. పూర్తిగా మహారాష్ట్రపద్ధతిని ఏర్పాటు చేసిన భోజనమును చూచి మేము సంతోషించితిమి. ఉత్తర ప్రదేశీయులు అతిధులకు అత్యంత ప్రేమతోను, ఆదరముతోను భోజనము పెట్టుచుండుట నేను అనుభవ పూర్వకముగ తెలిసికొన్నదే. మహారాష్ట్రులమయిన మనము ఆవిధ ముగా భోజనము పెట్టుట నేర్చుకొనవలెను. కాని ఉత్తరప్రాంత సోదరుల కొకమాట చెప్పెదను. క్షమింపవలెను. మహారాష్ట్రుల వడ్డనచేయు పద్ధతి వారికి తెలియదు. మహారాష్ట్రములో రకరకము లయిన మిఠాయిలు లేకపోవచ్చుగాక. కాని ఏ రెండుమూడు వస్తువు లేయయినను ఒక విశిష్టపద్ధతి ననుసరించి వడ్డించెదరు. ఆ వరు సను చూచినప్పుడు సంతోషము గలుగుచుండును. ఒక ప్రాంతీయులు వేఱొక ప్రాంతీయుల మంచిని గ్రహింపగలిగినచో ఎంతబాగుండునని నాకు తోచుచుండును.

రెండు జాముల సమయమున, కాంగ్రెసు కార్యకర్తల సభలో వినోబాజీ, గ్రంథపఠనము చేయన్నివారిని గుఱించి ఆక్షేపించుచు ఇట్లనిరి: "కమ్యూనిస్టులును, మతానుయాయులును తమతమ సాహిత్యమును పఠించుచున్నారు. కాని కాంగ్రెసువారును, నిర్మాణ కార్యకర్తలును బొత్తిగా గ్రంథపఠనము చేయరు. అట్లు చేయనిదే అభివృద్ధి యెట్లు కలుగును?"

ఈ చర్చ అయిన తరువాత ముసల్మాను సోదరులు వచ్చిరి. వారు ఉర్దూ విషయమయి తమ కోరికలను వెల్లడించిరి. వినోబాజీ

ఇట్లనిరి: 'మనము ఉర్దూ అభివృద్ధి చెందవలెనని కోరుకొన్న యెడల దానిని నాగరి లిపిలో కూడ వ్రాయవలెను. అంతేకాదు. భారత దేశములోని భాషలన్నిటిని నాగరి లిపిలోనే వ్రాయవలెనని నా అభిప్రాయము. అట్లు చేయుటవల్ల ఇచ్చి పుచ్చుకొనుట సులభము కాగలదు.

ఈ చర్చ అయిన తరువాత మహిళాసభ ప్రారంభమయ్యెను. "పురుషులు మమ్ము ముందునకు పోనిచ్చుటలేదు" అని మహిళలు నేరము చెప్పగా వినోబాజీ, "అట్లయిన సత్యాగ్రహము చేయుడు. మీలో ప్రేమ ఉండనే ఉన్నది. దానికి తోడు ఆగ్రహము (పట్టుదల) చేరెనో సత్యాగ్రహమయిపోవును. ప్రేమ ఉన్నచోట, సఫలతాపూర్వకమగు సత్యాగ్రహము జరుగగలదు" అనిరి.

సాయంకాల సమయము. నిర్మల నీలాకాశమున పున్నమ చంద్రుడు ప్రకాశించుచుండెను. నేడు బుద్ధ జయంతి. ప్రార్థనా ప్రవచనము ప్రారంభమయ్యెను.

'నహి వేరేణ వేరాణి సమంతీధ కదాచన
అవేరేణచ సమన్తి యస ధమ్మో సనంతనో'

రెండువేల అయిదువందలసంవత్సరములకు పూర్వము ఈ శబ్దములు ప్రకటితమయి యుండెను. నేడు మరల వినవచ్చుచున్నవి. కారణ మేమనగా అందు త్రికాలాతీతమయిన సత్యము గర్భితమయి యున్నది.

వినోబాజీ గంభీర ధ్వనితో ఉపన్యసించుచుండిరి: "మిత్రస్య అహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే" లోకమును శత్రువుగా గాని, మిత్రునిగా గాని చేసికొనుట నా చేతిలోని పని అని వేదములు చెప్పుచున్నవి. నా నేత్రము నిర్మలమయి యున్నయెడల, అద్దమునకు మాలిన్యము చూపదగు శక్తిలేదు. అద్దము ఏ విధముగా నాకు ప్రతిబింబరూపమో, అట్లే లోకముకూడ. కారణమేమనగా అది జడము, నేను చేతనుడను. అహింస యొక్కయు, నిర్వైరము యొక్కయు

సిద్ధాంతము, బుద్ధుని జీవితములోను, ఇంకను అనేక సాధుపుంగవుల జీవితములోను నిష్కర్షగా ఋజువు చేయబడినవి.

సమాజములోని సమస్యలన్నిటిని నిర్వైరమువల్ల ఎట్లు పరిష్కరింపదగునో ఇప్పుడాలోచింపవలెను. రాజనైతిక రంగములో గాంధీజీ ఆ ప్రయోగమే చేసియుండిరి మనము మన స్వతంత్రమును అహింసా పద్ధతి వల్లనే పొందగలిగితిమి. ఇది సామాన్య విషయము కాదు. కనుక దీని విషయమయి శ్రద్ధగా యోచింపదగుదురు... స్వరాజ్యమునకు పూర్వము మనము అహింసను అవలంబించితిమి. ఆ సమయములో మనకు హింసాపద్ధతి సాధ్యముగా నుండలేదు. కనుక ఆనాటి అహింస అశరణునికి శరణమువలెను, అగతికునికి గతి వలెను, అనాథునికి ఆశ్రయమువలెను ఉండెను. కాని ఇప్పుడు మనకు ఎన్నికలు వచ్చినవి. కావలెనన్న యెడల ఇప్పుడు మనము హింసను గాని, అహింసను గాని చేపట్టవచ్చును. ఒకవేళ మనము హింసా మార్గము నంగీకరింప దలచిన యెడల అమెరికానో, రష్యానో మన గురువుగా చేసికొనవలసి వచ్చును. అప్పుడు వారికి శిష్యులుగా అణగిమణగి యయినను పడియుండవలెను. లేదా వారికంటె బలవంతుల మయిన యెడల లోకమునకు మనవల్ల ఉపద్రవము సంభవింప గలదు. ప్రళయ కాలమందు సర్వత్ర నీళ్లకునీళ్లే కనబడుచుండెను. కాని ఆ సమయములో మార్కండేయ మహర్షి యొక్కడే ఈతగొట్టుచు లోకమును పరిరక్షించెను. ఆ ప్రకారముగా నేను లోకమంతయు ప్రళయమువైపు దారి తీయుచుండగా ఏ దేశము మార్కండేయమహర్షివలె ఈతగొట్టుచుండునో, అయ్యది తాను ప్రాణములు దక్కించుకొని లోకమునుకూడ రక్షింప గలదు. అహింసా మార్గమును చేపట్టి మన భారతదేశము మార్కండేయ మహర్షి కావచ్చును. హింసకావలెనో, అహింస కావలెనో నిర్ణయించుకొనండి. గాలివలె భావమును గూడ ఎవరును అడ్డు పెట్టజాలరు. అహింసా మార్గమును స్వీకరించిన మన భారతదేశము తన

భావమును బయటికి పంపవచ్చును. ఆ దీక్షతోనే పని సాగించినయెడల మన అహింసాధర్మము లోకమందంతట వ్యాప్తి పొందగలదు. మను మహారాజ్ భవిష్యమును గుఱించి ఇట్లు వ్రాసెను :

'ఏతద్దేశ ప్రసూతస్య । సకాశాదగ్ర జన్మనః
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ । పృథివ్యాం । సర్వమానవాహః'

భారతదేశములో పుట్టిన జ్ఞానులవల్ల లోకములోని జనులు పాఠము నేర్చుకొందురు మనము అహింసామార్గ మవలంబించితిమా, మను మహారాజు భవిష్యమును గుఱించి చెప్పినమాట సత్యమని తేల గలదు. పరమేశ్వరుడు బుద్ధ భగవానుని పనిని, బలహీనుడనైన నాకు వప్పగించినాడు. మనము లోకమున కొక ఆకారమును దిద్దగలము... నిర్ణయించుకొనండి.''

ఇవి మాటలుకావు. హృదయములో అగ్నిని ప్రజ్వలించు నిప్పు కణములు. ''నా హృదయమును చీల్చి మీ యెదుట ఉంచితిని'' అని వినోబాజీ అంతిమ శబ్దమును వచించినారు. ఇవి నిజముగా అంతిమ శబ్దములే యని భావించుచున్నాను. కారణ మేమనగా ఇంతకంటె అధికముగా ఎవరేమి చెప్పగలరు ? శబ్దముల ద్వారా ఎంతవఱకు వ్యక్తము కాగలదో అంతవఱకు వెల్లడి చేయబడెను. అంతటితో శబ్ద శక్తి సమాప్తమయిపోయెను.

'ధర్మచక్ర ప్రవర్తనము'. అవును, ఆ మాట ఇదియే. ఈ శబ్ద ములో కేవలము ప్రాచీన గౌరవస్మృతి మాత్రమే నిక్షిప్తమయి యుండలేదు. ఉజ్జ్వల భవిష్యమును గుఱించిన స్వప్నము కూడ నిహిత మయి యుండెను. 'అక్రోధేన జనేక్రోధం అసాధునా సాధునాజినే' కారుణ్యావతారుడు విహరించుచుండెను. క్రోధమును ప్రేమవల్లనే జయింపవలెను. అంధకారవినాశము ప్రకాశమువల్లనే కావలెను. హింసా దుష్టచక్రమున తగులుకొనియున్న లోకమును అహింసా మార్గమువల్లనే జయింపగలము.' ...ఈ మాటలు ఎవరివి ? 'అసంఖ్య

మానవుల రక్తధారలచే ఎఱ్ఱనైన కళింగభూమి ఈనాడు నాది! ఏమి, నిజముగా అది నాదేనా! ...చక్రవర్తి సమ్రాట్టు మానస వీథులలో ఈ భావచక్రము తిరుగ నారంభించెను. ఆ భావచక్రము నుండియే ధర్మచక్రమును ప్రవర్తింపజేయునట్టి 'దేవానాంప్రియ' దేవతలకు ప్రియుడైన అశోకుడు జన్మించెను. ......'అనేక జనుల విశ్వాసముచే ఏర్పడిన నా అద్వితీయ నేతృత్వము; కాని నేను నిజముగా ఈ అసంఖ్యాకులు విశ్వాసమునకు పాత్రుడనా? నా స్వాగతము నిమిత్తమయి ఆసక్తితో వచ్చిన జనుల నేత్రములలో గల నిరాశ, దైన్యము, ఉదాసీనత నా కంటబడకుండ ఉండలేకపోయెను. నేనీ ప్రజల కొఱకు ఏమి చేయగలను?'' భావచక్రము మరల ప్రారంభ మయ్యెను. మరల అధికారమును దానముచేసి మానవహృదయములో ధర్మచక్రము త్రిప్పునట్టి నిన్నటి అశోకుడు జన్మింపగలడు ......చేతి యందు శస్త్రములేదు. అస్త్రమునులేదు. కాని లోకమును జయించుచు ముందునకు సాగిపోవు ఆ భిక్షువు... మఱియు...

'క్షుధార్త జగతికొఱకు భూమి నివ్వ భూమినీ,
నవధర్మం సాధించగభూమి నివ్వ భూమినీ'

అనుగీతమును ఆలపించు వీరెవ్వరు?

భూత భవిష్యముల సరిహద్దు రేఖలు అస్పష్టములయి పోసాగినవి. వర్తమానములోనే రెండును కనబడసాగినవి. విగతకాలము యొక్క స్మృతి, భావికాలముయొక్క స్వప్నము ఈ రెండింటి అంతరము పోయినది. నేటి అనుభూతియందు రెండిటి ఆభాస కనబడుచున్నది.

## నాలుగవ భాగము

# యోగి - కళాకారుడు

*బంథరా (లక్నో)*
10—5—1952.

నిత్యమువలె మేము మూడు గంటలకు లేచి నాలుగు గంటలకు బయలుదేరితిమి. అదే ప్రకృతి. అవే సుందర దృశ్యములు. అదే నడక. ఆ సహాయాత్రికులే. నిత్యము జరుగు ఆ చర్చయే. ప్రతిదినమువలెనే నిత్యకర్మలు జరుగుచుండెను. కాని మనస్సులో గొప్ప పరివర్తనము గలిగెను. మనస్సులో దివ్యజ్యోతి వెలుగజొచ్చెను. ఆ వెలుగుకిరణములలో స్నాన మొనరించిన నూతనలోకము దృగ్గోచరమయ్యెను. ఒక చిన్న శబ్దమువలన ఈ పరివర్తన గలిగియుండెను. అణుశక్తికంటె శబ్దశక్తి అధిక ప్రభావోత్పాదకమయినది. ఆ శబ్దము నూతన దృష్టిని ఇచ్చినది. విశ్వవిజయమునకు నవ్యతంత్రము నేర్పియుండెను. ఈ తంత్రమునందు ఆత్మవిజయము పొందిన పిమ్మటనే విశ్వవిజయమునకు దీక్ష తీసికొనవలెను. అందువల్ల మనస్సులో ఒక విధమయిన గాంభీర్యము ఏర్పడియుండెను.

నిన్న రాత్రి జరిగిన సంగతి జ్ఞాపకము వచ్చినది. భారతములోని ఇద్దరు విఖ్యాత కళాకారులు తమ కళను ప్రదర్శించుటకు వచ్చియుండిరి. ఒకరి చేతిలో ఫిడేలు, రెండవవారి చేతిలో మృదంగము ఉండెను. వినోబాజీ చెప్పినట్లు, ఒకటి సుకుమార కళ రెండవది పురుషోచితకర్మ. వయొలిను లోని కోమల కరుణస్వరము మానవ హృదయములోని

కరుణరసమును ప్రబోధించుచుండెను. మృదంగ గంభీర నినాదము సత్యాహింసల మూలమున అసత్యముతోను, హింసతోను పోరాడు చుండెను. ఇద్దఱు కళాకారుల కళ వారి వ్రేళ్ళనుండి ఉట్టిపడుచుండెను. వారిద్దఱును లోకమునే మఱచియుండిరి. వినోబాజీ కూడ ఆత్మ విస్మృతులయి యుండిరి. ప్రత్యేక రాగము ముగియగానే వినోబాజీ నెమ్మదిగా ఆ రాగము పేరు చెప్పుచుండిరి. అటువంటి రసిక సంగీతజ్ఞుల్ల మెప్పుపొందిన మీదట ఆ కళాకారులు రెట్టింపు ఉత్సాహముతో నూతన రాగమును పలికించుచుండిరి. యోగికి శయ్యాకాలము సరిగా రాత్రి తొమ్మిదిగంటలు. కాని ఈనాడు కళాకారులు యోగిని కూడ జయించిరి. రాత్రి పదిన్నర గంటల వఱకు గానసభ జరుగుచునే యుండెను.

మేము నిత్యము క్రొత్తయింటికి భోజనమునకయి పోవుచుందుము. కాని మాకు క్రొత్తదయిన మా స్వంతయింటిలో భోజనము చేయుచున్నట్లే తోచుచుండెను. క్రొత్తయిండ్ల స్త్రీలతో మాకు మైత్రి ఏర్పడుచుండెను. ఇదేదో పురాకృత ఋణానుబంధమయి యుండునట్లుండెను. ప్రతియింటి యిల్లాండ్రును మాపై ప్రేమవర్షమును కురియించుచుండిరి. అందువలన మా బాధ్యత పెరిగిపోవుచుండెను. వీరందఱి ప్రేమ మమ్ములను ఋణస్థులను చేయుచుండెను. జీవితకాలమంతయు తపస్సు చేసినను, ఆ ఋణము తీరునట్టిదిగా తోచలేదు.

ఈరోజున మేము భోజనము చేసిన ఇంటిలోని ఒక అమ్మాయి నాతో, 'ఏమి మీరందఱు రేపే వెళ్లిపోవుదురా? కేవలము ఒక్కదినమునకు మాత్రమే వచ్చి బంధుత్వ మేర్పఱచుకొని పోదలచిన యెడల అసలు ఎందుకు రావలెను' అనెను.

# గురుదక్షిణ

నవాబుగంజి (ఉన్నావ్)
11—5—1952.

ఉదయము నాలుగున్నర గంటల సమయము. ఇంకను అరుణ కాంతులు రాలేదు. "భూమి దాన యజ్ఞమును సఫలము చేసెదము. నూతన లోకమును సృష్టించెదము"అని వందలకొలది కోమల కంఠముల నుండి ఒక్కటే ధ్వని బయలుదేరినది. దారికి రెండువైపుల చిన్న చిన్న బాలురు పంక్తులు తీర్చి నిలబడియుండిరి. వారిలో ఒకడు మధురస్వరమున భూమి దాన యజ్ఞమును గురించి పాట పాడెను. ఆ బాలురు మనస్సులోని ఉత్కంఠతో రాత్రినుండియు అక్కడ నిలబడి యుండిరి. బాబాకు దొరకిన పూలదండ్ల నన్నిటి మే మా బాలుర కంఠములలో వేయుచుంటిమి. పుష్పహారములను కంఠమున తగిలించు కొన్నవారు సంతోషముతో పొంగిపోవుచుండిరి. నేడు దొరకిన హార ములలో ఒకరకము గింజలదండ యుండెను. గౌతముడు చల్లగా ఆ హారమును దొంగిలించెను. నేను అప్పుడప్పుడు అతనికి ఇంగ్లీషు నేర్పుచుందును. అందువల్ల నే నాతనినుండి ఆ హారమును గురుదక్షి ణగా తీసికొంటిని. హారము పోగానే గౌతము డిట్లనెను: "ప్రతిరోజు ఇటువంటి దండలు దొరికితే బాగుండును. కాని పూలదండలు వాడి పోవుచుండును."

కరణభాయి కుమార్తె 'మున్నీ' ఇప్పుడిప్పుడే మా యాత్రీ దళములో చేరినది. ఆమె "మృదు" కంఠెను, "గౌతముని"కంఠెను చిన్నది. ఆమె చిలుక పలుకులను విని మేమును అనుకరించుచుంటిమి. పదిహేను మైళ్లు ఎఱ్ఱని యెండలో నడచిన మీదట, ముద్దుబిడ్డ మున్నీ "హాయ్, బాబూజీ" అనుచుండును. ఆ ఒక్కమాట ఎన్నో భావములను

వెల్లడి చేయుచుండును. అది విని మేము శ్రమ పోగొట్టుకొని కలకల నవ్వుచుందుము.

రాత్రి మే మొక చాకలి యింటికి భోజనమునకు పోతియుమి. కాన్పూరువంటి నగరమునకు సమీపమున గల చాకళ్లుకూడ ధనవంతు లయియుందురు. ఆ యింటి సోదరీమణులు నా పాదముల మీద పడ నారంభించిరి. ఇది చూచి నేను వ్యాకులపడితిని. "వద్దు, వద్దు"ని నే నడ్డుపెట్టుచుండగనే మఱియొక సోదరి మెదలకుండవచ్చి తన నుదురు నా పాదములకు సోకునట్లు నమస్కరించెను. ఇక్కడ నేటి కింకను జాయింటు కుటుంబ వ్యవహారమే నడచుచుండెను. కనుక ఒక్కొక్క యింటిలో చిన్నలు, పెద్దలు కలిసి పాతిక, ముప్పదిమంది స్త్రీలు ఉండుచుండిరి. వీరంతఱు నా చరణస్పర్శవల్ల పావనులగుచుండుట (?) చూచి, నాకు అక్కడ భోజనము చేయకుండ పాఱిపోవలె నను బుద్ధి పుట్టినది. పవిత్రులు కాగోరువారి విశ్వాస మెక్కడ? మా మానస దౌర్బల్య మెక్కడ?

# జయ్ హింద్, జయ్ సంసార్, జయ్ హరి

ఉన్నావ్
12—5—52.

"మీ పని ఎప్పుడు పూర్తియగునండీ" అని తఱుచు వినోబాజీని అడుగుచుందురు. అందుకు వినోబా ఇట్లనుచుందురు: "ఏమి, ఇది మా యింటిలోని పెండ్లియా? ఇది మీ పని. ఎప్పుడు పూర్తియగునని మీరు నన్నడుగుదురేమి? మీరు దీనిని పూర్తిచేయ దలచుకొన్నప్పుడు పూర్తికాగలదు. పరమేశ్వరుడు నా నుండి ఎంతపని తీసికొన గోరు చున్నాడో అంతయు తీసికొనును. నన్నెప్పు డాతడు ఎత్తుకొనిపోవునో, అపుడు ఆయనలో కలిసిపోవుటకు సంతోషముగా పోగలను. ఇది మీ

పనియని, నాదికాదని జ్ఞాపకము ఉంచుకొనండి.'' ఈ సమాధానము విన్నమీదట, ప్రశ్న అడిగినవారికి చెంపదెబ్బ తగిలినట్లుండవచ్చును.

దారిలో ఎవరో ''త్రివర్ణపతాకమునకు జయ్'' అని అఱచియుండగా బాబా అది విని 'సమస్త పతాకములకు జయ్' అని ఉచ్చస్వరమున నినాదముచేసిరి. మేము సర్వోదయ నామమును జపించువారమే యయినను 'సమస్త పతాకములకు జయ్' అను భావమును జీర్ణము చేసికొనుట మావంటివారికి కష్టమే యనిపించును.

ఈ సమయములోనే వినోబాజీ ఒక ఘట్టమును గుఱించి వివరించుచు ఇట్లు చెప్పిరి: 'ఒకసారి ఒక మిత్రుడు నన్ను కలిసికొనుటకయివచ్చెను. రాగానే అతడు నమస్కరించి ''జైహింద్'' అనెను. ''జైహింద్, జయ్ సంసార్, జయ్ హరి'' అని నేనంటిని.

మా యాత్రీదళముతోపాటు వినోబా సాహిత్యమును అమ్మునట్టి ఒక చిన్నదుకాణము కూడ ఉండును. యాత్రీదళములోని సోదరులిద్దఱు సాహిత్య ప్రచారమే చేయుచుందురు. అన్నిటికంటె ఎక్కువ ''గీతా ప్రవచనమే'' అమ్ముడు పోవుచుండును. వినోబా తమ ప్రవచనమును పూర్తిచేసిన పిమ్మట కుశలప్రచారకునివలె ఇట్లు చెప్పుచుందురు: ''నేనీ దినము మీతో గడపితిని. రేపు ఇక్కడనుండి వెడలిపోయెదను. జీవితములో మరల కలిసికొందుమో, లేదో, ఎవరు చెప్పగలరు? మన సంయోగము ఇది చివరిదే కావచ్చును. కాని శరీర సంయోగము కంటె భావసంయోగము శ్రేష్ఠమయినది. నేను గీతా ప్రవచనములో నా జీవితానుభవములను పొందుపఱచితిని. మీరు ఆ గ్రంథమును కొన్నయెడల దాని ద్వారా నే నెల్లప్పుడును మీ యొద్దనేయుందును. భావనా ప్రపంచములో మనము నిరంతరము దగ్గఱగానేయుందుము.' ప్రవచనము పూర్తికాగానే, పుస్తకముల దుకాణమువద్ద గీతా ప్రవచనము కొనువారు గుంపులు గుంపులుగా చేరుచుందురు.

# అమరజీవి గణేశశంకర్ స్మృతి

కాన్పూరు
13—5—1952.

నగరము సమీపించిన దగుచుండగా గుంపులు పెరుగజొచ్చినవి. ఇక నాలుగు మైళ్లున్నదనగా, జనసముద్రమును ఈదుకొని ముందునకు సాగుచున్నట్లు తోచెను. దారికిరువైపుల రెండువందలమంది స్వయం సేవకులు చేతులు కట్టుకొని పంక్తులుతీరి నిలిచినవారే యయినను, జనసమూహాములను అడ్డగించుట దుష్కరమయిపోయెను. జనులు తమ వీలుననుసరించి, సైకిళ్ళు, రిక్షాలు, టాంగాలు మున్నగు వాహనముల నుపయోగించి నడచియు, వచ్చుచుండిరి. వినోబాజీని సమీపించుట అసంభవమనియు తలచి, దూరమునుండియే వారివైపు పూలమాలలు విసరుచు తమ శ్రద్ధాభక్తులు చూపుచుండిరి. శ్రీరాముడు శ్రీకృష్ణుడు చేయుచుండెడు ఘనకార్యములకు దేవతలు అప్పుడప్పుడు, పుష్పవృష్టి గురియించుచుండిరని వినియుంటిమి. కాని వినోబాపైన నిరంతరము పూలవానయే కురియుచున్నట్లు తోచెడిది. ఇప్పుడు దేవతలవల్లకాదు కాని జనార్దనస్వరూపులయిన జనులవల్ల. ఈ ఋతువులో జాజిపువ్వులు అధికముగానుండును. కనుక జాజిపువ్వుల వికాసము, పరిమళము నలువంకల ప్రసరించుచుండెను. గంగానది వంతెనమీద పౌరులపక్షమున స్వాగతమునకు ఏర్పాట్లు జరుగుచుండెను. అక్కడ జనసముద్రమే పొంగివచ్చునట్లుండెను. ఇప్పుడు పట్టణ సరిహద్దు సమీపించినది. ఇకముందు మూడు మైళ్ళలోను అక్కడక్కడ మంగళ హారతులు ఇచ్చుచుండిరి. అక్కడక్కడ ద్వారములు నిర్మించిరి. వానిపైన "యుగప్రవర్తక సాధుపుంగవునకు స్వాగతము" 'బాపూజీ శిష్యవరేణ్యుడగు సాధువునకు స్వాగతము.' 'అహింసాక్రాంతి ప్రణేతకు స్వాగతము,' అని వ్రాయబడియుండెను. వినోబాకు ముందు నలుగురు

అశ్వారోహకులు బ్యాండుమేళముతో పోవుచుండిరి. గుంపువల్ల ప్రమాదము లేకుండ వినోబాజీని రక్షించుటకు వెనుకనుండి మేము, బాలికలము, వారిని చుట్టుకొని నడచుచుంటిమి. 'మహాత్మా గాంధీకీ జయ్' అను నినాదములతో ఆకాశము ప్రతిధ్వనించుచుండెను. దరిద్ర నారాయణ ప్రతినిధులకు జరుగుచున్న ఈ స్వాగతము చూచినప్పుడు, నూతన యుగారంభమయినదా అనిపించుచుండును.

మా నివాసము ఉద్యానముమధ్యగల ఒక సుందరభవనములో అయియుండెను. ద్వారమువద్దకు చేరగానే చందనాక్షతలతో మాకు స్వాగతము ఇవ్వబడెను. వ్యవస్థ అంతయు అత్యుత్తమముగానుండెను.

కాన్పూరు వాసులు గడచిన రెండు మాసముల నుండియు, స్వాగతమునకై అమిత ప్రయత్నములు చేయుచుండిరి. భూదానము కొఱకు మండలమందంతటను సువ్యవస్థితమయినఆందోళనయే సాగు చుండెను. జిల్లాలోని అన్ని పక్షముల ప్రముఖ కార్యకర్తలతోను "వినోబా స్వాగతసమితి" ఏర్పాటు చేయబడెను. ఆ సమితి పక్షమున జిల్లాయందంతట వినోబా సాహిత్యము ప్రచారము చేయబడెను. చిన్న పుస్తకములు వేలకొలది అమ్ముడుపోయెను. అక్కడక్కడ పోస్టర్లు అతికించుచు, తద్వారా ప్రజలకు పరిచయము గలుగజేయు చుండిరి. భూదాన గీతములు పాడుకొనుచు భూదానము కోరునట్టి కార్యకర్తలు గ్రామగ్రామములు తిరుగుచుండిరి. పెద్దలు పెద్దలకడకు పోయియు, చిన్నలు చిన్నలకడకు పోయియు భూదానములు అడుగు చుండిరి. ఈ ప్రయత్నము లన్నిటివల్ల కాన్పూరుజిల్లా ప్రవేశింపగానే, కాన్పూరు వాసులు వినోబాజీకి, జిల్లా నిమిత్తము నిర్ణయించిన పది వేల యకరముల భూమి "కోటా" కంటె ఎక్కువ దానపత్రములను కాన్పూరు సభలో చదివించిరి. భూదానయజ్ఞ చరిత్రలో ఇది అపూర్వ విషయము. వినోబాజీ తమ ప్రవచనమున ఈ విషయమును ప్రశం సించుచు ఇట్లనిరి: 'మీరు భూమిని ఇచ్చియున్నారు. దానితోపాటు

రెండువేల యెడ్ల జతలను కూడ ఇవ్వండి.' అంతట కాన్పూరులోని ప్రముఖ భూదాన కార్యకర్త, శివనారాయన్‌జీ టండన్, "వినోబాజీ కోరిన ఈ రెండవ వరమును కూడ మేము భర్తీ చేసెదము" అని సభలో ప్రకటించెను. ఇది వినగానే కరతాళ ధ్వనులు మిన్నుముట్ట ప్రతిధ్వనించెను. ఇక్కడ ఉన్న కార్యకర్తలందఱు చిన్నలు, పెద్దలు కలిసి ఎంతో ఉత్సాహముతోను, ఆసక్తితోను పనిచేసి యుండుట వల్ల వారు దేశమున కంతకును మార్గదర్శకు లయిరి.

ఇక్కడి ప్రజలు వినోబాజీనివాసము సముచితముగా ఏర్పాటు చేయుటవల్ల అందఱును ఆ లాభమును పొందగలిగిరి. పట్టణములోని అన్ని పక్షముల వారును, అన్నిశాఖల వారును వినోబాజీని కలిసికొని తమతమ పరిస్థితులను నివేదించి మార్గదర్శనము పొందుచుండిరి. ఈ విధముగా వినోబాజీ సమయములోని ప్రతిక్షణము వినియోగించు కొనబడెను.

అందఱికంటె ముందు గోరక్షణ సమితి వారు వచ్చిరి. వినోబాజీ వారితో ఇట్లనిరి: "గోరక్ష, అంధ విశ్వాసముతో గాక వైజ్ఞానికదృష్టితో చేయవలెను." అటుపిమ్మట జమీందారులప్రతినిధులు వచ్చిరి. వారు, పలాశ పర్ణములతో (మోదుగాకులు) ఒక సుందర పాత్ర నమర్చి, అందు తెల్ల, కమలములనుఉంచి తెచ్చి వారి కర్పించిరి. అటుపిమ్మట జమీందారులు తమ కష్టములను నివేదించుకొనిరి.

వినోబాజీ వారితో ఇట్లనిరి: "తమ భూమి శాసనము ద్వారా పోయినది. కాని మనస్సునుండి ఎంత పోయినదో చూడవలెను. నేను మీకు 'స్వామిత్వ నిరసన' పాఠము నేర్పుటకు వచ్చియున్నాను. ఈ రోజున మీ వద్ద మునుపటిసంపత్తి లేదని నాకు తెలియును. అయినను మీరు చిన్నవారి వంక చూచినయెడల వారికంటె మీ స్థితిగతులు ఎన్నో రెట్లు మంచివని మీకు తెలియగలదు...మీ భూమి పోక తప్పదు. ఈ రోజులలో లోకమందంతట భూమి పంపిణీకి సంబంధించిన గాలి

వీచుచున్నది. హింసాక్రాంతి జరుగుచోట్ల భూస్వాములను చంపుచున్నారు. కాని ఈ క్రాంతిలో మీకు కలుగుచున్న ఇబ్బంది ఎంత తక్కువదో కొంచెము ఆలోచించుకొనండి. మీకు చాల తక్కువ ఇబ్బంది కలుగవలెననియే నా కోరిక. కనుకనే నేను మీనుండి భూదానమును కోరుచున్నాను.''

జమీందారులు వెడలిపోయిన పిమ్మట వ్యాపారుల, కార్మికుల ప్రతినిధులు వచ్చిరి. వారు కార్మికుల కష్టములను గుఱించి చెప్పిరి. వినోబాజీ వారితో ఇట్లనిరి. ''అహమదాబాదులో గాంధీజీ నాయకత్వము క్రింద సుదృఢమగు కార్మికసంస్థ యొకటి ఏర్పడియుండెను. దానియందు కూలీలు, యజమానులు ఉభయులకు ప్రతిష్ఠ ఉండెను. ఆ సంస్థ పక్షపాతము కలిగియుండలేదు. మీరుకూడ అటువంటిసంస్థనే స్థాపించుకొనండి. అప్పుడు మీ పనులు నెరవేరగలవు.''

అమరజీవి గణేశ శంకర విద్యార్థి. కాన్పూరు నివాసులే అయియుండిరి. వారిచేత తయారు కాబడిన మంచిమంచికార్యకర్తలు నేడు భూదానకార్యములు చేయుచున్నారు. వినోబాజీ తమ ప్రవచనములో వారినిగుఱించి ఇట్లు ప్రసంగించిరి: ''ఈ నగరములో 'సమర్పణయోగి' స్వర్గీయ గణేశశంకర విద్యార్థి ప్రేరణ పని చేయుచున్నది. ఇక్కడ జరిగిన మంచిపనికి గల ప్రతిష్ఠ ఎవరికి చెందవలెను ? అందలి మానసిక కారణములలో అన్నిటికంటె ముఖ్యకారణము వారే. ఒక మానవుని విశుద్ధ జీవనము వల్ల అటువంటి పరంపర ఏర్పడగలదు. అది ఎన్నడూ విచ్ఛిన్నము కాదు. ఇక్కడ జరిగిన ప్రేరణకు వారి బలిదానశక్తి పని చేయుచున్నది. సత్ప్రవృత్తి గల మనుష్యుని జీవితపరిమాణము, అతని మృత్యువు పిదప కూడ ఎట్లు పని చేయునో చూచుట కిది యొక సజీవప్రమాణము. ఎండిపోయినప్పటికిని వకుళపుష్పములు (పొగడలు) పరిమాణవంతములుగా నుండునేగదా !''

రెండు జాములకు కార్యకర్తల సభ జరిగెను. మొదటి ప్రశ్న "మీకు ఎటువంటి భూమి దొరకుచున్నది ?"

వినోబాజీ : నాకు ఎటువంటి భూమి దొరకుచున్నదో దానికి జవాబు మీరే చెప్పవలెను. కారణమేమన, భూమి తీసికొనువారు మీరే...ప్రతి ఒక్కడు భూమిని ఇచ్చునప్పుడు తన కుమారునకిచ్చునట్లు ఇవ్వవలెనని కోరుచుందును. ఇదెట్లు సంభవమని ఎవరయినను అడుగ వచ్చును. జనులు అయోగ్యులయినవారిని దత్తపుత్రులుగా స్వీకరింప గలిగినప్పుడు నావంటి యోగ్యుని తమ కుమారునిగా ఏల స్వీకరింప రాదు ?..." ఇది విని జనులందఱు కలకల నవ్వసాగిరి.

సాయంకాల సభాదృశ్యము అపూర్వమయి యుండెను. లక్షల కొలది జనులు సమావేశమయినప్పటికిని వ్యవస్థ సర్వోత్తమముగా నుండెను. వ్యాసపీఠము అతి సుందరముగా నలంకరింపబడియుండెను. రంగు రంగుల పూల గుత్తులు, ఎఱ్ఱ ఎఱ్ఱని పూవులు, పచ్చ పచ్చని ఆకుల తోరణములు నాలుగు వంకల వ్రేలాడుచుండెను. సూర్యాస్తమయ మందలి మందకిరణములచే కోమల పుష్పముల సౌందర్యము అతిశయించుచుండెను. వినోబాజీ వ్యాసపీఠముపైకి రాగానే, సమీపములో నున్న ఎత్తయిన ప్రదేశమునుండి బ్యాండు వాయించి వారి రాకను సూచించిరి. అటుపిమ్మట ఇక్కడి సంగీతకళాశాల విద్యార్థులు ఎన్నో వాద్యములతో "అనేవాళే తుమ్హే ప్రణామ్" (దయచేసిన మీకు నమస్కృతులు) అను గీతమును పాడిరి. ఇప్పటికిని ఆ పాట యొక్క సుమధుర ధ్వని చెవులలో ప్రతిధ్వనించుచున్నది. పాట పూర్తి కాగానే ఒక చిన్న బాలిక బంగాళీ పద్ధతిని అలంకరింపబడిన పూజా పళ్లెరముతో ఎదుటికి వచ్చెను.

మొదట ఆమె దూర్వాదళముతో వినోబా చరణములపై నీళ్లు చిలుకరించి, చరణధూళిని శిరమున ఉంచుకొనెను. వారి ఫాలమున

చందనము అలది, అక్షతలు, దూర్వాదళములు వారితలపై నుంచెను. చివరకు సుందరమైన, పెద్దవైన గులాబిదండలను మెడలో అలంకరించెను.

ప్రవచనము ప్రారంభమయ్యెను. "అయీ భారతేర మహా మానవేర సాగర తీరే" అని గురుదేవులు గానముచేసిరి. మన భారత దేశము మానవ మహాసాగరము. సాగరమువలె అది అంగఅను గర్భములో ఇముడ్చుకొనుచున్నది. మనుష్య జీవితమునకు అంతిమ ఆదర్శ ముక్తి అను సిద్ధాంతము భారతదేశములో స్థిరపడిపోయినది. మనము మనలను మఱచిపోవలెను. అహంకార శూన్యులము కావలెను. విశ్వరూప, సమాజరూప భగవానునియందు లీనులము కావలెను. ఇది ముక్తికి అర్థము. బిందువు సింధువునందు లీనమై పోవుచున్నది. అప్పుడది గొప్పదై పోవుచున్నది. నష్టమై పోవుటలేదు."

"మనము భగవానుని పాదము లంటవలెను. సమాజములో దుఃఖవంతులును, పీడితులును భగవంతునిచరణములు. వారిని సేవించుట వల్లనే ఈశ్వరుని చరణ స్పర్శలాభమును పొందగలము. నేడు హిందుస్తానము మేలుకొనుచున్నది. వేలకొలది జనులు భక్తి శ్రద్ధలతో భూదానములు ఇచ్చుచున్నారు. అంధులుకూడ దాన మిచ్చియున్నారు. ఆ రామచరణుడు గ్రుడ్డివాడు. అతనిని నేనెట్లు మరువగలను...... ఆ దినమున మా మజిలీ ఒక చిన్న గ్రామములో అయియుండెను. రాత్రిపూట మే మందఱము నిద్రించితిమి. ఆ అంధుడు నాలుగుమైళ్ల దూరమునుండి ఎడ్లబండిలో కూర్చుండి వచ్చియుండెను. అతడు నా మిత్రులను మేలుకొలిపి దాన మిచ్చి వెడలి పోయినాడు. మరునాడు నాకీ సంగతి తెలియగానే, ఆ వచ్చినవాడు అంధుడుకాడు, భగవంతుడు అంటిని. ఆ యంధునకు ఏ దర్శన మయ్యెను ? ఈ ప్రేరణ యెక్కడనుండి వచ్చినది ? దీని తాత్పర్య మేనమగా, భగవంతు డీపనిని ప్రేమించుచున్నాడు. మీ రందఱు మహిమావంతులు. తుచ్ఛులు కారు.

ఈ లోకములో ఏదియు అపూర్ణముకాదు. మానవు లందఱు పూర్ణులు". "పూర్ణ మదః పూర్ణ మిదమ్"... అహింసా మార్గము చేపట్టండి. మఱియు లోకమునకు నాయకులు కండి. అశోకచక్రవర్తి బుద్ధభగవానునినుండి ప్రేరణ పొందినవాడయి ప్రేమ, అహింసల సందేశమును లోకములో వ్యాప్తిచేసినట్లు మనము ఈ అశాంతిమయ జగత్తునకు శాంతి, అహింసల సందేశ మొసంగవలెను. అందుకుగాను మనము మన జీవితములలో అహింసాప్రతిష్ఠాపనము చేసికొనవలెను".

# మనకు వామనావతారమే కావలెను

కాన్పూరు,
14—5—52.

ఉదయము నాలుగు గంటలకు ప్రార్థన జరిగెను. నగరములోని పెక్కండ్రు నాగరికులు హాజరయి అటుపిమ్మట ఇక్కడగల సంక్షేమ సంఘము ద్వారా ఏర్పడనున్న హరిజన బస్తీకి శంఖుస్థాపన వినోబాజీ నివాసస్థానమందే చేసియుండిరి. అన్నిటికంటె ముందుగా ఎఱ్ఱని గులాబి పుష్పహారము సమర్పింపబడెను. దానిని చూడగానే ఎత్తుకొని పోయిన బాగుండు ననిపించెను.

శిలాన్యాస సమావేశములో వినోబాజీ ఇట్లు ప్రసగించిరి: 'మీ నగరమునకు ప్రతిష్ఠ మహోన్నతములయిన భవనములవల్లకాదు. కాని ఈ హరిజన సోదరుల నివాసస్థానములవల్లనే రాగలదు. మన శరీరములో అన్నిటికంటె బలహీనమైన అవయవమేదో, అదే మన శక్తి. పాకీవాడు మన గుండెకాయ. ఒకవేళ అదే చెడిపోయిన యెడల మన సంఘమే నాశనమయిపోవును. గొలుసులోని బలహీనమగు గొళ్ళెమేదో అదే దానిబలము. అదే విఱిగిపోయినయెడల, నడుమే విఱిగిపోవును.'

ఈ రోజున బాబా వ్యాసమొక దానిని ఇంగ్లీషులోనికి అనువాదము చేయవలసియున్నది. వారి ఉపన్యాసములలో వేదాంతభాగము వచ్చినప్పుడు, 'ఇదెట్లు అనువాదము చేయగలనురా, పరమాత్మా'అని నాకు గుండెదడ పుట్టుచుండును. ఒకసారి 'పరమాత్మసాధన' అను మాటకు సరియయిన శబ్దము దొరకకుండెను. నా పని అంతయు ఆ శబ్దము మూలమున ఆగిపోయెను. చివరకు విసుగుపుట్టి, ఇంత యెందుకు, 'పరమార్థసాధన' అను మాట ప్రయోగించిననే మంచిదని, అట్లే చేసితిని. ఆ విధముగానే "ఆత్మౌపమ్యబుద్ధి" అను మాట నా యెముకలు కొఱికి వేసినది.

ఈ ప్రదేశములో ప్రతిచోట 1857 వీరుల స్మృతి గర్భితమయి యున్నది. ఇక్కడనుండి సమీపములోనే బిఠూరు (బ్రహ్మావర్తము) అను పేరు గల చరిత్ర ప్రసిద్ధిగల స్థానమొకటి గలదు. యాత్రీ దళములోని కొందఱు సోదర సోదరీమణులు బిఠూరు చూచుటకు పోవుచుండిరి. సరిగా ఆ సమయముననే పత్రికా విలేఖరుల సమ్మేళనము ఏర్పాటు చేయబడెను. ఇప్పుడు నే నెక్కడకు పోవలెనను ప్రశ్నపుట్టెను. కడచిన చరిత్రకంటె కన్నుల యెదుట జరుగుచున్న చరిత్రకు అధిక ప్రాధాన్య మిచ్చుట తగునని తలచి బిఠూరు పోకుండుటకే నిశ్చయించుకొంటిని. నా నిశ్చయమే మిక్కిలి మంచిదయినది. కారణమేమన నేటి ప్రశ్నలకు వచ్చిన చాల జవాబులు నా సందేహములను పోగొట్టునట్టివిగా నుండెను.

పురాణ కథలలోని రూపకములను నేటి స్థితిగతులకు అనురూపముగా వినోబాజీ అన్వయించి చెప్పియుండిరి. ఈ పద్ధతి ఎంతో ఉద్బోధకముగా నుండెను. నేటి పరిస్థితిని నరసింహావతారముతో పోల్చి వినోబాజీ ఇట్లనిరి: "నేటి స్థితి నూతనమును కాదు, ప్రాచీనమును కాదు. మాధ్యస్థమై యున్నది. ఇప్పుడు నరసింహావతారము నడచుచున్నది. అవతారము లన్నిటిలోను ఈ అవతారము భయంకరమయి

నది. పూర్తిగా పశువూ కాదు. పూర్తిగా నరుడును కాదు. ఇంతకు పూర్వము వచ్చిన అవతారములలో అవి పశువులని గ్రహింప గలుగు చుంటిమి. కాని యిప్పుడు సంక్రమణ కాలము నడచుచున్నది.

"నా పని నూతనమయినది కాదు. ఇదే వామనావతారము నడచుచున్నది. బలిదానము యొక్క తాత్పర్యమేమనగా బలిచక్రవర్తి ఇచ్చిన దానము. అనగా బలవంతుల దానము. దుర్బలులది కాదు. బలిచక్రవర్తి సామ్రాజ్యాధిపతి యయియుండెను. నేటి వామనావతారములో కూడ మూడడుగులభూమిని అడుగుచున్నాము. మొదటి అడుగు, మీకు గల భూమిలో ఆఱవ భాగము దానమివ్వండి. రెండవ అడుగు, సాలంకృత కన్యాదానము, అనగా భూమితోపాటు సాధనము లను కూడ దానమివ్వండి; ఇచ్చి దరిద్రుల సేవలో నిమగ్నులు కండి. మూడవ అడుగు, బీదల సేవ చేయుచు చేయుచు స్వయముగా నీఱు పేదలు కండి. 'శివో భూత్వా శివం యజేత్' ఇది పురాతన కర్మయే. కాని యుగము మాఱుచున్న కొలది, కర్మ స్వరూపము మాఱు చుండును."

ప్రశ్న : మీ ప్రణాళికకును, ఇతర ప్రణాళికలకును గల భేదమేమి ?

వినోబాజీ : మాది వామనావతారము. ఇతరులది పరశురామావతారము లేక రామావతారము. ఇదే తేడా. పరశురాముడు శస్త్రముల ద్వారా భూమిని నిఃక్షత్రియము చేయుటకయి ఇరువది యొక్క మాఱులు ప్రయోగముచేసెను. కాని ప్రయోగములన్నియు వృథాఅయిపోయినవి. నేటికిని పరశురాముని ప్రయోగములు నడచు చునే యున్నవి. 'శుద్ధము(Purge)చేయండి.' "జమీందారులను పెట్టు బడి దారులను హత్య చేయండి" అని వారనుచుందురు. రామావతారములో రాజా రామచంద్రునిఆజ్ఞలవల్ల పనులు జరుగుచుండెడివి. ఈ సంగతినే నేటి భాషలో చెప్పవలెనన్న 'శాసనము ద్వారా పంపిణీ

జరుగవలెను' అని చెప్పుదుము కాని మా పని ఈ రెండిటికంటెను భిన్నమయినది. కారణ మేమనగా, మాది వామనావతారము. మేము ప్రేమతో మా ఉద్దేశమును బోధించి భూదానమును గ్రహింతుము. ఎవరును కాదనరు. జనులు భూమి దానము లిచ్చుచుందురు."

"వామనావతారము తరువాత పరశురామావతారము గాని రామావతారము గాని అవసరము. కాని వామనావతారమే వల్లనే పని జరిగిపోయినట్లయిన ఈ రెండిటిలో దేని అవసరము కనబడదు. మనకు రామావతారము కావలెను. కాని పరశురామావతారము ఎన్నడును వద్దు. కారణ మేమనగా పరశురాముని ఇరువది యొక్క ప్రయోగములవల్ల లాభము లేదని తేలిపోయినది. కాని వామనావతారములోనే పని అంతయు జరిగిపోయిన యెడల మిక్కిలి గొప్ప సంగతి కాగలదు."

వినోబాజీ హత్య, శాసనము, కరుణ అను మూడు ఉపాయములను చూపియున్నారు. ఈ మాటలు మా భూదాన కార్యకర్తలకు మిక్కిలి ప్రియమైనవి. మా యాత్రీదళములోని గౌతమబాలుడు, మృదుబాలికకూడ ఈ మూడింటిని స్పష్టముగా వివేచనచేసి అన్నిటికంటె కరుణోపాయమే తరుణోపాయమని ఋజువు చేయగలరు.

ప్రశ్న : "ఈనాడు మీరు బొత్తిగా భూములులేనివారికి భూముల నిచ్చుచున్నారు. కాని రెండు మూడు ఎకరముల భూమిగల వారికి మరి రెండుమూడు యకరములు ఇచ్చినయెడల చాలినంత భూమి (Economic Holding) ఏర్పడగలదు. ఇదే శ్రేష్ఠమైన పద్ధతి యని మాకు తోచుచుండును."

వినోబాజీ ఇట్లనిరి: "పనులన్నియు బుద్ధివల్లనే చేయుట సాధ్యము కాదు. కొన్నిటిని హృదయమువల్ల కూడ చేయవలెను. మహాభారతములో ఒక కథఉన్నది. యక్షుని యెదుట ధర్మరాజు నిలబడి

యుండెను. అతని సోదరులు నలుగురును, యక్షుని ప్రశ్నలకు జవాబు చెప్పకుండ నీళ్ళు త్రాగ ప్రయత్నించిరి. అందువల్ల మరణము పొందిరి. యక్షుడు ధర్మరాజును ప్రశ్న లడిగెను. అతడు మంచిమంచి జవాబులు చెప్పుటవల్ల యక్షుడు సంతోషభరితుడై ధర్మరాజుతో 'నేను నీ సోదరులలో ఒక్కనిని జీవింపచేతును. ఎవరిని జీవింప జేయవలెనో చెప్పు' మని యడిగెను. నిజమునకు, అర్జునుడు అందరికంటెను ఉపయోగకారి. అర్జునుడు ఎకనామికు యూనిట్ (Economic Unit) ఆర్థికోపయోగి. కాని ధర్మరాజు, "మా కడసారి సోదరుడయిన సహదేవుని జీవింప జేయవలెను. అతడు మా రెండవతల్లికి కూరిమి బిడ్డడు," అని కోరగా యక్షు డదివిని పరమ సంతోషమునుపొంది ధర్మరాజు సోదరులందరిని మరల జీవింపజేసెను. 'ధర్మరాజు ఉపయోగితావాది కాడురా, ధర్మనిష్ఠుడురా' అని అతనికి తోచెను. అర్జునుని జీవింప జేయుట అన్నిటికంటె లాభదాయకము. కాని అతడు లాభమును విడిచిపెట్టి, కడసారి సోదరుని జీవింప జేయవలెనని కోరుకొనెను. దీనిని ధర్మదృష్టి యందుము. అటువంటి ధర్మదృష్టినే కలిగియుండండి. సమాజములో అందరికంటె దుఃఖవంతులయి నిఱుపేదలుగా నున్న వారిని సుఖవంతులుగా చేయుటకు యత్నము చేయండి."

మాకు భూదాన యజ్ఞము యొక్క ఉద్దేశము బాగున్నది. కాని గ్రామగ్రామములు తిరిగి భూమిని అడుగుట మాకు సాధ్యము కాదు. ఇంక మేము ఏ విధముగా పని చేయవలెనో చెప్పండి ?

ఈ ప్రశ్నకు సమాధానముచెప్పుచు వినోబాజీ ఇట్లనిరి: "భూదాన కార్యము చేయలేనివారు లోకములో ఒక్కరుకూడ లేరు. ఇందు ప్రతి ఒక్కరు, స్త్రీలు, బిడ్డలు అన్ని భాగములందును పని చేయవచ్చును. మీరు భూదానములు అడుగలేని యెడల భావనా ప్రచారము చేయండి. భూదాన సాహిత్య ప్రచారము చేయండి. అన్నిటికంటె ముందుగా భావన ఏర్పడుచున్నది. అటుపిమ్మట ఆచరణ. సామాన్య

ముగా స్త్రీలకు భూమిని ఇచ్చునట్టి హక్కు లేదు. కనుక వారు స్వయముగా భూమినివ్వజాలరు. కాని ఇప్పించుపని చేయవచ్చును. గాజియాబాదులో ఒక వకీలు సోదరుని భార్య అతని కిట్లు బోధించినది: "మీకు వకీలు ఉద్యోగము బాగా సాగుచున్నది. మనము స్వంతముగా భూమి మీద వ్యవసాయము చేయలేము. అట్టి స్థితిలో మనము భూమి ఉంచుకొని ఏమి చేయగలము? కనుక భూమినంతయు దానముగా ఇచ్చివేయండి." అంతట ఆ సోదరుడు తన పంద్రెండు యకరముల భూమిని దానముగా ఇచ్చివేసెను. తఱుచుగా పురుషులు, "మేము దానము ఇవ్వగోరుచునే యున్నాము. కాని ఆడంగులు, పిల్లల పట్టుదల మూలమున దానమివ్వలేకపోవుచున్నాము" అనుచుందురు. ఇక స్త్రీలే దాన మివ్వవలసినదని చెప్పినయెడల పురుషులు దానము ఇచ్చియే తీరవలెను. దేవతల భార్యలు మంచివారని పురాణములలో చదివియున్నాము. కాని రాక్షసుల భార్యలు కూడ పతివ్రతలయియున్నారు. రావణుని భార్య మండోదరి పతివ్రత. ఆమె తన భర్తను చెఱుపునుండి రక్షించుటకు తగినంత యత్నము చేసెను... కనుక ఈ యజ్ఞములో పాల్గొనని రాక్షసుల (నవ్వు) భార్యలు మండోదరివలె పని చేయదగుదురు. వారు తమ దైవీగుణములవల్ల పురుషుల ఆసక్తిని పోగొట్టి దానమిప్పించు పని చేయవచ్చును. దేవతల భార్యలు మాకు అనుకూలముగా నుండుట సామాన్యముగా చూచుచునే యున్నాము. కాని రాక్షసుల భార్యలు కూడ అనుకూలముగానే ఉంటున్నారు. ఇక పిల్లలో భూదాన కార్యములు చేయుచునే యున్నారు. వారు బిగ్గఱగా భూదానమును గుఱించి నినాదములు చేయుచున్నారు. పాటలు పాడుచున్నారు. అందువల్లనే ఆ పలుకు త్రిభువనములలోను పరివ్యాప్తమగుచున్నది." ఈ చివరి మాట వినగానే మాలో ఎంతో మందికి "ఔరా! పిల్లలమయిన ఎంత బాగుండును!" అనిపించినది. చర్చ సాగుచునే యుండెను.

ప్రశ్న : మీకు దానమిచ్చెడి గొప్పగొప్ప జమీందారులలో చాలమంది స్వార్థ దృష్టితో దానమిచ్చుచున్నారన్న సంగతి మీకు తెలియునా ?

వినోబా : నేను ఇతరుల భావములను విశ్లేషణచేయను. భూదానము ఇచ్చెడివారు, అందరిభావనను గ్రహించి యిచ్చుచున్నారనియు ప్రేమతో ఇచ్చుచున్నారనియు నే నంగీకరింతును. ఎవరయినను, నిన్నటివఱకు ప్రేమింపజాలని యెడల నేటినుండి ప్రేమింపరాదా ? మనుష్యుని హృదయము ఒక్క క్షణములో మార్పు చెందగలదు. మనుష్య హృదయమునందు ప్రేమ నిలిచియున్నది.

వినోబా జమీందారుల, పెట్టుబడిదారుల ఏజెంటు అని కమ్యూనిస్టులు ఆక్షేపణ చేయుచుందురు. వారు నా అధికారమును (ఏజెన్సీని) అంగీకరించిన యెడల నేను తప్పక వారి ఏజెంటును కాగలను. నిజము పేదల ఏజంటుగా ఉండనే ఉన్నాను. శ్రీమంతుల ఏజెంటుగా కూడ ఉండగోరుచున్నాను. నా ఉద్దేశ్యము "సర్వోదయము" అనగా అందఱి క్షేమము. ఏ ఒక్క వర్గము యొక్క క్షేమము కాదు.

చివరి ప్రశ్న : మీకు ఉత్తరాధికారి యెవరు ?

వినోబా : నాకు ఉత్తరాధికారి భగవంతుడు.

ఈ మాట విని జనులందఱు ఉలికిపడిరి. వినోబాజీ యొక్క ఈ ఉత్తరాధికారి పయిన ఎవరును ఆక్షేపణము చేయజాలరు. అతడు తప్పు చేసినయెడల మన మాతనిని ఎన్నికలలో ఓడింపజాలము.

నేటి సాయంకాల ప్రార్థన సభ కూడ నిన్నటివలె బ్రహ్మాండముగా నుండెను. అభినందన పదములయిన కవిత్వములు, భూదాన గీతములు వాన కురిసినట్లు కురిసినవి. ఈ సమావేశములలో స్థానికులయిన కవులు భూదానగీతములు రచించి అర్పించుచుందురు. మా యాత్రలో అట్టి కవితలు సమర్పింపని దినము ఒక్కటికూడ ఉండదు. రాష్ట్రకవి మైథిలీశరణగుప్త మొదలుకొని గ్రామములోని పల్లెభాషలో

కవిత్వముచెప్పు అజ్ఞాతకవి వఱకు వందలకొలది కవులు భూదాన గీతములను రచించియున్నారు. హిందీసాహిత్యప్రపంచమునందు చిన్నలు, పెద్దలు అయిన ఈ కవులు రచించిన భూదాన గీతములకు ప్రముఖ స్థానము ఏర్పడియున్నది.

వినోబాజీ నేటి ఉపన్యాసములో సర్వోదయ తత్త్వములోని మూల సిద్ధాంతములను వివరించి చెప్పిరి. అటుపైన, నేడు నిజమయిన రాజనీతి యనగా నేమో విశదపఱచుచు వినోబాజీ ఇట్లనిరి: 'ప్రజాశక్తి సంవర్ధనమ్ రాజకారణమ్' దేశములో అనంత భేదభావములున్నప్పటికి కూడ, భేదములో అభేదమును గుర్తించి జనశక్తిని ప్రబోధించుటయే నిజమయిన రాజనీతి. అభేదములో భేదమును నిరూపించుట తెలివిగల వారి పని కాదు. ఈనాడు దేశములో లెక్కలేనన్ని మతభేదములున్నప్పుడు ఏదో ఒక ప్రధాన విషయముపైన అందఱు దృష్టి నిలుపుట అత్యవసరమయియున్నది. నేడు భూదాన యజ్ఞముద్వారా దారిద్ర్యమును నిర్మూలనము చేయుట ఎట్లా యని అందఱును ఆలోచించు చున్నారు. జనులలో ఉత్సాహము గలుగుచున్నది. ఈ పని విషయమయి అందఱి సానుభూతి ఏర్పడుచున్నది.''

''మన రాజనీతిజ్ఞులకు దీని కాంతి ఎన్నడు సోకగలదు ?'' అని వినోబాజీ అనుచుందురు. బుద్ధభగవానుని కాలములో తక్కువశక్తిగల రాజు లుండెడివారా ? కాని రాజనీతి కుట్రలలో చిక్కుకొన్నవారికి, పాదసంచారియగు ఈద్రష్ట ఉపదేశమును వినుటకు తీఱిక యెక్కడిది? అస్త్రశస్త్రముల ఝాంకారములు బ్రహ్మాండముగా నుండగా ఏకాంత పథికుని అహింస, మైత్రి, కరుణా ధ్వని ఎవరి చెవిని బడగలదు ? కాని లోకములో ఆశక్తిశాలురగు రాజులు ఊరును, పేరును లేకుండ పోయిరి. కాని ఏకాంత పథికుడే నేటివఱకును మానవ హృదయమును ఆకర్షించుచున్నాడు. నేడు చరిత్ర అంతయు మరల పునశ్చరణ చేయబడునా ?

# సర్వోదయము స్వప్నము కాదు, సత్యము.

సచేండీ (కాన్పూరు)
15—5—1952.

భూదాన ప్రణేతకు స్వాగత మిచ్చుటలో కాన్పూరు నగరము చక్కని వ్యవస్థను, కళను, భవ్యతను ప్రదర్శించి యుండుటవలన, ఆ నగరమునకు చరిత్రలో విశిష్టస్థాన మేర్పడియున్నది. కడచిన రెండు దినములనుండియు కాన్పూరు నగరవాసులకు గలిగిన ప్రబోధమును దర్శించియుంటిమి. అయినను నేటి ఉదయము నాలుగు గంటలకు మేము పయనమై పోవుచుండగా మరల వారి ఉత్సాహము కానవచ్చెను. కాన్పూరును దాటిపోవుటకు సుమారు ఒకటిన్నర గంటల కాలము పట్టెను. అప్పటివఱకు సాధుపుంగవునినుండి సెలవు తీసికొనుటకు జనులు దారి పొడుగునను గుంపులు గుంపులుగా నిలిచియుండిరి. పుష్పవృష్టియు, జయజయ ధ్వనులును సాగుచునే యుండెను. చీకటి యగుటవలన ముఖములు కనబడుటలేదు. అయినను వారి ముఖమండల మందలి భావములను మేము ఊహించి గ్రహింపగలుగుచుంటిమి. నగరము సరిహద్దువఱకు వందలకొలది పౌరులు మాతో నడచి వచ్చుచుండిరి. "విజయీ విశ్వ తిరంగా ప్యారా" అను పాటను రచించిన కవి నేటివఱకును మాతో తిరుగుచునే యుండెను. అతడు భూదానమును గుఱించికూడ ఒకమంచి పాటను వ్రాసెను. దారిలో ఆతడు దానిని పాడుచు వచ్చుచుండెను. జనులుకూడ ఆ పాటనే వారితోకలిసి పాడుచుండిరి. మఱియొక కవి తనపాటను ఇట్లు పాడుచుండెను:

"ఆజ్ గౌతమ్ ఔర్ గాంధీకీ హోరహీ విజయ్‌హై"

(నేడు గౌతములకును, గాంధీజీకిని విజయము కలుగుచున్నది.)

ఈ చిన్నిపంక్తిలో ఏయే భావములు గర్భితములయి యున్నవో చెప్పజాలము.

గడచిన రెండుదినములనుండి హడావిడిగానుండెను. అందువలన నేడు గ్రామమునగల ప్రశాంతస్థితి, ఆ స్థానము యొక్క రామణీయకత ఎంతో ఇంపుగానుండెను. ఒకచిన్న చెఱువుగట్టు మా నివాసగృహమై యుండెను. చెఱువు అవతలిగట్టున ఒక విశాల వృక్షముగలదు. నేను దానినీడను గూరుచుండి పగ లంతయు పనిచేసికొనుచుంటిని.

నేడు మే మొక గొప్ప జమీందారుని యింటికి అతిథులము. ఆ యజమాని వినోబాజీతో ఇట్లనెను : 'మీరు వచ్చి మమ్ము రక్షించిరి. లేనిచో మాస్థితి ఇంకనుచెడిపోయెడిది.' ఇట్లుచెప్పిన యాతడు తగినంత భూదానము చేయుచునేయుండెను. ఆ దానమిచ్చుటలో అతనికి ఎంతో సంతోషము గలుగుచుండెను. "భూదాన యజ్ఞము వల్ల ధనవంతులకును, బీదవారికి కల్యాణము గలుగుచున్నది. నిజమునకు వారిద్దఱి హితములోను విరోధమేలేదు" అని వినోబాజీ నిరంతరము చెప్పుచునే యుందురు. ఇటువంటి ఘట్టములుచూచినప్పుడు వినోబాజీ పలుకులందు ఎంత సత్యమున్నదో మాకు తెలియుచుండెడిది.

సర్వోదయమనగా కవి కల్పనకాదు. అది ఒక మహాసత్యము. దీని వెలుగు మనకు భూదాన యజ్ఞమువల్ల గలుగుచున్నది. భూములు లభించినట్టి నిఱుపేదలు వినోబాజీని తమఉద్ధారకుడుగాఎంచుచున్నారు. ఇది స్వాభావికమే. కాని భూములిచ్చినవారు కూడ వినోబాజీని తమ ఉద్ధారకుడుగానే యెంచుచున్నారు. ఇందే అహింసాతంత్ర ప్రభావము ఇమిడియున్నది.

మా యజమానుని సోదరుడు మిక్కిలి లావయినమనిషి. అతడు వినోబాజీతో, 'మీతో కొన్ని సంగతులు మాట్లాడవలెనని యున్నది' అనెను. సామాన్యముగా నడచునప్పుడే నమ్మకమయిన మాటలు సాగుచుండును. కనుక వినోబాజీ చిఱునవ్వు నవ్వుచు, 'మీరు రేపు నాతో నడచిరండి. మాట్లాడుకొందాము' అని మీతో చెప్పజాలను అనిరి.

ఆ మాటలు విని జనులందఱు గొల్లున నవ్విరి. ప్రశ్నకర్త కూడ నవ్వ సాగెను.

## గాంధీజీ భారతదేశమువంక ప్రపంచదృష్టి

బారా (కాన్పూరు)
16—5—1952.

నిన్నటి దినము నడకలో వినోబాజీకి నడుములో నొప్పిపుట్టెను. అందువల్ల వారి నడక మందగించినది. కేవలము నావలెనే అయినది. వారు తమ విషయమయి "ప్రజాసూయ యజ్ఞాశ్వ" మని చెప్పుకొను చుందురు. కనుక వారీనాడు సరసముగా "ఈ రోజున గుఱ్ఱమయితే సిద్ధముగా నున్నది. అప్పుడప్పుడు అలసిపోవుచుండును" అనిరి.

దారిలో లక్ష్మీనారాయణజీ వినోబాజీతో "తమరు లక్నోలో ఇచ్చిన ఉపన్యాసము ఈనెల సర్వోదయపత్రికలో పూర్తిగా ప్రకటింప వలె"ననగా, వినోబాజీ వెంటనే ఇట్లనిరి: "నాకు మీ 'సర్వోదయ' మొదలయినవానితో పనిలేదు. నాకు స్వంతముగా ఒక విలక్షణమయిన రేడియో ఉన్నది. దాని ద్వారా నా సందేశము లోకమున కెన్నడో ప్రసారము చేయబడినది. నాకు మీ ప్రచార సాధనముల అవసరము కనబడుటలేదు"... మొన్నటి దినమున దక్షిణ అమెరికాలోని ఏదో మూలనుండి వినోబాజీకి ఒక ఉత్తరము వచ్చినది. ఆ సంగతి ఇప్పుడు జ్ఞాపకము వచ్చినది. ఆ ఉత్తరములో ఒక మిత్రుడు ఇట్లు వ్రాసియు న్నాడు: "గాంధీజీ భారతదేశములో నేడు మీరే అహింసాప్రయోగ మును చేయుచున్నారో దానివంక మేమందఱము ఆశాపూరిత నేత్ర ములతో చూచుచున్నాము. హింస, అశాంతితో కూడిన ఈ జగత్తులో అదొక్కటే ఆశాకిరణము కనబడుచున్నది." ఇటువంటి ఉత్తరములు ఎన్నో దేశ దేశముల నుండియు వచ్చుచుండును.... ఈ ఉత్తరములు

వ్రాసిన వారందఱకు బాబాజీ "విలక్షణ రేడియో" ద్వారా సందేశము అందుచుండునని తలంతును.

మా యాత్రదళములోని ఒక రాష్ట్రీయ స్వయంసేవక సభ్యుడు వినోబాజీని, తన సందేహములు వెల్లడించుచు, ఎన్నో ప్రశ్న లడుగగా వానికి వినోబాజీ చెప్పిన సమాధాన మిది: "గ్రామములోని వ్యవహార మంతయు గ్రామీణులకే వప్పగించవలెను. ప్రతివానికిని తనగ్రామమ్మును సంబాళించుకొను తెలివి ఉండనే ఉన్నది. కాని ఈ రోజులలో తెలివి తేటలు లేకపోయినను, యావత్తు దేశమును గుఱించి ఆలోచించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. దాని మూలమున అనేక మతభేద ములు పుట్టుచున్నవి. గ్రామీణులు నగరవాసులతో, "మాకు మీరాజ కీయ పక్షములతో గాని, మీ కక్షలతో గాని పనిలేదు. మేము మా మా సంగతులు చూచుకొందుము" అని చెప్పవలెను...ఈనాడు దేశీయధర్మము దేశీయ అధర్మముగా పరిణమించినది. కారణము యేమనగా నేటి దేశీయధర్మమునందు ఇతర దేశములను ద్వేషించుట వచ్చుచున్నది. ఒక విధముగా మనము లోకమంతటిని ఒక్కటిగానే చూచుచున్నాము. నిజమునకుకూడ అంతే. కాని ప్రస్తుతము అహం కార మూలముగా విశ్వము నంతటిని కృత్రిమోపాయములచే ఒక్క టిగా చేయవలెనని వృథాప్రయత్నము చేయుచున్నారు. అందువల్ల వందలకొలది మతభేదములు పుట్టుచున్నవి. విశ్వము నంతటిని ఏకము చేయుటకు కృత్రిమోపాయములుగాని, బాహ్యసాధనలుగాని అవ సరము కావు. భగవానుడు గీతలో "నేనందఱను ఒక్కసూత్రముతో బంధించియున్నా" నని చెప్పియున్నాడు. లోకం మూలతః ఒక్కటే. ఈనాడు కనబడుచున్న మతభేదముల నన్నిటిని పోగొట్టినట్లయితే అసలు విశ్వమునకుగల ఐక్యత గోచరింపగలదు.

"మనము ఎవరినీచూచి భయపడవలసినపనిలేదు. లోకమంతయు ఒక్కటే," అని తలచినవారయి మీ మీజీవితములలో అద్వైతమును,

అభిన్నతను అనుష్ఠించండి. అప్పుడు లోక మంతయు వేదాంతమును, తత్త్వజ్ఞానమును అంగీకరింపగలదు. "రేపు లోకమంతయు వేదాంతమును, తత్త్వజ్ఞానమును అంగీకరించగల" దని నేను భవిష్యద్వాణి చెప్పుచున్నాను. వ్రాసికొనండి.

సాయంకాలం సభ అయినపిదప కొందఱు ముసల్మానుసోదరులు వినోబాజీని కలిసికొనుటకు వచ్చిరి. వారు ఖురాను షెరీఫ్‌లోని కొంత భాగమును వినిపించిరి. అక్కడక్కడ వారికి జ్ఞాపకము రాకపోగా వినోబాజీ అందించుచుండిరి. పైగా సరళభాషలో అర్థమును వివరించి చెప్పిరి. ఇదిచూచి ముసల్మాను సోదరులు ఆశ్చర్యమునుపొంది ఆనంద భరితులయిరి. వినోబాజీ గద్గద కంఠముతో ఇట్లనిరి: "ఈ చిన్నగ్రామములోకూడ ఖురానును కంఠస్థము చేయువా రున్నా రనగా ఇదిచాల గొప్ప మాటయని నా అభిప్రాయము. శ్రద్ధ అనగా అట్లుండవలెను. దాని మూలమున మనము తరింపగలము."

## ఋషిసత్తా

డింగ్ (కాన్పూరు)
17—5—1952.

"మీరు కాలినడకను ఏల తిరుగుచున్నారు ?" అనుప్రశ్న తరుచు నగరములలో అడుగుచుందురు. దానికి వినోబాజీ చెప్పిన సమాధానము మిగుల రసవంతమయినది. "ఒక వేళ నేను వాయు విమానములో తిరిగితినా, నా పనికూడ గాలిలోనే కలసిపోవును. కాని నేను భూమి పైన పాదములతో నడచుచున్నాను గనుకనే నాపని భూమిలో లోతుగా పాతుకొని పోవుచున్నది. నేను వాయువిమానంలో తిరిగితినా నాకు కేవలము సన్మాన పత్రములు దొరకెడివి. కాని భూమి దాన పత్రములు కావు. సత్యా సంశోధన జరుపవలెను. ఏ పనివల్ల అహింస

ఏర్పడునో, ఆ విషయమై చింతన చేయవలెను. అందుకుగాను ఆరు బయట, ముక్తాకాశములో తిరుగుచుండవలెను. "ఎవడు నడచుచుండునో, వాడు కృత యుగములో నున్నవాడని" వేదములు చెప్పుచున్నవి. "కృతం సంపద్యతే చరన్"

"నేను కాలినడకను తిరుగుచున్నాను గనుక నే జనులు నాయందు విశ్వాస ముంచి మాట్లాడుచున్నారు. నా విషయమై వారికి ఆత్మీయత ఏర్పడుచున్నది." బాబాను అడుగుచున్న వివిధములగు ప్రశ్నలే ఈ ఆత్మీయతకు ప్రత్యక్ష ప్రమాణములు. చిన్నపిల్లవాడు నమ్మకముగా తనతల్లి దగ్గఱకుపోయి ఏవో లోకవృత్తము లన్నియు ఎట్లు అడుగుచుండునో అట్లే జనులు ఎంతో నమ్మకముతో వినోబాజీ సన్నిధికిపోయి తమ హృదయములోని మాటల నడుగుచుందురు. "మీరు సన్నగా ఉన్నా రేమి?" ఈ ప్రశ్న ఎంత విచిత్ర మయినదో, దాని సమాధానము కూడ అంతేవిచిత్ర మయినది. బాబా ఇట్లు జవాబు చెప్పుదురు: "యోగి తన శరీరములోని పంచమహాభూతములలో పృథి వ్యంశమును తగ్గించుకొనవలెను. తపస్స్వ్యులు ఎల్లప్పుడు సన్నగానే యుందురు. నా శరీరములోని మట్టిని తగ్గించు కొనకుండా నాకు మట్టి (భూదానము) ఎట్లు లభింపగలదు?"

లోకవృత్తములలో ఏ విషయమైనను అడుగండి. వినోబాజీ వెంటనే జవాబు చెప్పుచుందురు. ఇది చూచినపిదప నా మనస్సులో ఒక కొంటెకోరిక పుట్టినది. 'వినోబాజీ జవాబు చెప్పలేని ప్రశ్న నొకదానిని ఏ మహానుభావు డయినను అడిగిన బాగుండునుగదా!' అని.

చిన్నగ్రామ మయినందువల్ల నేటి సాయంకాల సభలో కేవలము గ్రామీణులు మాత్రమే హాజరయిరి. కాని వినోబాజీ బోధించిన నూతన విషయములను గ్రహించుశక్తి నగరవాసులకంటె గ్రామీణుల యందే అధికముగా గలదని తెలియుటవల్లనే కాబోలు వారి కొక నూతన విషయమును బోధించిరి.

"ఒక కాలములో పూర్ణాధికారముగల రాజులు ఋషుల సలహా పైన రాజ్యము చేయుచుండిరి. దీని తాత్పర్యమేమనగా ఆ రోజులలో ఋషుల పలుకుబడి చెల్లుచుండెను. ఋషులు ఎల్లప్పుడు సంపదనుండి, అధికారము నుండి నిర్లిప్తులుగా నుండిరి. వారు అడవులలో నివసించుచు ధ్యానము, చింతనము, అధ్యయనము, అధ్యాపనము చేయుచుండిరి. వారు అపరిగ్రహులును, ఇంద్రియ నిగ్రహులును. వారు సంఘ క్షేమమునకు వలయు సంగతులు ఆలోచించుచు, సంఘము నిలిచిఉండుటకు గల మూలతత్త్వములను గురించి చింతన చేయుచు, రాజులకు తగిన సలహానిచ్చుచుండిరి.

"రాజుల అధికారము కంటె ప్రజల అధికారమే మంచిదని నే నంగీకరింతును. ఐనను నేటిప్రజాతంత్రములో బహుసంఖ్యాకులు, అల్ప సంఖ్యాకులు అను భేదము పుట్టుటవల్ల దేశకల్యాణము కలుగజాలదు. ఈ అధికారము వికేంద్రీకృత మైనప్పుడే నిజమైన ప్రజాధికార మేర్పడును. ప్రస్తుతము సంఘములో అపరిగ్రహులు, నిష్కాములు, నిష్పక్షులు అయిన సేవకవర్గ మొకటి బయలుదేరుట మిక్కిలి అవసరమై యున్నది. ఈ సేవకులు అటు ప్రభుత్వముకంటెను ఇటు జనులకంటెను భిన్నులుగా నుందురు. వీరు చింతనచేయుదురు. ఉభయుల దోషములను తెలియజెప్పి మార్గమును చూపుచుందురు. వీరు కేవలము సత్యమునే పలుకుచుందురు. అందరి యెడల వీరి మనస్సులో సమాన భావనయే ఉండును. వీరు అందరను మానవులను దృష్టితో చూచుచుందురు. మహాభారతములో ఒక కథ ఉన్నది. కృష్ణభగవానుడు 'నేను స్వయముగా యుద్ధముచేయను, అర్జునా ఇందు కంగీకరించితివా' అని అడిగి అతని అంగీకారముపైన తాను రథసారథి యయ్యెను. అట్లయినను అత డొకసారి చేతితో చక్రముపట్టుట తప్పలేదు. కాని వ్యాసమహాముని అన్ని విషయములలోను అలిప్తుడుగానే యుండెను. అర్జునుడును, అశ్వత్థామయు బ్రహ్మాస్త్రములు విడిచిపెట్టినవారుకాగా

లోకసంహారము కాసాగెను. అప్పుడు వ్యాసమహాముని ఉభయుల మధ్యను నిలిచి అస్త్రమును ఉపసంహరింపవలసినదని అర్జునునకు బోధించెను. ఈ విధముగా అతడు లోకసంహారము జరుగకుండ కాపాడెను. అట్లే వ్యాసమహర్షి వంటి నిర్లిప్తులు, నిష్పక్షులు నయిన సేవకులు నేడు మిక్కిలి అవసరము. సర్వోదయ సమాజము ద్వారా అటువంటి సేవకులు రాగలరని నా ఆశ.''

ఉపన్యాసము వినుచున్నప్పుడు వినోబాజీ రచితమగు ''స్థితప్రజ్ఞ దర్శనము'' లోని వాక్యమొకటి జ్ఞాపకము వచ్చినది. ''స్థితప్రజ్ఞుని నాయకత్వము నంగీకరించిన సమాజమే అభ్యుదయ పరంపరలను, అధికౌన్నత్యమును పొందగలదు'' అని.

భారతీయ లోకప్పుడు స్థితప్రజ్ఞావస్థను పొందిన నాయకుని నాయకత్వ మంగీకరించుట జరిగినది. దానివల్ల ఆతని నిర్ణయ కుశలత మేధా విశేషము లోకమునకు వెల్లడియయినవి.

## భూమి పంపిణీకి మొదటి సమావేశము

పుఖరాయాఁ (కాన్పూరు)

18—5—1952

ఈనాడు దారిలో విద్యాబహాను ముక్తకంఠంతో భజనపాటలు పాడుచుండెను. గాలి తీవ్రముగా వీచుచుండెను. అప్పుడామె కంఠధ్వని గాలితో పోటీ చేయుచున్నట్లుండెను. కొందఱు సాధకులు తమ పాటల ద్వారా ఈశ్వర సన్నిధానమును చేరుకొన గోరుచుందురు. విద్యాబహాను అటువంటివారిలో ఒకతె.

గాలి వేగము కొంత తగ్గినది. పుఖరాయా గ్రామస్థులయెదుట వినోబాజీ ఉపన్యాస వేగము పెరిగినది. ''లోకములో రెండు దానములే శాశ్వతములని చెప్పదగినవి. ఒకటి విద్యా దానము, రెండవది

భూమి దానము. ఈ రోజులలో విద్యా దానము ఎవరు చేయగలరు? ఎవరో ఒకరిద్దఱు జ్ఞానులు మాత్రమే విద్యాదానము చేయగలరు. కనుక మీరందఱు భూదానము చేయండి."

అటుపిమ్మట వారు "గీతాప్రవచనము" ను సిఫారసు చేసిరి. ఇంతలో ఒక సోదరుడు లేచి ఇట్లనెను:"తమ గీతాప్రవచనము ప్రవేశించినచోట ఉద్బోధకలుగకుండ మానుటలేదు. దానికి ప్రజాహృదయంలో తులసీ రామాయణమున కున్నటువంటి స్థానము లభించినది. దానిని చదువగానే పండితులకును, పామరులకును మార్గముదొరుకుచున్నది." అది విని వినోబాజీ ఇట్లనిరి: "అవునండీ, ఆ గ్రంథము లభించిన చోట మా పని తొందరగా అగుచున్నది. కొందఱు కత్తివల్ల భూమిని సంపాదింతురు. మఱికొందరు శాసనమువల్ల సంపాదింతురు. కాని నేనో పుస్తకమువల్ల భూమిని సంపాదించుచున్నాను. నేను మీకు విద్యాదానమిచ్చి మీనుండి మన్నువంటి తుచ్ఛవస్తువును తీసుకొనుచున్నాను. ఇది మీకు లాభసాటి బేరమేకదా!"

కాన్పూరు జిల్లాలో ఇది ఆఖరు మజిలీ. కాన్పూరు వాసులు అనేక విషయములలో అగ్రగణ్యులయి యున్నారు. వినోబా ద్వారా భూమి పంపిణీ ప్రథమ సమావేశము కూడ హిందుస్థానములో మొట్టమొదట కాన్పూరులో జరుగవలెనని వారు కోరుచున్నారు. ఈనాడు వారి కోరిక నెరవేరినది.

పుఖరాయా గ్రామములోను, సునరాపుర్ గ్రామములోను దానమువల్ల వచ్చిన భూమిని వినోబాజీ స్వయముగా తమ కన్నులతో చూచియున్నారు. భూమి మంచిది. పంటకూడ బాగా అగుచుండెను. సునరాపురులో దానమువల్ల వచ్చిన భూమి ఖండములలో మధ్య ఒక చెక్క దానము ఇవ్వబడకుండ ఉండిపోయెను. వినోబాజీ ఆ యజమానుని పిలిపించి 'మీరా ఒక్కముక్క ఏమి చేసికొందు' రనగా అతడా ఖండమునకు వెంటనే దానపత్రము వ్రాసి ఇచ్చివేసెను. అంతట మా

యాత్రీదళములోని సోదరులు ఇంటికి పోయి పళ్లెరములుతెచ్చి గ్రామ మంతయు తిరిగి ఇట్లు చాటింపు వేసిరి: "ఈ రోజు పది గంటలకు వినో బాజీ చేతులతో పంపిణీ జరుగగలదు. కాబట్టి సోదరీ సోదరులందఱు హాజరు కావలసిం దోహో్‌య్" అని.

ఇది విని జను లాశ్చర్యముతో చూడ సాగిరి. "షరతులేమీ లేకుండ భూమిహీనులకు భూమి ఈ ప్రకారముగా పంచబడుతున్నదే, ఏమి చిత్రమిది" యని నమ్మజాలకుండిరి. రెండు గ్రామములలోను భూమిహీను లెందఱున్నారో లెక్కలు తేల్చిరి. సునరాపురులో నలుగురును, పుఖరాయాలో ఎనమండుగురును మొత్తము పన్నెండుమంది తేలిరి. వారు ఇతరుల పొలములలో పనిపాటులు చేసికొనుచు జీవనము చేయుచున్నారు.

సరియయిన సమయమునకు సభ ప్రారంభ మయ్యెను. సభలో దాన మిచ్చినవారు, పుచ్చుకొనేవారు, గ్రామములోని ఇతరమిత్రులు అందరును వచ్చియుండిరి. వినోబాజీ చెప్పినట్లు అది యొక "మంగళ ప్రసంగము." వ్యాసపీఠమును ఆ సమావేశమునకు తగినట్లుగానే అలంకరించిరి. రెండువైపుల మామి డాకులతో అలంకరింపబడిన మంగళ కలశములను, దీపములను ఉంచిరి. ఎదురుగా స్వస్తిక చిహ్నమును, ఓంకార ఆకృతియు అమర్చబడినవి. భూమి ఎవరికి ఈయదగినది అన్న విషయము ముందుగా తేల్చబడినది. ఎవరికి పొలములేదో, కాని వ్యవసాయము చేయవలెనను కోరిక ఉండునో, వ్యవసాయము చేయుట కూడ తెలియునో, మఱి యితర వృత్తిచేయుట చేతకాదో, అటువంటివారు మునుముందుగా దానము పొందదగినవారు అని నిర్ణయము చేయబడ్డది. ఈ సభలో అటువంటి దానయోగ్యులు పంద్రెండుగురు తేలిరి. ఒక్కొక్క కుటుంబమునకు ఐదేసి ఎకరముల చొప్పున ఆఱు కుటుంబములకు మాత్రమే ఇచ్చుటకు తగినంత భూమి లభించి యుండెను. ఇట్టి స్థితిలో భూమి యెవరికి ఇవ్వవలె ? వినోబాజీ పంపిణీ

విషయమును ఒక చక్కని పద్ధతిని కనిపెట్టినారు. దానిలో పక్షపాత మునకు చోటేలేదు. భూమి హీనులయిన సోదరులు తమలో తామే సంప్రదించుకొని, అందరికంటె దరిద్రుడెవడో నిర్ణయించి చెప్పవలెను. స్వయముగా వినోబాజీయు, సభకు వచ్చిన పెద్దమనుష్యులును కేవలం సాక్షీభూతులుగా మాత్రమే కూర్చుండియుండిరి. పంపిణీచేయబడు భూమిలో ఒక మూడవ వంతు హరిజనులకిచ్చుటకు నిశ్చయింపబడినది.

'ఏ షరతులేకుండ ఇప్పుడు పొలము దొరకగలదు. ఆ పొలము నా స్వంతమయిపోవును' అన్న ఆలోచనలతో భూమిహీన సోదరులు ఎట్టి నిర్ణయము చేసికొనలేనివారయి మౌనముద్ర వహించి కూర్చుండిరి. అంతట వినోబాజీ తమ ఎత్తుపీఠమునుండి క్రిందకు దిగివచ్చి ఆసోదరుల వద్దకుపోయి, ప్రతివారి వెన్నుపైన చేతితో నిమిరి వారితో మాట్లాడసాగిరి. వెంటనే వారిలో ఒక హరిజన సోదరుడు గద్గద స్వరముతో ఇట్లనెను: "బాబా! నా కొడుకులు పెద్దవాళ్లు. మేము ఎట్లో కూలిచేసికొని బ్రతుకగలము. కాని ఆ సోదరుడు (చేతితో చూపుచు) నాకంటె కూడ బీదవాడు. వాని పిల్లలు చిన్నవాళ్ళు. వానికి పొలము ఇవ్వండి. నాకు అక్కరలేదు."

ఈ మాటలు వినగానే కన్నులు చెమ్మగిల్లనివారు ఆ సభలో ఒక్కరుకూడ లేరు. ఈనాడు లోకములో నాలుగువంకల సంపత్తిని ఆర్జించుటకు భయంకరమైన పోటీ ఒకటి జరుగుచుండగా, ప్రతి ఒక్కరు 'చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష' అనుకొనుచు స్వార్థపరులై యుండగా, ఇక్కడ భారతదేశములో ఒక హరిజనమిత్రుడు, పైగా కూలివాడు నిలబడి, 'అయ్యా! నాకు భూమి అక్కరలేదు. ముందుగా అతని కివ్వండి' అని చెప్పుచున్నాడు... ఏమి పొరపాటున భూమిపైన సత్యయుగము ప్రవేశించినదా?... లేదు. ఇంతవరకును వచ్చియుండ లేదు. కాని నవ్యలోకమును నిర్మించునట్టి ఒకడు, 'ముందుగా అతని కివ్వండి. అతడు నాకంటె బీదవాడు' అనుచున్నాడు. ఈ విధముగా

చెప్పుచున్నట్టి వాని శరీరముపయిన చినిగిపోయిన పీలికలు మాత్రమే ఉండెను. అవి, యుగములనాటి, వాని దరిద్రమును వెల్లడిచేయుండెను. కాని వాని హృదయములో అపారమయిన మానవత్వము, కరుణ, ఔదార్యము నిలిచియుండెను. రాక్షస సంహారము చేయుటకయి తన యెముకలను ధారపోసిన దధీచి సంతానములోని వాడతడు. అసంఖ్యాకులయిన సత్పురుషుల తపస్సులోని పుణ్యాకణములు ఏ గడ్డ మీద పడియుండెనో అటువంటి భారతభూమిలో అతడు జన్మించి యుండెను. కనుకనే అతడు ఆకలివలన తన శరీరము కృశించిపోయిన దన్న సంగతి కూడ మఱచినవాడయి ఆకలిబాధచే చావుకు సిద్ధముగా నున్న అతని సోదరుని పసిబిడ్డలు జ్ఞాపకమునకు వచ్చిరి... అంతట అతడు సగర్వముగా తల పైకెత్తి 'వానికి ముందుగా ఇవ్వండి' అని చెప్పగలిగినాడు.

వినోబాజీ సభలోనున్న భూస్వాములతో ఇట్లనిరి : 'ఇటువంటి మంగళ తరుణమున మీరు పెదవిపైన పెదవి వేసికొని కూర్చుండ దగుదురా ? మీలో ఎవరును దానమిచ్చుటకు ముందునకు రారా ? అనగా వెంటనే ఒక సోదరుడు లేచి 'బాబా ! తీసికొనండి. నావి ఐదు ఎకరాలు!' అనగా వినోబాజీ, 'సెబాస్ ! మఱియొక కుటుంబమునకు భూమి దొరికినది. కాని మిగిలిన ఐదుగురు వ్యక్తులను వట్టి చేతులతో ఇంటికి పంపివేయుదమా ?' అనిరి. ఈ మాటలు వినగానే ఇద్దఱు సోదరులు లేచి ఐదేసి యకరముల చొప్పున ఇచ్చెదమని ప్రకటించిరి. అంతట వినోబాజీ ఇట్లనిరి: ఇంక ముగ్గురు సోదరులకు భూమి కావలెను. ఇది ఆనందదాయకమయిన, ప్రేమపూరితమయిన ఘట్టము. ఇటువంటి సదవకాశము మరల మరల రాదు. జీవితములో తీసికొను అవకాశములు చాల వచ్చుచుండును. కాని ఇచ్చు అవకాశములు ఎన్నో రావు.' పంపిణీకి సాయముచేయుటకయి సర్కారు కాగితములు తీసికొని ఒక బీదకరణము అక్కడకు వచ్చియుండెను. అతడీ దృశ్యమును చూచి

కరగి నీరయ్యెను. 'అయ్యో! నావి రెండున్నర బీగాల భూమి' (బీగాకు సుమారు 63 సెంట్లు) తీసికొనండి' అనెను. పాకిస్తానునుండి ఒక పంజాబు శరణార్థి సోదరుడు అక్కడకు వచ్చియుండెను. ఆతని ఆస్తి, ఇల్లు, వాకిలి సమస్తము పాకిస్తానులో మంగళమైపోగా, ఇక్కడకు వచ్చి పాటుపడి మరల ఇల్లు, వాకిలి ఏర్పఱచుకొనెను. అతడు ముందుగా అయిదు ఎకరముల భూమిని దానమిచ్చియుండెను. అయినను అతని హృదయములోని కరుణరసము ఇంకను పొరలి వచ్చుచుండుటచే "బాబాజీ! నాకుగల పన్నెండు బీగాల భూమిని పొంతము ఇచ్చివేయుచున్నాను," అనగా, మఱియొకడు 'ఎంత పొలము తక్కువగునో, దాని నంతా నే నిచ్చెద' ననెను.'

దాన మడుగుపని పూర్తిఅయ్యెను. రెండు గ్రామాలలోని భూమి హీను లందఱకు పొలము లభించెను. "ఎవరిని ఎంచుకొనవలెను" అను ప్రశ్నయే పుట్టలేదు. ముందుగా వాని కివ్వండి. నా కక్కఱలేదు అని చెప్పిన హరిజన సోదరునికికూడ పొలము దొరికినది. అతని త్యాగము వల్లనే అందఱకును దాన మివ్వవలె నను బుద్ధిపుట్టినది. అతడు సర్వస్వ మును త్యజించెను గనుకనే అతనికి సర్వస్వము లభించెను.

మహాదేవితాయీ భూమిహీను లందఱకు చందన తిలకము ఉంచెను. వారికి దానము లభింపలేదు. వారిహక్కు వారికి మరల వచ్చెను. వారు భూమి పుత్రులు. కాని నేటివరకు భూమాతచే లాలింప బడు అదృష్టము వారికి పట్టలేదు. వారు పొలముపాటు చేయుచున్న మాట నిజమే. కాని ఇతరుల పొలములో కూలినాలి చేసుకొనుచు మాత్రమేగదా! ఈనాడు భూమిపుత్రులు భూమాతచే లాలింపబడు అదృష్టమును పొందియున్నారు.

వినోబాజీ మాట్లాడసాగిరి. కాని కంఠావరోధ మయ్యెను. మాట రాలేదు. వెంటనే కన్నీళ్లు ప్రవహింప సాగినవి. మార్గ మేర్పడి నది. "భారతీయ హృదయము ఎట్లు పనిచేయుచున్నదో చూచు

చున్నారుగదా! ఇట్లు జరుగుచున్నను, 'ఈ విధముగా దాన మడిగినచో మీకు భూమి దొరకగలదా' అని ప్రజలు ఎందుకు నన్నడుగుచుందురో తెలియదు. గంగా యమునలు ప్రవహించిన ఈ పావన భూమియందు ఏమిజరుగ గలదో దాని దివ్యదర్శనము ఈ నాడు అగుచున్నది. మనము మన నేత్రములతో దానిని చూచుచున్నాము."

బాబా రాఘవదాసు మాట్లాడసాగిరి. వారి కన్నులవెంట అశ్రుధారలు గంగాప్రవాహమువలె పాఱుచుండెను. "మానవ హృదయములో నివాసము చేయునట్టి పరమేశ్వరుని దివ్యదర్శనము ఈనాడయినది. "ముందుగా వాని కివ్వండి" అని చెప్పిన హరిజన సోదరుని రూపములో భారతీయహృదయము సాక్షాత్కారమయ్యెను." వారు గద్గద స్వరముతో నానకు భజన కీర్తనను పాడిరి.

'సబ్ మహి రమ రహియా ప్రభు ఏక్
పేఖి పేఖి నానక వీగ సాయీ'

వినోబాజీ కన్నీళ్లను తుడుచుకొనుచు, గద్గద కంఠముతో మరల ఇట్లనిరి: "ఈ రోజున ఎవరికి భూమి లభించినదో, వారు అదృష్టవంతులే. కాని భూమి నిచ్చినవారు ఇంకను అదృష్టవంతులు. నేటి వఱకు ఆ ఉభయులకు సంబంధము లేకుండెను. కాని నేటినుండి వారు ప్రేమ సూత్రముచే బంధింపబడి యున్నారు. భూమి ఎవరికి దొరికినదో, వారు ప్రామాణికబుద్ధితో భూమాతను సేవింపవలెను. తమ దుర్గుణములను విడిచిపెట్టి, ఈశ్వరునికి భక్తులు కావలెను. భూమిని పంచినందుకుగాను ఇంతకంటె శ్రేష్ఠమార్గము వేఱొకటి ఉండబోదు.

గీతను నిత్యము చదువండి. ఆమె మాతృదేవి. ఆమె నిరంతరము నన్ను రక్షించుచున్నది. ఆమె ప్రేరణ వల్లనే ఈ యజ్ఞము ప్రారంభమైనది. 'కర్మచేయుము. ఫలమును గుఱించి చింతింపవద్దు' అని ఆమె నేర్పినది. నేను ఫలచింతయే చేసియున్న యెడల, ఎన్నడో

నా లెక్కలు విఱిగియుండెడివి. ఈనాడు నేను చేయుచున్న గగన విహారము ఏనాడో ఆగిపోయెడిది."

భూమి పంపిణీకి ఇదే మొదటి సమావేశము. కేవలము 60 యకరముల భూమి మాత్రమే పంచిపెట్టబడెను. అయినను భూమి ఇచ్చువారు, తీసికొనువారు, చూచువారు అందఱి హృదయముల లోను క్రాంతి ప్రవేశించినది. ఇక లక్షలు, కోట్ల యకరముల పంపిణీ జరుగునప్పుడో గణితశాస్త్రము లెక్కలు అందవు. పరమేశ్వరుని పను లన్నియు అసంఖ్యాకములుగానే యుండును.

సభ సమాప్తి చెందినది. ఈనాడు ఒకదాత ఇట్లనెను: 'మేము స్వయముగా దాతలమని ఎందు కనిపించుకొనవలెను. దానివలన అహంకారము కలుగును. ఇటువంటి మహాత్మునకు భూదాన మిచ్చుట వలన మేము స్వయముగా పవిత్రుల మగుచున్నాము. నేటివరకు నేను వకీలువృత్తి చేయుచుంటిని. కాని నేటినుండి ఆ వృత్తిని మానుకొని భూదాన కార్యమునకై నా జీవితమును అర్పించుకొనుచున్నాను.'

రెండవదాత ఇట్లనెను : ఈనాడు నాకు గలిగిన బ్రహ్మానందము నా జీవితములో ఎన్నడును గలుగలేదు.

మూడవదాత : రాముడు, కృష్ణుడు పుట్టిన కాలములోని వారి కంటెకూడ మేము అధిక ధన్యాత్ములము. కారణ మేమనగా మేము గాంధీజీ పిలుపువిని తదనుసారము పనిచేయగలిగితిమి. ఇప్పుడు మాకు వినోబాజీ పిలుపు విని భూదానములు చేయునట్టి మహదవకాశము ప్రాప్తించినది.

దానము ఇచ్చిన వారిని, పుచ్చుకున్న వారిని ప్రోగుచేసి మధ్య వినోబాజీని కూర్చుండబెట్టి ఫోటో తీయించిరి. అందఱి ముఖసీమల యందును ఆనందరేఖలు చిఱుగంతులు పెట్టుచుండెను.

సాయంకాల ప్రార్థన సభయందు భూమి దాన మిచ్చిన వారికి తత్సంబంధమయిన కాగితములు ఇవ్వబడెను. అంతట శివనారాయణజీ

టుండను హృదయమును కదిలించునట్టి ఉపన్యాస మిచ్చెను. "నే నింత వరకు సంపాదించిన దానిని త్యాగము చేయవలెనని, పరమేశ్వరున కర్పణ చేయవలెనని ప్రతి భారతీయుడు ముఖ్యముగా కోరుకొను చుండును. ఎవరికి సర్వత్ర ఆత్మ ఒక్కటియే కనబడుచుండునో, అటు వంటి బ్రహ్మర్షులలో వినోబాజీ ఒక్కరు. అటువంటి ద్రష్ట, స్థితప్రజ్ఞుడు అయిన నాయకుడు మనకు లభించియున్నాడు. అందుకు పరమేశ్వరు నకు కృతజ్ఞులము."

వినోబా ఇట్లనిరి: "ఇది మాట్లాడుటకు తగిన తరుణము కాదు. బిడ్డకు పాలిచ్చుకొన్నందువల్ల, తల్లికి సంతోషము గలుగును. అట్లే నేడు భూదాతలకు సంతోషము గలుగుచున్నది... నేను రేపు కాన్పూరు జిల్లాను విడిచిపోవుచున్నాను. కాని ఈ పోవుటయందు నేను వియోగ భారము ననుభవించుటలేదు. సంయోగ సుఖమునే అనుభవించు చున్నాను."



అయిదవ భాగము

# సమయము ఉండగనే మేలుకొనండి

కాలపి (జాలౌన్)

19—5—52.

యమునానది ఒక ఒడ్డున కాన్పూరుజిల్లా సమాప్తి. రెండవ ఒడ్డున జాలౌను జిల్లా ప్రారంభము. కాన్పూరువాసులు ఎంతో ఆతురతతో మమ్ము సాగనంపిరి. వారితో గడపిన ఈ ఆఱు దినములు మఱపునకురాకుండెను. కాన్పూరువాస్తవ్యులు శ్రీ రామనాథజీ టండను, వారి భార్య మాకు తల్లియు, తండ్రియు అయిపోయిరి.

కాలపి సమీపములో వ్యాసమహర్షి నివాసస్థాన మున్నది. 1857 లో 'కాలపి' విశేషముగా ప్రఖ్యాతి చెందినది. ఝాన్సీరాణీ స్మృతిచిహ్నములు ఇక్కడ ఎన్నో కనబడుచున్నవి. ఝాన్సీరాణి, తాంత్యా టోపి, నానాసాహెబు పీష్వా ఈ ముగ్గురును ఇక్కడనే కలిసికొనిరి. ఇక్కడనుండి బుందేలు ఖండము ప్రారంభము. 1857 లో బుందేలుఖండమంతట విప్లవజ్వాలలుభగభగ మండుచుండెను. ఇక్కడకు రాగానే స్వ॥ సుభద్రాకుమారి చౌహాను పాట జ్ఞాపకమువచ్చినది.

"బుందేలే హరబోలోంకే ముఖ హమ్‌నే సునీ కహానీ థీ
ఖూబ్ లడీ మర్దానీ వహ్ తో ఝూన్సీవాలీ రాణీ థీ"

ఈ రోజున యమునలో బాగా ఈదితిని. ఈదుటను వ్యాయామమని ఎందుకందురో నా కర్థము కాలేదు. 14, 15 మైళ్లు నడచివచ్చిన మీదట నదిలోని చల్లని నీటిలో ఈత కొట్టుచున్నప్పుడు శ్రమ పరిహారమైనట్లుతోచినది. ఇంతవఱకు ఈ యాత్రలో గంగ, యమున, గోమతి, తమసానదులతో మిత్రత్వము గలిగినది.

బుందేలు ఖండములోని ఎట్టనియెండ మమ్ము తపింపచేయు చుండెను. హిందూస్థాన మందంతటిలోను ఇక్కడనే ఎక్కువ వేడిగా నుండును. ఈ ప్రదేశములో మాయాత్ర సరిగా మే, జూను, నెలలలో సాగుచుండెను. శీతాకాలములో నైనీతాల్, అల్మోరాలలోను, హిమాలయము లోయలలోను మా యాత్ర సాగియుండెను. వినోబాజీ పను లన్నియు తలక్రిందులుగానే యుండును.

వినోబాజీ ఈనాడు తమ ఉపన్యాసములో మమ్ము కఠినముగ మందలించిరి. "స్వాతంత్ర్య ఉద్యమములో వేలకొలది కార్యకర్తలు తమ జీవితములను ఆహుతి చేసికొనియుండిరి. కాని నేడు అందఱును శవసమాను లయిపోయిరి. స్వరాజ్య మొచ్చిన పిదప, మన మందరము పురుషార్థహీనులము అయిపోయినాము. ఈ పద్ధతియే నడచినయెడల మన స్వరాజ్యము ఎట్లు నిలువగలదు ? ఏమి, మీరు దేశములోని అంతు లేని దారిద్ర్యమును చూచుచుండుటలేదా ? సర్వనాశన మగుచుండగా మేలుకొనరా ! సోదరులారా ! సమయము ఉండగనే మేలుకొనండి. పనిలోనికి దుముకండి. లేకపోతే తల గోకికొనవలసి వచ్చును."

స్వరాజ్యము వచ్చినపిదప మనదేశము నిస్తేజ మయినట్లు తోచినది కనుక దానిని ప్రబోధించుటకు ఇంతకటువుగా చెప్పవలసి వచ్చినది. రాత్రి నిద్రించు సమయమున ఒక్కటే వాక్యము జ్ఞాపకము వచ్చుచుండెను. "సమయము ఉండగా మేలుకొనండి" అని.

# సామ్యవాదము కాదు - సామ్య యోగము.

*ఆటా, ఉరయీ, ఢకౌర్ (జాలౌన్)*

**20, 21, 22 మే, 1952.**

ప్రస్తుతము బుందేలు ఖండములో మిట్టపల్లములుగల భూమి పయిన మా యాత్ర సాగుచుండెను. ఈ ప్రదేశము అడవులతోను,

కొండలతోను నిండియున్నది. ఇక్కడ నీటియిబ్బంది యెక్కువ. వేసవి కాలములో నూతులనుండి నీళ్లుతోడుట యమయాతనయే. కనుక ఎండలు మిక్కుటముగా ఉన్నప్పటికిని తక్కువనీళ్ళతో కాలము వెళ్ళదీయవలసి వచ్చెను.

దారిలో అడ్డుపడిన నదులవల్ల మే మెక్కువ లాభము పొంద గలిగితిమి.

దారిలో చర్చలు ప్రారంభమయ్యెను. 'లోకమంతయు వేదాంత ధర్మము నంగీకరింపగలదు.' అన్న విషయమును గుఱించి స్పష్టీకరించుచు బాబా ఇట్లనిరి: 'ఇప్పుడు నాస్తికత్వమునకును వేదాంతమునకును సంఘర్షణ రానున్నది. నాస్తికతలోని తత్త్వజ్ఞానము శరీరమునకు ప్రాధాన్యమిచ్చును. అందువలన మనస్సు సుఖోపభోగముల వంకకు పరుగులిడుచుండును. 'నాకు సుఖము కావలెను' అన్న ఆలోచనతో ఇతరులదుఃఖము విషయమయి ఉదాసీనత, ఈర్ష్య, కలహాము మొదలయినవి పుట్టుచున్నవి. వేదాంతము దీనిని వ్యతిరేకించును. మనము దేహము కాదు, 'ఆత్మ' అని వేదాంతము చెప్పును. ఆత్మ యొక్క సర్వవ్యాపకత్వము, అద్వైత బోధచేయు వేదాంతము, ఇవే మానవుని నేటి కలహప్రయత్నములనుండి రక్షింపగలవు.'

ఉరయీ గ్రామములో జరిగిన సభలో సామ్యవాదమును గుఱించి ప్రశ్నలడుగబడెను. అందుకు వినోబాజీ ఇట్లు జవాబు చెప్పిరి: 'నాకు సామ్యవాదము అక్కఱలేదు. గీతలో బోధించిన సామ్యయోగమును వ్యాపింపగోరుచున్నాను. సామ్యయోగము యొక్క సారాంశమేమనగా ప్రాణులన్నిటియందును ఒక్కటే ఆత్మ వాసము చేయుచున్నది. నాలోకూడ ఆ యాత్మయే ఉన్నది. ఈ సంగతియే బోధింపవలెను.'

డకౌరు గ్రామము వెలుపల ప్రపంచమునుండి చాలదూరములోనున్నది. ఇక్కడకు రైలుగాని, మోటారుగాని లేదు. దినమం

తయు, కోకిల కూతలు, నెమిలికేకలు వినబడుచుండును. నేటిరాత్రి మేము భోజనముచేసిన ఇంటి యజమానినుండి మాకు ఐదువందల యకరముల భూమి దానము లభించెను. తఱుచుగా మాకు భోజనముతోపాటు, దక్షిణ కూడ దొరకుచుండును. ఒకసారి ఒక హోటలు యజమానుడు ఒక నూతిని దానముచేసెను. మఱియొక మిల్లు యజమానుడు పది బోరింగు నూతులను దానమిచ్చి మాకు భోజనము కూడ పెట్టెను.

# భూమి అంతయు గోపాలునిదే

ఇఖైలియా (హమీర్పూర్)

23—5—52.

మా సామాను తీసికొనిపోవు ఎడ్లబండి తోలువాడు ఇట్లనెను: "నాకున్న పొలములో సర్వశ్రేష్ఠమయిన భూమి రెండు యకరములు దాన మిచ్చివేసితిని. ఇల్లు వాకిలి విడిచిపెట్టి, వినోబాజీతో ఉండవలె ననియు, దేశసేవ చేయవలెననియు బుద్ధి పుట్టుచున్నది. గ్రామమంతటిని ఒక్క కుటుంబముగా చేయవలెనని నిన్న వినోబాజీ చెప్పిన మాట నాకు చాల నచ్చినది." ఈ మాటలు చెప్పినదెవరో యెఱుగుదురా? ఒక చదువురాని బీదరైతు.

మంగరూటు గ్రామము ఇక్కడకు సమీపములోనుండెను. కాని వినోబాజీని మంగరూటు తీసికొనిపోవలెనన్న, బుందేలు ఖండములోని మిట్టపల్లములు గల భూమిపైన మే మాసపు ఎఱ్ఱని యెండలో రెండు మైళ్లు నడిపించి తీసికొని పోవలెను. అందువలన మంగరూటు నివాసులందఱు వినోబాజీ దర్శనము నిమిత్తము బేతవా నది ఒడ్డున సమావేశమయిరి. గ్రామములోని పసిపిల్లవాడు మొదలు వృద్ధుడు వఱకు అందఱు హాజరయిరి. కాంతలు మంగళ కలశములను తలపైనిడుకొని

నిలబడి యుండిరి. వినోబాజీ అక్కడ అయిదునిమిషము లాగి, గ్రామ స్థులకు "భూమి అంతయు గోపాలునిదే" అను మంత్రము నుపదేశిం చిరి. మంగరూటు వాసులు కాయ కష్టపడి ఒక కాలిబాటను ఏర్పఱ చిరి. దానికి రెండువైపుల దిశలను సూచించు గుర్తులు, చూపుడు బల్లలు కట్టిరి. ఆ దారి మీదుగా వినోబాజీ ఇస్లైలియా గ్రామము వంకకు పోయిరి.

మంగరూటుగ్రామమునకు జమీందారు దివాన్ శత్రుఘ్నసింహ్. అతడీప్రాంతములో ప్రముఖ కార్యకర్త. ఆతని భార్య రాణీసాహెబా నిరంతరము పని చేయుచునే యుండును. ఆమెలో సౌజన్యము, నిరా డంబరత్వము మూర్తీభవించినట్లుండెను. మేము బేతవా నదిని దాటి సాగిపోవుచుండగా మా వెంట ఒక సోదరి ముతుక ఖద్దరుచీర కట్టు కొని వచ్చుచుండగా చూచితిమి. నర్మదాబేను ఆమెను, 'అమ్మా! మీ రెవరు' అని అడుగగా ఆమె సరళముగా 'నేనొక కూలిదాన' నని జవాబు చెప్పినది. మే మామాటను నమ్మితిమి. తరువాత విచారించగా ఆమె రాణీసాహెబా అని తెలిసినది. ఆమె హమీర్పూరు జిల్లాయం దంతట సంచారము చేసి పని చేసి యున్నది. ఈ జిల్లాలో ఆమె త్రొక్కి చూడని గ్రామము ఒక్కటి కూడ ఉండదు. నూలు వడకుట, ఘోషా, అంటరానితనము పోగొట్టుట ఈ మొదలయిన విషయములు ఆమె గత ఇరువది సంవత్సరములనుండియు ప్రచారము చేసియున్నది. దీని ఫలిత మేమనగా ఈ జిల్లాలోని ప్రతి గ్రామము నుండియు కాంతామ తల్లులు స్వతంత్ర సంగ్రామమునందు పాల్గొని కారాగారములకు సయితము పోయియుండిరి.

దివాను సాహెబును, రాణీసాహెబాయును గత ఇరువది సంవ త్సరముల తపస్సు వల్ల క్షేత్రము సిద్ధపఱుపబడి యున్నది. అందు వినోబాజీ మంత్రరూపమయిన ఈ విత్తనమును నాటియున్నారు. "భూమి అంతయు గోపాలునిదే. గ్రామమంతటిని ఒక కుటుంబము

చేయండి" అని. ఇంక పంట పండక మానునా ? వినోబాజీ మంత్రమును మనస్సునందు జపించుకొనుచు మంగరూటు నివాసులు ఇండ్లకు చేరి అత్యంత సహజభావముతో గొప్ప క్రాంతియుతమగు నిర్ణయము చేసికొనిరి. అందఱును కలిసి, "భూమి అంతయు గోపాలునిదే" అను నిర్ణయమునకు వచ్చిరి. ఆ రోజున దివాను సాహెబు భూదానము కొఱకే ఏదో మఱియొక గ్రామమునకు పోయియుండెను. తిరిగి వచ్చి చూడగా తన గ్రామవాసులందఱు తన కొఱకు ఎదురు చూచుచుండిరి. వారు దివానుసాహెబుతో "మనమందఱము మన భూమినంతటిని వినోబాజీకి దానమిచ్చివేయుద"మనిరి. దివానుసాహెబు తన భూమి నంతటిని దానమిచ్చి వేసి స్వయముగా కూలివాడగుటకు ఎట్లును నిశ్చయముచేసికొనెను. సరి, ఇక గ్రామీణులు త్యాగమదము వలన ఆనందానుభవము పొందుచుండిరి. ఇంటికి పోగానే కొందరిని వారి మహిళలు కోకిల కంఠములతో ఇట్లు చీవాట్లుపెట్టిరి. "భూమి అంతయు ఇచ్చివేసి ఏమి తిన దలచితిరి ? దివానుసాహెబు స్వయముగా దరిద్రుడయి పోవుచుండెను. మీరందఱు అతని వెంటపోయెద రెందుకు ?" అనగా గ్రామీణులు మత్తువల్ల, "మాకు రెండుచేతులు ఉండనే ఉన్నవి. కూలిపని చేసికొందుము" అనిరి. తన సిద్ధాంతములను తన జీవితములో అమలు జరుపుకొనుచున్న రాణి ఎట్లూరకుండ గలదు ? ఆమె ఇంటింటికి పోయి స్త్రీలతో 'అక్కలారా ! పురుషులు క్రాంతిమార్గ మవలంబించి యుండగా స్త్రీలమయిన మనము అడ్డు తగులుట తగునా ? మనము క్రాంతికి అగ్రదూతలము కావలెను' అని బోధించెను.

లోకములో ఇట్టి క్రాంతి కొఱకు వేలకొలది జనులను హత్య చేయుచుందురు. మానవత్వమునకు కళంకము కలిగించు పనులను ఎన్నిటినో చేయుచుందురు. అట్టి క్రాంతిని భారతీయ రైతులు ఎంతో సహజముగా ప్రవేశపెట్టుచున్నారు. తామీ మహాత్కార్యమును

చేయుచున్నట్లే వారికి తెలియదు. ఈనాడు లోకములో సర్వత్ర మానవీయ లక్షణములు మటుమాయ మగుచుండగా చూచి, జనులు 'ఇంక ఎక్కడి మానవత్వమురా' అని పెదవి విఱుచు సమయములో వారొకసారి మంగరూటులో సహజముగా జరుగుచున్న క్రాంతిని చూచినట్లయిన 'ఔరా! ఇంకను మానవత్వము నిలిచియున్నదిరా' అనిపింపక మానదు.

మంగరూటులో మొత్తము 111 (నూటపదకొండు) కుటుంబములు ఉన్నవి. వానిలో 45 కుటుంబములకు భూమి లేదు, 66 కుటుంబములకు ఉన్నది. కాని ఇప్పుడు భూమి అంతయు పరమేశ్వరునిదై యున్నది. పరమేశ్వర ప్రసాదరూపముగా ఆ భూమి అంతయు గ్రామమునకు మరల లభించినది. ఇప్పుడు భూమి లేనివాడునులేడు, ఉన్నవాడును లేడు. భూమి అందఱిది అయిపోయినది. అందఱు కష్టపడి పనిచేసి కలిసి అన్నము తిందురు. గ్రామములోని పిల్లలందఱు కలిసి విద్య నేర్చుకొందురు. స్వధర్మము ననుసరించి పనిపాటులు చేసికొందురు. స్త్రీలు ఘోషా విడిచిపెట్టి బయటికి వచ్చెదరు. మఱియు జీవితములోని ప్రతి రంగములోను కలిసి సమానముగా పనిచేసెదరు. గ్రామములో ఎవరికైనను వ్యాధి వచ్చినయెడల అందఱును కలిసి నివారణోపాయము వెదకెదరు. ఎవరికయినను కష్టము వచ్చినయెడల అందఱును కలిసి ఉపశాంతి చేసెదరు.

కాని ఈ ప్రయత్నము కేవలము ఆరంభమాత్రమే. వినోబాజీ ఆశీర్వాద బలమువలన మంగరూటువాసులు నూతనలోకము సృజించుటకు ప్రథమ ప్రయత్నము చేసియున్నారు. దీర్ఘప్రయాణము చేసినమీదటకూడ ఇంకను దూరముగా కనబడు క్షితిజమువలె జీవితాదర్శముకూడ నిరంతరము దూరముగానే ఉండుచుండును. మనము దాని సమీపమునకు పోజాలము. అయినను అఖండముగా నడచుచుండుటలోనే మానవజీవితమునకు సఫలతగలుగుచున్నది. సాధుపుంగ

వుని మానసకల్పనకును, వాస్తవికతకును గల మధ్యదూరములను తగ్గించుటకు మంగరూటువాసులకు గల ఆకాంక్ష ఆకాశకుసుమము వంటిదే కావచ్చునుగాక. అయినను ఆకాశములో ఎగురుచున్న యెడల ఈశ్వరచరణములకు మిక్కిలి సమీపముగా పోగలమని ఎవరో కవి చెప్పగా వినియున్నాను.

తన స్వప్నమును ప్రత్యక్షముగా చూచునట్టి భాగ్యము ఏ అదృష్టవంతునకో గాని కలుగదు. కాని నేడు 'జరుగదు' అను కొన్నది జరిగినది. కారణమేమనగా కాలవేగము తీవ్రమయినది. మానవుడిప్పుడు తనకు 'సర్వోదయము' కావలెనో, 'సర్వనాశము' కావలెనో నిర్ణయించుకొనవలెను.

'మంగరూటు నివాసులు యక్ష, కిన్నర, గంధర్వులుకారు. వారుకూడ మనవంటి మానవులే. కనుక వారు చేసినపని, ప్రతి గ్రామములోని వారును ఏల చేయజాలరు?' వినోబాజీ ఇప్పుడు ప్రతి గ్రామములోను ఈ ప్రశ్ననే అడుగుచుందురు.

దీపావళి పండుగ ప్రతిష్ఠను నిలబెట్టుటకు ఒక్క దీపమే చాలును.

## శాకుంతలమును స్మరించుట

రాత్ - పన్వాడీ, కల్ పహాడ్
24, 25, 26 మే, 1956.

ఉదయము నాలుగు గంటలకు ఇబ్రైలియానుండి బయలుదేరు నప్పుడు చూడగా దారికి రెండువైపుల వందల కొలది స్త్రీ పురుషులు 'రామధున్' పాడుచుండిరి. గ్రామములో ప్రవేశించునపుడు స్వాగతము, మఱుదినము వీడ్కోలు. ఇదే మా ప్రతిదిన జీవితము. ఇది 'మూడునాళ్ళ ముచ్చట' అని సాధువులు చెప్పుచుందురు. కాని మాది ఒక్కనాటి ముచ్చటయే.

ఆరోగ్యవతులును, దార్ఢ్యము గలవారును అయిన స్త్రీలు 'రామధున్' పాడుచుండగా సంతోషము గలిగినది. వీరందఱు పొలము పాటుచేసికొను సోదరీమణులు. 'రామధున్' గానము చేయునప్పుడు, అందు కరుణస్వర మున్నట్లు నేను పసిపట్టితిని. ఎవరినో స్మరించుచు గానముచేసినట్లు నాకు తోచినది. బహుశా ఇందువల్లనే కరుణస్వరము వచ్చుటకు కారణమైయుండును. మేము చాలదూరము సాగిపోయితిమి. అయినను ఆ జనులు మమ్ము వెంటనంటి వచ్చుచునేయుండిరి. వారి శ్రద్ధాభక్తులను చూచి వినోబాజీ నిలుచుండవలసిన వారయిరి. అంతట వారు ప్రసంగింపసాగిరి. కొందఱు సోదరీమణులు వెనుకబడి పోయిరి. వినోబాజీ ఆగియుండుటనుచూచి వారు పరుగుపరుగున బయలుదేరివచ్చిరి. వారి పాదములకు గల అందెల, కడియాల చప్పుళ్లు మనోహరముగా వినవచ్చెను.

వినోబాజీ ప్రసంగము ఎప్పుడు ముగించినారో, ఎప్పుడు పయనము సాగించినారో జాడ తెలియలేదు. వారు గ్రామస్థులతో ఇండ్లకు పోవలసినదిగా చెప్పియుండిరి. అందువలన వారు ముందునకు సాగిరాలేదు. కాని వారి నేత్రములు, అతివేగముగా సాగిపోవుచున్న పాదములకంటె ముందుగా సాగిపోవుచుండెను. కొంచెము సేపయిన తరువాత మేము వెనుదిరిగి చూతుముగదా; వారక్కడనే చిత్రముల పగిది నిలబడియుండిరి.

ఈ రోజులలో వేడిమి అత్యధికముగా నుండెను. మేము వేడి మంగలములో కూర్చుండి నట్లుండెను. నాలుగు వంకల అగ్నిజ్వాలల వలె వడగాడ్పులు వీచుచుండెను. మేము పరుండినది జంఖానాయే అయినను, చితికాష్ఠము మీద నిద్రించినట్లు తోచెను. దారిలో గ్రామము కనబడని యెడల మా ప్రాణములు గిలగిల కొట్టుకొను చుండెడివి. అటువంటి సమయములో ఈశ్వరుడు వచ్చి వరదానము కోరుకొండని మమ్ము అడిగినచో 'నీళ్లు' అని ఒక్కమాటయే పల్కెడి వారము.

బుందేలు ఖండములోని తీవ్రపుటెండలలో సంచారము చేయుట తపస్సేయని ఇక్కడి జనులు చెప్పుచుందురు. అందువలన మాకు 'తపస్స్యలు' అను వృథా బిరుదమును ప్రసాదించు చుండిరి. ఒక నాడు చిన్ని బాలికయగు మాయ దప్పికగొని గిలగిల కొట్టుకొను చుండెను. గౌతముడు రెండుమైళ్ళు పరుగెత్తి ఏదో గ్రామమునుండి ఇన్ని మంచినీళ్లు తెచ్చి యిచ్చెను. ఏమయినను అతడు కూడ పసివాడే గదా! వడగాలి తగులుట వలన అతనికి జ్వరము వచ్చినది. రాత్రి పూట నేను జోలపాటలుపాడి నిద్రబుచ్చితిని. చివరకు ఏమయినదనగా ఈ ఇద్దరు బిడ్డలును నా జోలపాట లేనిదే నిద్రింపరయిరి.

ఇంతవఱకు బాబా భూమిలోని ఆఱవ భాగమునే కోరు చుండిరి. కాని - మంగరూటు గ్రామము పూర్తిగా లభించినప్పటి నుండియు, గ్రామములకు గ్రామములే కావలెనని కోరుచున్నారు. మాలో ఒకరు వినోదముగా "బ్రాహ్మణునకు ఇంటిలో చోటిచ్చిన యెడల ఇంటిని యావత్తు స్వాధీనము చేసికొనును, అని మరాటీలో ఒక సామెత ఉన్నది" అనిరి. సరిగా ఇప్పుడిట్లే అయినది. ఈబ్రాహ్మణు డంతకంటె దొడ్డవాడు. 'ఇతడు వామను డను పేరు పెట్టుకొని వచ్చినాడు. ఇతనికి ఇల్లున్నంత మాత్రాన తృప్తి గలుగదు. ఇతని యెదుట బలిచక్రవర్తివలె తలవంచవలసియే యున్నది.

'కుల్ పహాడ్' గ్రామము తనపేరు సార్థకము చేసికొన్నది. కొండలచేత ఆవరింపబడిన ఈ గ్రామము దూరమునుండియే కనబడు చుండెను. ఈ ప్రదేశములో ప్రతిచోటను కమలములతో నిండిన తటాక ములు కనబడు చుండెను. వానిని చూచినప్పుడు ఎండతీవ్రత తగ్గి పోయిన దనిపించును. ఈ గ్రామములో మేము తామరాకుల మీద భోజనము చేయవలసివచ్చెను. నేను సరసముగా ఇట్లంటిని: 'మనమెంత అరసికులము! శకుంతల ప్రేమలేఖలు వ్రాసిన ఆకుపైన మనము భోజనము చేయుచున్నాము.' భోజనము చేయునప్పుడు నాకు కాశి

దాసు శాకుంతలములోని దృశ్యములు తలపునకు వచ్చినవి. 'ఉన్న మిత్తైక భ్రూలతమాననమస్యాః పదాని రచయన్త్యాః' దానితోపాటు 'తవ న జానే హృదయమ్' అనియు, శిరీషకుసుమములును జ్ఞాపకము వచ్చినవి.

## సర్పము కూడ గుర్తించుచున్నది

మహోబా, కబరయీ, మటౌంధ్

27, 28, 29 మే, 1952

సమీపములోనున్న చారిత్రిక స్థలములను చూచుటకయి మాలో కొందఱము బయలుదేరితిమి. ఛత్రసాల్ మహారాజు కోటను, బేలా తటాకమును చూచియుంటిమి. ఇది ఆల్హా, ఊదల్ నివాసస్థానమని వినియున్నాము. బేలా తటాకము కొండ గుట్టలతో ఆవరింపబడి యున్నది. ప్రాతఃకాలసమయమయి యుండెను. ఆకాశమున కొంచెము కొంచెము మబ్బులు పట్టి యుండెను. మేఘముల చాటునుండి అప్పుడే ఉదయించిన బాలసూర్యుని కిరణములు సృష్టి సౌందర్యమును ఇతోధికము చేయుచుండెను. కమలములు వికసించుచుండగా మేము నావ మీద పోవుచుంటిమి. కమలమును చూడగానే కావ్యపాఠము తలపునకు వచ్చుచుండెను. దానితోపాటు తత్త్వజ్ఞానము కూడ. సంస్కృత సాహిత్యములో కమలముతో ఉపమానములు ఎన్నో చెప్పబడినవి. సాహిత్యములో పంకములో పుట్టిన పంకజము యొక్క పవిత్రతను గుఱించి చదివియుండుటయు అందఱి ఆనంద మనుభవించుటయు నిజమే అయినను నేత్రముల యెదుట సాక్షాత్కరించిన ఈ అనుభూతి వేఱు. మేము తామరాకులమీద నీళ్లు చల్లుచు ఆటలాడుచుంటిమి. కాని నీటి చినుకులు ఆకులమీద నిలుచుటలేదు. అప్పుడు 'పద్మపత్రమివాంభసా' జ్ఞాపకము వచ్చినది. జీవితము యొక్క క్షణభంగురతను

సూచనచేయు ఆ జలబిందువులును, జీవితములోని అస్థిరతనుసూచించు ఆ కమలపత్రములును మాకు ఎన్నో సంగతులను జ్ఞాపకము చేసినవి.

'చారిత్రిక స్థలములలోని ప్రతి ఊాయియు ఎన్నో ఘట్టములను, సుఖదుఃఖములతో కూడిన ఎన్నో కథలను చెప్పుచుండును. కాని ఆధునిక నగరములు ప్రాణహీనములయినట్లు తోచును,' అని మన ప్రధాన మంత్రులు ఎక్కడనో చెప్పియున్నారు. పాడుపడిన క్రోట చూచినప్పుడు ఈ అంశము జ్ఞాపకము వచ్చినది. వీరుల గర్జనలను, రాజనీతిజ్ఞుల షడ్యంత్రములను, నర్తకస్త్రీల నూపురఝుంకారములను, గాయకుల గానములను, విద్వాంసుల జ్ఞాన చర్చలను ఇక్కడి ఊాళ్లు వినియుండవచ్చును. వాని హృదయములో ఎన్ని స్మృతులు దాగి యున్నవో! ఆ ఊాళ్లు, జీవితములోని కటు, మధుర అనుభవములను పొందిపొంది విరక్తములయినట్లును, మావంటి బాటసారుల రాకవలన కూడ సమాధిభంగము కానట్లును మాకు తోచియుండెను.

మాకు ఎంతో సమయము లేకుండెను. అందువలన విహంగావలోకనముగా అన్ని వస్తువులను చూడగలిగితిమి. ఒక మహాలులోని కొన్ని గదులలో ఇప్పుడు పాఠశాల నడచుచున్నది. ఉపయోగితావాదమును బట్టి ఇది మంచిదే కావచ్చును. కాని మనస్సునకు తృప్తి కలుగలేదు. రేపు తాజమహాలులో ఏ పాఠశాలనో, ఏ ఆసుపత్రినో పెట్టినట్లయితే.........

ఈ విహారములో మనస్సు భూతకాల విషయములందు లగ్నమయియుండగా, బాబాజీ ఉపన్యాసము అమాంతముగా దానిని వర్తమానములో పడవేసినది. కమ్యూనిస్టుల ప్రశ్నలకు సమాధానము చెప్పుచు బాబా ఇట్లనిరి: "సమాజములో శోషక వర్గమొకటి ఉన్నదని నే నంగీకరింపను. లోకములో శోషణ జరుగుచునే ఉన్నది. మనలో ప్రతి ఒక్కరు కొందఱి యెడల శోషకులుగాను, మఱికొందఱి వల్ల శోషితులుగాను ఉండుచున్నారు. సమాజము యావత్తు శోషణ చేయు

నట్టి పాకీవాడు కూడ తన భార్యను శోషణ చేయుచున్నాడు. శోష ణను పోగొట్టవలెనన్న నేటి సమాజ మొదలంట మార్పు చేయ వలెను. ఒక్క రెప్పపాటు కాలము కూడ నేను శోషణను సహింప లేను. కనుకనే కాలి నడకను సంచారము చేయుచున్నాను. అహింసా మార్గము వల్ల శోషణ రహిత సమాజమును స్థాపించుటకు భూదాన యజ్ఞము మొదటిమెట్టు.

మహోబా గ్రామములో రాత్రి చాల వేడిగానుండెను. ఆకాశ మున మబ్బులు క్రమ్మియుండుటవల్ల గాలి బిగదీసినది. రాత్రిఅంతయు ప్రాణములు నిలుచుట కష్టమయ్యెను. నూఱు యత్నములు చేసినప్ప టికి కంటికి నిద్దుర రాలేదు. 'దగ్గఱి చెఱువులో బడి నిద్రింతుమా' అని తోచినది. మఱునాడు నేను కరణభాయితో 'ఏమి నాయనా! మనము ఈ ఉత్తర ప్రదేశపు వేడికి తట్టుకొనలేక పాఱిపోవలసివచ్చుననుకుం టాను" అని అంటిని.

హామీర్పూరు జిల్లాలో ఆఖరు మజిలీ కబరయి గ్రామములో. ఈ జిల్లాలో 8 దినములలో 18 వేల యకరముల భూమి దొరకినది. ఇప్పుడు భూదానములు కూడ అధికముగా దొరకుచుండెను. దివాను సాహెబు కుటుంబీకులు గడచిన ఎనిమిది దినములనుండియు మా యాత్రీ దళముతో కలసి సంచారముచేయుచుండిరి. వారికిని, మాకును ఎంతో సన్నిహిత సంబంధము ఏర్పడెను. 'వారు రేపు వెళ్లెదరు' అన్నమాట వినుటకే మాకు దుర్భరముగా నుండెను. రాణీసాహెబా పాదములలో పెద్దపెద్ద బొబ్బలు పొక్కినప్పటికిని, ఎఱ్ఱని యెండలో 15 మైళ్లు నడచివచ్చుచుండెడిది. "అమ్మా! మీరు నిలిచిపొండని" మేము ఎన్నో పర్యాయములు ఆమెను అడ్డగించితిమి. కాని ఆమె వినలేదు. "బాబాతో గలిసి తిరిగెడు భాగ్యము మరల ఎన్నడు గలుగునో ఈశ్వరు డెఱుగును. వారితో నడచునప్పుడు, నా పాదములు బొబ్బ లెక్కినట్లే నాకు తెలియదు" అని ఆమె అనుచుండెను.

ప్రాతఃకాల ప్రార్థన జరిగియుండెను. తులసీదాసు నివాసస్థల మగు బాందా జిల్లాలో ప్రవేశింపనుంటిమి. నాలుగువంకల చీకటులు ఆవరించి యుండెను. దారిలో నట్టనడుమ ఒక పెద్ద పాము పడగ విప్పుకొని కూర్చుండియుండెను. వినోబాజీ పాదము దానిమీద పడి యుండెడిదే. ఇంతలో బాలిక 'మాయ' వారితో 'బాబా! కొంచెము ప్రక్కగా నడవండి' అనగా వారు కొంచెము తొలగి నడచిపోయిరి.

అసలు ఏమిజరిగినదో, వారికేమియు తెలియదు. మామనస్సులలో కూడ ఎవ్వరికిని భయమే కలుగలేదు. కారణ మేమో తెలియదు. ఆ పాముకూడ ఎవరినీ కఱవదలంచలేదు. మేము ముందునకు సాగి పోవుచున్నవారము. కాగా, అదికూడా తన దారిని బట్టిపోయెను.

సాయంకాల సభయందు బాబా ఇట్లనిరి: 'మీ మనస్సులో గల ప్రేమరూపమయిన పక్షిని కుటుంబరూపమయిన పంజరములో బంధించకండి. దానిని గ్రామములో ఎగురనీయండి. అటుపిమ్మట గగనమందంతట విహారము చేయనీయండి.'

'సత్యప్రచారము స్వయముగానే కాగలదు. సూర్యుని ప్రచారమునకు విజ్ఞాపనము అవసరమా ? అటులనే సత్యప్రచారమునకు కూడ బాహ్యసాధనములు అవసరముకావు. సత్యమును ఆచరించుటవల్ల సత్యమునకు ప్రచారము కాగలదు.'

ఈ భావములు కలము ద్వారా కాగితముపయి వ్రాయబడినవి. అంతేగాక, హృదయపటలముపైన గూడ అంకితమైపోయినవి.

# జయప్రకాశ నారాయణుని ఆగమనము

బాందా

30—5—1952

మహోన్నతము లయిన కొండలనుండి 'కేను' నది ప్రశాంతముగా ప్రవహించుచుండెను. ఆ నది యొడ్డున బాందానగరము నిలిచి

యున్నది. బాందానగరవాసులు ఆ నదియొడ్డుననే వినోబాజీకి శ్వేత కమలములు సమర్పించి స్వాగత మిచ్చిరి.

ఈనాడు ప్రసిద్ధ సమాజవాద నాయకుడైన జయప్రకాశ నారాయణుడు వినోబాజీని కలిసికొనుటకు వచ్చెను. మూడుగంటల వఱకు వారు ఉభయులు ఏకాంతమున మాట్లాడుకొనిరి. సాయంకాల ప్రార్థనసభయందు ఇద్దఱును ఒకే మంచంపైన కూర్చుండిరి. వేఱువేఱు పక్షములవారు వేఱు వేఱు స్వాగతపత్రములలో ఉభయులకును స్వాగతములనిచ్చిరి. ఈ ఘటన భావిసూచకమయియుండెను. జయప్రకాశ్ తన ఉపన్యాసమునందు ఇట్లు చెప్పెను: "గాంధీజీ వెళ్ళిపోయిన తరువాత దేశములో నాలుగువంకల చీకటి వ్యాపించినట్లు కనబడెను. రష్యామార్గము ననుసరించుటవల్ల విపత్తులు కలుగును. ఆ సంగతి విశదమయిపోయినది. కాని గాంధీజీ మార్గమువల్ల, అహింసా మార్గమువల్ల సమస్యలన్నియు ఏ విధముగా పరిష్కారము కాగలవో, ఈ సంగతిని ఎవరును చెప్పలేకపోయిరి. కనుక అన్నిచోట్ల నిరాశ వ్యాపించియుండెను. కాని ఇప్పుడు వినోబాజీ ప్రారంభించిన భూదాన యజ్ఞమువలన దేశమునకు ఆశాకిరణము లభించినది. వినోబాజీ మార్గమువల్ల లోకమునకు కల్యాణము కలుగగలదు. నవ్యలోకము నిర్మింపబడగల దను విశ్వాసము గలుగుచున్నది."

ప్రార్థన సమయమందు జయప్రకాశ్ నేత్రములు మూసికొని ప్రశాంతముగా కూర్చుండెను. నాకు విన్సెంటు షీను వ్రాసిన పుస్తకములోని ప్రసంగమొకటి జ్ఞాపకము వచ్చినది... ఒకసారి ఆ లేఖకుడు జయప్రకాశ్‌తో ఇట్లనెను: "ద్వంద్వాత్మకమగు భౌతికవాదము (Dialectical Materialism) పై నాకు గల విశ్వాసము పోయినది. ఇప్పుడు నేను భగవానుని అంగీకరించుచున్నాను." ఇట్లు చెప్పి అతడు జయప్రకాశ్ వంక చూచెను. ఆ మాటలకు ఈ సమాజ వాదకుడు తన్ను ఉపహాసము చేయునని అతడు తలచెను. కాని జయప్రకాశ్

తల యెత్తి అతని వంకకు చూచుచు "నేనుకూడ భగవానుని అంగీకరించుచున్నాను" (I too believe in God) అనెను.

జయప్రకాశ ముఖమునుండి వెలువడిన శబ్దములు హృదయములో క్రాంతి రూపమగు అగ్నిని ప్రజ్వలింపజేయునవియై యున్నవి. కాని ఆ పలుకులు అత్యంత శాంతముగా, అవివశముగా, అవిచలముగా చెప్పబడుచుండెను. మాలో ఒకరు అతనిని "1942 లో మీరు జెయిలునుండి ఎట్లు పాఱిపోయితిరి" అని అడుగగా, "బహు సులభముగా" అని అతడు మందహాసము చేయుచు జవాబు చెప్పెను. అటుపిమ్మట అతడు తన జీవితములోని క్రాంతికరమగు ఆ ఘట్టమును వినిపించెను. తాను జెయిలు గోడలను ఎట్లు దాటెనో, అడవులలో ముండ్లదారుల బడి దాగుకొనుచు, దాగుకొనుచు ఎట్లు పాఱిపోయెనో అంతయు వర్ణించి చెప్పెను. ఆ చెప్పెడి ధోరణి శాంతముగాను, అవికలముగాను ఉండెను. ధ్వనిలో ఆరోహణ, అవరోహణలు లేవు. అతని వ్యక్తిత్వమే ఒక సమస్య యని నాకు తోచినది.

## మరల ఎప్పుడు వచ్చెదరు ?

*ఖురహాట్, బందేసా, చిత్రకూటము, పహాడీ*

31 మే, 1, 2, 3 జూను 1952

ఖురహాట్ గ్రామములో హరిజనులు మమ్ము భోజనమునకు పిలిచిరి. వారందఱు భూమి హీనులు. మిక్కిలి నిఱుపేదలు. కనుక అందఱు చందా వేసికొని సాధుపుంగవుని సహయాత్రికులమయిన మమ్ము తమ యిండ్లకు భోజనమునకయి పిలిచిరి. మన రాజ్యాంగ చట్టము ప్రకారము అంటరానితనము నశించిపోయినది. కాని గ్రామములో హరిజనుల స్థితి వెనుకటివలెనే ఉన్నది. వీరిని గ్రామములలోని నూతులనుండి నీళ్లు తోడుకొననివ్వరు. ఇంత ఎఱ్ఱనిఎండలో సయితము

దూరముగా పోయి ఎక్కడో ఉన్న నూతులనుండి నీళ్లు తెచ్చుకొన వలసి వచ్చుచున్నది. ఈ రోజున మా భోజనము పప్పు, రొట్టె. కాని ఇంత మధుర భోజనము మేము మా జన్మలో ఎన్నడునుచేసియుండము. హరిజన సోదరసోదరీమణులు తమ సంతోషమును పట్టజాలకపోయిరి. సమాజము ఎవరిని ఉపేక్ష చేసియున్నారో, వారి యిండ్లకు సాధు పుంగవుని సహయాత్రికులమయిన మేము అతిథులుగా పోయి యుంటిమి. మేము సోదరీమణులయొద్దకు పోయి మాట్లాడ మొదలు పెట్టితిమి. వారు తమ దుర్దశను మాతో చెప్పుకొనుచు, మేము వారి కడకు వచ్చుటవలన కలిగిన ఆనందమును కూడ వెల్లడించుచుండిరి. మేము వారి భాషను సరిగా అర్థము చేసికొనలేక పోతిమి. అయినను హృదయమునుండి వచ్చిన భాషను అర్థము చేసికొంటిమి. మమ్ము సాగనంపునప్పుడు, ఆ సోదరీమణులు మా చేతులను తమ చేతులలోనికి మాటిమాటికి తీసికొని 'మరల ఎప్పుడు వచ్చెదరు' అని అడుగసాగిరి. భారతదేశములోని సమస్త పీడిత, దళిత దీనజనము వారి ముఖము నుండి 'మరల ఎప్పుడు వచ్చెదరు' అని అడిగినట్లుండెను.

బందౌసాగ్రామము పోవునప్పుడు చల్లని గాలి, దారిలో రెండు వైపుల పెద్దపెద్ద చెట్లనీడ, వీని అన్నిటికంటె బాబా సాన్నిధ్యము. వీని అన్నిటి మూలమున మేమీ రోజున 16 మైళ్లు నడచినట్లే తోచలేదు. ఎండ తీవ్రముగానేఉండెను. బాబా నాతో, "నీవిప్పుడు అటితేటినా నే? క్రమక్రమముగా పూర్తిగా గ్రామీణురాలవు కాగలవు. అసలు మాన సిక బలము వల్లనే అన్ని పనులు జరుగగలవు. శరీర సుఖము విషయ మయి మనమెంత శ్రద్ధ తీసికొనుచుందుమో, అంత దుర్బలులమైపోవు చుందుము. నేను బాల్యములో చాల పలుచగా ఉండెడివాడను. నేను చాల దినములు జీవింపగలుగుదునని ఎవరును నమ్మకుండిరి. కాని నా మనస్సు బలీయమయినది. అందువల్లనే వేలకొలది మైళ్లు నడవ గలుగు చున్నాను" అనిరి.

చిత్రకూటము, తులసీదాసు వారి ఆరాధనస్థలము. అనసూయ, అత్రిమహామునుల ఆశ్రమము ఇక్కడనే ఉండెననిచెప్పుచుందురు. ఇక్కడ నుండియే మందాకినీనది ప్రవహించుచున్నది. దాని ఒడ్డున ఎన్నో దేవమందిరము లున్నవి. ఇది పవిత్రభూమి అని ఎంచుచుందురు. యాత్రాదినములందు వేలకొలది యాత్రికులు మందాకినిలో స్నానము చేయుచుందురు. అందువలన వారికి ఎట్టి పుణ్యము రాగలదో నాకు తెలియదు. కాని రెండుజాముల వేళ, తీవ్రపుటెండలో మందాకినీ శీతల వినిర్మల జలమునందు మునిగినప్పుడు, ఆ జలస్పర్శవలన నాకు అమితానందము కలిగినది.

చిత్రకూటమునకు సమీపమున గల దట్టంపుపొదలను మనోహర ప్రకృతి సౌందర్యమును చూచినప్పుడు బుందేలు ఖండములోని తీవ్ర మయిన ఎండలు కొంచెము తగ్గినట్లు కనబడెను. తులసీదాసుగారు ఇట్లు చెప్పియేయున్నారు: 'అబ్ చితచేత చిత్రకూటహిఁ చలు.'

నేటి ప్రవచనములో వినోబాజీ, 'జనసేవయే నిజమయిన పూజ' అని చెప్పియున్నారు. 'మానవసేవయే మాధవసేవ' అను సామెత తెలుగులో కలదని విద్యాబహెను తరువాత చెప్పినది.

గాంధీజీ మనుమరాలు సుమిత్ర ఎం. ఏ. పరీక్షలో ప్రథముల్లుగా ఉత్తీర్ణత పొందినందుకు బంగారు పతకము లభించినదని ఇప్పుడిప్పుడే మాకు వార్త వచ్చినది. ఆమె నాకు ముఖ్యమయిన స్నేహితురాలు. అందువల్ల నేను పరమసంతోషమును పొంది బాబాకు ఆ వార్త వినిపించితిని. దామోదర్ జీ వారితో, 'సుమిత్రకు మీరేమయినా వ్రాయండి' అనగా, బాబా నవ్వుచు, 'ఒకవేళ ఫేలు అయియుండిన యెడల ఆమె నోదార్చుటకు గాను ఏదో వ్రాసియుండెడివాడను. కాని ఇప్పుడు బంగారు పతకము దొరికినది. ఇటుపైన నేనుకూడ వ్రాసినచో దాని బరువువలన ఆమె అణగిపోగలదు,' అనిరి.

సాయంకాలము, సభ అయిపోయిన తరువాత, ఎప్పటివలెనే గ్రామీణ కార్యకర్తలు బాబాతో మాట్లాడుచుండిరి. 'గ్రామములలో సేవాగ్రామపద్ధతిని 'శౌచకూపములు' కట్టుకొనుటకు శిక్షణ ఇప్పించవలె'నని ఎవరోచెప్పిరి. అందుకు బాబా, 'ఏదయినను నవ్యమైన మహాత్కార్యము పిచ్చివారివల్లనే కావలెను. ఈ పనిచేయుటకు కూడ పిచ్చివాడో బయలుదేరగలడని నా తలంపు' అనిరి.

నేనింటివద్ద ఉండగా, నాతో చాలమంది, 'వినోబాతో కాలి నడకను ప్రయాణము చేసే సాహసము చేయవద్దు' అని చెప్పుచుండిరి. ఇప్పుడు నేను వారితో వినోబాజీ చెప్పినట్లు, 'పిచ్చివారివల్లనే క్రాంతి కాగలదని' జవాబు చెప్పగలను.

## సత్యమేవ జయతే

*రాజాపూర్ (బాందా)*
4—6—1952.

నేడు ప్రయాణము సాగించి నప్పటినుండియు ఆకాశములో మబ్బులు కనబడుచునే యుండెను. మధ్యమధ్య మెఱుపులు మెఱయుచు మాకు దారి చూపుచుండెను. కొంచెము సేపటిలోనే టపటప చినుకులు పడ నారంభించెను. గ్రీష్మములోని అతి తీవ్రమయిన ఎండల తరువాత వచ్చిన ఈ ప్రథమ వర్షము మాకు ఎంతో సుఖదాయకముగా నుండెను. గురుదేవుడు చెప్పినట్లు "మంటల చేత తపించిపోయిన భూమిపైన పరమేశ్వరుని ఇంద్రలోకమునుండి పంపబడిన అమృతమే" ఆ వర్షము. వాన కురియుచుండెను. దానితో పాటు గాలి వీచుచుండెను. మాలో ప్రతి ఒక్కరు తమతమ భాషలలో వర్షమునకు స్వాగతమిచ్చుచు పాటలు పాడుచుండిరి. గౌతముడు, మాయ నాట్యమే చేయసాగిరి. గురుదేవునకు అత్యంతప్రియమైన ఋతువు 'వర్షఋతువే.'

నాకు అతని 'వర్షాగీతము' జ్ఞాపకము వచ్చినది. అందు కవి ఇట్లనును: "అనేక యుగములు గడచిపోయినవి. ఒక కాలములో ఇప్పటివలెనే ఆషాఢమాసము జరుగుచుండగా వాన కురియుచుండెను. రేవా నది యొడ్డున కూర్చుండి గానము చేయుచున్న ఒకానొక కవిస్వరము వినవచ్చుచుండెను."

వాన కొంచెము తగ్గినది కాగా చర్చ ప్రారంభమయ్యెను.

నేనడిగితిని : మానవుని జీవితము సుఖమయమని మీరు చెప్పుచుందురు. కాని జీవితము దుఃఖమయమని బుద్ధభగవానుడు చెప్పుచుండును. అతడు దుఃఖమును ప్రథమ 'ఆర్యసత్యము' అనుచుండును. అట్టితఱి మీ ఉభయుల భావములలోను ఈ విధమైన వ్యత్యాసము ఉండుటకు కారణమేమి ?

బాబా : బుద్ధ భగవానుడు మానవజీవితమును దుఃఖమయమని చెప్పియుండెను. అది సత్యమే. కాని నేను జీవితమును ఆత్మపరముగా చూచుచు, జీవితము సుఖమయమని చెప్పుచున్నాను. ఒక విధముగా చూచినయెడల జీవితము నేడుకూడ దుఃఖమయమే. కాని బుద్ధభగవానుడు దుఃఖమునకు కారణమేమని చెప్పియుండెను.

నేను : తృష్ణ.

బాబా : ఆ తృష్ణావినాశనమునకు మార్గమేమి ?

నేను : తృష్ణాక్షయము.

బాబా : సెబాష్. కనుక మన దుఃఖములన్నింటికి కారణము "వాసన" అని తేలినది గదా ! జీవితము సుఖమయమైనదే. కాని వాసనాక్షయమైన తరువాతనే.

సందేహమునకు సమాధానమువచ్చినది కాగా, నేనింక రెండవ ప్రశ్న అడుగ నారంభించితిని. "బుద్ధభగవానుని తత్త్వజ్ఞానము 'నిరాశావాద' మని (**Pessimistic**) తఱుచుగా చెప్పుచుందురుగదా. ఇది ఎంతవఱకు సత్య" మని నే నడిగితిని.

బాబా : ఇక్కడ ఆశావాదము (Optimism), నిరాశావాదము (Pessimism) అను శబ్దముల ప్రయోగమే కూడదు. బుద్ధ భగవానుని తత్త్వజ్ఞానము కేవలము నిరాశావాదము కానేకాదు. లోకమాన్యతిలకు తమ గీతా రహస్యములో ఈ సంగతినే చెప్పియున్నారు. సన్యాసమనగా నిరాశపొంది జీవితమునుండి పాఱిపోవుట కాదు. సన్యాసమనగా సత్యమయిన ఆనంద ప్రాప్తిని కోరుకొనుట. నిరాశావాదుల కోరికలు నష్టమయిపోవు. జీవించియే యుండును. కాని సన్యాసి కోరికలు నష్టమయి పోవును. అందువల్ల అతనికి ఆనంద ప్రాప్తి గలుగుచున్నది.

నేను : సాహిత్యములో దుఃఖాన్త కథలను (Tragedy) అధిక సుందరములని, కళాపూర్ణములని చెప్పుచుండుటకు కారణమేమి ?

బాబా : సజ్జనునకు దుఃఖాంతమే అగునని చెప్పుటయేనా దుఃఖాంత కథ తాత్పర్యము ? నిజముగా చూచినట్లయిన సజ్జనునకు దుఃఖాంతము రానేరాదు. కేవలము లౌకికదృష్టితో చూచినయెడల సజ్జనుడు చాల కష్టములు అనుభవించినాడనియు, దుర్జనుడు సుఖ భోగము చేయుచున్నాడనియు కనబడవచ్చును. ఈ సాధారణ దృష్టియే కలిగియున్నయెడల 'దుఃఖాంతకథలు' వ్రాయవచ్చును. కాని చివరకు సజ్జనత్వమునకే విజయము గలుగునని మా విశ్వాసము. ఆ లోకములో సజ్జనత్వమునకు కిమ్మతు కట్టబడును. కాని కొంచెము సుదూరముగా విచారించి చూచినయెడల ఈ లోకములో కూడ సజ్జనత్వమునకే విజయము గలుగ గలదని తెలియగలదు. ఇప్పుడు బాపూజీనే ప్రమాణముగా తీసికొనుము. వారికి గలిగిన ఉత్తమ మృత్యువువంటిది ప్రాప్తించుట దుర్లభము. వారి దినచర్యయంతయు పూర్తి అయిపోయినది. దినక్రమము ననుసరించి నూలువడకుట కూడ పూర్తి అయినది. ప్రార్థనకొఱకు పోవుచుండిరి. అదిగాక, కొంచెము

ఆలస్యమయినందువలన మనస్సులో భగవానుని చింత తప్ప అన్య మేమియులేదు. అటువంటి సమయములో రెండు గుండుదెబ్బలు తగిలినవి. నోటివెంట 'హే రామ్' అను నామములో ఉచ్చరింపబడినది. తరువాత కొద్ది క్షణములలో మృత్యువు ప్రాప్తించినది. అది ఎంతటి మహద్భాగ్యము ! మరణకాలమందు ముఖమునుండి రామనామము బయలువెడలుటకు ఎంతటి తపస్సు చేయవలెను ? ఒకసారి నేనును, వారును సంభాషించుకొనుచుంటిమి. అప్పుడు వారిట్లరి: 'జ్ఞాని సర్వథా అహంకారశూన్యుడని చెప్పుట తప్పు. దేహమున్నంతవఱకు ఏ కొంచె మైనను అహంకారము ఉండనే ఉండును. సాంతము నశించదు. అవును, నెమ్మది నెమ్మదిగా నశించిపోవుచుండెను. కాని ఏ క్షణమందు అహంకారము పూర్తిగా నష్టమయిపోవునో ఆ క్షణమందు ఈ దేహము ఒక కుప్పవలె కూలిపోవును.'' సరిగా అటువంటి మృత్యువే వారికి వచ్చినది.'

'బాపూజీ చేయవలసిన పని పూర్తికాకమునుపే ఈ లోకమును విడిచి పోవలసివచ్చెను. అందువలన వారి జీవితము విఫలము' అని కొందఱనుచుందురు. కాని ఇట్లు చెప్పుట సరికాదు. లోకములోని సమస్యలన్నిటిని పరిష్కరింపగలమని వారు పూచీపడియున్నారా ? పరమేశ్వరుని లోకము నడచుచునేయుండును. అందలి సమస్యలు కూడ అసంఖ్యాకములుగా నుండును. వానిని పరిష్కరించు పూచీ కూడ పరమేశ్వరునిదే అయియున్నది. మధ్యమధ్య అతడు ఎవరెవరినో సాధనముగా చేసి పంపుచుండును. బాపూజీకి ఏదయినను వ్యక్తిగత సమస్యవుండి, దానిని పరిష్కరింపకమునుపే వారు వెడలిపోయిన యెడల వారి జీవితము విఫలమయినదని చెప్పవచ్చును. కాని సమస్యలు వారి స్వంతమైనవికావు. లోకమునకు సంబంధించినవి.'

'బాపూజీ మృత్యువును గుఱించి అనేకమందికి అనేక భావనలు ఉన్నవి. వారి జీవితము వారి స్వంతమయియుండలేదు. వారు లోక

ముతో ఏకరూపులయిపోయిరి. మన అందఱి పుణ్యమువలన వారు పుణ్యావంతులగుచుండిరి. పాపమువలన పాపులగుచుండిరి. మన అందఱి పాపములభారము వారి తలపైన ఉండెను. ఆ పాప ప్రాయశ్చిత్తమే ఆ మృత్యువు.'

'సమత్వము అత్యంత దుర్లభమయినది. కాని నాకు దుర్లభ వస్తువును పొందవలెనను ప్రయత్నములోనే ఆనందమున్నది. ఒక విధముగా చూచిన, పరిపూర్ణజ్ఞాని, సమత్వయుక్త వ్యక్తి ఈ లోకములో లభించుట అశక్యమే. ఏ మహాపురుషుని జీవితములో గాని నిండుగా పూర్ణత్వము కనబడదు. ఏ కొంచెమో అపూర్ణత్వము కనబడుచుండును. పూర్ణత్వము కేవలము అవ్యక్త పరమేశ్వరునిలోనే కనబడగలదు. కాని మహాపురుషులజీవితమునుండి మనకు ప్రేరణ లభించును. మనము వారిలో మన ఆత్మపరిశుద్ధ స్వరూపమును చూడగలుగుచున్నాము. ఆ విధముగా వారిలో అపూర్ణత్వము ఉన్నప్పటికిని, వారి దర్శనమువల్ల కూడ లాభము కలుగుచుండును. సమత్వవిషయములో జ్ఞానేశ్వరుడు గొప్పసాధన చేసినాడని నా అభిప్రాయము. అతని వ్రాతలన్నిటియందును ఒక్క కటుశబ్దము కూడ కనబడదు. వారి జీవితము కూడ మిక్కిలి చిన్నదైయుండెను.'

'మాతృభాష మరాటీయగుటవలన నేను బాల్యములో జ్ఞానేశ్వరుని గ్రంథములను చదివియుంటిని. కనుక వారి భావములను అప్పుడే తెలిసికొనియుంటిని. అందువలన నేను వారిని గుఱించి చెప్పిన దానిలో కొంత పక్షపాతమున్నను ఉండవచ్చును. అయినను వారు మహాపురుషులు అందఱిలోను ఒకరనియు, సమత్వ ఆదర్శమును చేరుటలో అందఱికంటె సమీపమునకు పోయినారనియు నాకు తోచుచుండును.

"విశ్వామిత్రుడు కూడ చేయజాలని పనిని మీరెట్లు చేయగల రయ్యా?" అని నన్ను చాలమంది అడుగుచుందురు. అందుకు నేనిట్లు జవాబు చెప్పుచుందును: "నేను విశ్వామిత్రుని భుజములపైన నిలబడి యున్నాను. తండ్రి భుజాలమీద నిలబడిన కుమారుడు ఎక్కువ దూరమును చూడగలడు. నేటివఱకుగల ఋషుల అనుభవముల లాభమును నేను పొందగలుగుచున్నాను."

స్వాగతముకొఱకు రాజాపూరునుండి వచ్చిన భజనమండలివారి రామధున్ శబ్దము వినగానే మా చర్చ ఆగిపోయినది. రాజాపురము మహాకవి తులసీదాసుగారి జన్మస్థానము. యమున ఒడ్డున వారు ఉండెడి ఇంటిపట్టున ఇప్పుడొక దేవాలయముకట్టించిరి. అందు సీత, రాముడు, లక్ష్మణుడు, తులసీదాసుల విగ్రహములు కలవు. దేవాలయములో తులసీదాసుగారి స్వహస్తముతో సుందరముగా వ్రాయబడిన రామాయణములోని అయోధ్యాకాండ నకలు ఒకటి ఉంచబడి యున్నది. బాబా భక్తితోను, వైజ్ఞానికదృష్టితోను ఆ రామాయణమును చూచిరి.

ఈ రోజున మా నివాసస్థానము యమున ఒడ్డున ఎత్తయిన మెట్టుమీదఉండెను. సమీపములోనే ఒకప్పుడు తులసీదాసుగారి యిల్లు, అనగా నేటి దేవాలయము ఉన్నది. నిన్నటి దినమున వాన కురిసినందువలన యమునలోని నీరు నిర్మలముగా లేకుండెను. అందువలన ఈదునట్టి అదృష్టము లేకపోయెను. అయినను మేము యమునలో స్నానము చేసి కొంచెము పుణ్యము సంపాదించుకొంటిమి.

నేటి సభ వేద మంత్రములతో ప్రారంభమయ్యెను. అదియుంగాక సంస్కృతములో స్వాగత పత్రము చదువబడెను. అటుపిమ్మట చిన్న సంకీర్తనము, రామాయణపాఠము జరిగెను. నేటి ఉపన్యాసమునందు వినోబాజీ మాటిమాటికి తులసీదాసుగారిని స్మరించుచున్న వారై గద్గదకంఠులయిరి.

# మహాత్మా గాంధీకీ జయ్

*సురధువా, కమాసిన్, కిషనపూర్ (బాందా)*

5, 6, 7 జూన్ 1952.

• "కర్తవ్యమును నిర్ణయించుటెట్లు ?" అని ఒకరు మార్గమధ్యమ్మున బాబాను అడిగిరి. బాబా యిట్లు జవాబు చెప్పిరి: "కర్తవ్యమును నిర్ణయింపవలసిన అవసరము కలుగదు. అది సహజముగానే లభించును. మనుష్యుడు తన స్వధర్మమును ఎంచుకొనవలసిన పనిలేదు. తల్లివలెనే స్వధర్మముకూడ పుట్టుకతోనే లభించుచున్నది. స్వధర్మమును గుర్తించుటెట్లు అని ఎవరయినను ప్రశ్నింపవచ్చును. ఎవరికి ఏ పనియందు విశేషానందము కలుగుచుండునో అదియే వారి స్వధర్మము. నాకు ప్రతిదినము ఆత్మచింతన యందు తప్ప మఱే పనియందును ఆనందము కనబడదు. అందువలన నా స్వధర్మము "ఆత్మచింతనము." ఇప్పుడు నాలో ఎట్టి "వాసన" యునులేదు. ఈ క్షణమందు నాకు మృత్యువు వచ్చినప్పటికిని పరమేశ్వరుని చింతన చేయుచునే యుందును. మరణానంతరము పరమేశ్వరునిలో లీనమైపోవుదును."

నేటి మా నివాసస్థానము కూడ పూర్తిగా నదీ తీరముననే ఉండెను. తుపాను చెలరేగినప్పుడు నదీ సౌందర్యము నిరుపమానముగా నుండెను. ఆకాశములోని మబ్బుల నీడలు నది నీళ్లమీద పడుచుండుట వలన ఎన్నో చిత్రములు ఏర్పడుచుండెను. మరల పెద్దగాలి వీచినప్పుడు ఆ బొమ్మలన్నియు చెఱిగిపోవుచుండెను. తెల్లని జాతుల గుంపొకటి మిగుల ఒయ్యారముగా ఈదుకొనుచు పోవుచుండెను. మేము నది గట్టున కూరుచుండి పాటలు పాడుకొనుచుంటిమి. "శిష్టాగమనే అనధ్యాయః" అన్నట్లు మేము తుపాను, వర్షము మొదలయినవి వచ్చినప్పుడు పనులు చేయకుండ సెలవు తీసికొనుచుందుము.

బాందాజిల్లాలో ఆఖరు మజిలీ 'కమాసిను' గ్రామము. ఒక వారము దినముల క్రిందట మేము మొదట ఈ జిల్లాలో పాదము మోపినపుడు, ఈ జిల్లాలో పనియేమియు జరుగలేదు. కనుక తక్కువ భూమి దొరకగలదు' అని ప్రతి నోటినుండియు ఈ మాటయే విన వచ్చుచుండెను. కాని వినోబాజీ ఈ జిల్లాలో ప్రవేశింపగానే, 'తులసీ దాసుగారి జిల్లాలో సంచారము చేయకుండగనే నాకు భూమి ధొరక్క వలెను. ఆ సాధుపుంగవులు తపస్సుచేసిన ప్రదేశమునుండి ఎంతయిన్నను రాగలదని నేను అపేక్షపడుచున్నాను' అనిరి. నిజముగా కమాసిను గ్రామములో తులసీదాసుజీ తపస్సు ఫలితమునే మేము పొందగలిగి తిమి. ఏడు దినములలో 21 వేల యకరముల భూమి దానముగా లభించెను. ఇక్కడగల కొద్దిమంది కార్యకర్తలు గత ఏడుదినముల లోను జీపుకారుపైన దినమంతయు తిరుగుచు సాయంకాలపు సభలో దానపత్రములు చదివించి వెడలిపోవుచుండిరి.

బాందాజిల్లా విడిచిపెట్టి ఫతేపూర్ జిల్లాలో ప్రవేశించుటకు నావపయి యమునా నదిని దాటవలసియున్నది. యమునానదిలోని గోధుమరంగుగల ఇసుకతిన్నెను చూచినప్పుడు మఖమలు తివాసీపఱచి యున్నారా అనిపించినది. సూర్యకిరణములలో తళతళ మెఱయునట్టి ఆ యిసుక తివాసీమీద కాలుమోపుటకు, దాని శోభ చెడునేమోయని భయముగా ఉండెడిది. పువ్వులతోను, ఆకులతోను అలంకరింపబడిన ఆ నావమీద పాదము మోపగానే. ఫతేపూరు వాసులు అందరకు చందనతిలకము నుంచిరి. యమునానదికి ఇవతలిగట్టున మమ్ము వీడ్కోలుప్ప జనులుండగా అవతలిగట్టున స్వాగతమిచ్చు వారుండిరి. రెండు తీరములనున్న జనులు సంతతము జయజయ ధ్వనులు చేయు చుండుటవలన నావ ఎప్పుడు బయలుదేరినదో, ఎపుడు చేరినదో జాడ తెలియలేదు. బాబా నావనుండి దిగగానే ఫతేపూరు జనులు గగనభేదీ స్వరముతో 'మహాత్మాగాంధీకి జయ్' అని గర్జనచేసిరి.

సాయంకాలము ప్రవచనములో వినోబాజీ గద్గద కంఠముతో ఇట్లనిరి: ఈ రోజు ఆ రోజే అయియుండెను. జూను ఏడవతేదీ. 36 సంవత్సరముల క్రిందట ఈ రోజుననే నేను మొదటిసారి బాపూజీ దర్శనము చేసికొంటిని. ఆ రోజులలో నేనొక చిన్న బాలుడను. నాటి నుండి వారు ఆజ్ఞాపించుచుండగా నేను పనులు చేసికొనుచు పోవుచుంటిని. ఇంతే నా జీవితము." వినోబాజీ చెప్పిన ఈ సంగతిని, భారతీయులు ఎన్నడో ఎఱుగుదురు. అందువల్లనే వారు వినోబాజీని చూడగానే "మహాత్మాగాంధీకీ జయ్" అను సింహగర్జన చేయుచుందురు.

# భావమునకు విజయము

*ఖాగా, బహరాంపురము, ఫతేపూరు, మౌజమాబాదు*

(ఫతేపూరు) 8, 9, 10, 11 జూను 1952.

ఖాగా గ్రామము వెళ్లునప్పుడు దారిలో విజయాపురమను గ్రామము ఉన్నది. ఆ గ్రామము ఉత్తర ప్రదేశములోని 'వికాస యోజన' లో ఉత్తమస్థానము పొందియున్నది. గ్రామీణులు స్వాగతము కొఱకు అట్టహాసముగా ఏర్పాటుచేసిరి. వినోబాజీ వారితో ఇట్లనిరి: "మీరు వికాస యోజనలో మొదటి స్థానమును పొందియున్నారు. కనుక ఇప్పుడు గ్రామములోని. భూమిహీను లందఱకు భూమినిచ్చి ఆ పనిలో కూడ ప్రథమ స్థానమును పొందండి." ఇచ్చోట మా అందఱకు చందనతిలకము లుంచి మా పైన అక్షతలు చల్లిరి. బాబా మా వంక చూచి మందహాసము చేయుచు, "ఓహో! నేడు అందఱు బాబాలు అయిపోయినారే!" అనిరి.

మరల చర్చ ప్రారంభమయ్యెను. ఒక సోదరుడు మానసిక సమానతను గుఱించి ప్రశ్నింపగా బాబా ఇట్లనిరి: "ఆర్థిక క్రాంతికి

అధిష్ఠానమే మానసిక సమానత. 'మానసిక సమానత' తాత్పర్య మేమనగా మానవులందఱిలోను ఒక్కటే ఆత్మ సమాన రూపముగా వాసము చేయుచున్నదనియు, మనము దేహము కాదనియు ఆత్మల మనియు అనుటయే.''

అనంతరము మహర్షి అరవిందులను గుఱించి చర్చ ప్రారంభ మయ్యెను. అప్పుడు బాబా ఇట్లనిరి: ''రామానుజులు, శాక్తపంథులు, విజ్ఞానము'' ఇవన్నియు అరవిందుల పైన పనిచేసినవి. వారు కూడ రామానుజులవలె మాయను మిథ్య అనకుండ బ్రహ్మయొక్క అంశమే అనిరి.

ప్రశ్న : అరవిందుల స్థూలదేహము నష్టమయిపోయినప్పటికిని, వారు నేటికిని సూక్ష్మరూపములో పని చేయుచున్నారని మాతాజీ **(Mother)** సాంత్వన వాక్యములు చెప్పుచుండునుగదా. ఈ విషయ మయి మీ అభిప్రాయమేమి ?

వినోబాజీ : ఈ సంగతి సత్యమే. మహాపురుషులందఱు దేహ త్యాగముచేసినమీదట సూక్ష్మరూపములో ఎక్కువపని చేయుచుందురు.

బహారాంపూరు పోవునప్పుడు దారిలో ఒక విచిత్రము జరిగినది. మా యాత్రీదళము ముందునకు సాగిపోవుచుండగా కొందఱు గ్రామీణులు ఇండ్లనుండి బయటికి వచ్చిచూడసాగిరి. ఆ సమయమున మా యాత్రీదళము వెంట పోలీసులు కూడ ఉండిరి. బాబా ముందుగానే సాగిపోయిరి. మేము వెనుకవెనుకగా పోవుచుంటిమి. ఇంతలో గ్రామీణులు మమ్ముచూచి, 'ఔరా ! ఈ గుంపంతయు అరెస్టు అయి పోయినదా ? బాలురు, బాలికలు కూడానా ?' అనుకొనుచుండగా మేము వినియున్నాము. ఆ గ్రామీణుల అజ్ఞానమునకు హద్దులేకుండ నుండెను. వినోబాజీ పోవుచున్నారన్న సంగతియే వారెఱుగరు. అందు వలన కరణభాయీ మనస్సు చాల నొచ్చుకొనెను. కార్యకర్తలు

సరిగా ప్రచారము చేయలేదనియు అందువలననే గ్రామీణులకు అసలు విషయమేమో తెలియలేదనియు ఆతడు తలచెను. ఆ విషయమై ఆతడు చాలఖేదము పొందెను. సాయంకాలము సభలో తన ఉపన్యాసములో ఈ సంగతిని చెప్పి తన ఆర్తిని వెల్లడించెను. అటుపిమ్మట వినోబాజీ చెప్పిన ఉపన్యాసమువల్ల మాకుగల నిరాశ, దుఃఖము మటుమాయ మయ్యినవి. వినోబాజీ ఇట్లనిరి: 'జనులలో ఎంత ఉత్సాహము మంద గించునో పనిచేయుటకు నాకు అంత అధికోత్సాహము కలుగుచుం డును. ఎదుట ఎంత గాండాంధకారముండునో దీపమునకు అంత మంచిది. కారణమేమనగా చీకటిలో దీపపుకాంతి అధికముగా వ్యాపించును. కనుక ఇటువంటి ఘట్టములనుచూచి మీరు నిరాశ పడకండి. మీరుమిక్కిలి ఉత్సాహముతో పనులుచేసికొనుచుపొండి.'

బహార్గాంపూరులో సాయంకాల సభ సమాప్తిచెందినది. మేము బాబా సన్నిధిని కూరుచుండి మాటలాడుకొనుచుంటిమి. ఇంతలో ఒక సోదరుడు మావద్దకు పరుగెత్తుకొనుచు వచ్చెను. అతడు దగ్గఱకు వచ్చినమీదట, నాలుగుమైళ్ళ దూరమునుండి పరుగెత్తు కొనుచు వచ్చినాడన్నసంగతి తెలిసినది. అంత కష్టపడినను, ప్రవచనము వేళకు, అతడు రానేలేకపోయెను. అతనికి కేవలము ఆఱుబీగాల (బీగమునకు సుమారు 6 3 సెంట్లు) భూమి మాత్రమేవుండెను. అందలి ఆఱవభాగము·ఒక బీగము దానమిచ్చుటకై వచ్చియుండెను. అతడింత వఱకు బాబా దర్శనము చేసియుండలేదు. వారి ఉపన్యాసముల నైనను వినియుండలేదు. అట్టి స్థితిలో అతనికి ప్రేరణ ఎక్కడనుండి వచ్చినది ? బాబా తఱుచుగా ఇట్లు చెప్పుచుందురు: 'భూదాన కార్యము నాది కాదు. అది భగవంతుని కార్యమే. అందువల్ల అతడే అందఱకును ప్రేరణ కలుగుచుండును,'' అని. మేము మా కన్నులతో ఇటువంటి ఘట్టములు చూచినప్పుడు బాబా చెప్పిన మాటలలో సత్యము కలదని తోచుచుండును.

మొన్నటి దినమున రాజాపురములో ఉపన్యసించుచు బాబా ఇట్లనిరి: "తులసీదాసు వారి జీవితము అత్యంతశుద్ధమయినది. కనుకనే వారుచెప్పినట్లు ఇంత సామర్థ్యము కలిగినది." ఈ విషయమై నేనొక సందేహమును వెల్లడించితిని. "యూరపులో ఎందఱో ప్రతిభావంతు లయిన కవుల జీవితము పతితమయియున్నప్పటికిని వారి పలుకులలో శక్తి ఉంటున్నది. ఏమందురు?" అనగా బాబా అనిరి; "మానవుని ఆత్మ ఎల్లప్పుడు పైకి లేవవలెననియే యత్నించుచుండును. కానిఆ ప్రయత్న ములో విఫలత్వము పొందుచు క్రిందకు పడిపోవుచుండును. యూర పులోనున్న ఆ కవులు తఱచుగా పైకిలేవవలెనను ప్రయత్నములోనే తమ కావ్యములు వ్రాయుచుందురు. అందువల్లనే వారి పలుకులలో అంత శక్తి ఏర్పడుచున్నది. వారి కావ్యమునకును, వారి నిత్యజీవిత మునకును సంబంధము ఉండదు. తఱచుగా అటువంటి సాహిత్యము స్థిరముగా ఉండజాలదు. అట్లయినను వారి ఉత్తమ భావములను మనము గ్రహింపవలెను. వారి జీవితములను మఱచిపోవలెను. నేను షెల్లీకవి కావ్యములను స్మరించుచుందును. వారి జీవితమును మఱచి పోవుదును."

ప్రశ్న : ప్రాచీన కాలములో వేదాధ్యయనమునకు అధికారము కేవలము బ్రాహ్మణులకే ఉండెనా ?

వినోబా : ఆ కాలములో జ్ఞానప్రాప్తికి అందఱకును అధి కారము ఉండెను. కాని వేదాధ్యయనముచేయు అధికారము కేవ రము బ్రాహ్మణులకే ఉండెను. దానికి కారణ మేమనగా ఆకాలములో వ్రాత సాధనములు లేకుండెను. అందువలన శుద్ధ మయిన ఉచ్చారణకే అధిక ప్రాధాన్యము ఇవ్వబడుచుండెను. శుద్ధమైన ఉచ్చారణపైననే వేదముల శుద్ధరూపము ఆధారపడియుండెను. కనుక వేదపఠనమునకు అధికారముకూడ కేవలము బ్రాహ్మణులకే ఇవ్వబడెను. వా రీపని

యందే నిమగ్ను లయియుండిరి. ఆ కాలములో వేదములు నిలబెట్టుటకు ఇంతకంటె వేఱే ఉపాయము కనబడలేదు. కనుక ఆ కాలములోని జనులు పాపము చేసినవా రని చెప్పరాదు. వారి ఇబ్బందులను, కష్టములను విచారింపకుండ వారిని విమర్శింప మొదలుపెట్టిన యెడల అది అన్యాయమే కాగలదు.

వేదకాలమును గుఱించి బాబా మాట్లాడుచున్నప్పుడు వారి కంఠస్వరము ఏదో అజ్ఞాత భూతకాలమునుండి వచ్చుచున్నట్లు తోచుచుండును. వారు తమ గతజీవితములోని సంగతులను స్మరించుకొనుచున్నారా అనిపించుచుండును.

ఫతేపూరులో విశేష జనసముదాయము ఎదుట మాట్లాడుచు బాబా ఇట్లనిరి : "భూదానకార్యము నేటివఱకు చరిత్రలో ఎన్నడును జరిగియుండ లేదని మీ రనవద్దు. కాని మే మీపని చేసియే తీరుదుము అనండి. చరిత్రలో నేటివఱకు ఏ పని జరిగియుండదో, దానిని చేయుటకే ఈశ్వరుడు మనలను సృజించియున్నాడు. చేయవలసిన పనులన్నియు మన పూర్వులే చేసివేసియుండిన యెడల ఈశ్వరుడు మనకీ జన్మను ఎందుకు ప్రసాదించును ? కనుక చరిత్రలో నేటివఱకు జరుగనటువంటి అహింసా క్రాంతిని మనము ప్రవేశపెట్టి చూపవలె నన్న సంగతి జ్ఞాపకము ఉంచుకొనండి."

నేడు. బాబా ప్రవచనము చేయుచున్నప్పుడు, 'బాబా మాట్లాడుచుండుట లేదనియు, ఏఅవ్యక్తపురుషుడో మాట్లాడుచున్నాడనియు, అతడే బాబా ద్వారా యీ పనిచేయించుచున్నాడనియు తోచెను. అతడు మనకింత సమీపములో ఉన్నప్పటికిని, అతని సంగతినే తెలిసికొనజాలకున్నాము.

మౌజమాబాదు పోవునప్పుడు ఒక కార్యకర్త వేసిన ప్రశ్నకు సమాధానముగా బాబా ఇట్లనిరి: "సర్కారువారు తమ పని చేసికొనుచుందురు. నేను నా పని చేసికొనుచుందును. నాకు జనశక్తి మీదనే

నమ్మకము ఉన్నది. కనుకనే జనశక్తిని ప్రబోధించుటకీ పని చేయుచున్నాను. కాని బీదల హితము కొఱకై శాసనములు చేయకుండ, సర్కారువారిని ఎవరు అడ్డు పెట్టుచున్నారు? శాసనములు చేయుట వారి పని. కాని నాకు శాసనములమీద విశ్వాసము లేదు. జనశక్తిమీద ఉన్నది. శాసనము వల్ల కొన్ని విషయములు పరిష్కారము కాగలవని నే నంగీకరింతును.

"నేను ప్రేమ మార్గముతో లోకమున కొక భావనను ఇచ్చి, నా పని చేసికొనుచున్నాను. ఒకవేళ నా భావన కొద్దిమందికే అర్థమయిన యెడల పని కొంచెముగానే జరుగగలదు. అందఱకును అర్థమైన యెడల పని అంతయు అయిపోవును. ఎవరికిని అర్థము కాని యెడల ఏ పనియు కాదు. కాని నేను మాత్రము భావననే బోధించుకొనుచుపోయెదను. బలవంతముగా నా భావనను ఎవరిపైనను రుద్దను. ప్రతి వారికిని తమతమ భావములను ప్రచారము చేసికొనుటకు అధికారము ఉండవలెనని నే నంగీకరించెదను. నా భావన తప్ప, మిగిలిన భావముల ప్రచారము జరుగరాదని చెప్పుట దోషమనికూడ అంగీకరింతును. కమ్యూనిస్టులు తమ భావములను ప్రజల కెఱుకపఱచెదరు. నేను నా భావములను ఎఱుకపఱచెదను. ఇతరులు కూడ తమతమ భావనలను ఎఱుకపఱుపవచ్చును. జనులు ఏ భావన మంచిదని తలచెదరో, దానిని పరిగ్రహింపగలరు. ఎంచుకొను పని ప్రజలది. నా మనస్సులో ఎటువంటి చిక్కును లేదు. నా బుద్ధి మిక్కిలి నిర్మలముగానున్నది. నేను జనుల కొక భావనను తెలుపుచున్నాను. ఆ భావన సర్వోత్తమమని నా ఉద్దేశము. అయినను ఆ మార్గమును గ్రహించుట, గ్రహింపక పోవుట అది జనుల యిష్టము."

"నన్ను దారిలో ఎవరయినను ఆపినయెడల, ప్రతి నిమిషమునకు నాకు ఫీజు (భూదానము) చెల్లగట్టవలసియుండును" అని ఇప్పటివఱకును బాబా చెప్పుచుండెడివారు. కాని ఈ రోజున వారు, 'నన్ను

అడిగిన ప్రతి ప్రశ్నకు ఫీజు ఇవ్వవలసి యుండు' నని చెప్పియున్నారు. ఈ రోజున ప్రశ్నలడిగిన కార్యకర్తతో, బాబా చిఱునవ్వు నవ్వుచు "ఈ రోజున మీరు నన్ను మూడు ప్రశ్న లడిగినారు. కనుక ఇప్పుడు 300 యకరముల భూమి తెచ్చి యివ్వవలెను" అనిరి. ఈ మాటలు విని నేను నా మనస్సులో లెక్కలు వేసికొన నారంభించితిని. నేను ఎన్నో ప్రశ్న లడిగితిని. వాని అన్నిటికిని ఫీజు క్రింద వేలకొలది యకరములు కాగలదు. నేను ఇన్ని వేల యకరములను ఎక్కడనుండి తేగలనను భయము గలిగినది. కాని ఇట్లనుకొంటిని— భూమికంటెను జీవితము విలువయినదే గదా! కనుక భూదానకార్యము నిమిత్తము జీవితమును సమర్పణచేసి ఋణ విముక్తురాలను కాగలను.' కాని జ్ఞానము సంపాదించుకొంటిని గదా! ఈ ఋణము ఒక్క జన్మలో కాదు, అనేక జన్మములలో కూడ తీర్చుకొనజాలను.

మౌజమాబాదు కేవలము గంగ ఒడ్డుననే నిలిచియున్నది. గ్రామము సమీపమునకు రాగానే శీతల వాయువులు, మెత్తని నేల గోచరించినవి. వానివల్ల గంగాజీ సమీపముననే ఉన్నదని తెలియ వచ్చినది. మజిలీకి చేరుకొనగానే విశాలమయిన గంగాప్రవాహ భవ్య దర్శనమయినది. గంటలకొలది అటువంక చూచుచున్నప్పటికిని తృప్తి కలుగలేదు. మా నివాసస్థానమునుండి అక్షరాలా నాలుగు అడుగులలోనే గంగాజీ ఉన్నది. అనగా మా యింటిలోనికే గంగాజీ వచ్చియున్నదన్నమాట గంగలోని ఇసుక మైదానములు నీలముగా ప్రకాశించుచుండెను. అందలి ఇసుకరేణువులు తెల్లని కాంతితో తళతళలాడుచుండెను. ఆ సౌందర్యమును చూచి యేతీరవలెను. యమునలోని ఇసుక తిన్నెలు గోధుమరంగు గలిగి యుండగా గంగలోని ఇసుక తిన్నెలు నీలవర్ణము గలిగి యున్నవి. రెండింటి సౌందర్యము ఒకదానితో నొకటి పోటీ చేయుచున్నట్లుండెను. గంగా యమునలను సందర్శించినంత మాత్రాననే సౌందర్య సాక్షాత్కారమగుచుండును.

# పునరాగమనము

లాల్ గంజ్
12—6—1952.

రాత్రి గడచిపోవుచుండెను. రాయబరేలీ జిల్లాలో ప్రవేశించుటకుగాను మేము నావనెక్కితిమి. నావయెక్కి గంగను దాటవలసియున్నది. ప్రార్థన జరుగుచుండెను. ప్రశాంతసమయమున, సౌమ్య శీతల ప్రకాశమున, మేమొక్క బ్రహ్మర్షితో కూడ ఉపనిషత్సూక్తములను పారాయణచేయుచు నావపైన పోవుచుంటిమి. ఆ సమయమున మేము అపూర్వానందము ననుభవించితిమి. ప్రార్థన సమాప్తి కాగానే మేము 'సంత పరమహితకారీ' అను భజన కీర్తనను పాడ నారంభించితిమి. నెమ్మది నెమ్మదిగా నావ ముందునకు సాగిపోవుచుండెను. మనస్సులో గలిగిన సంతోషమునకు మేరలేదు. నేత్రముల నుండి జాఱిన కన్నీళ్ళు, గంగాజలమును కౌగలించుకొనుటకు వేగముగా పోవుచుండెను. అవతలిగట్టున రాయబరేలీ జిల్లా ప్రజలు స్వాగతముకొఱకు నిలబడియుండిరి. నావ సమీపమునకు రాగానే కార్యకర్తలలో ఒకరు స్వాగతమిచ్చుచు ఇట్లు ప్రసంగించిరి; 'జాహ్నవీ తీరమందలి యీ తపోభూమిని ఎందఱో మహర్షులు పావనము గావించిరి. జహ్నుమహర్షి, గర్గమహర్షుల ఆశ్రమములు ఇక్కడనే ఉండెను. కల్యాణగుణసంపన్నుడయిన రామచంద్రుడు ఇచ్చటనుండియే నావలో కూర్చుండి దక్షిణమునకుపోయి లంకను జయించెను. ఇప్పుడు దక్షిణమునుండి సాధు పుంగవులు ఇక్కడకు వచ్చి జాహ్నవిని దాటి ప్రభు రామచంద్రుని భూమిలో ప్రవేశించుచున్నారు. రామరాజ్య స్థాపన చేయవలెనని వారు సంకల్పించిన మహత్కార్యములో మనము కూడ ఆత్మార్పణచేసికొనుట మన కర్తవ్యమై యున్నది,' అని. సృష్టి యందంతటను శాంతి విస్తరించియుండెను. కేవలము ఆ మాటలు

మాత్రమె వినవచ్చుచుండెను. ఆ మాటలు ఇప్పటికిని చెవులలో గింగురుమనుచున్నట్లు తోచెడివి. మా నావ ఒడ్డునకు చేరగానే 'మహాత్మాగాంధీకీ జయ్' అను ఘోష పది దిక్కులయందును ప్రతి ధ్వనించెను.

గంగ ఒడ్డున శివాలయ మున్నది. ఇక్కడకు సమీపమున గల ఖజ్వార గ్రామమునకు జమీందారయిన రాణాసాహబు ఆ శివాలయములో బాబా కంఠమున తులసీమాల వేసి వారికి స్వాగతమిచ్చెను. అనంతరము నాలుగు వేల బీగాల భూమిని దానపత్రమును వ్రాసి చదివించెను. ఎవరిని పోషక వర్గములో చేర్చుచున్నామో, ఆ వర్గమునకు ప్రతినిధి తన భూమిహీన సోదరుల హక్కును వాపసు చేయుటకు స్వయముగా తనభూమిని ఇచ్చి దరిద్రనారాయణ ప్రతినిధికి వందనము చేయుచున్నాడు. ఈ క్రాంతికారి యయిన ఘట్టము అల్పమయినదా ! దీనియందు గర్భితమయిన క్రాంతినిగురించి మనము తెలిసికొంటిమా, హిందూస్తానము ఆకారమే మారిపోవును.

## క్రాంతి రాజశక్తి వల్ల గాక ఋషిశక్తి వల్లనే కాగలదు.

*అటౌరా బుజుర్గు, రాయబరేలీ*

**13, 14 జూను 1952**

వినోబాజీ సాయంకాలము ఉపన్యాసములో, కార్యకర్తల మాంద్యమును పసిగించుకొని, వారిని కటువుగా మందలించిరి. నవ్యరక్తముతో నిండిన యువజనులు కావలెనని ఆవాహనము చేసిరి. "క్రాంతి ఎన్నడును ముసళ్లవల్ల కానేరదు. అది పడుచువారివల్లనే కావలెను. నూతన భావమును గ్రహించునట్టి శక్తి నవ్యరక్తములోనే

ఉండును. రాజశక్తివల్ల ఎన్నడును క్రాంతి రానేరదు. అది ఋషుల వల్లనే రావలెను. గొప్పగొప్ప సామ్రాజ్యాధిపతుల స్థానము ఇతిహాస గ్రంథములలో నుండును కాని ప్రజాహృదయములో నుండదు. రాజశక్తి వల్లనే క్రాంతి రాగలిగిన యెడల బుద్ధభగవానుడు తన చేతిలోని రాజశక్తిని విడిచి సన్యాసి ఎందుకు కావలసి యుండెను.''

సయీ నదీ తీరమున ఉదయోన్ముఖుడైన సూర్యుని సాక్షిగా రాయబరేలీ ప్రజలు వినోబాకు స్వాగత మర్పించిరి. నినాదములును, పెద్ద కంఠములతో పాటలును ప్రారంభమయ్యెను.

''ఏక్ నయే ఢంగ్ సే, నయే రంగ్ సే, బదలేగా సంసార్
బదల్ నేవాలా ఆయా హై''

కొన్ని రోజులు బాబాతో కూడ ఉండవచ్చు నను సంకల్పముతో ఇక్కడకు వచ్చియుంటిని. కాని ఇప్పుడు భూదాన యజ్ఞముకొఱకు నా జీవితమును సమర్పింపవలెనని నిశ్చయించుకొంటిని. నేనీ సంగతి బాబాతో చెప్పగానే, వారు చిఱునవ్వు నవ్వుచు, ''చాల మంచిమాట. స్వార్థముకంటె పరమార్థము ఎల్లప్పుడును శ్రేయస్కరమైనదే'' అనిరి. అటుపిమ్మట ''భూదానములు-చదువుకొన్నవారు'' అన్న విషయమును గుఱించి మాట్లాడుచు ఇట్లనిరి: సామాన్యముగా చదువుకొన్నవారును, విద్వాంసులును క్రాంతి కార్యములు సాధించుటకు ముందునకురారు. చిన్నచిన్నవారి వల్లనే క్రాంతి సాధింపబడగలదు. వారివల్లనే చరిత్ర ఏర్పడగలదు. ఆ చరిత్రను వ్రాయుటకు విద్వాంసులు సిద్ధమగుదురు.''

నా స్వంత పనిమీద నేను మా గ్రామము పోవలసి యున్నది. రాయబరేలీలో ఉండుటయే ఆఖరు రోజు. ఇంటికి పోవలెనను బుద్ధి పుట్టుటలేదు. కాని భూదానయజ్ఞముకొఱకై జీవితమును సమర్పించుకొంటిని గదా! కనుక బాబా చెప్పినట్లు వియోగభారముతో కూడ, సాంగత్య సుఖముతోనే పోవుచుంటిని.



## ఆఱవ భాగము

# పూర్వ పశ్చిమ సంగమము

*కాశీ విద్యాపీఠము, బనారస్*
11—9—52.

ఈనాడు బాబాజీ పుట్టిన రోజు. సర్వ సాధారణముగా ఇట్టి రోజున మనుష్యుడు తన వెనుకటి జీవితమును సింహావలోకనము చేసికొని యశాపయశములను తూచుకొనుచుండును. కాని ఎవరు తమ జీవితములో చిరంతన సత్యమును గుఱించి అన్వేషణ చేసియుండిరో ,ఎవరి జీవితము ప్రతిక్షణము చిరసనాతనము, చిర నూతనము అయియున్నదో అటువంటి వ్యక్తి జన్మదినమందు విశేషమేమి ఉండగలదు ? అయినను అప్పుడప్పుడు అటువంటి మహాపురుషుల అతికఠోర తపస్సంకల్పములు వారి జన్మదినమందు ప్రకటింపబడుచుండును. కాని అయ్యది కేవలము యోగాయోగమే. వినోబాజీ-కూడ ఈనాడొక సంకల్పమును వెల్లడించిరి. "భారత దేశములో భూమి సమస్య పరిష్కారము కాకుండ ఉన్నంతవఱకు నేను పవనారు ఆశ్రమములో కాలుపెట్టను. సంచారము చేయుచునేయుందును; లేదా ఈ పనియందే ఆహుతి అయిపోదును.''

ఇక్కడకు సమీపములోనున్న భారతమాతా మందిరము పుస్తకాలయములో సాయంకాల సభ జరిగినది. మందిరములోని హాలు

అశోక పుష్పములతోను, పత్రములతోను అలంకరింపబడియుండెను. ఉత్తర ప్రదేశములోని మండలము లన్నిటినుండి కార్యకర్తలు వచ్చియుండిరి. ఇక్కడ స్ఫూర్తిని, ప్రేరణను పొంది తమ తమ జిల్లాలలో భూదాన కార్యములు సాధింపదలచియుండిరి. ఇంక రెండు దినములకు వినోబాజీ ఉత్తర ప్రదేశమును విడిచిపోగలరు. అందువలన ఇది వీడ్కోలు సమావేశము కూడ అయియుండెను. సభా ప్రారంభమున వినోబాజీని అభినందించుచు కవితావర్షము కురిపింపబడెను. అనంతరము ఉపన్యాసములు. ఒకరు వినోబాజీని దక్షిణమునుండి ఉత్తరమునకు వచ్చిన సర్వగుణ విభూషితుడగు రామచంద్రు డనిరి. ఇంకొకరు నవయుగసందేశకర్త యనిరి. మఱియొకరు అహింసాక్రాంతికి అగ్రదూత యనిరి. వేఱొకరు భగీరథుడనిరి. వశిష్ఠుడనిరి. బనారసు హిందూ విశ్వవిద్యాలయమునకు ఉపకులపతియగు ఆచార్య నరేంద్ర దేవ్ ఇట్లనెను: ''వినోబాజీ పూర్వపశ్చిమముల సుందర సంగమమయియున్నారు. వారు నవీనులకంటె నవీనులు. ప్రాచీనులకంటె ప్రాచీనులు.' కాన్పూరులోని శివనారాయణజీ టండను ఇట్లనిరి: 'వినోబాజీ యందు భగవద్గీతము రూపము దాల్చియున్నది.' మంగరూటు వాస్తవ్యులు దివాను సాహెబు ఇట్లనెను: 'నేను వక్తను కాను. సేవకుడను. కనుక నే శబ్దములవల్లగాక కృతివల్ల వినోబాజీ మార్గము నిజమయిన సుఖమునకు మార్గమని చెప్పుచున్నాను.'

వినోబాజీ తమ ఉపన్యాసములో-తమ సంకల్పమును గుఱించి వెల్లడించును ఇట్లనిరి: 'గీతలో యజ్ఞము, దానము, తపస్సు అను మూడు క్రియలు చెప్పబడినవి. జనులు దానము, యజ్ఞము చేయుచున్నారు. ఇక కార్యకర్తలు తపస్సుచేయవలెను. నేనీరోజున మిమ్ము తపస్సుచేయవలెననియే కోరుచున్నాను.'

కొన్ని శబ్దములను ఉచ్చరించుట తేలికయేగాని, ఆచరించుట కష్టము. 'తపస్సు' అటువంటి శబ్దము. హింసాక్రాంతియందే లేక

యుద్ధమునందు, శౌర్యము, ధైర్యము చూపించుటకు అవకాశ ముండును. కాని అహింసాక్రాంతియందు అంతకంటె అనేకరెట్లు అధికముగా శౌర్యము, ధైర్యము ప్రదర్శింపవలసియున్నది. అంతేగాక ఇంకను లోతుగా పోవలసియున్నది. రణరంగములో గుండుదెబ్బతిని నవ్వుచు, నవ్వుచు మరణించుటలో తప్పక పరాక్రమము ఇమిడి యున్నది. కాని నవ్వుచు నవ్వుచు తపస్సుతోకూడిన జీవితము గడపు టలోగల పరాక్రమము ఇంకను మూల్యవంతమయినది. దీపము కొంచెముకొంచెముగాను, అఖండముగాను మండుచున్నదని కావ్యము లలో ఉపమానము చెప్పినప్పుడు మధురముగానుండును. అట్లే అహింసా సైనికుని జీవితమంతయు ఆ దీపమువలె నిరంతరము జ్వలించునదయి యున్నది.

కాశీమహారాజు పదివేల ఎకరముల భూదానముచేసియున్నారు. నేటివఱకు చేసిన దానములలో వారిదే గొప్పది. వారు రెండు జాములవేళ వినోబాజీని కలిసికొనుటకు వచ్చిరి. వినోబాజీని పుట్టిన రోజు పండుగకు వారు ఒక పులిచర్మమును కానుకగా సమర్పించిరి.

కాశీ విద్యాపీఠము ఇంతవఱకు ఎందఱో నరరత్నములను దేశమునకు ప్రసాదించినది. వర్షాకాలమగుటవలన ఆ విద్యాపీఠము లోనే, వినోబాజీ గడచిన రెండు మాసములనుండియు నివాసము చేసి యుండిరి. ఆ రోజులలో "ధర్మచక్రమును ప్రవర్తింపజేయుటెట్లు" అన్న విషయమును గుఱించి చింతనచేయుచుండిరి. వారికి వేదములు, ఉపనిషత్తులు, గీత, కురాను, బైబిలు మొదలయినవి ఆప్తమిత్రులు. అందువలన ఆ గ్రంథములను పఠించుటయందే తమకాలమును గడుపు చుండిరి. శంకరభాష్యము కూడ వారికి అత్యంత ప్రియమైనది.

ఈ చింతనవల్ల ఏ వస్తువు ఉత్పన్నమయినదో దానినిగుఱించి భావి చరిత్రకారుడు చెప్పగలడు.

# భూమి అధికారమును ఇప్పుడు ఇచ్చివేయండి.

*ముగల్‌సరాయ్ (బనారస్)*

12—9—52

వర్షాకాలమందు యాత్రలు మానివేసి విశ్రమింప వలసినదని ప్రాచీన ఋషుల ఆదేశమయి యున్నది. ఈ ఆదేశమును పాలించుటకు గాను, వినోబాజీ గడచిన రెండు మాసములు కాశీలో నివాసము చేసి యుండిరి. కడచిన సంవత్సరము తెలంగాణా యాత్ర అయిపోయిన పిమ్మట వారు ఈ విధముగానే వర్షాకాలములో రెండు మాసములు తమ పవనారు ఆశ్రమములో గడపియుండిరి. సరిగా ఈ రోజుననే వారు ఉత్తర భారత యాత్రను ప్రారంభము చేసియుండిరి. అప్పటి నుండి, ప్రజలకు చక్రవర్తిత్వము పొందింపజేయుటకుగాను, ఈ ప్రజా సూయ యజ్ఞాశ్వము సంతతము సంచారముచేయుచున్నది. పరమేశ్వరుని ప్రేరణవల్లనే ఈ సంచారము జరుగుచున్నప్పుడు, దీనిని అడ్డు పెట్టగలిగిన వారెవ్వరు? భారతభూమిలో అది తిరుగుట పూర్తి కాగానే దరిద్ర నారాయణునకు ప్రపంచ చరిత్రలో అందరికంటె ముందుగా సార్వభౌమత్వ పదవి ప్రాప్తించును.

నేటికి మూడు నెలల తరువాత. మరల నా యాత్ర ప్రారంభ మయ్యెను. ఈ లోపుగా వినోబాజీ రాయబరేలీ తరువాత, సుల్తానుపూర్, అలహాబాదు, మిర్జాపూరు జిల్లాలలో యాత్ర చేసియుండిరి. సుల్తానుపూరులో అన్ని జిల్లాలకంటె ఎక్కువ భూదానము దొరకినది. సాహిత్యము కూడ ఎక్కువగా విక్రయింపబడినది. ప్రస్తుతము ఉత్తర ప్రదేశ భూదాన సమితిలో ప్రముఖులయిన అలహాబాదు నివాసులు రాజర్షి టండన్‌జీ యాత్రలో మాతోకూడ నుండిరి. నిత్యక్రమము

ననుసరించి ఉదయము నాలుగు గంటలకు కాశీ విద్యాపీఠమునుండి బయలుదేరితిమి. అక్కడనుండి మాలవీయ వంతెన వఱకు బాట కిరువైపుల వందలకొలది నగరవాసులు బారులుతీర్చి నిలిచియుండిరి. మాలవీయ వంతెనవద్ద వినోబాజీ నగరవాసులకు కడసారి వందనము చేసి, "స్వచ్ఛ కాశీ ఆందోళనము" సాగింపవలసినదిగా సందేశమిచ్చిరి. ఈ రోజులలో మన తీర్థక్షేత్రములలో చాల మురికి ఏర్పడియున్నది. తీర్థస్థానములలో మరణించినయెడల తిన్నగా స్వర్గమునకు పోవుదురని చెప్పుచుందురు. అందువల్ల నేకాబోలు అక్కడనుండి తిన్నగా స్వర్గమునకు పోవుటకు ఈ సదుపాయము చేసియున్నారు. కాశీలోని మురికిని చూచిన వినోబాజీకిచాల దుఃఖము కలిగెను. వారు కాశీనగరవాసులకు ఆవాహనముచేసిరి. అంతట సెప్టెంబరు 7 వ తేదీన వందలకొలది నగరవాసులు సాధుపుంగవుని ఆవాహనమునందుకొని, చేతులలో చీపురుకట్టలు పట్టుకొని, 'స్వచ్ఛ కాశీ ఆందోళన' ను ప్రారంభించిరి. జనశక్తిని ప్రబోధింపచేసి సమస్యలు ఎట్లు పరిష్కరించుకొనవచ్చునో తెలుపుటకు ఇదియొక చక్కని ప్రమాణముకాగలదు.

వంతెనమీద నిలబడి నేను మరల ఒకసారి కాశీనగరమువంక చూచితిని. క్రిందనుండి విశాలమైన గంగా ప్రవాహము పోవుచుండెను. ఇప్పుడిప్పుడే అరుణోదయమగుచుండెను. నీలాకాశముపైన లేతగులాబి రంగు అలముకొనియుండెను. తెల్లని మబ్బులు గుంపులు గుంపులుగా ఇటునిటు విహరించుచుండెను. •గంగ ఒడ్డున నిలిచిన అతి ప్రాచీనమయిన ఆ కాశీనగరము ఎక్కువ రమ్యముగా కనబడుచుండెను. దేవాలయములనుండి ఘంటాధ్వని వినవచ్చుచుండెను.

ఉత్తర ప్రదేశములోని ఒక కర్మఠ కార్యకర్త శ్రీ జలేశ్వర భాయీ గడచిన తొమ్మిది మాసములనుండి వినోబాజీవెంట యాత్రలో నుండెను. అత డిట్లనెను: 'నేను తొమ్మిది మాసములనుండి దారిలో బాబాకు త్రాగుటకు మంచితీర్థము ఇచ్చుచుంటిని. అందువల్ల నా పేరు

సార్థకమయినది' అని. జలేశ్వరభాయీ మొన్నమొన్ననే రెండువేల యకరముల భూమి పంపకము చేసివచ్చెను. ఆ పనిలో తనకు గలిగిన అనుభవమును ఇట్లు చెప్పుచుండెను: 'పంపిణీ చేయునప్పుడు ఎక్కువ భూదానములు లభించుచుండును. భూమి హీనులకు ఇచ్చుటకుగాను ఎడ్లు, విత్తనములు మొదలయిన సాధనములు గ్రామమునుండి లభించుచుండును. పంపిణీ జరుగునప్పుడు జనులు గుంపులు గుంపులుగా వచ్చెదరు. ఆ సమావేశము అభూతపూర్వముగానుండును. ఎవరికి భూమి లభించునో వారికి ఎన్నోజన్మలనుండి ఉన్న అభిలాష ఈనాడు నెరవేరుచున్నట్లు తోచును. భూమిదాన యజ్ఞము వలన భూమి హీనులలో ప్రబోధము గలుగుచున్నది. వారికి భూమి లభింపగలదని తెలిసికొనియున్నారు. అందువలన వారిలో స్వాభిమానము ఏర్పడినది. ఇప్పుడు వారింక అత్యాచారములను సహించి ఊరకుండజాలరు.'

ఈ రోజున మంగరూటు నివాసి దివానుసాహెబు మా వెంట ఉండెను. అతడు మంగరూటు సంగతులు వినిపించుచుండెను. బయట నున్న కొందఱు జనులు మంగరూటు నివాసులను ఎచ్చగొట్టుటకై ప్రయత్నము చేసిరి. "ఏమయ్యా! భూమి అంతయు దానము ఇచ్చుట వలన మీకు కలిగిన లాభమేమి? దివాను సాహెబునకు పేరువచ్చినది, మంగరూటునకు పేరా, ఊరా?" అనిరి. ఆ మాటలకు మంగరూటు నివాసులు ఎంతో మంచి జవాబుచెప్పిరి. "ఓ అయ్యలారా! ఇప్పటి వఱకు మంగరూటుపేరు ప్రక్కనున్న రాజ్యములో ఎవ్వరును ఎరుగరు. అటువంటిది నేడు హిందూస్థానమం దంతట మాఱుమ్రోగి పోవుచున్నది. రేడియోలో కూడ ఆ సంగతే చెప్పబడుచున్నది" అని.

సింధు దేశములోని ప్రసిద్ధకవి దుఖాయల్ జీ ప్రస్తుతము మా యాత్రీదళములో చేరియున్నారు. వారు సింధీభాషలో గొప్ప భక్త కవి, ఇప్పుడు హిందీలోకూడ పాటలు వ్రాయుచున్నారు. తాము

కట్టిన ఖంజరీపైన పాడుచుండగా వేలకొలది జనులు మంత్రముగ్ధులై వినుచుందురు.

"దే దో అబ్ భూమి అధికార్
దాన్ కరో, అభిమానరహిత, తో హోగా, బేడాపార్"

వారుకట్టిన యీపాట మిక్కిలి జనరంజకముగా నుండెను. ఈ పాటలో భూదాన తత్త్వజ్ఞాన మంతయు మిక్కిలి సరళభాషలో చెప్పబడినది.

నిన్నటిదినము (13-9-52) ఉత్తర ప్రదేశయాత్రకు చివరి దినము. ఇంక బీహారులో ప్రవేశింప నున్నాము. కడచిన పదిమాసముల నుండి బాబా రాఘవదాసు, కరణభాయీ, కపిలభాయీ, జలేశ్వర భాయీ మొదలయినవారు బాబా వెంటనుండిరి. వారి ముఖసీమల నలముకొన్న విషాదరేఖలు చూడగా వియోగక్షణములు సమీపించు చున్నవని తెలియవచ్చెను. ఈ రోజు భోజన సమయమున కరణభాయీ మమ్ము బలవంతపెట్టి మీగడ పెరుగు తినుపించుచుండెను. అంతట నేను సరసముగా "ఏమండీ! మీరు మమ్ము పహల్వాను వస్తాదులను చేయదలచుచున్నారా" అనగా, కరణభాయీ 'నాయనా! తినరా! ఇది చివరిరోజు' అనిరి. నేత్రములు కన్నీళ్ళతో నిండియున్నట్లు నేను కనిపెట్టితిని.

## భూదానము నిమిత్తము ఆత్మ సమర్పణ ప్రారంభం

*సయ్యదురాజా (బనారసు)*

13—9—1952.

పూజ్యులు కిశోర్ లాల్ భాయీ మష్రువాలా స్వర్గవాసులయి నారన్న వార్తవిని నాలుగుదినము లయినది. వినోబాజీ కుడిచేయి

పడిపోయినట్లే తోచినది. అప్పటినుండి వారు తమ ప్రతి ఉపన్యాసము లోను స్వర్గీయ కిశోర్ లాల్ భాయీ తపస్వి జీవనమును గుఱించి ఏ కొంచెమయినను చెప్పుచుండిరి. ఈ రోజు ఉత్తర ప్రదేశ్ యాత్రకు చివరి దినము. ప్రాతఃకాల ప్రార్థన అయిన తరువాత వినోబాజీ మౌన ధారణచేయు అలవాటునకు భంగము కలిగించి కొంచెము సేపు ప్రసంగించిరి. మునుముందుగా కిశోర్ లాల్ జీని గుఱించి కొంచెము చెప్పి ఇట్లనిరి : "నే నొక ప్రతిజ్ఞా పత్రమును తయారుచేసితిని. జీవిత మంతయు భూదానకార్యముల నిమిత్తం సమర్పణ చేయగల కార్యకర్తలందఱు దానిపైన సంతకము చేయవలెను. అట్టి ప్రతిజ్ఞ తీసికొను కార్యకర్తలు నాకు కావలెను. అటువంటి దీక్షాపరులు కొద్దిమంది ఉన్నను పరవాలేదు. ఏసుక్రీస్తునకు ప్రారంభములో పంద్రెండుగురు శిష్యులే యుండిరి.

సాయంకాల సభాదృశ్యము ఎన్నటికిని మఱపునకు రానిది. గ్రామము చిన్నదే అయినప్పటికిని సభలో పదివేలమంది జనులకంటె అధికముగా వచ్చియుండిరి. ఆకాశము మేఘావృతమయియుండెను. దుఖాయల్ జీ మధుర స్వరమున గానము చేయుచుండెను. కవివాణి జనులకు విశ్వ బంధుత్వమును బోధించుచుండెను.

"కైసాహై యహ్ సుఖమయ సపనా మానోసారా జగహై అపనా,
సబకే సుఖమేఁ సుఖ మానే హం సబకే దుఖమే సీఖేఁ తడపనా"

వినోబాజీ ప్రవచనము ప్రారంభముకాగానే బ్రహ్మాండముగా వాన కురియసాగెను. కొందరు గొడుగులు తీయుచుండగా చూచి వినోబాజీ పెద్దకంఠముతో "గొడుగు లన్నీ తీసివెయ్యండి. వర్ష రూపములో పరమేశ్వరుని కృపారసము కురియుచున్నది. మధ్యను గొడుగులు పట్టకండి. తిన్నగా పరమేశ్వరుని స్పర్శ కలుగనీయండి" అనిరి. అంతట గొడుగు లన్నియు ముడిచి వేయబడినవి. ఆకాశమునుండి భూమికి వెండి త్రాళ్ళు పెట్టి బిగించినట్లు వాన కురియుచుండెను.

అయినను జన సముదాయ మంతయు బొమ్మలవలె కూర్చుండి, సాధు పుంగవుని మధురవాక్కు వినుచుండిరి. పసిపిల్లలు కూడ ప్రశాంత ముగా కూర్చుండియుండిరి. వినోబాజీ వాగ్ధార ఝరీవేగమున ప్రవ హించుచుండెను. "వినోబాజీ మాట్లాడుచుండుటలేదు. వారి ముఖము నుండి ఈశ్వరుడే మాట్లాడుచుండెను."

సభానంతరమున కొంతసేపటివఱకు ఈ దృశ్యమే కనబడు చుండెను. ఒంటిమీద చినిగిన పీలికలతో, చేతితో కఱ్ఱ పొడుచుకొనుచు ఒక్కొక్క రైతు ముందునకువచ్చి దానపత్రముమీద సంతకముచేసి కుచేలుని పిడికెడు అటుకులవలె సమర్పణచేసి పోవుచుండెను. ఇప్పుడు కాలము మారిపోయినది. ఈనాడు అతనివద్ద ధనముగాని, దర్పము గాని, వైభవముగాని లేవు. అయినను యజ్ఞములో ఆహుతి సమర్పిం చుటకు అతడు తన ప్రాచీన భారతీయ పరంపరను మఱచియుండలేదు. భారతదేశమును పునరుద్ధరించుటకు ఆరంభమయిన భూదానయజ్ఞంలో రైతులు తమ హవిర్భాగములను సమర్పించి తమ ప్రాచీన పరంపరను నిలబెట్టుకొనుచుండిరి. బీదల దానమును గుఱించి వినోబాజీ "గుండె కాయ ముక్కలు" అనుచుందురు. ఈనాడు ఎందఱో నిరుపేదలయిన రైతులు తమ గుండెకాయ ముక్కలతో సమాన మయిన భూమిని దానము చేయుచుండుటవలన, ఈ దానములనుండి మహత్తర మగు క్రాంతికారక-శక్తి ఉద్భవించగలదని వారి విశ్వాసము.

ఉత్తర ప్రదేశములో గడచిన పది మాసముల యాత్రలోను ప్రతిదినము వెయ్యి యకరముల చొప్పున అయిదు లక్షల బీగములు (మూడున్నరలక్షల యకరములు) దానరూపముగా దొరికియుండెను.

దీని తాత్పర్య మేమనగా అయిదులక్షల మంది మనుష్యులకు శాశ్వతముగా స్వాభిమానముతో గూడిన నవ్య జీవితమును గడుపు కొను అవకాశము ప్రాప్తించియుండెను. ఇదంతయు కేవలము ప్రేమ శక్తివల్లనే గలిగినది. సూదిమొనమోపినంత భూమి యయినను ఇచ్చు

టకు దుర్యోధను డంగీకరింపలేదు. అందువల్లనే మహాభారతయుద్ధము జరిగినది. కాని ఈనాడో... వేలకొలది రైతులు ఇష్టపూర్వకముగా లక్షల యకరాల భూమిని దానమిచ్చుచున్నారు. ఒక్క నెత్తురు చుక్క చిందకుండ, ఎవరి మనస్సును నొప్పింపకుండ, మానవులందఱి హృదయములలోను దాగియున్న సత్ప్రవృత్తులను మేలుకొలిపి, ఈ కాలమునాటి "యక్ష ప్రశ్న" కు సమాధానము కనుగొనబడినది.

## ఉత్తర ప్రదేశము విడిచి బీహారులో ప్రవేశించుట

దుర్గావతి (షాహాబాదు)
14—9—52.

రాత్రి గడచిపోవుచుండెను. ఉత్తరప్రదేశ ప్రజలు వినోబాజీని వీడ్కొలుపుటకై భజనకీర్తనలు పాడుచుండిరి. దానపత్రములు స్వీకరించుటకు వినోబాజీకి ఒకచోట ఆగవలసి వచ్చెను. దానపత్రములు అర్పణచేయుచు బాబా రాఘవదాసు గద్గద కంఠముతో, "ఇక కొంచెము సేపటిలో ఈశ్వరుని మహాభక్తులయిన వీరిని ఉత్తర ప్రదేశమునుండి సాగనంపగలము" అనిరి. ఉత్తర ప్రదేశీయుల కన్నీటి ధారలు ఒండొరులతో పోటీచేయుచుండెను. మా నేత్రములనుండియు కన్నీటి వర్షము కురియుచుండెను. మేము స్వజనమును వీడిపోవుచున్నామా! అనిపించెను. ఉత్తరప్రదేశ భూమిపైన వినోబాజీవి ఇవి ఆఖరు అడుగులు. ఉత్తర ప్రదేశీయులు విని కని యెఱుగని గాంధీ బాబా శిష్యులను క్షణములో గుర్తించిరి. ఈ ఉత్తర ప్రదేశములోనే గంగా యమునా తీరముల అసంఖ్యాకులగు ఋషీశ్వరులు తపస్సు గావించి, మానవులకు శాశ్వతముగా శాంతిని గలిగించు తత్వజ్ఞానము ను ప్రసాదించియుండిరి. ఇప్పుడో ఆ తపోభూమిపైననే అహింసా

ధర్మము యొక్క ధర్మచక్రప్రవర్తనము ప్రారంభమయ్యెను. అహింసా క్రాంతియందు క్రియారూపముగా పాల్గొన్న జనులు చివరిసారి నమస్కరించు వేళ సమీపించుచుండెను. ముందునకు వేయుచున్న మా అడుగులు బీహారువంకకు పోవుచుండెను. కరణభాయీ తనకు ప్రియమైనపాట పాడ నారంభించెను.

"గౌతమఋషికీ నారీ అహల్యా పత్థర్ సే, తుమ్ తార్యో రామ్"

గాంధీ నిర్యాణానంతరం దేశములో నిరాశాంధకారము వ్యాపించియుండెను. దానిమూలమున కార్యకర్తలందఱు నిస్తేజులును, ప్రాణహీనులును అయిపోయిరి. నిరాశ, నిస్సహాయత, పథభ్రష్టత అను ప్రవాహములో బడి అందఱును కొట్టుకొని పోవుచున్నారు. అందఱును సంవేదనా శూన్యులయి, చేతనా విహీనులయి జాతి బొమ్మలవలె అయిపోయినారు. అటువంటి సమయమున భూదానయజ్ఞము వచ్చినది. అయ్యది నవ్యచేతన, నవ్యప్రాణము, నవ్యస్ఫూర్తి కలిగించి మనకు అహల్యోద్ధరణ కలుగజేసెను.

మేము ముందుకు సాగిపోవుచుంటిమి. ఎదుట కర్మనాశానది కనబడుచుండెను. నదికి ఆవలిగట్టున బీహారు ప్రదేశ ముండెను. రెండు ప్రదేశముల సరిహద్దున ఒక భవ్యద్వారము నిర్మింపబడినది. దానిక్రింద అలంకరింపబడిన మంచెగలదు. ఉత్తర ప్రదేశవాసులు బాబా నుదుటను కుంకుమ తిలక ముంచి, హారతి ఇచ్చి, పాదములపై పుష్పాంజలి సమర్పించి కడసారి వందనము గావించిరి. విడిచిపోవు క్షణము వచ్చి వేసినది. మంచమీద వినోబాజీ కన్నులు మూసికొని ధ్యానస్థులై కూర్చుండి యుండిరి. ఈ సమయమున వారి హృదయసాగరములో ఎట్టి భావతరంగములు లేచుచుండునో ఎవరు చెప్పగలరు? రాత్రికి రాత్రియేవచ్చి వెడలిపోయిన ఆ అంధభక్తుడు రామచరణుడును, మన గ్రామమునుండి సాధుపుంగవుని వట్టిచేతులతో పంపగూడ దనుకొనుచు

కుచేలుని ఆటుకులవలె దాన సమర్పణచేసిన ఆ తెలికలవాడును, శబరి పండ్లవలె నా భూదానమును మీరు స్వీకరింపకతప్ప దని సమర్పించిన ఆ పేదరైతును - వీరందఱను స్మరించుటవల్ల బాబా హృదయము సంతుష్టి చెందకుండునా ? తమ గ్రామములోని భూమిహీను లందఱకు భూదానము చేసిన టికార్డీ గ్రామవాసులును, భూమి అంతయు గోపాలునిదే అని గ్రామదానము చేసిన మంగరూటు వాసులును, బాబా హృదయములో ఇల్లు కట్టుకొని కాపురము చేయుచునే యున్నారు. వారందఱను వారు స్మరించు చుండిరా ? వీని అన్నిటిని తలచుకొన్నందువల్ల వారికి ఆనందానుభవము గలుగుచుండవచ్చును. కాని నేటి కింకను దరిద్ర నారాయణుల క్షుధార్తిని తీర్పలేక పోవు చున్నా మను సంవేదనకూడ వారి హృదయమున ఉండి యుండ వచ్చును. బాబా ప్రశాంతముగా నుండుటకు ప్రయత్నము చేయు చుండిరి. అయినప్పటికిని వారి హృదయములో ఉత్తర ప్రదేశీయుల యెడగల ప్రేమ కన్నీళ్ళ రూపములో పొంగి వెలికివచ్చుచుండెను.

మేము మా హృదయ సీమలయందు, ఉత్తర ప్రదేశములోని అసంఖ్యాకములగు స్మృతి చిహ్నములను పదిలపఱచుకొని బీహారు భూమిపైన పాదము మోపితిమి.

"సంత వినోబా అమర్ హో" అని బీహారు ప్రజలు సింహగర్జన గావించిరి. ఈ గర్జనయందు భావిసూచన గర్భితమయియున్నది.

మార్గమునందు చూచుటకువచ్చిన వారిలో స్త్రీలసమూహము కనబడెను. వారినిచూచి, "రాముని భూమినుండి ఇప్పుడు సీతాదేవి భూమిలోనికి వచ్చుచున్నాము. ఇప్పుడీ లక్షణములు కనబడు చున్నవి" అని ఒక రనిరి. ఇది సీతాదేవియొక్క విదేహారాజ్యము. నేను కాంతలవద్దకు పోయి మాట్లాడసాగితిని. వృద్ధస్త్రీలు నన్నాశీర్వ దించుచు, 'నాయనా! నీవు గొప్ప తపస్సు చేయుచున్నావు. నీ దర్శ నమువలన మా భాగ్యము పండిన' దనిరి. వా రింతగా నన్ను గౌర

వించుటకు నేను అపాత్రురాల నని యెరుగుదును. అయినను వారి ఆశీర్వాద బలమువల్ల నేను, ఒకానొకనాడు పాత్రురాలను కాగలను. ఈ తల్లుల యొక్కయు, అక్క సెల్లెంద్ర యొక్కయు సేవచేయ దగు బలమును ప్రసాదింపవలసిన దని హృదయములో భగవానుని గురించి వేడుకొంటిని.

బుద్ధభగవానుడు విహారముసల్పిన బీహారములో ప్రవేశింపగానే వినోబాజీ "బీహారులోని భూమి సమస్య పరిష్కారముకానిదే నేను బీహారును విడిచిపెట్టిపోను" అని క్రొత్తగా ప్రకటించిరి. కాశీలో చేసిన చింతన పరిణామమే యిట్లయ్యెను. 'ప్రతి ప్రాంతములోను నాలుగైదు మాసములు సంచారము చేసి, నాలుగైదు లక్షల భూమి సంపాదించుకొనుచు, దేశమంతటను తిరిగిన యెడల దేశములో కొన్ని లక్షల యకరములు ప్రోగు కాగలవు. దాని మూలమున అనుకూల స్థితిగతులు కూడ ఏర్పడగలవు' అని వినోబాజీ ఆలోచించియున్నారు. కాని ఇప్పుడున్న ప్రకారముగా భూమి సమస్య పరిష్కారము కాదు. కనుక ఏదో ఒక ప్రాంతములో సమస్యను పరిష్కరించి చూపిన యెడల, హిందూస్థానమంతకును మార్గ మేర్పడగలదు. ఇట్టి ఆలోచనతో వారు బుద్ధ భగవానునకు తపోభూమి యయిన బీహారును తన ప్రయోగ శాలగా ఏర్పఱచుకొనిరి. ఒక త్రికోణములో ఏదయినను సిద్ధాంతము ఋజువయిన యెడల, అదే సిద్ధాంతము ప్రతిత్రికోణములోను రుజువు కాగలదు అని వారు తఱుచుగా చెప్పుచుందురు. కనుక బీహారులో అహింస వల్లను, కరుణ వల్లను, భూసమస్యా పరిష్కారము కాగలిగిన యెడల ప్రపంచములో ఏ దేశములోనైనను సరే అహింస గెలిచితీరిన దన్న మాటయే. బీహారునకు మరల ఒక పర్యాయము లోకమునకు మార్గము చూపునట్టి అవకాశ మేర్పడినది. వినోబాజీ ఇట్లనుచుందురు: "నేను బుద్ధభగవానుని చరణ చిహ్నములను అవలంబముగా గొని యున్నాను. అతడు మహాత్ముడు. నేను తుచ్ఛుడను. అయినను నే

నాతని కుమారుడను. అతని బుజముల మీద నిలిచియున్నాను. కనుక అతని కాలములో ఏ పని జరిగియుండలేదో అది నేడు కాగలదు. దానికి కారణము అతని అనుభవము మనకు ప్రాప్తించియుండుటయే.''

కమ్యూనిస్టుల ప్రశ్నలకు జవాబిచ్చుచు, వినోబాజీ యిట్లనిరి: ''కమ్యూనిస్టులు క్రాంతి, క్రాంతి యని బొబ్బలు పెట్టుచుందురు. కాని క్రాంతి అనగా ఏ పిట్టపేరో కూడ వారెఱుగరు. వారు క్రాంతి నిమిత్తము ఒక శాస్త్రమునుకూడ తయారుచేసియున్నారు. మార్క్సు పుస్తకములలో వ్రాయబడిన సంగతుల ననుసరించి క్రాంతి రాగల దని వారు తలచుచుందురు. కాని ఈ విధముగా క్రాంతిని మూసలో పోసినట్లయిన క్రాంతి స్వరూపమే నశించిపోవును. హిందూస్తానములో క్రాంతి ఎట్టి పద్ధతిని రాగలదో ఆ సంగతి వారికంటె నాకే బాగా తెలియును. వేదములు మొదలుకొని, గాంధీవఱకు గల సమస్త భావములను తఱచితఱచి నే నాపోశనము పట్టియున్నాను. కనుక నే ఈ దేశములోని క్రాంతికొక పద్ధతి, ఒక తత్త్వజ్ఞానము, ఒక సందేశము ఉన్నది.''

## ఘోషాకు వ్యతిరేకముగా తిరుగుబాటు చేయండి

*భభువా, సాసారామ్, కుదరా (షాహబాద్)*

15, 16, 17 సెప్టెంబరు, 1952.

'పేట్' అను పేరుగల ఒక అమెరికను సోదరి, 'ఫిలిప్' అను పేరుగల ఒక అమెరికను సోదరుడు మా యాత్రీదళములో కలిసి యుండిరి. ఈ రోజులలో మేము దినమునకు 16, 17 మైళ్ల చొప్పున నడవవలసి వచ్చుచుండెను. నడచుటవల్ల పేట్ సోదరి కాళ్లలో పెద్ద పెద్ద బొబ్బలెక్కినవి. అయినను ఆమె ఎవరిమాట వినకుండా కాలి

నడకనే వచ్చుచుండెడిది. ఆమె శాంత, సౌమ్య, ప్రసన్నముద్రను చూడగానే ఎవరికయినను సంతోషముగలుగక మానదు. ఆమె ఎన్నడును చిరాకుపడుట గాని, నేరములు చెప్పుట గాని మేము చూచియుండలేదు. ఎన్ని కష్టములు వచ్చినను సరే పరమ సంతోషముతో అనుభవించుచుండెడిది. తమిళనాడు భూదానసమితికి తరుణ సంయోజకుడు జగన్నాథం, అతని భార్య కృష్ణమ్మ కొన్ని నెలలనుండియు మా యాత్రలోఉండి భూదానతంత్రమును నేర్చుకొనుటకు వచ్చియుండిరి. జగన్నాథం అగ్రవర్ణమునకు చెందినవాడు. కృష్ణమ్మ హరిజన స్త్రీ. వారి వివాహమువల్ల సాంఘికాచారముపై పెద్ద గొడ్డలిపెట్టు పెట్టినట్లయ్యెను. కృష్ణమ్మ కేవలము చదువుకొన్న దగుటయే కాకుండ మంచి సంస్కారము గలది, మంచి స్వభావముగలదికూడ.

ఇక్కడ ప్రతిదినము సభలోనికి చిన్న గ్రామములలో సయితము 15 వేలకంటె అధికముగాజనులు వచ్చుచుండిరి. మా నివాసస్థానము కూడ యాత్రాస్థల మగుచుండెడిది. దినమంతయు ప్రతిద్వారము నుండియు, కిటికీ నుండియు గుంపులుగుంపులుగా మనుష్యులు తొంగి చూచుచుందురు. అందువలన గాలి స్తంభించిపోవును. తీవ్రమైన వేడిమి గూడ ఉండుటవలన ఊపిరి ఆడుచుండెడిది కాదు. మేము మాటి మాటికి, 'కొంచెము తొలగండయ్యా, గాలి లోపలికి రానీయండి' అని జనులను ప్రార్థించుచుంటిమి. కాని ఎవరును తొలగిపోరు. 'మేము కూడ మీవంటి మనుష్యులమే. మమ్మేమి చూచెద'రని మేమెంత బోధించినను ప్రయోజనము లేకపోయెడిది. 'మేము మీ దర్శనము చేయుచున్నాము అంతే' అని వారు ఒక్కటే జవాబు చెప్పుచుందురు. మా దర్శనమువల్ల వారికేమి లాభము గలుగునో ఆ సంగతి భగవానునకే యెఱుక. దినమంతయు కూర్చుండినను, నిలబడినను, పనిచేయుచున్నను, విశ్రమించుచున్నను, ఆరగించుచున్నను కనీసము నూఱు నేత్రములైనను మమ్ము నిరీక్షించుచునే యుండును. ఈ సంగతి

మాత్రము మేము మఱచి యుండజాలము. "మేము ప్రాణి సంగ్రహాలయములోని విచిత్ర ప్రాణులమయిపోతి" మని నారాయణ చెప్పుచుండును.

సామాన్యముగా జనులు వినోబాజీతో, "అయ్యా! తమరు చెప్పిన అభిప్రాయము మాకు నచ్చినది. కాని ఈ కలియుగములో దానిని తమ తమ జీవితములలో అమలుజరుపుకొనగల వా రెవ్వరు?" అనుచుందురు. వారికి వినోబాజీ ఇట్లందురు: "యుగమను వస్తువేదియు లేదు. రామచంద్రుడు, కృష్ణుడు పుట్టిన యుగములో రావణుడు, కంసుడు వంటి రాక్షసులు పుట్టియున్నారు. ఈ కలియుగములో గాంధి, రామకృష్ణుడు వంటి సత్పురుషులు పుట్టియున్నారు. దీని తాత్పర్య మేమనగా మనమే స్వయముగా యుగమును ప్రతిష్ఠించుచున్నాము. ఎవరి వల్లనో నిర్మితమయిన యుగములో మనము నివసించుచుండుటలేదు. అంగారకుడు, గురుడు మొదలయిన గ్రహముల చెంత ఆయా వాతావరణము ఉన్నట్లు, మన సమీపమున గూడ మన వాతావరణము ఉండును. కారణ మేమనగా మనము చేతనులము" అని. ఒకసారి యుగధర్మమును గుఱించి ప్రసంగించుచు వినోబాజీ ఒక విచిత్రమయిన కథ ఇట్లు చెప్పియున్నారు: "ఒక పర్యాయము శ్రావస్తీనగర ప్రజలు కొందఱు చాతుర్మాస్యదీక్ష మా నగరములో జరుపుకొనవలసినదని బుద్ధభగవానుని ఆహ్వానించియుండిరి. వారు భూమి యజమానుల యొద్దకు పోయి, 'అయ్యలారా! బుద్ధభగవానునినిమిత్త మొక కుటీరము నిర్మింపవలెను. అందుకు భూమి ఇప్పించండి' అని. అడుగగా ఆ భూస్వాములు 'మీకెంత భూమి కావలెనో అంతమేర బంగారు కాసులు పఱచి భూమిని తీసికొనండి' అనిరి. చివరకు అట్లే చేయవలసి వచ్చినది. చూడండి. బుద్ధభగవానుని కాలములో ఆ మహాపురుషుని నిమిత్తము బంగారుకాసులు పఱచి భూమిని తీసికొనవలసి వచ్చెనే! ఇక నావంటి తుచ్ఛవ్యక్తికి, ఆ శ్రావస్తీ

నగరములోనే నూఱు యకరముల భూమి దానముగాలభించెను. ఇక చెప్పండి. ఇది కలియుగమా లేక సత్య యుగమా ?''

ఈ రోజులలో వినోబాజీ ఉపన్యాసాంతమునందు బీహారువాసులను ప్రబోధించుచు ఇట్లు చెప్పుచుందురు: ''గౌతమబుద్ధుని, గాంధీ మహాత్ముని నేత్రములు మన యీ చిన్న కార్యమును చూచుచున్నవి. వార్లు విహారము సలిపిన బీహారులో ఈ పని ఎట్లు సఫలమగునా యని వ్వారు చూచుచున్నారు'' అని.

కుదరా గ్రామము పోవునప్పుడు మేమొక చిన్ననదిని దాటవలసివచ్చెను. అక్కడ డింగీ (చిన్ననావ) ఒకటి, ఏనుగొకటి ఉండెను. వీనిలో వినోబాజీ డింగీనే కోరుకొనిరి. అటు అమెరికనులు, అన్నచెల్లెలు, తమ జీవితములో మొదటిసారి ఏనుగునెక్కి మహదానంద మనుభవించిరి. డింగీలో బాబా, కరణభాయీ, నేను ముగ్గురము కూర్చుంటిమి. నాకు అమెరికాలోని ''గ్యాలపు పోల్'' జ్ఞాపకము వచ్చినది. ఒక నౌకలో ట్రూమను, అయిన్‌స్టీను, ఫిలిముస్టారు వీలీలన్ లీ - ఈ ముగ్గురును కూర్చుండియుండగా పడవ ప్రమాదము సంభవించెను. ఎవరిని రక్షింపవలెను ? ఒకరినే రక్షించుటకు అవకాశ మేర్పడెను. ఈ స్థితిలో ఎవరిని రక్షింపవలయునో చెప్పవలయునని ఒక పత్రికలో జనాభిప్రాయము కోరబడెను. ఫిలుముస్టారును రక్షింపవలెననియే జనులందఱును కోరియుండిరి. అందరకంటె మిక్కిలి తక్కువమంది, ట్రూమనును రక్షింపవలెననిరి. నేనీ సంగతి బాబాతో చెప్పగా ''ఈ విధముగా వోట్లిచ్చుట భారతదేశములో జరుగ'' దని వారు సమాధానము చెప్పిరి. డింగీనుండి దిగి మేము కాలిదారి పట్టితిమి. చీకటి, బురద, కప్పలు, దోమలు వీని అన్నిటివల్ల బాధపడుచు సాగిపోవుచుంటిమి. పాదము ఎత్తగానే ఏ కప్పమీద పడునో, అది యెక్కడ నలిగిపోవునో యని భయముగా నుండెడిది. నోరు తెఱవగానే అయిదాఱు దోమలు లోపల ప్రవేశించెడివి. కొంచెము సేపయిన తరువాత

పొలములోనుండి పోవు కాలిదారి దొరికినది. ప్రాతఃకాలమయ్యెను. నాలుగువంకల పచ్చని వరి పొలములు కన్నులపండువుగా నుండెను. కాలినడకను పోవునప్పుడు కనబడు వివిధమైన ప్రకృతి సౌందర్యము వాహనముల మీద ప్రయాణము చేయునప్పుడు ఎట్లు లభింపగలదు ?

దారిలో మరల నావపైన దుర్గావతి నదిని దాటవలసి వచ్చెను. కాంగ్రెసువారును, సమాజవాదులు రెండునావలను పూలతో అలంకరించి తీసికొనివచ్చిరి. వినోబాజీని ఏ నావలో కూర్చుండబెట్టవలెను ? ఈ విషయమై వారు జగడమాడిరి. బీహారులో పార్టీ కలహముల తీవ్రత దృష్టి గోచరమయ్యెను. నావికుడు వినోబాజీ పాదములు కడిగి వారిని తన నౌకలో కూర్చుండబెట్టుకొనెను. ఆ సమయమున ఆ దృశ్యము జ్ఞాపకము వచ్చెను.

"సోయీా చరన కేవట ధోయీావీన్హో ఫిర్ ప్రభునావ్ చఢాయీా"

ఇటువైపున ఘోషా పద్ధతి అధికముగా నుండుటవల్ల, ఇక్కడ ఉండే స్త్రీలు పగలంతయు బయటికి రాక రాత్రి కాగానే వినోబాజీ దర్శనమునిమిత్తమయి వచ్చుచుండిరి. రాత్రి పన్నెండుగంటల వఱకు వచ్చుచునే యుండిరి. కాని బాబా ఎనిదిమిన్నర గంటలకే నిదురించుచుండుటవలన, వారి దర్శనము కాకుండగనే స్త్రీలు తిరిగిపోవుచుండిరి. అప్పుడప్పుడు, ఎనిమిదిన్నర గంటల లోపుగా బాబా దర్శనమునకయి వచ్చిన స్త్రీలను వారు ఇట్లడుగుదురు: "మీరు దొంగలా ? దారులు కొట్టువారా ? ఈ విధముగా దొంగలు-తోడుమోతులవలె రాత్రిపూట ఎందుకు వచ్చెదరు ? పగటియందు సూర్య ప్రకాశములో ఎందుకు రారు ? ఈ ఘోషాపద్ధతి పరమపాపిష్టిది. ఘోషా విడిచిపెట్టి నిర్భయముగా తిరుగండి." అనగా, స్త్రీలు 'తమరు చెప్పినది మాకిష్టమే. కాని ఇంటిలోని మగవారు మేము బయటికిపోవుట కంగీకరింపరు' అనిరి. అంతట వినోబాజీ పెద్ద కంఠముతో "ఆ పక్షములో తిరుగుబాటు చేయండి" అని ఆదేశము ఇచ్చియుండిరి.

సాసారాము గ్రామములోని విశాల సభయందు వినోబాజీ మిక్కిలి క్రాంతికారకమగు అభిప్రాయమును చెప్పియుండిరి.

"రాష్ట్రపతికిని, వడ్రంగికిని సమాన వేతనము లభింపవలెను. సంఘములో ఏ మనుష్యునకయినను శ్రేష్ఠత రావలెనన్న, అతని విద్వత్తును బట్టియు, గుణశీలములనుబట్టియు రావలెను. అంతేగాని జీతములలో, హెచ్చు తగ్గులు ఎందుకు ఉండవలెను ?" అని.

## ఏ కళ శ్రేష్ఠమయినది?

*డెహరీ, నాసిర్గంజ్, విక్రమగంజ్, నవానగర్, ఇటాడీ*

18, 19, 20, 21, 22 సెప్టెంబరు, 1952.

ఈ రోజులలో నడచుచుండగా ప్రకృతియొక్క విశేష సుందర స్వరూపము దృగ్గోచరమగుచుండెను. దారి కిరుప్రైపుల మహోన్నతములయిన వృక్షములు; ఆకాశమండలమున ఉషఃకాల మందలి అరుణ కాంతులతో మేఘములు సలుపు నృత్యము; ఆ నృత్య శోభను చూచుకొనుచు కొంతసేపును, పచ్చని వరిచేలను చూచుకొనుచు కొంత సేపును, వరి మొక్కలపై నిలిచిన జలబిందువులను పానము చేయుచు కొంతసేపును, మధ్య మధ్య శోణభద్ర భవ్య సందర్శనము చేయుచు కొంతసేపును మేము యాత్ర సాగించుచుంటిమి.

నడక సాగుచుండగా బాబా నన్ను చూచి, "మీ నాన్నగారు యూరపులో సుదీర్ఘ యాత్ర చేసియున్నారు గదా ! ఇంతవఱకు ఆ యాత్రావిశేషములు నాకు చెప్పవైతివి" అనగా మా నాన్నగారికి ఒక యూరపియను మిత్రుడు చెప్పిన వృత్తాంతమును తెలియబఱచితిని. ఆ ఐరోపా మిత్రుడు మానాన్నగారితో ఇట్లుచెప్పెను: "తూర్పుదేశము లందున్న మీరు ప్రాచీనులును, అనుభవజ్ఞులును అయియున్నారు. కనుక మీకు చిన్న తమ్ములయిన పశ్చిమదేశీయులను విద్యావంతు

లుగా చేయుట మీ కర్తవ్యము. భారతదేశము నుండి తత్త్వజ్ఞానమును బోధింపగల మిషనరీలు ఇక్కడకు వచ్చుట మిక్కిలి అవసరము.'' ఆమాటలు విని బాబా యిట్లనిరి : ''అవును. ఇక్కడ నుండి మిషనరీలు తప్పక పోగలరు. కాని కొంతకాలము జరుగవలెను. బుద్ధభగవానుని తరువాత వేయి సంవత్సరములకు వారి తత్త్వజ్ఞానము లోకములో వ్యాపించెను. ఈనాడిక్కడ బుద్ధభగవానుడు జన్మించుచున్నాడు. కొంతకాలము పోనిమ్ము. ఇక్కడ నుండి అహింసా సందేశమును గ్రహించి విదేశములకు పోవు ప్రచారకులు ఎందరో బయలుదేరెదరు.''

అటు పిమ్మట ''కళ, జీవితము'' అన్న విషయముపయి చర్చ ప్రారంభమయ్యెను. బాబా యిట్లనిరి : ''కళను గురించి నాకు గలిగిన అభిప్రాయములు 'భయంకర' మైనవి. ఏది అందఱకును ప్రియముగా నుండునో, ఏది జనులందఱను ముగ్ధులను చేయుచుం డునో అదియే శ్రేష్ఠ కళాకృతి. కాళిదాసు, టాగూరులకంటె వాల్మీకి మహోన్నత శ్రేణికి చెందిన కవి.''

బాబా చెప్పిన యీ మాటలు నాకు నచ్చలేదు. ''బాబా! తఱుచుగా సర్వసామాన్యులు ఉత్తమ కళాకృతుల విలువను గ్రహింప జాలరు. అట్టి అభిరుచిని కలిగియుండుటకు కొంత శిక్షణ, సంస్కారము కావలెను గదా!'' అంటిని. దానిపైన బాబా యిట్లనిరి : ''ప్రకృతి, సంస్కృతి, వికృతి- అనువాని హద్దులను గుర్తింపవలెను. సామాన్య ముగా సంస్కృతి అను పేరుతో వికృతిని తెచ్చిపెట్టుచున్నారు. బూర్జువా కళ అనునది ఇటువంటి కళయే. ఏది సర్వులకు ప్రియముగా నుండునో, అదే నిజమైన కళ.''

నేను : ఈ విషయమయి మతభేదము లుండవచ్చును. బర్నా ర్డుషా ''కళాకృతుల రసమును గ్రహింపగలవా డెవ్వడో, అతడే నిజమయిన అర్థములో మంచి సంస్కృతి గలవాడు'' అనిరి.

బాబా : బర్నార్డుషా లేదా కాళిదాసు వంటి కళాకారులు నీ వంటి మంచి సంస్కారులను రంజింపజేయగలరు. కాని ఏ సంస్కారము లేనివానిని సంస్కార సంపన్నునిగా చేయజాలరు. ఇక వాల్మీకి వంటి కవిశేఖరులు అసంస్కారులను సుసంస్కారులుగా చేయగలరు.

ఆ మాటలకు నేను సంతృప్తిచెందితిని. కాని "ఏది అందఱకు ప్రియమో, అదే శ్రేష్ఠమయిన కళ" అన్న నిర్వచనమును అంగీకరింపజాలకున్నాను.

విక్రమగంజి సభకు పాతిక వేల మంది జనులు వచ్చియున్నారు. లౌడ్‌స్పీకర్లు పనిచేయలేదు. అందువలన జనులు ప్రశాంతముగా కూర్చుండజాలకపోయిరి. వినోబాజీ కొంచెముసేపు మాత్రమే మాట్లాడిరి. ఉపన్యాసము ముగించిన పిమ్మట వారు మంచెమీద కూర్చుండి "గీతా ప్రవచనము" పైన సంతకములు చేయుచుండిరి. చాలకాలము గడచిపోయినప్పటికిని, జనులందఱు ఎక్కడివారక్కడే కూర్చుండియుండిరి. వీరు వినోబాజీ దర్శనము చేసికొనుటకు వచ్చుచున్నారే గాని, వారి ఉపన్యాసము వినుటకు కాదని నాకు తోచినది. దర్శనము వల్ల కలుగు లాభమేమో వారికే తెలియవలెను. విన్సెంటు షీనుకూడ వినోబాజీవలెనే ఇట్లు చెప్పుచుండును: "భారతీయులు దర్శనమాత్రం చేతనే సంతుష్టు లగుచుందురు. వారి దర్శనలాలస అతి విచిత్రమయినది. ఈ గుణము యితర దేశములలో కనబడదు" అని.

వినోబాజీ కేవలము "గీతాప్రవచనము"పైన సంతకములు మాత్రమే చేయుచుందురు. ఈరోజులలో సంతకము చేయుపని ఎక్కువసేపు పట్టుచుండెను. దానికి కారణము ఆ సాహిత్యము ఎక్కువగా అమ్ముడుపోవుటయే. అందువలన సంతకము చేయించుకొనగోరువారు ఒక సుదీర్ఘమైన పంక్తిలో నిలబడియున్నారు. కొందరుజనులు ఆ పంక్తిని విడిచి, ముందునకు త్రోసికొని వచ్చుచుండగా వినోబాజీ వారినిచూచి, "ఈ విధముగా ముందునకు త్రోసికొని పోవలెనన్న

ప్రయత్నము మానుకొనవలెను. 'నేను అందరికంటెను వెనుకగా ఉందును,' అను మనోవృత్తి రావలెను. అప్పుడుగాని సర్వోదయ మేర్పడదు. 'నేనే అందఱకంటె ముందుగా పోవలెను. నా అవసరము అందఱకంటె ముందుగా తీరవలెను,' అను మనోవృత్తి ఉన్నయెడల సర్వనాశనము కాగలదు." గీతాప్రవచనముపై సంతకముచేసి వినోబాజీ స్వయముగా ఆ గ్రంథమును చేతి కిచ్చుచుండిరి. ఇట్లు చేయుట వలన వారికి జన పరిచయము గలుగుచుండెడిది. పుస్తకమును తీసికొను వారు తఱుచుగా వినోబాజీ పాదము లంటి నమస్కరించు చుండెడి వారు. ఈరోజున బాబా సంతకముచేయుచు, ఇట్లనుచుండిరి : 'ఇప్పుడు గీతాప్రవచనము తీసికొనియున్నారు. ఇంక భూదానము చేయవలసి యున్నారు. కొంచెము కామ క్రోధాదులను జయించుట నేర్చు కొనండి' అని.

చీకటి పడగానే, స్త్రీలు మేలి ముసుగులు వేసికొని గుంపులు గుంపులుగా మా నివాసస్థానమునకురాసాగిరి. "పేట్", కృష్ణమ్మలకు హిందీరాదు. అందువలన నేనే స్త్రీలతో మాట్లాడవలసివచ్చుచుండెను. ఒకప్పుడు ఒకానొక సోదరి నాతో ఇట్లనుచుండును : "నాయనా ! జ్ఞానము సంపాదించుటకుగాను, నీవు, ఇల్లు వాకిలి విడిచిపెట్టి సాధు పుంగవుని వెంట తిరుగుచున్నావు. ఇది చాల కఠిన తపస్సు. నీకు శతశత ప్రణామములు. నీ దర్శనమాత్రము చేతనే నేను పవిత్రురాలనైతిని" అని. మఱియొకసోదరి యిట్లనును: "ఈ విధముగా దారులు, డొంకలు పట్టుకొని తిరిగితిరిగి నీ కోమల శరీరమును కష్టపెట్టుకొనుచున్నావు. పెండ్లి చేసుకో. ఒంటరిగా తిరుగవద్దు" అని. ఈ స్త్రీలను బాబావద్దకు తీసికొని వెళ్లినప్పుడు వారు (వినోబాజీ) ఇట్లనుచుందురు: "మీరందఱు ముసల్మానులా ! హిందూ మతములో ఘోషాపద్ధతి లేనేలేదుగదా. ఘోషా చెడ్డదని కొందఱు ముసల్మాను మిత్రులు సైతము అంగీక రించుచున్నారు" అని. నేను "పేట్" కన్యను స్త్రీలకు చూపుచు,

"ఆ తెల్లజాతి పిల్ల ఇక్కడకు ఏడు సముద్రములు దాటివచ్చి వినోబా వెంట తిరుగుచున్నది. మీరు ఈ దేశమందుండియే వినోబాజీ స్వయముగా మీ యింట్లకు వచ్చినప్పుడయినను వారి ఉపన్యాసము వినుటకు బయటికి రారు" అనుచుండెడిదానను.

ఒక దినమున నేను బోసికాళ్లతో నడచుచుండగా బాబా చూచి కారణమేమని అడిగిరి. "చెప్పులు కఱచినవి. అందువల్ల వట్టికాళ్లతో తిరుగుచున్నాను" అని నేననగా, బాబా యిట్లనిరి: "ప్రయాణములో ఎటువంటి చెప్పులు తొడుగుకొనవలయును? ఈ విషయములో నేనిప్పుడు ప్రొఫెసరును అయిపోయినాను" అని. ఇక్కడకు రాక పూర్వము నేనొక సంవత్సరము కాలేజీలో ప్రొఫెసరు ఉద్యోగము చేసియున్నాను. కనుక బాబా మొదలుకొని గౌతముని (బాలుడు) వఱకు అందఱు నన్ను 'ప్రొఫెసరు', 'ప్రొఫెసరు' అనిచెప్పి పరిహాసము చేయుచుందురు.

నవానగరు గ్రామము పోవునప్పుడు దారిలో వర్షము వచ్చుటవల్ల మేము సొంతము తడిసిపోతిమి. ఇంకను వాన తగ్గిపోనందువల్ల మేము అనేక పర్యాయములు దారిలో తడిసిపోవలసివచ్చెను. వాన వేగము పెరుగుచుండగా వినోబాజీ నడక వేగము కూడ పెరుగుచుండెను. నేను బాబాతో 'ఈ రోజున చాల వేగముగ నడచినారే,' అనగా బాబా, "అవును. ఈ వేగమువల్లగాని క్రాంతి రాజాలదు" అనిరి. తరువాత వారు గమనవేగమును కొంత తగ్గించి, చిఱునవ్వు నవ్వుచు 'మంచిది. ఇప్పుడు నిర్మలను ఎక్కువ అలసట పెట్టకూడదు' అనిరి. అటుపిమ్మట వారు నాగపురము జెయిలులోని తమ మిత్రులను గుఱించి నన్నడిగి తెలిసికొని, వారి సుగుణములను వర్ణింపసాగిరి. వారి సుగుణములను మాత్రమే వర్ణించుచుండుటవలన ఎన్నడయినను వినోబాజీకి ఎవరి దోషములయినను కనిపించునా, అని తోచెను. మఱిలీకి చేరగానే బాబా ఇట్లనిరి: "నేనీరోజున ఎంతో వేగముగా నడచితిని.

అందుకుగాను నాకు 'పరమవీరచక్రము' రాదగినది." అనగా, అందఱు పకాలున నవ్వసాగిరి.

నవానగర గ్రామములో దినమంతయు వాన కురియుచునే యుండెను. సభా స్థానమంతయు బురదబురద అయిపోయెను. అయి నను అయిదువేల మంది జనులు నిలబడి ఉపన్యాసము వినుచుండిరి. ఉదయము కాగానే, ఇక్కడ భూదానములేమియు లభింపలేదను వార్త తెలిసినది. అప్పుడు యాత్రీదళములోని ప్రముఖుడు రామదేవు బాబు భూములు అడుగుటకుపోయి సభాసమయమునకు కొంతభూమిని తీసికొనివచ్చెను. జనులు భూదానములు చేయుటకు ఉత్సాహపడు చున్నారు. కాని అడుగువారు తక్కువగా నున్నారు. ఈ సంగతిని మేము ప్రతిదినము చూచుచునే యున్నాము. వినోబాజీ ఉపన్యాస మయిన పిమ్మట రైతులు మా కార్యాలయములోనికి వచ్చి స్వయ ముగా దానములిచ్చి పోవుచుండిరి.

దారిలో అచ్చటచ్చట తామరపువ్వులతోను, కలువ పువ్వుల తోను నిండిన చెఱువులు కనబడుచుండెను. సూర్యోదయము కాగానే కమలములన్నియు వికసించుచుండెను. కాని కలువపువ్వులుగల చెఱు వులలో వాని మూతులు ముడుచుకొని పోయినవి. చంద్రకిరణముల వల్ల కలువలు వికసించుననని, నేటివఱకు సాహిత్యములో మాత్రము చదువుకొనియుంటిని. కాని నేడు ప్రత్యక్ష దర్శనమయినది. ఈ కలు వలు యోగులవంటివి. లోకమంతయు నిదురించునప్పుడు, ఇవి మేలు కొని యుండును. లోకమంతయు మేలుకొని యుండునప్పుడివి నిద్దుర పోవుచుండును.

ఇటూడీ గ్రామమునకు పోవుచుండగా కొండచిల్లులుపడినట్లు వాన కురియసాగెను. నేను సరసముగా కరణభాయీతో ఇట్లంటిని: "శీతకాలములో నైనీతాలులోను, వేసవిలో బుందేలు ఖండములోను మనము యాత్రసాగించితిమి. ఇప్పుడు వానకాలములోకూడ యాత్ర

సాగుచున్నది. ఇప్పుడు బుద్ధభగవానునివలె తపస్సు చేయుచున్నామా, లేదా ? చెప్పండి. ఇంక మనము బుద్ధగయకు పోయి బోధివిచెట్టుక్రింద కూర్చుంటయే తడవు.''

ఇటాడి గ్రామములో, మా సామాను తెచ్చునట్టి లారీకారు చాల ఆలస్యముగా వచ్చినది. కనుక దినమంతయు తడిబట్టలతోనే ఉండవలసి వచ్చెను. అట్టి సమయమున, బాబాకు సరియయిన ఏర్పాటులు చేయుటకు మా మహాదేవి తాయీ చాల శ్రమపడుచుండును. ఆమెకు నిత్యము ఒక క్రొత్తయిల్లు. దానిలో ఏర్పాటులన్నియు ఎప్పటి కప్పుడు చేసికొనవలసివచ్చుటయు, అందువలన ఆమె తన కల్పనాశక్తి నంతయు వినియోగింపవలసి వచ్చుటయు జరుగుచుండెను. ఈ రోజున బాబాను వాన బాధనుండి తప్పించుటకుగాను, ఆమె సగము పడిపోయిన గదికి నాలుగువైపుల కందకమొకటి త్రవ్వి, దానిద్వారా నీటిని బయటికి పంపుచు, గదిమధ్య సురక్షితమయిన స్థానమున ఒక బల్లమీద బాబా కొఱకు స్థానము నేర్పఱచెను. ఈ విధముగా ఆమె అనేక సంవత్సరాలనుండి దీక్షతో బాబా పరిచర్య చేయుచుండెను. కాని ఈ వర్షాకాలములో ఆమెకు పరీక్షా సమయమే వచ్చినట్లయ్యెను. ఆమె ఆరోగ్యము కూడ మంచిదికాదు. కాకపోయిననుసరే, బాబాకు పరిచర్య చేయుటలో ఆమె ఏ లోపమును జరుగనీయదు. బాబా పెరుగు, పాలు, అప్పుడప్పుడు పండ్లరసము మాత్రము తీసికొనుచుందురు. ''పెరుగు తియ్యగానే ఉండవలెను. దధి మధురమ్, మధు మధురమ్ అని ఉపనిషత్తులు చెప్పుచున్నవి'' అని వినోబాజీ చెప్పుచుందురు. ఈ మాటలు వినుటకు బహు మధురముగానే ఉండును. కాని బాబాకు ప్రతి మూడుగంటలకు తియ్యని పెరుగు ఏర్పాటుచేయుటలో మహాదేవి తాయీ నలిగి చూర్ణమయిపోవుచుండును. పెరుగు పులియకుండుటకుగాను, తాయీ రాత్రి అంతయు త్రుళ్లిపడుచు, లేచి బహు జాగరూకత వహించుచుండును.

# వెలుతురునకు చీకటి భయము ఉండదు.

*బక్సరు*

**23, 24 సెప్టెంబరు, 1952.**

బక్సరు పౌరాణిక కాలమునుండియు ప్రసిద్ధమయినది. విశ్వామిత్రు డిక్కడనే యాగముజేసియుండెనని వినియున్నాము. రామచంద్రులు వివాహముకొరకు విదేహరాజ్యము పోవునప్పుడు ఇక్కడనే ఆగి, యజ్ఞ బాధకులయిన పెక్కండ్రు రాక్షసుల సంహరించి యాగరక్షణ చేసియుండిరి. తాటక సంహారముకూడ ఇచ్చటనే జరిగియుండెను. ఇతిహాసములో బక్సరు యుద్ధము ప్రసిద్ధమైనదే. ఆ యుద్ధములోనే ఆంగ్లేయులు కాశీ మహారాజును ఓడించి బీహారు నంతటిని స్వాధీనము చేసికొనిరి. ఆ యుద్ధములో ఆంగ్లేయులవద్ద సేన కొంచెముగానే ఉండెను. కాని వారి బందోబస్తు, క్రమశిక్షణలవలన కాశీమహారాజునకు పెద్దసేన ఉండియు లాభములేకపోయెను. ఆంగ్లేయులకే విజయము కలిగెను. బాబా ఆ యుద్ధమునుగురించి వివరించుచు ఇట్లనిరి: "మనలో చక్కని ఏర్పాట్లుచేయు శక్తి లేదు. ఇదే మనలోని గొప్పదుర్గుణము. బీహారులో ప్రతిదినము ఈ విషయమును కనిపెట్టిచూచుచున్నాను. ఈ దుర్గుణమువల్లనే మనము బక్సరు యుద్ధములో ఓడిపోయితిమి. ఇప్పు డయినను మేలుకొనండి. ఈదుర్గుణమును తొలగించుకొను ప్రయత్నము చేయండి."

బీహారు ప్రాంతీయ కాంగ్రెసు సభాపతులు (ఇప్పుడు స్వర్గవాసులు) పండిత ప్రజాపతి మిశ్ర భూదానకార్యములందు ఎక్కువ శ్రద్ధ చూపుచుండిరి. భూదానములు సాధించుటకుగాను వారు బక్సరులో కాంగ్రెసు కార్యకర్తలను సమావేశపఱచిరి. దిన మంతయు ఆ సభ జరుగుచునేయుండెను. బీహారులో ఇంతవఱకు జరిగినపని తక్కువ. పైగా వినోబాజీ, "బీహారులోని భూమిసమస్యను పరిష్క

రించుటకుగాను నేను ప్రాణముల నయినను అర్పింతును'' అనిరి. సభలో కాంగ్రెసు విరోధియగు కార్యకర్త వినోబాజీతో, ''ఈ కాంగ్రెసువారు బాపూజీని మోసగించిరి. ఇప్పుడు మిమ్ము మోసగింప గలరు. కనుక వీరినుండి దూరముగా ఉండండి,'' అనగా, వినోబాజీ సమాధానముచెప్పుచు, 'ఏ తల్లి తనబిడ్డలు చెడ్డవారని, వారిని దూరముగానుంచునో ఆమె తల్లియేకాదు. నాకు అందఱు మంచివారుగాను, పవిత్రులుగాను కనబడుచుందురు. ప్రకాశమునకు అంధకార భయమేమి ?'' అనిరి.

బీహారు యాత్రానంతరము బెంగాలు రావలసిన దని ఆవాహనము చేయుటకు బెంగాలు నాయకుడొకడు వినోబాజీని కలిసికొనుటకువచ్చెను. ఈ రోజున అతడు బెంగాలు కార్యక్రమమును గుఱించి మాట్లాడుచుండెను. వినోబాజీ అతనితో, 'నాకు ఒక నెలఫీజు ఒక లక్షయకరములు' అనిరి. ఈ రోజులలో వినోబాజీ ప్రతి ప్రాంతములోను ఆఱవవంతు భూమిని ఇవ్వవలసిన దని కోరుచుండిరి. వా రింకను ఇట్లనిరి : ''నేటిరాజు దరిద్ర నారాయణుడు. 'షష్ఠాంశముర్వ్యా ఇవ రక్షితాయాః' అను శాస్త్రవచనము ననుసరించి ఆ రాజునకు మీ భూమిలో ఆఱవవంతు ఇవ్వవలెను.'' భారతమంతటిలోను అయిదు కోట్ల యకరముల భూమి కావలెనని వారు కోరియుండిరి. అది ఈ తత్త్వము మీదనే ఆధారపడి యున్నది. ఇదిగాక, దేశములో అయిదు కోట్లమంది భూమిహీనులు రైతులున్నారు. వారికి అయిదుకోట్ల యకరములు కావలసి యున్నవి. వినోబాజీ ''మనము అయిదుకోట్ల యకరములు సంపాదింపవలసి యున్నది'' అనుచుందురు. బెంగాలు కార్యక్రమమును గుఱించి మాటలు సాగుచుండెను. ఎదురుగా విభక్త బెంగాలు పటముండెను. దానిని చూచి నారాయణుడు ''ఈ బెంగాలు ఎంత విచిత్రముగా నున్న'' దనగా, బాబా, ''ఇదంతయు పటముమీద ఉన్నదయ్యా. నిజమునకు భూమి అంతయు ఒకదాని కొకటి అంటు

కొనియే యున్నది'' అనిరి. బాబా దృష్టిలో రాజనైతిక శక్తికి విలువ లేదు. మానవుని హృదయమును మేలుకొలిపి నవ్యలోకమును నిర్మించుటయే వారి బుద్ధివిశేషము. కనుక వారి మానసిక ప్రపంచమందు పటములో కనబడుచుండు భిన్నభిన్న రాజనైతికశక్తులుగల భిన్నభిన్న దేశములు కనబడవు. వారి కంటికి సర్వమానవులు, సర్వత్ర ఒక్కరే. ''క్రాంతి ఇంటినుండియే ప్రారంభము కావలె'' నన్న రీతి గనుక భారతములోని భూమిహీనులగు రైతుల విషయము అన్నిటికంటె ముందుగా ఎత్తుకొని యుందురు. అయినను పాకిస్తాను, చీనా, ఇంకను లోకమునందలి ఇతర దేశములలోని మానవుల సమస్యలు తమవిగానే కనబడుచుండును. అన్ని దేశములందలి దీన ప్రజల ఆర్తనాదము వారి చెవిని పడుచునే యుండును. రాజనైతిక పరిధులు దాటి మానవ మాత్రులహృదయమునుఆకర్షించునట్టి బుద్ధభగవానుని శిష్యులువారు.

ఈ రోజున ఇక్కడ గల కమ్యూనిస్టుపార్టీ ద్వారా ప్రచురింపబడిన పుస్తక మొకదానిని చూచియున్నాము. ''వినోబా జమీందారులకు, పెట్టుబడిదారులకు ఏజెంటు. కనుక అతని మాయాజాలములో పడవద్దని మేము ప్రజలను హెచ్చరించుచున్నా'' మని అందున్నది. దానిమీదట, మాయాత్రీదళములోని ఒకరు, ''వినోబాజీ మార్గము వలన భారతములోని భూమి సమస్య తీఱిపోయిన యెడల, 'హింధూస్థానము చీనా కాబోదని,' కమ్యూనిస్టుల భయమండీ''. అనిరి.

సాయంకాల సభయందు కూడ కమ్యూనిస్టులు ఒక పెద్ద ప్రశ్నల జాబితా వ్రాసియిచ్చిరి. వానికి వినోబాజీ చెప్పిన సమాధానముల వల్ల ఎట్టి వివేకవంతునకైనను సంతుష్టి గలుగును. వినోబాజీ ఇట్లనిరి : ''కమ్యూనిస్టులు పుస్తక పూజారులు. వారు మార్క్సు గ్రంథమును వేదవాక్య ప్రమాణముగా నంగీకరింతురు. అందువలన అతివేగముగా పోవుచున్న ఈ కాలములో వారు వెనుకబడి పోయినారు. అందువలన వారు నవ్యభావములను గ్రహింపలేక పోవు

మన్నారు. సామ్యవాదమునకు వ్యతిరేకత కొఱకు నా పని ప్రారంభము కాలేదు. నా పని స్వయముగా స్వతంత్రమయినది. దానికి అధిష్ఠాన దేవత ఈ భారతభూమియం దుద్భవించిన తత్త్వజ్ఞానమే. కనుకనే ఇది "ధర్మచక్రప్రవర్తన" కార్యమని చెప్పుచున్నాను. నేను అహింసామార్గమువల్ల సమాజ నిర్మాణమునం దంతటను మొదలంట క్రాంతిని ప్రవేశపెట్టవలెనని చూచుచున్నాను. కమ్యూనిస్టులు నాకు మిత్రులు. ఈ రోజున వారు దారితప్పి తిరుగుచున్నప్పటికిని రేపు నా అభిప్రాయములు తప్పక వారి తలకెక్కగలవని నా విశ్వాసము."

ఈ తాత్త్వికవివేచనము అయిపోయిన పిమ్మట, వినోబాజీ ప్రశ్నల కాగితము చేతితో నందుకొనిరి. అందలి మొదటి ప్రశ్న : "మీకు భారతీయ సంస్కృతియందు నమ్మకమున్నదా ?" దానిపైన వినోబాజీ నవ్వునవ్వుచు, "నా రూపరేఖా విలాసములను చూచియే నిర్ణయించుకొనవచ్చును గదా! ఇది భారతీయ సంస్కృతియో లేక విదేశీయ సంస్కృతియో." అనగా సభాజనులు యావన్మంది పగులబడి నవ్వసాగిరి.

"నేను ఒంటరిగా సంచారము చేయవలెనని కోరుకొనుచుందును" అనిబాబా తఱుచుగా అనుచుందురు. దానికెవరైనను ఆక్షేపణ చేసినయెడల మరల ఇట్లనుచుందురు: "అయితే, ఆపక్షములో మా యాత్రీదళములో మిక్కిలి తక్కువమందే ఉండవలెను. గౌతముడు, మృదుల, నిర్మల- వీరుముగ్గురు నా కార్యదర్శులు. వీరు చాలుదురు. మహాదేవి, ఇంకను ఇద్దరు సేవకులు నా స్వంతపనులు చేయుటకు సరిపోవుదురు. నిర్మలకు "విదేశ విభాగము" (Foreign Department), మహాదేవికి "స్వదేశ విభాగము" (Home Department) ఇప్పటికి ఆఱుగురు వ్యక్తులు. నేను ఏడవవాడను. (We are seven) ఇప్పుడు ఏడుగురము సరిపోతిమి."

బక్సరు జెయిలులో సత్యాగ్రహముకొఱకు బంధితులయిన సమాజవాదమిత్రు లుండిరి. వినోబాజీ జెయిలులోనికిపోయి వారిని కలిసికొనిరి. భారతదేశమునకు ముందుగానే స్వరాజ్యము వచ్చి యుండుటవలన నా కెన్నడును జెయిలులోనికి పోవు సౌభాగ్య మబ్బి యుండలేదు. జెయిలు లోపలకుపోవుట నా జీవితములో ఇదే మొదటి పర్యాయము. అక్కడగల విషాదవాతావరణమును, దొంగ ఖైదీల శూన్యతను, నిరాశతోనిండిన వారి దృక్కులను చూచినప్పుడు నాకు పిచ్చెత్తిన ట్లయ్యెను. జెయిలు అవసరమే లేనట్టి సంఘనిర్మాణము జరిగిన బాగుండునుగదా యనుకొంటిని. అటువంటి సంఘమును నిర్మించుటకేగదా, ఈ కార్యమందు మునిగియుంటిమి, అని ఊఱటచెందితిని. జెయిలు లోపల ప్రవేశింపగానే, సమాజవాదు లగు ఖైదీలు 'సంత్ వినోబా అమర హో' అని గర్జన చేయసాగిరి. అనంతరము వినోబాజీపై పూలవాన కురియించిరి. సమాజవాద నాయకు డిట్లనెను: "ఈరోజున మావంటి ఖైదీలకు గలిగినభాగ్యము ఇంత అంత అని చెప్ప జాలము. హిందూదేశములో జెయిలు వెలుపల అన్ని ప్రదేశములలోను చొరబాటిన ప్రకాశము మా జెయిలు లోపలకుకూడ వచ్చియున్నది. మేము వినోబాజీ ఆజ్ఞప్రకారము పనిచేయగలము." అంతట వినోబాజీ గద్గదకంఠముతో ఇట్లనిరి: "మీరూ మా జట్టులోనివారే. స్వరాజ్యము వచ్చిన తరువాతకూడ జనులు జెయిలుకుపోవలసి వచ్చుచున్నది. ఇది నాకు సంతాపకర మయినది." అనంతరము ఖైదీలు వినోబాజీతో తమతమ కష్టములు చెప్పుకొనిరి. వినోబా, తమకు సమీపమున ఆసీను లయియున్న జెయిలు అధికారులతో ఆ కష్టములు తొలగింపవలసిన దని కోరిరి. తరువాత వారు జెయిలు నంతటిని నిరీక్షించిరి. జన్మ ఖైదుపొందిన ఖయిదీల గదివద్దకుపోయి వారితో మాట్లాడిరి. వారు ఖైదీ లందఱతోను శారీరక మానసిక స్వాస్థ్యముల నిమిత్తము ప్రతి ఒక్కరు కనీసము నాలుగు గంట లయినను - కాయకష్టము చేయ

వలెను" అనిరి. 'జెయిలును ఆశ్రమముగా చేయండి' అని అందఱను ఆదేశించిరి. ఖైదీ లందరు ఒకపూట భోజనము మానుకొని, దానివల్ల వచ్చిన ధనమును భూదాన యజ్ఞముకొఱకు సమర్పణచేసిరి.

## స్త్రీలకుకూడ బ్రహ్మచర్యమునకు అధికారము

*డుమరావు, బ్రహ్మపూర్, బిహియా, ధమార్*

**25, 26, 27, 28 సెప్టెంబరు, 1952.**

మహారాష్ట్రమునుండి సోదరి ప్రేమాకంటక్ వ్రాసిన ఉత్తరము నిన్నటి దినముననే బాబాకు అందినది. అందు ఆమె ఇట్లు వ్రాసినది: "ఒకరో ఇద్దఱో తేజస్వులయిన, జ్ఞాన నిష్ఠులయిన, వైరాగ్యమూర్తులయిన స్త్రీలు, శంకరాచార్యుల వంటివారు, ఉద్భవింపవలసి యున్నదని తమరు చెప్పినమాటకు ఇక్కడగల నాయకులు కొందరు తీవ్రముగా నధిక్షేపించిరి. వారివాద మేమనగా "స్త్రీకి పెండ్లాడుట అత్యవసరము. పాతివ్రత్యము స్త్రీ ధర్మము" అని. ఆ ఉత్తరము చదివి, మహాదేవి తాయీ కోపముతో "అటువంటి మనుష్యులకు ఇటువంటి జవాబునే చెప్పవలెను" అనెను.

అంతట బాబా నన్నుచూచి, ఈ విషయములో నీ అభిప్రాయ మేమి" అని అడిగినప్పుడు, నే నేమి జవాబు చెప్పగలను ? అయినను, "బాపూజీ ఆదేశించిన ప్రకారము అనగా, 'ముందుగా యోగ్యత సంపాదించుకొమ్ము, తరువాత కోరుకొమ్ము' **(First deserve, then desire)** అన్న వచనము నాకు నచ్చినది. ఈ విషయములో కూడ నా అభిప్రాయము అదే" అని ఒక్కమాటలో సమాధానము చెప్పితిని.

బాబా : అవును. అదే సరియయినది. కాని ఒకవేళ ఎవరైనను స్త్రీలకు బ్రహ్మచర్యమునకును, సన్యాసమునకును అధికారము గలదా

యని అడిగినప్పుడు, జనులు వెంటనే 'లేదు, లే' దని సమాధానము చెప్పెదరు. సామాన్య స్త్రీలకు ఈ అధికారము యొక్క అవసరము ఉండదని నే నంగీకరింతును. అయినను, స్త్రీలకు బ్రహ్మచర్యాధికారము లేదని ఈనాడు పురుషులు చెప్పుచుండుట యుక్తముగా లేదు.

నేను : "అటువంటి పురుషులను, ఆచరణవల్ల, వాగ్బంధనచేసి కూర్చుండబెట్టదగును." బాబా కోరిక ప్రకారము రేపటి దినమున శంకరాచార్యులవంటి స్త్రీలు ఒకరు యిద్దఱు జన్మించినయెడల స్త్రీలకు సన్యాసాధికారము లేదని చెప్పెడి యీ పురుషులే వారికి శిష్యత్వము చేయగల రని నా అభిప్రాయము. ఏ దేశములో సంఘమిత్రవంటి స్త్రీలు పుట్టియున్నారో అక్కడ శంకరులవంటి వారు కూడ తప్పక ఉద్భవింపగలరు.

వినోబాజీ అనేకపర్యాయములు సమాజమును శరీరముతో పోల్చుచు, "ఏ విధముగా శరీరములోని అవయవము లన్నియు కలిసి మెలసి పనిచేయుచున్నవో ఆ విధముగానే వ్యక్తులందరు కలిసి, మెలసి పనులు చేయుచుండవలెను. అప్పుడే సంఘము సుఖముగా నుండగలదు" అనుచుందురు. కాని యీ సంగతి నాకు నచ్చలేదు. అందువలన నేను ఇట్లంటిని : "మీరు సమాజమునకు, శరీరముతో ఉపమానము చెప్పుచున్నారు. కాని అది **Organic Conception of Society** అయియుండుటవల్ల దానినుండియే సర్వాధికార ప్రభుత (**Totalitarianism**) ఉద్భవించునని దార్శనికు లనేకులు చెప్పుచుందురు. ఇటువంటి సమాజములో వ్యక్తికి స్వతంత్రమెట్లుండ గలదు ? "

బాబా : నే నీ ఉపమానమునే ప్రయోగించుచుందును. కాని వేఱే అర్థములో, నేను నిర్మింపబోవు సమాజమునందు వ్యక్తికి పూర్ణ స్వతంత్రముండును. శరీరములోని భిన్నభిన్న అవయములవలె భిన్న

భిన్న వ్యక్తుల పనులుకూడ భిన్న భిన్నములుగా నుండును. కంటిపని కన్నే చేయగలదు.

నేను : కాని సమాజము వ్యక్తికి స్వతంత్రము ఇవ్వక తన వ్యవస్థా భారమును వ్యక్తిమీద పడవేసినయెడల వ్యక్తి నష్టమై పోగలడు.

బాబా : శరీరమున కంతకు నష్టము గలుగునుగదా అని, కంటిని పొడిచివేయవలెనని ఏ శరీరము కోరుకొనదు.

నేను : వ్యక్తి సంఘశ్రేయస్సునకు వ్యతిరేకముగా పని చేయరాదని సర్వాధికార ప్రభువులు (Totalitarians) చెప్పుచుందురు. ఈ విషయమును బోధించుటకు వారుకూడ శరీరముయొక్క ఉపమానము చెప్పుచుందురు.

బాబా : ఆ పక్షములో వారికీ ఉపమానము యొక్క సరియయిన అర్థము తెలియలేదనే చెప్పవలెను. 'వ్యక్తిహితము వేఱు, సమాజహితము వేఱు, ఈ రెండిటిహితములు పరస్పర విరుద్ధములు' అన్నవాదమును నేనెన్నటికిని అంగీకరింపజాలను.

నేను : సమాజవ్యవస్థ చెడిపోయినయెడల వ్యక్తి ఆ సమాజము పైన తిరుగుబడుటకు అధికారము గలిగియున్నాడా, లేడా ? ఏసు క్రీస్తును, గాంధీ మహాత్ముడును సమాజమునకు వ్యతిరేకముగా తిరుగుబాటు చేసియున్నారు గదా !

బాబా : తిరుగుబాటుచేయు అధికారమున్నదా, లేదా, అను ప్రశ్నయే పుట్టదు. ఏ వ్యక్తి అయినను తిరుగబాటు చేయదలచిన యెడల అతడు తిరుగుబాటుచేసి, దాని ఫలమనుభవించును. ఆ వ్యక్తి భావనలో ఏదయినను సత్యమున్నయెడల అది నిలువగలదు. లేనిచో పోగలదు.

నేను : కాని మీరు ఊహించుచున్న నవ్యసమాజ వ్యవస్థలో వ్యక్తికి తిరుగుబాటుచేయు హక్కు ఉండునా, ఉండదా ?

బాబా : 'హక్కు తప్పక ఉండును. కాని హక్కు అనగా అతని కర్తవ్యమని అర్థముకాదు. ఏ అధికారమునయినను ఉపయోగించునప్పుడు అది మన కర్తవ్యమగునా, కాదా, అన్నసంగతిని లెస్సగా ఆలోచించుకొనవలెను. పదునాలు వత్సరముల ప్రాయమువచ్చిన ప్రతి పిల్లవాడు తనతండ్రినుండి వేఱుబడుటకు అధికారము గలిగియున్నాడు. కాని అతడు ఆ అధికారమును ఉపయోగించునప్పుడు, తన కర్తవ్యమును గుఱించి కూడ ఆలోచించుకొనును.'

అద్వైతసిద్ధాంతము ననుసరించి, వ్యక్తిహితమునకును, సమాజహితమునకును పరస్పరవిరోధము లేదు. ఇట్టి భావన నుండియే సర్వోదయతత్త్వజ్ఞానము ఉద్భవించినది. కాని ఇప్పటివఱకును ఈసంగతి నాతలకెక్కలేదు. నేటివఱకును నేను చదువుకొన్న చదువే దీనికి కారణము కావచ్చును. మా చదువు మాకు సంఘర్షమును గురించిన తత్త్వజ్ఞానమునే నేర్పియున్నది.

ఉపహారముల సమయమయినందువల్ల ఈ చర్చ ఇంతటితో ఆగిపోయినది. ఈ రోజులలో బాబా తేనె, నీళ్లు పుచ్చుకొనుచున్నారు. మా యాత్రీదళములో విభిన్న ప్రాంతీయులు ఉండుచున్నారు. మా అందఱివంకను దృష్టిసారించుచు, బాబా సరసముగా ఇట్లనుచుందురు: ''ఏ ప్రాంతమువారు ఎవరయినది వారి ముఖాకృతులను బట్టియే గుర్తింపవచ్చును. దక్షిణాదివారు నల్లగానుందురు. కాని వారి నేత్రములు తేజోవంతములయి యుండును''అని. ఈ మాటలు వినగానే మేమందఱము వెంకటేశయ్య వంక చూడసాగితిమి.

ఇప్పటివఱకును భూదానము తక్కువగానే దొరకియుండెను. నేటి సభలో బాబా ఈ విషయమును ప్రసంగించుచు ఇట్లనిరి: 'నాకు స్వాగత మివ్వదలచినయెడల భూమితో ఇవ్వండి. పూలదండలతో కాదు. మీరు భూమి ఇవ్వకుండ పూలదండలతోను, ఆకుతోరణముల తోను నాకు స్వాగతమిచ్చినయెడల నాకు చాల వ్యథ గలుగును.

ఈ దండలు నాకు విష సమానములుగా తోచును,'' అని. వినోబాజీ ఆఱవవంతు భూమి భాగమును కోరుచుందురు. ఎవరయినను తమ శక్తికి మిక్కిలి తక్కువగా భూమి నిచ్చినయెడల స్వీకరింపవద్దని వారి ఆదేశమైయున్నది. ఈరోజున మూడువందల యకరములు గల ఆసామి ఒకరు కేవలము ఐదు యకరములు మాత్రము దానమిచ్చియున్నారు. అంతట వినోబాజీ సభవారి యెదుట అతని దానపత్రమును చించివేసిరి. ''నేను బిచ్చమెత్తుటకు రాలేదు. దీక్ష ఇచ్చుటకు వచ్చితిని. దరిద్ర నారాయణుని ప్రతినిధిగా, అతని హక్కునడుగుటకు వచ్చియున్నాను,' అని వారనిరి.

డుమరావు గ్రామ జమీందారు సుమారు ఆఱవవంతు భాగ' మును బాబాకు దానపత్రముగా వ్రాసియిచ్చెను. అప్పుడు బాబా అతనితో, 'ఈ పని మీ హితముకొఱకే అయి యున్నది. ఈ సంగతిని గుర్తుంచుకొని ఇక మీరు ఇతరులనుండి భూమి నిప్పించండి.'అనిరి.

బీహారులో అన్నమును 'ప్రసాద'మనియు, పరమాన్నమును 'తస్మై' అనియు అనుచుందురు. 'ఇక్కడి మనుష్యుల పేర్లలోనే ప్రసాదము నిండుగా ఉండుటగాక, ప్రతిదినము భోజనములో కూడ ప్రసాదమే ఉంటున్నది,' అని నేనంటిని. మాకు అప్పుడప్పుడు ఉపహార ములలో హల్వా దొరకుచుండెడిది. ఒకసారి మాకు వచ్చిన హల్వాలో ఆకులు, చచ్చినచీమలు, రాళ్లు, పుల్లలు ఇంక ఏమేమో కూడ ఉండెను. మా 'పేట్' సోదరి, 'దీనిలో లేనివస్తువులు ఇంక ఏమయినా ఉన్నాయా, అమ్మా!' అనిఅడిగినది. బెల్లపు హల్వా కొంచెము నల్లగా ఉండుటచూచి ఒకసారి బాబా సరసముగా, 'ఏమి, మీరు పేడ తిను చున్నారా' అని అడుగగా, మేము పొట్ట చెక్కలగునట్లు నవ్వుకొంటిమి.

ధమారు గ్రామములో, దసరా రోజులలో వినోబాజీ 'సీమాంతము' చేయవలసినదని ఆదేశించి ఇట్లనిరి: 'భూమి సమస్యను పరిష్కరించుటకంటె, దానిని పరిష్కరించుటకు గల అహింసా మార్గ

మునే అధికముగా ప్రస్తుతింతును. అహింసా మార్గమువల్ల లోకములోని సమస్యలన్నియు తీఱిపోవునని నేటివఱకును నా దృఢ విశ్వాసము. వాస్తవిక జగత్తులో కూడ ఆ విశ్వాసము పనిచేయుచున్నది. అయినను ఆలస్యము, వైమనస్యము అను నీరెండు దుర్గుణములవల్లను బీహారులో నేటివఱకును పని ఎక్కువగా కాలేదు' అని.

ఈ రోజున మేము రామలీల చూచితిమి. తులసీరామాయణము వ్యాపించినచోట, ప్రతి సంవత్సరము దసరా రోజులలో రామలీల జరుగుచుండును. ఏ ఆధునిక ప్రచారసాధనములు అవలంబింపకుండ, రామాయణమును ప్రచారముచేయుటకు తులసీదాసుగారు అవలంబించిన ఈ పద్ధతిని నేటి జననాయకులు నేర్చుకొనదగుదురు. వందల కొలది సంవత్సరములనుండి ఆ రామ కథయే నడచుచున్నది. జనులు అదే ఉత్సాహముతో ప్రతి సాలున రామలీల చూచుచున్నారు. వినోబాజీ ఇట్లనుచుందురు: 'రామాయణము, మహాభారతము ఈ రెండును భారతీయ జీవితముతో ఏకరూపము చేసికొన్న గ్రంథములు. ఆ గ్రంథములలోనున్న పాత్రలు తన కుటుంబ జనులకంటె మిక్కిలి సన్నిహితులుగానున్నట్లు ప్రతిభారతీయునకు తోచుచుండును' అని. ఈ రామలీలనే భూదానయజ్ఞము కొఱకు నేర్పరితనముతో ఉపయోగించుకొన్నయెడల ఎంత బాగుండును, అని నాకు తోచెను.



## ఏడవ భాగము

# భూదానము యుగధర్మము

ఆరా, అఖగాంవ్, బాగా

29, 30 సెప్టెంబరు, 1 అక్టోబరు 1952.

బీహారు భూమిలో ప్రవేశింపగానే వినోబాజీ వారి ధర్మచక్రమును ప్రవర్తింపజేయ మొదలుపెట్టెను. ఆరా గ్రామసభలో విశాల జన సముదాయము ఎదుట మాట్లాడుచు వారు బుద్ధుని వంశీయులను ఆవాహనము చేసిరి. అది విన్నయెడల మృతదేహములందు సయితము ప్రాణ ప్రతిష్ఠ గలుగవలసినదే. వారిట్లనిరి: "బుద్ధభగవానుడు ఆ కాలమునాటి ఒకసమస్యను అనగా యజ్ఞములలో చేయబడు పశుహింసను వారించుట అన్నదానిని తీసికొని లోకమునకు అహింసా ధర్మమును బోధించెను. ఆ సమస్యను పరిష్కరించుచు అతడు అహింస ద్వారా లోకమును జయించునట్టి విజయధర్మమును ప్రవర్తింపజేసెను. కేవల తత్త్వవిచారము అవ్యక్తము, నిర్గుణము, నిరాకారముగా ఉండును. కనుక దాని ప్రచారము చేయదలచినయెడల ఏదో ప్రత్యక్ష కార్యము చేయవలెను. ఆ కాలి మందలి సమస్యను తీసికొని దానిని పరిష్కరించుటకు ఆ ధర్మము సాకారమును పొందును. అదే విధముగా నేను భూమి సమస్యను పరిష్కరించుటద్వారా సమాజమునకు సర్వోదయ తత్త్వమును బోధించుచున్నాను. హింసాపద్ధతివల్ల క్రాంతి ఎన్నడును రాజాల దని నా తలంపు. దానియందు క్రాంతి ఆభాస మాత్రమే గలుగుచుండును. కాని వెంటనే ప్రతిక్రాంతి ప్రారంభమగుచుండును. సాధ్యము, సాధనము - ఈ రెండిటియందును క్రాంతి గలిగినప్పుడే నిజమయిన క్రాంతి ఏర్పడును. ఏ దుర్జనునితోనో నాకు

పోట్లాట వచ్చినయెడల నే నతని కత్తులు కటారులు చేతబట్టినయెడల, ఒకవేళ నాకు జయమే గలిగినను అతని ఆత్మ నాలో ప్రవేశించును. అప్పుడు అత డెంత దుర్జనుడో నేనును అంతే కాగలను. కనుక ఆ విష యములో అతనికే గెలుపువచ్చినది. సాధనము, సాధ్యము ఈరెండిటి యందును క్రాంతి గలిగినప్పుడు అది సమ్యక్ క్రాంతి లేక సంక్రాంతి కాగలదు. బుద్ధభగవానునకు ఈ బీహారు భూమియందే జ్ఞానసిద్ధిగలిగెను. మహాత్మాగాంధీకి ఈ భూమియందే చంపారనులో అహింసాదేవి సాక్షాత్కరించినది. ఓ బుద్ధ వంశీయులారా! మీ ప్రదేశములో అహింసాక్రాంతి జరుగబోవుచున్నది. ఈ పుణ్యభూమి నివాసులు ఈ క్రాంతిని సఫలము చేయరా?"

ఈ రోజులలో వినోబా సాహిత్యము తెగ అమ్ముడు పోవు చుండెను. అందువలన భావప్రచారము బాగుగా జరుగుచుండెను. "ఒక్కసారి నాభావన జనులహృదయమునకు పట్టినయెడల ఇక భూమి వర్షమువలె కురియ నారంభించును" అనిరి. ఆరా గ్రామసభలో 500 గీతా ప్రవచనములు అమ్ముడు పోయినవి. చిన్నచిన్న పుస్తకములు ప్రతి దినము వందలకొలది ఖర్చు అగుచుండెను. కానిభూమి మాత్రము తక్కువ దొరకుచుండెను. అందువలన వినోబాజీ చింతానిమగ్నులగు చుండిరి. వారు కార్యకర్తలతో ఇట్లనిరి: 'నేను కేవలము అగ్నిని ప్రజ్వలింపదలచినయెడల, సభలలో ఉపన్యాసము లిచ్చుకొనుచు భావ ప్రచారముచేసికొనుచు పోయెడివాడనే. కాని నేను అగ్నిని చల్లార్ప దలచితిని అందువల్ల భూమి దానము లడుగుచున్నాను. ఈ విధముగా భూమి తక్కువగా లభించినయెడల అగ్ని మండుచునేయుండును. ప్రతిదినము నా సభలోనికి వేలకొలది జనులువచ్చుచు నా సందేశమును వినుచునేయున్నారు. ఇప్పుడు వారిలో భూమి తృష్ణ యేర్పడుచున్నది. కాలము మించిపోకమునుపు ఆ తృష్ణను శాంతింపజేయనియెడల తరువాత ఏమగునో కొంచెమాలోచించుకొనుడు.'

వినోబాజీ ఇట్లు చెప్పుదురు: 'భూదానయజ్ఞము ఈ కాలపు లక్షణము అనగా యుగధర్మము. కాల ప్రవాహమంతయు ఆ పనికి అనుకూలముగా ఉన్నది. సామాన్య జనమునకు నేడది అవసరమయి యున్నది.' ఈ విషయమై ప్రసంగించుచు వారు అఖగాంవు గ్రామ సభలో 'కాల రూపియయిన, భగవానుడును, విశ్వరూపుడయిన భగవానుడును ఉభయులును దీనికి అనుకూలురుగా నున్నా'రనిరి. బాగా గ్రామములో మేమొక దేవాలయములో బస చేసితిమి. ఆ దేవాలయ మహంతు కొంత భూమిని దానముగా ఇచ్చెను. 'మహంతుజీ మావారే. వారుకూడ సన్యాసులే గదా!' అని చెప్పి వినోబాజీ వారిని తమవంకకు లాగుకొనిరి.

ప్రతిదినము నిత్యనూతన సృష్టిసౌందర్యము గానవచ్చుచుండెను. ఈ పచ్చపచ్చని పొలములు, కొండలు, నదులు, కొండవాగులు, కమలములతో నిండిన చెఱువులు. వీని నన్నిటిని చూచుటకు కాలినడకను ప్రయాణము చేయవలెను. నయనాభిరామమగు ఈ ప్రకృతిసౌందర్యమును చూచుటకు బదులుగా జనులు రైలుబండ్లలోను, గాలి విమానములలోను ఎక్కి ఎందుకు తిరుగుచుందురో గదా! ఇక్కడ వెదురు చెట్లు, పనసచెట్లు మనోహరముగా గానవచ్చుచుండెను. ప్రతిదినము సూర్యోదయ, సూర్యాస్తమయ దృశ్యములు ఉన్మాదము గలుగజేయునట్టివిగానుండెను. ఇప్పుడు పూర్ణిమ సమీపించుచుండెను. అందువలన చంద్రికాస్నాతయగు సృష్టిని చూచుటకు రాత్రి సంచారము చేయవలెనను బుద్ధి పుట్టుచుండెను. ఈ విషయములో నాకును 'పేట్' సోదరికిని మంచి జత కుదిరినది.

# మనస్సులో హిమాలయము-
# హృదయములో అగ్ని.

*పాలీగంజి, విక్రమ, బిహడా, మనేర్ (పాట్నా)*

**2, 3, 4, 5 అక్టోబరు, 1952.**

కాలువగట్టున నొక చిన్నకాలిదారి ఉండెను. పశ్చిమ క్షితిజము పయిన చతుర్దశినాటి చంద్రుడు ప్రకాశించుచుండెను. బాబా చేతితో లాంతరు పట్టుకొని అందరికంటె ముందుగా నడచి పోవుచుండిరి. ఈ రోజున కేవలము లాక్షణికార్థమందుగాక వ్యావహారికార్థమందే వారు మాకు మార్గదర్శకులుగా నుండిరి. కొంచెమునే పయినతరువాత శోణానదిగట్టు తగిలినది. ఇక పాట్నా జిల్లాలో ప్రవేశింపవలెను. మా నావ క్రమక్రమముగా ముందునకు సాగిపోవుచుండెను. బాబా ఆకాశమును చూపి పాఠము బోధింపసాగిరి. దక్షిణదిశను అగస్త్య నక్షత్రమును, వారి ఆశ్రమమును చూపింపబడెను. తరువాత కృత్తికా నక్షత్రము. అది ఆఱుగురు ఋషి పత్నులతో ఏర్పడియున్నది. ఏడవది అరుంధతి, సప్తర్షులలో వశిష్ఠుని వద్దనే ఉండుచుండును. క్రమక్రమముగా నక్షత్రములు అస్తమింపసాగెను. ప్రాచీన ముఖమున అరుణకాంతులు అలముకొన్నవి. చూచుచు, చూచుచుండగనే క్షితిజముపయిన ఎఱ్ఱని సూర్యబింబము దృగ్గోచరమయ్యెను. శోణానదీ జలములలో దాని ప్రతిబింబము కాననయ్యెను. అందువలన ఏ సూర్యబింబమును దర్శింపవలెనో మనస్సునకు నిశ్చయబుద్ధి గలుగలేదు. నావ ఒడ్డునకు చేరినది. ఇంకను శోణానది ఇసుకతిన్నెలో ఒక మైలు నడువవలసి యుండెను. శోణానది ఇసుకతిన్నె గంగా యమునా యిసుక తిన్నెలవలె అంత కోమలముగా గాని, అంత స్నిగ్ధముగా గాని లేకుండెను. నే నీసంగతి బాబాతో చెప్పినప్పుడు వారు

'అవును. కనుకనే గంగా యమునల ఇసుక తిన్నెలలో కాలు దిగబడి పోయినట్లు యిక్కడ దిగబడి పోవుటలేదు' అనిరి. ఇసుకపైన బాబా అడుగు జాడలను చూచినప్పుడు, "నేను బుద్ధభగవానుని చరణ చిహ్నముల నూతగా గొనియున్నాను" అన్న వారి వాక్యమే నాకు జ్ఞాపకము వచ్చెను.

ఈనాడు గాంధీ జయంతియు, శరత్పూర్ణిమయు కలిసివచ్చెను. బిహారులోని ప్రసిద్ధ కవియగు 'దినకరు'ని పాటతో సభా ప్రారంభమయ్యెను.

*"సురమ్య శాంతి కేలియే, జమీను దో, జమీను దో
మహాన్ క్రాంతి కేలియే, జమీను దో, జమీను దో"

ఈ రోజున బాబా బాగుగా మాట్లాడెద రని మేము తలచితిమి. కాని వారు గంభీరస్వరముతో 'ఈ రోజు మాట్లాడుట కొఱకుగాక, ఆత్మ సంశోధనకొఱకై యున్నది' అనిరి. ఒక సోదరులు అందరికంటె ముందుగా మంత్రులనుండియు, గొప్పగొప్ప నాయకుల నుండియు భూమిని తీసికొనండి. అనగా దానిపైన వినోబాజీ, 'క్రాంతి ఎన్నడును గొప్పవారి వల్ల కాదు. ప్రభు రామచంద్రుడు కోతులచేత మహాత్కార్యములు సాధింపజేసెను. శ్రీకృష్ణ భగవానుడును గొల్లపిల్లలచేత అట్లే చేసెను. ఏసుక్రీస్తు, గాంధీమహాత్ముల ప్రథమ శిష్యులలోకూడ చిన్నచిన్నవారే ఉండియుండిరి.'

రాత్రి గడచిపోవుచుండెను. పున్నమ చంద్రుడు తన కిరణజాలముచే సృష్టిజాలము నంతటిని వశీభూత మొనర్చుకొనెను. అందువలన బీహారులోని రమణీయమయిన సృష్టి ఇంకను అధిక రమణీయముగా గోచరించుచుండెను. దారి కిరువంకలను వందలకొలది స్త్రీ పురుషులు హస్తములందు మంగళహారతులను, పూలదండలను పుచ్చు

---

*శ్రీ లవణం రచించిన 'భూక్రాంతి గీతాలు'లో ఈ పాట తెలుగుసేత ఉన్నది.

కొని నిలబడి యుండిరి. పాలీగంజి గ్రామమునుండి విక్రమ గ్రామము తొమ్మిదిమైళ్ళ పొడుగునను ఈ దృశ్యమే గానవచ్చుచుండెను. ప్రతి చోటను పుష్పమాలలతోపాటు, భూదానములుకూడ లభించుచుండెను. ఒకచోట మంగళహారతి పళ్ళెరములో కర్పూరము మండుచుండగా చూచి, బాబా, 'దీనిని ఎన్నడును వెలిగించరాదు. ఇది విదేశముల నుండి వచ్చుచున్నది' అనిరి.

మా యాత్రీదళములోని ఒక సమాజవాదీ మిత్రుడు తివారీజీ కొన్ని ప్రశ్నలడుగగా బాబా యిట్లనిరి: 'సమాజవాదులకు స్పష్టమయిన అభిప్రాయములు లేవు. వారిలో కొందరు గాంధీవాదులు. కొందరు మార్క్సువాదులు, మఱి కొందరు ఉభయులును. ఇంకను కొందరు ఎవరునుకారు. అహమదాబాదులో కేంద్రీకృతములయిన మిల్లులను వికేంద్రీకరించి పల్లెపల్లెలలోను స్థాపింపవలెనని వారి యభిప్రాయము. ఇప్పటివఱకును వారు గ్రామ పరిశ్రమల నంగీకరించి యుండలేదు. ఉత్పాదక కార్యములనన్నిటిని చేతితోనే చేయవలెనని నా అభిప్రాయము. మిల్లులన్నిటిని మూసివేయవలెనని నా వాదన. కాని రైలుబండ్లు, విమానములు మొదలయిన వాహనములుండవలెను. కారణమేమనగా, ఆ వస్తువులు వేఱు. ఇవి సమయసాధక యంత్రములు. ఉత్పాదక యంత్రములు కావు. నేను మిక్కిలి వేగముగల విమానమునే కోరుచుందును. ఈనాటి విమానముల గమనవేగము నాకు చాలదు. మొన్నమొన్ననే (నావంక సైగజేసి) ఈ బాలిక తండ్రి యూరోపు వెళ్ళివచ్చినాడు. అదేవిధముగా ఈ విమానము నన్నుకూడ యూరోపు లేక అమెరికా తీసికొనిపోగలదు. కాని నేను కుజ, గురు గ్రహములపైన ఎక్కి పోగోరుచున్నాను.'

విక్రమ గ్రామములో ఈనాటి మా నివాసము బేసికు ట్రెయినింగు స్కూలులో అయియుండెను. ఏదో సైనిక శిబిరమును ఇప్పుడు బేసికు స్కూలుగా మార్చియున్నారు. 'సైనిక శిబిరమున కింతకంటె

శ్రేష్ఠమైన ఉపయోగమేమి ఉండగలదు' అని బాబా అనిరి. ఏదయినను నిర్మాణాత్మక కార్యములు జరుగు సంస్థలోనికి పోయినప్పుడు ఖద్దరు ధారులయిన సోదర సోదరీమణులు కనబడెదరు. సర్వత్ర స్వచ్ఛత, నియమపాలన, నూలు వడకుట మొదలయినవి చూచినప్పుడెంతో సంతోషముగానుండును. అట్టితడి స్వగృహములోనికే వచ్చితిమా యనిపించుచుండును. విక్రమ గ్రామములో సాయంకాల సభకూడ బ్రహ్మాండముగానుండును. ఒక విశాలమయిన మామిడిచెట్టు నీడను కలశములతోను, తోరణములతోను అలంకరింపబడిన మంచె పైన వినోబాజీ ఆసీనులయి యుండిరి. 'నవీనవిద్య' (నయీ తాలీమ్) ను గురించి వినోబాజీ ఇట్లనిరి: 'ఈ విద్య నేడు సమాజమునందుగల పురాతన మూల్యములనన్నిటని పోగొట్టి, నవ్యమూల్యమునుస్థాపించునదయియున్నది. ఇది సమానత్వమును తీసికొని రాగలదు.' ఇంకను వారిట్లనిరి: "నేను నా భావమును చీనానుండిగాని, రష్యానుండిగాని తెచ్చియుండలేదు. అది యీ ఆర్యభూమిలోని ఒక ధర్మభావన. 'ఏ మనుష్యుడు తన సోదరులకు పెట్టకుండ ఊరకే అన్నసంగ్రహము చేయుచుండునో, వాడు తన హత్యకొఱకు సంగ్రహించుకొనుచున్నా' డని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. ఇంతకంటె కఠినముగా ఎవరు శపింపగలరు ?"

పేట్ కన్య నాతో 'నీనుండి హిందూ తత్త్వజ్ఞానము నేర్చుకొనవలసియున్న' దనగా నేను 'చెల్లీ ! ఈ విషయమయి నీవెంతో, నేనూ అంతే' అంటిని. పేట్ కన్యను చూచినప్పుడు ఇక్కడికి జనులకు ముఖ్యముగా విద్యార్థులకు చాల ఆశ్చర్యము గలుగుచుండెను. విద్యార్థులు ఎల్లప్పుడు ఆమెను ప్రశ్నలు అడుగుచుందురు. ముఖ్యముగా సామ్యవాదమువైపు మ్రొగ్గిన విద్యార్థులు ఆమెతో 'భూదానయజ్ఞమువల్ల ఏ సమస్యకూడ పరిష్కారము కాదు' అనుచుందురు. ఆమె శాంతముతో గంటలకొలది వారికి భూదాన తత్త్వజ్ఞానమును బోధించుచుండును.

భారతీయ విద్యార్థులు యజ్ఞము, దానము, అద్వైతము మొదలయిన విషయములను గురించి ఒక అమెరికను సోదరినుండి పాఠము నేర్చు కొనవలసివచ్చుచుండెను !

జయప్రకాశజీ భార్య ప్రభావతీదేవిచే స్థాపితమయిన "మహిళా చరఖా సమితి" ఇక్కడ చక్కగా పనిచేసి యున్నది. ఆ సంస్థలోని సోదరీమణులు ఇక్కడ బాగుగా ప్రచారము చేసిరి. కనుక ఈ రోజు లలో సభలలో స్త్రీలు అధికముగా కనబడుచుండిరి. ఇక్కడనుండి పాట్నా సమీపములోనుండుటవలన మంత్రులు, గొప్పగొప్ప ఆఫీసర్లు, శాసనసభ సదస్యులు మొదలయినవారు ఇక్కడకు గుంపులుగుంపు లుగా వచ్చుచుండిరి. బీహారు ప్రాంతీయ కాంగ్రెసు కమిటీవారు బీహారు శాసన సభాసభ్యులను, పార్లమెంటుసభ్యులను తమతమ నియో జక వర్గములలో భూదాన కార్యములు సాధింపవలసినదని ఆదేశించి యున్నారు. అందువలన ఏ సభ్యుని నియోజకవర్గములోనికి వినోబాజీ పోవుచుందురో, ఆ సభ్యుడు ముందుగానే కొంతభూమిని సంపాదించి వారికి స్వాగతమిచ్చుటకు సిద్ధముగా నుండును.

ఒకానొకనాడు బాబా, "నేను తిరుగుచుండుటలేదు. క్రాంతియే తిరుగుచున్న" దనెను. ఈ రోజున నేను బాబాతో పోవుచుండగా చూచి, ఇక్కడ ఉన్న నాయకులొకరు వినోదముగా, 'ఏమమ్మా ! మీరు పూర్తిగా క్రాంతితో అడుగులో అడుగు కలుపుకొనుచు తిరుగు చున్నారే' అనగా, నేను నవ్వుచు 'కాదండీ, నేను క్రాంతికి వెనుక వెనుకనే నడచుచున్నాను' అంటిని.

పదిమైళ్ళ లోపు అయినచో మేము సూర్యోదయమునకు పూర్వమే మజిలీ చేరుకొనుచుండెడివారము. ప్రాతఃకాల సుందర సమయమందు బాబాకు మాట్లాడవలెనను ప్రేరణ గలుగుచుండును. మనేరు గ్రామము చేరగానే అటువంటివేళ వారిట్లు చెప్పసాగిరి: "ఆర్యుడు అనగా ఉదారుడు, దాత" అని అర్థము. కనుక ఆర్యభూమి

నివాసులయిన మనము ఉదారులముగా నుండవలెను. ఆర్యుడు కృప ణుడుగా నుండజాలడు......"

"మిల్లు బట్టల కంటె ఖాదీ (ధరలో) ప్రియముగా నుండును అని కొందఱనుచుందురు. కాని మిల్లులవల్ల ఎందఱు నిరుద్యోగులగు చున్నారో వారికి అన్నపానము లిచ్చి పోషించు భారము మిల్లులకు వప్పగించిన యెడల మిల్లుబట్ట ప్రియముగానుండును. మిల్లు వస్తువులు చౌకగా నుండుటకు కారణమేమనగా అక్కడనున్న జనులకు తక్కువ మజూరీ ఇచ్చుచుండెదరు. సారాంశమేమనగా జనులు ఆకలిబాధచే చావవలసి వచ్చుచున్నది. ఖద్దరు అందఱకును పని చూపించి అన్నము పెట్టుచున్నది. విషము చౌక, అమృతము ప్రియము."

"హిమాలయమునకు స్థానము వక్షము కాదు, మనసు. కాని హృదయము ఉష్ణముగా నుండవలెను. అక్కడ భావనలుండవలెను. మనస్సులో హిమాలయమును, హృదయములో అగ్నియు ఉండ వలెను. కాని ఈ రోజులలో నవయువకుల స్థితి కేవలము దీనికి భిన్నముగా నున్నది."

# దేవతలను సంతోష పెట్టండి.

*ఛపరా, మాంఝీ, ఏకమా, మహారాజగంజి (సారణ)*

**6, 7, 8, 9 అక్టోబరు, 1952**

'సారణ' రాష్ట్రపతి రాజేంద్రబాబు జిల్లా. రాజేంద్రబాబు గత సంవత్సరము ఢిల్లీలో వినోబాజీతో, "బీహారులో, నా తాలూకుభూమి ఎంత కావలెనో అంత తీసికొనండి" అని చెప్పియుండుటయే గాక, "వినోబాజీచే ప్రారంభింపబడిన భూదాన కార్యములందు మీరు చేరి పని చేయండి" అని ఆ జిల్లా వాసులకు విజ్ఞప్తి చేసియుండిరి. జయ ప్రకాశ్ కూడ ఈజిల్లా వాసులే అయియుండిరి. "ఈ రోజులలో వారు

ఆరోగ్యలాభము కొఱకు పూనా నగరములో విశ్రాంతి తీసికొను చుండిరి. కాని వారి హృదయము యావత్తు బీహారులోని భూదాన ముల కొఱకే కొట్టుకొనుచున్నది. పూనానుండి వారు వ్రాసెడి ప్రతి ఉత్తరములోను బీహారు భూదాన ప్రశంసయే ఉంటున్నది'' అని వారి మిత్రులు చెప్పుచుండిరి. వినోబాజీ ''మీ శరీరము అక్కడ ఉన్నప్పటి కిని మీ మనస్సు ఇక్కడ ఉండుటవల్ల ఎన్నో పనులు జరుగుచున్నవి'' అని వారికి ఉత్తరము వ్రాసియుండిరి.

దారిలో వెళ్లుచుండగా ఒక కార్యకర్త, 'బాబా! ఏదిన మందు భూమి దొరకదో, ఆ దినమున ఏమిచేయవలె'నని అడుగగా బాబా, ఏదినమున భూమి దొరకదో ఆరోజున ఉపవాసము చేయండి. మరియు భూస్వాములతో 'మీరు ఒక వేళ భూమిని ఇవ్వనియెడల నేటికి అన్నము తినను' అని ప్రేమపూర్వకముగా చెప్పండి' అని చెప్పగా, ఆ కార్య కర్త 'ఇది ఒత్తిడికాదా ?' అని అడిగెను. అంతట బాబా ఉచ్చస్వర మున ''ఇదేమి ఒత్తిడి. వారి వక్షముపయిన పిస్తోలు పేల్చుటకు సిద్ధ మయిన వారుండగా, వారిని మనము ఆ స్థితినుండి రక్షించుచున్నాము. ఈ సంగతిని ప్రేమపూర్వకముగా బోధింపవలెను'' అనిరి.

మాంఝీ గ్రామము పోవునప్పుడు దారిలో ఒక పొడుగుపాటి గ్రామము తగిలెను. ఆ గ్రామములో ఒక్కటే రోడ్డు ఉండెను. ఆ రోడ్డున కిరువైపుల ఇండ్లును, వానివెనుక పొలములు ఉండెను. ఈ గ్రామ నిర్మాణము చక్కగా నున్నది. ప్రతి యింటికి పరిశుద్ధమయిన గాలి వచ్చుచుండును. ఎదురుగా సంఘీయులు, వెనుకవైపున సృష్టి. ఆ గ్రామ సమీపములో గౌతమ మహర్షి దేవాలయ ముండెను. అక్కడ అతని ఆశ్రమ ముండెనని చెప్పుదురు.

మాంఝీ గ్రామము సరయూనది యొడ్డున నిలిచియున్నది. భూదేవి సీతాదేవిని తన గర్భములో దాచుకొన్నప్పుడు రాముడు విర హముచే వ్యాకులుడై ఈ సరయూనదియందే దేహ త్యాగము చేసి

యుండెను. సరయూనదిలో నీటి వేగము అధికముగా నుండెను. కాని అది నీటి వేగముగాక, రాముని ప్రేమ రసోద్వేగమై యుండెను.

ఒకదినమున మే మొక జమీందారుని యింటిలో బస చేసితిమి. విద్యావతి యగు అతనిభార్య ఆ యింటి నంతటిని కళాకృతులతో నలంకరించినది. దానిని చూడగా సంతోషము గలిగినది. మఱుక్షణము ననే నా మనస్సులో అన్యభావములు ప్రవేశించినవి. "లక్షలకొలది జనులు దేశములో అన్నములేక గిలగిల తన్నుకొనుచుండగా ఎవరయినను గృహాలంకరణకై ప్రయత్నము చేతురా? సామాన్యజనుల అవసరములు తీరకుండ వ్యక్తి తన చిన్నయింటిలో సుఖముగా నుండజాలడు. ఇవి కటువాక్యములే అయినను, సత్యమే యగునుగదా! ఈ సత్యమును గుర్తింపగానే సుఖజీవనము చేయు వ్యక్తులు తమ వ్యక్తిగత జీవితములోని మోహపాశమును ఛేదించుకొని సంఘజీవితములో తమ జీవితములను విలీనము చేసికొనుట నేర్చుకొనవలెను."

మహారాజగంజి గ్రామము ప్రవచనములో వినోబాజీ, "ఈనాటి సమాజ పద్ధతిని ఒకపద్ధతి అనరాదు. విధ్వంస మనవలెను.

దేవతలు కొద్దిపూజతో సంతృప్తి పొందెదరు. వారికి "పత్రం, పుష్పం, ఫలం, తోయమే" చాలును. కాని రాక్షసులు సర్వస్వము కోరుచు అంతయు నాశనము చేయుచుందురు. కనుక కాలము మించిపోక మునుపే దేవతలను సంతోషపరచండి. లేనిచో సర్వస్వము అపహరింపను పట్టు రాక్షసులు రాగలరు" అనిరి.

## నైతిక అధిష్ఠానము, భూదానమునకు పునాది

*సీవాన్, మీర్‌గంజ్, బడహరియా, గోపాలగంజి, బరేలీ*

**10, 11, 12, 13, 14 అక్టోబరు, 1952.**

దారినడక సాగుచున్నది. దానితోపాటు చర్చకూడ. ఒక సోదరుడు ప్రశ్న లడుగగా, బాబా ఇట్లనిరి: "స్వరాజ్యము రాక

పూర్వము దేశస్థితి వేఱు. ఈనాటి స్థితి వేఱు. ఆ సమయములో స్వరాజ్యము పొందుటకొఱకు దేశములోని శక్తులన్నియు కేంద్రీక రింపబడినవి. కారణ మేమనగా స్వరాజ్యములేకుండ మన మేమియు చేయజాలకుంటిమి. కాని ఇప్పుడు సర్కారు మనదయిపోయినది. ఈ సమయమున ప్రభుత్వమును దృఢముగా చేయుట మన కర్తవ్యము. మనము స్వరాజ్యమునకు దెబ్బతగులుపని చేయరాదు. చాలమంది ఈ సంగతిని ఆలోచించరు. స్వరాజ్యము దృఢపడినమీదట అనగా 20, 25 సంవత్సరముల తరువాత మనము నేటికంటె భిన్నముగా ప్రవర్తింపవచ్చును. కాని నేటి అరాజకతవల్ల స్వరాజ్యమునకే మోసము కలుగవచ్చును. అందువలన ప్లానింగు కమీషనును కఠి నముగా విమర్శించితిని. కాని ప్రభుత్వమువయిన తిరుగుబాటు చేయ లేదు. జనశక్తికి ప్రబోధము కలిగినకొలది, ప్రభుత్వ మాసంగతి కని పెట్టగలదు. మన లక్ష్యము వికేంద్రీకరణము. కాని నేడు మనము రెండు విషయములపైనే పట్టుదల చూపుచున్నాము. 1. భూమి పంపిణీ 2. గ్రామపరిశ్రమలు. ఈ రెంటిని నేను "సీతారామ్" అని చెప్పుచున్నాను. నేటి సర్కారువారు ఈ రెండు విషయములను అంగీకరించినయెడల నేటికంతే చాలును. దీనివల్ల బీదప్రజలకు కొంత ఉపశాంతి గలుగును. అంతేగాక వారిలో విశ్వాసముగూడ గలుగును అటుపిమ్మట తరువాతి పని సరళమే.

నా పనిని అనేక దృష్టికోణములతో చూడవచ్చును. ఎవనికి ఏచూపు నచ్చునో, అత డాప్రకారము చేసికొనవచ్చును. ఏఒక్క చూపుతోనో పనిచేయునప్పుడు, ఇతరచూపులతో జరుగు పనులకు అప కారము జరుగరాదు. ఈ కార్యమందలి నైతిక అనుష్ఠానమునకు దెబ్బ తగులరాదు. ఈ విషయమై జాగరూకులయి యుండవలెను. భిన్న భిన్న రాజకీయ పక్షములవారు ఈ పనిని సాధించునప్పుడు నా పద్ధతినే అవలంబింతురని నాకు నమ్మకము గలదు."

"రాజనీతి అన్నిటికంటె చివర రాగలదు. అది దేవాలయ శిఖరము వంటిది. పునాది లేకుండ దేవాలయ నిర్మాణము జరుగ జాలదు. పునాది సంగతిని ఎవరును ఆలోచింపరు. అయినను మన కార్యకర్తలు భూదానయజ్ఞములోని నైతిక అధిష్ఠానమును గుర్తించు కొనవలెను. నైతిక అధిష్ఠానము పునాది. ఆర్థిక రంగము మందిరము. రాజనైతిక రంగము కలశము. భూదాన యజ్ఞము వలన నేటి రాజ్య స్వరూపమే మాఱిపోవును. అనగా మన భావ పరంపరల ననుసరించి నవ్య రాజ్యమే యేర్పడును. ఇతర పరిభాషలో ఈ సంగతినే చెప్పవలె నన్న ఈ కార్యమునకు పునాది (Basis) నైతికము, యోజన (Plan) ఆర్థికము, మహత్త్వము (Elevation) సామాజికము అయి యున్నది."

ఈ జిల్లాలో చాల పంచదార మిల్లులున్నవి. మీర్ గంజిలో ఒక పంచదార మిల్లు ఉన్నది. అది అక్కడ ఉన్నట్లు, ఆ గ్రామ సమీప మునకు పోగానే మాకు తెలియవచ్చినది. పంచదార మిల్లు మూల మున దుర్వాసన వ్యాపించి యుండెను. బాబా దానిని బొత్తిగా సహింపలేకుండిరి. 'నన్ను అడవిలో ఏ చెట్టు క్రిందనైనను ఉంచండి. కానీ ఇటువంటి చోట ఉంచకండి. ఇది శుద్ధ నరకము' అనిరి. అటు పిమ్మట ఒక సోదరుడు పారిజాత పుష్పములను కానుకగా సమర్పిం చెను. ఆ పుష్పములను చూచి బాబా సంతోషించుచు, 'ఎంత అంద మయిన పువ్వులు. పారిజాతము దేవలోక వృక్ష' మనిరి.

బడహరియా గ్రామ సభలో కేవలము రెండు యకరముల భూదానము లభించెను. ఇప్పటి మాయాత్రలో ఇంత తక్కువదానము ఎన్నడును దొరికి యుండలేదు. నేటి ప్రవచనములో బాబా ఇక్కడి కార్యకర్తలను మందలించుచు "ఇక్కడికార్యకర్తలందరు సోమరులు, నిస్తేజులు అయిపోయిరి. వారి స్థితి మిక్కిలి దయనీయమయినది" అనిరి. ఈ మందలింపుతో కార్యకర్తలు మేలుకొని గ్రామగ్రామము

తిరిగి భూమిని తే నారంభించిరి. సారణ జిల్లాలో మంచి కార్యకర్తలు చాలమంది గలరు. స్వరాజ్యాందోళనములో వందలకొలది జనులు చేరియుండిరి. కాని "జనులందఱును అధికారము వెంటబడిరి. అందువలన నిఱుపేదలను సేవించుట కెవరికిని అవకాశముండుటలే" దని బాబా చెప్పుచుందురు.

బీహారులోని మంత్రి యొకరు మొన్ననే భూదాన యజ్ఞమును గుఱించి విమర్శించుచు "వినోబాచేయు పనివలన సంఘములో భయస్థితి యేర్పడుచున్న" దనిరి. గోపాలగంజి సభలో ఈ విషయముపై వినోబా ఇట్లనిరి: "నా పని వల్ల భయస్థితి ఏర్పడుచున్న దనువారు కొంచెము ఆత్మ పరిశీలన చేసికొనుట మంచిది. భూమి యివ్వరాదని వారొకవేళ నిశ్చయించుకొన్నయెడల, నా పనివల్ల తప్పక భయస్థితి కలుగును. కనుక సంఘములో భయస్థితి కలిగించుట, కలిగింపక పోవుట వారిపైనే ఆధారపడి యున్నది."

ఈ రోజున కొన్ని కటు వాక్యములు చెప్పబడుట వలన వారి రిపోర్టును తయారుచేసి, అందలి సామంజస్యము చెడకుండుటకుగాను బాబాకు చూపించితిని. ఒక రోజున ఒక రిపోర్టులో సారాంశము వ్రాయునప్పుడు ఒక ప్రధాన వాక్యమును విడిచిపెట్టితిని. అప్పుడు బాబా నాతో "ఆ ఒక్కవాక్యము విడిచిపెట్టుటవల్ల ఆ రిపోర్టులోని సామంజస్యము చెడిపోయినది" అనిరి. బాబా భావములను చెడిపోకుండ రిపోర్టు వ్రాయుట ఎంత కష్టమో నాకప్పు డర్థమైనది...

బాబా ప్రతి శబ్దమును శ్రద్ధగా పరిశీలన చేయుచుండిరి. సమయము గడచుచున్న కొలది నా గుండెలు తటతట కొట్టుకొనసాగినవి. చివరలో వారు రెండు మూడు మాటలను సవరించి "సరిగా ఉన్నది" అనగా, అప్పుడు నాకు ఎం. ఏ. తాతవంటి పరీక్షలో నెగ్గినట్లు తోచినది. "నేనే మాటలను ఎందుకు సవరించితినో, ఆ సంగతి పరిశీలించుము" అని కూడ వారు నాతో చెప్పిరి.

ఒక దినమున మేము దారిలో ఒకచోట ఉపహారముల కొఱకు ఆగియుండగా ఒకస్థానిక కార్యకర్త అక్కడచేరిన జనులకు భూదానము లివ్వవలసినదని ఉపన్యసింప నారంభించెను. అంతట బాబా ఆతని నడ్డగించుచు, "ఈ విధముగా గాలితో ఏల మాట్లాడెదవు ? ప్రతి వ్యక్తి వద్దకుపోయి ప్రేమతో బోధింపుము. ఎవరినయినను తుపాకిగుండుతో కొట్టవలెనన్న, అతనిని ఈ విధముగా గాలిలో కొట్టజాలవు గదా ! అతని దగ్గఱకు పోవలెను. గుండెపై గుఱిచూడవలెను. అప్పుడు కొట్టవలెను. మనది ప్రేమ మార్గము. హింసామార్గము కాదు. కాని ఈ విషయములో కూడ మనుష్యుని సమీపమునకే పోవలసి యున్నది."

ఈ రోజులలో బాబా అనేక పర్యాయములు ఈ ప్రకారము తుపాకి గుండుతో ఉపమానము చేయుచుండగా చూచినప్పుడు మాకాశ్చర్యము గలుగుచుండెడిది. వారు భారతదేశము, బీహారు అందలి ప్రత్యేక జిల్లా పటములను ఎదురుగా పెట్టుకొని వానివంక చాలసేపు చూచుచు ఉందురు. ఏ స్థానములో ఎంతపని అయినది, ఎక్కడకు ఎవరిని పంపినయెడల ఎక్కువపని కాగలదు, ఈ సంగతులు ఆలోచించుచుందురు. వారు పూర్తిగా, ఒక మహా యుద్ధములోని సేనాధిపతివలె, ప్లానులు వేయుచుందురు. హింసా యుద్ధములోగల అనుశాసనము, వ్యవస్థ, యోజన, నియమపాలన— ఈ మొదలగు గుణములన్నియు, అహింసా సైనికులమగు మనముకూడ అలవరచుకొనవలెను,' అని బాబా చెప్పుచుందురు.

దీపావళి పండుగ సమీపించుచుండెను. ఒకదినమున ఆకాశమున ఏకాదశి చంద్రుని చూచుచు బాబా అక్కడనున్న జనులను, "మీరు దీపావళి పండుగను ఏ విధముగా జరుపుకొందురు ?" అని అడిగి, దీపావళిని గుఱించి యిట్లు చెప్పసాగిరి : "వర్షాకాలమయిన పిదప శరదృతువులో ఆకాశము స్వచ్ఛమై, నిరభ్రమై, నిర్మలమై కన్పట్టును. వేసవికాలములోకూడ ఆకాశములో రజఃకణములు గానవచ్చు

చుండును. అందువలన శరదృతువులో మాత్రమే ఆకాశము నిర్మలమై గానవచ్చును. కనుకనే శరత్పూర్ణిమకును ప్రథమ అమావాస్య (దీపావళికిని) ఉత్సవము చేసుకొందురు. అమావాస్యనాడు నిర్మలాకాశమున తారాగణముల ఉత్సవము గాననగును. అదేవిధముగా భూమి పయిననుగూడ దీపావళి మూలమున అటువంటి దృశ్యమునే చూడగలుగుదుము. ఈ ఉత్సవములు ప్రకృతితో ఏకరూపత సాధించునట్టి ఉత్సవములు.''

అనంతరము బాబా తమ కల్పన ననుసరించి గ్రామవ్యవస్థ యెట్లుండ వలయునని కోరుచుందురో, ఆ విషయమయి ప్రసంగించిరి. ఒకమిత్రులు ''బాబా! ఇదంతయు వినుటకు అతి మధురముగా నుండును. కాని మన అలవాటు లెట్లుమాఱగలవు?'' అని అడుగగా, బాబా ఇట్లు సమాధానముచెప్పిరి: 'అలవాటులు దేహసంబంధమైనవి. కనుక హృదయములో భావన ప్రవేశింపగానే అలవాటులు వెంటనే మాఱిపోవును. ఒకగుహలో పదివేల సంవత్సరములనుండి అతిప్రాచీనముగ అంధకారము నివాసము చేయుగాక! అక్కడకు ఒక చిన్న దీపమును తెచ్చితిమా, ఆ చీకటి అంతయు పలాయనము కావలసినదే. అంతేగాని, చీకటి పదివేల సంవత్సరాలనాటిదిగనుక, అది నశించుటలో కొంతకాలము పట్టుననుమాట ఉండదు. ఈ విధముగానే హృదయములో భావన ప్రవేశింపగానే వెంటనే అలవాటులలో మార్పు ఏర్పడును' అని.

నాకు తులసీదాసుగారి వాక్యమొకటి జ్ఞాపకమువచ్చినది.

''బిగడీ జన్మ అనేక కీ సుధరత పల్ మేఁ ఆధ్''

మానవ హృదయమునకు నవ్యభావన పట్టగానే దానియందు మార్పు గలుగును. ఇట్టి శ్రద్ధయే భూదానయజ్ఞమునకు అధిష్ఠానము.

గీతలో చెప్పబడిన స్థితప్రజ్ఞ లక్షణములను గుఱించి ఒకరు ప్రశ్నింపగా బాబా ఇట్లు సమాధానము చెప్పిరి: ''గీతలో స్థితప్రజ్ఞునికి

విలక్షణములు చెప్పబడినవో, అవే అతని సాధనములుకూడ. స్థిత ప్రజ్ఞునికి విలక్షణములు స్వాభావికములుగా నుండునో మనము వానిని ప్రయత్నపూర్వకముగ సాధింపవలెను. సరియయిన సమయమునకు ఉదయించుట సూర్యునకు స్వాభావికము. కాని మనము ప్రయత్నము చేసి ఆ పని చేయగలము.''

బాబా తఱచుగా భూదానమును కన్యాదానముతో ఉపమించి ఇట్లు చెప్పుచుందురు : 'భూమి హీనుడయిన రైతును తన అల్లునిగా ఎంచుకొని గౌరవపూర్వకముగా అతనికి భూమినిచ్చి, ఇతరసాధనము లనుగూడ ఇచ్చుచుండవలెను. అట్లుచేయుటవల్ల సాలంకృత కన్యా దానమగును' అని బాబా చెప్పెడి ఈ పలుకు నా కెన్నడును అర్థ మయ్యెడిదికాదు. దానముక్రింద ఇచ్చివేయుటకు కన్యక ప్రాణహీన వస్తువా ?· అని నాకు తోచుచుండును. కనుక కన్యాదానశబ్ద ప్రయో గమువల్ల స్త్రీయొక్క స్వాభిమానమునకు దెబ్బతగులుచున్నది అని నాకు తోచుచుండును. ఈ రోజున నేను తెంపుచేసి బాబాతో ''మీరు కన్యాదాన మని చెప్పుచుందురు. ఆ మాటలు మాకు నచ్చలే''దంటిని.

అందుకు బాబా ఇట్లు సమాధానమిచ్చిరి : అవును. మంచి మాట చెప్పితివి. కన్యాదాన మనుమాట త్రోసివేయదగినదేయగును. కాని సమాజంలో ఇది రివాజుగా నున్నది. జనులకు వారిభాషలో బోధించుటకుగాను ఆ శబ్ద ప్రయోగము చేయుచున్నాను. కాని ఇక ముందు చేయను. ఇంకొక సంగతి. మన శాస్త్రములలో 'కన్యా సంప్రదాన్' అను శబ్దప్రయోగము ఉన్నది. దాని భావము దానము వంటిదికాదు. అయినను దాన మనుమాట సమాజములో వ్యాపించి పోయినది. కారణ మే మనగా, నేటికికూడ తలిదండ్రులే తమ కుమారుల వివాహమును నిశ్చయించుచున్నారు. ఒకవేళ బాల బాలికలు తమ పెండ్లిండ్లు తామే నిశ్చయించుకొన్నయెడల ఆసంగతి

వేఱుగా నుండెడిది. అది స్వయంవరము కాగలదు. అవును. అదికూడ మంచిదే'' అని.

అటుపిమ్మట వారు తమ ప్రవచనములో ఈ విషయమునే ప్రసంగించుచు ఇట్లనిరి: ''నాతో కొందఱు కన్యలు సంచారముచేయు చుందురు. వారిలో ఒకామెకు కన్యాదాన శబ్దము నచ్చలేదు. కనుక ఇప్పటినుండి ఆ శబ్దమును ప్రయోగింపనని ప్రతిజ్ఞ తీసికొంటిని. ఈ సంగతి చూడండి. అలంకారశాస్త్రములో 'ఉపమ' లో ఒక అంశము గ్రహింప బడుచుండును. 'పాలు హంసవలె తెల్లగానుండును' అనగా హంస పాలవలె త్రాగబడునను అర్థమును కాదు. లేదా పాలుకూడ హంసవలె ఎగురునను అర్థమును కాదు. ఏమయినను కన్యలు ఈ శబ్ద మును ఇష్టపడుచుండుట లేదు గనుక నేను దానిని విడిచి వేయు చున్నాను—'' అని.

దారిలో పోవుచుండగా ఒక పక్షిస్వరము వినబడెను. ''ఠాకుర్ జీ, ఠాకుర్ జీ'' అని అది కూయుచున్నదని బాబా అనిరి. ఈ వైపున దీనిని ''ఖేలోజీ'' అందురు అని రామదేవుబాబు అనెను. ''మంచిమాట. ఆడుకొనండి. పోట్లాడుకొనవద్దు' అని ఈ పక్షి చెప్పు చున్న'' దని, బాబా అనిరి. అటుపిమ్మట— ''తమిళములో ఈ పక్షి పేరేమి'' యని వెంకటేశయ్య నడిగిరి. తరువాత కేరళమునుండి వచ్చిన రాజమ్మను, ''మళయాళములో దీని నేమందు'' రని అడిగిరి. ఈ విధముగా వారు నడచునప్పుడు రాజమ్మనుండి మళయాళమును, వెంకటేశయ్యనుండి తమిళమును నేర్చుకొనుచుండిరి. కాని సామాన్య ముగా ఆయా భాషల విషయములో గురువుకంటె శిష్యుడే అధికు డని తెలియుచుండెడిది.

దారిలో ఒక రైతు, బాబా చెప్పిన మీదట తన రెండు బీగాల పొలమునుండి రెండు కట్టాలు దానము చేసెను. దానిపైన బాబా ''ఇట్టిది హిందుస్థానముననే సాధ్యము. ఎప్పుడయినను అడిగినందువల్ల

భూమి లభించునా! చంపితే గాని భూమి రాదు.' అని యూరపువా రనుచుందురు'' అనిరి. అటుపిమ్మట ఒక ధనవంతుడు తన హోదా కంటె మిక్కిలి తక్కువ భూమి నిచ్చియుండగా, బాబా అతని దాన పత్రమును అతని కిచ్చివేసి ''మీకు అగౌరవము కలుగవలెనని నా అభిప్రాయము కాదు. అందఱికిని గౌరవము పెరుగవలెనని నా తలంపు. అందువల్ల మీ దానపత్రమును నేను స్వీకరించుట లేదు. నేను మీ దానము నంగీకరించితినా, మీకు అగౌరవము గలుగును. ఇతడు తక్కువ భూమినిచ్చి వినోబాను మోసగించినాడని ప్రజలు చెప్పుకొందురు. కనుక మీరు ఇవ్వదలచుకొన్న యెడల బాగా ఆలోచించుకొని మీ శక్తికి తగినట్లు ఇవ్వండి. తక్కువ ఇవ్వదలచిన యెడల అసలు ఇవ్వకండి'' అనిరి.

బరేలీ గ్రామములో ఇచ్చిన ప్రవచనములో వినోబాజీ ఒక సుందర మంత్రమును వినిపించిరి.

''శ్రద్ధయా దేయమ్, అశ్రద్ధయా అదేయమ్, శ్రియా దేయమ్, హ్రియా దేయమ్, భియా దేయమ్, సంవిదా దేయమ్.''

ఈ మంత్రముతో భూదాన యజ్ఞములోని నిగూఢ విషయములను ఎక్కడకక్కడ విడదీసి చెప్పిరి. సనాతన మంత్రములనుండి క్రాంతికరములగు నవ్యార్థములు కల్పించుటలో వారికి గల శక్తి అద్వితీయమయినది. ఒక రోజున వారు వినోదముగా ''నా శస్త్రాగారమందు ఎన్నో శస్త్రములున్నవి. వాని యెదుట ఎవ్వరును నిలువజాలరు'' అనిరి. వేదములు, ఉపనిషత్తులు అను ఆ శస్త్రాగారము సర్వులకు అందుబాటులోనిదే. కావి ఆ శస్త్రములను ఉపయోగించునట్టి పాత్రత మనకెక్కడ గలదు?

# మనది అహింసామార్గము

*గోరయ్యాకోఠీ, వసంతపూర్, మసరఖ్*

15, 16, 17 అక్టోబరు, 1952

ఆదర్శ గ్రామ నిర్మాణమును గుఱించి మాట్లాడుచు బాబా యిట్లనిరి: "భూమి అంతయు గ్రామ యాజమాన్యము క్రిందకు వచ్చి నప్పుడు రెండు విధములయిన ప్రయోగములు చేయవచ్చును. (1) అందఱు కలిసి భూమిని వ్యవసాయము చేసికొనవచ్చును. (2) లేదా ప్రతి కుటుంబమునకు ఇంత భూమి అని ఇచ్చి మిగిలిన భూమిని సామూహికముగా వ్యవసాయము చేసికొనవచ్చును. గ్రామ ములోని పిల్లలందఱకు ఒకే విధమయిన విద్య నేర్పబడును. ఒకవేళ గ్రామస్థులకు అవసరమని తోచినయెడల మేధావియగు ఏ బాలు నైనను విద్యకొఱకు విదేశములకు పంపవచ్చును. అతడు గ్రామ బాధ్యత పైన పంపబడును. గ్రామములో ఒక "సామూహిక వివాహ నిధి" యుండును. ఇక బాలుని వివాహమయినను, బాలిక వివాహ మయినను ఆ కుటుంబమునకు సంబంధించినదిగా నుండక గ్రామము నకు సంబంధించియుండును. అందు గ్రామీణులందఱు పాల్గొందురు."

ఈ రోజులలో మేము ప్రతిదినము రెండుజాముల వేళ స్త్రీలకు ప్రత్యేక సమావేశము ఏర్పాటు చేయసాగితిమి. అందు ఘోషా విడిచి పెట్ట వలసినదనియు, భూదానములు చేయించవలసినదనియు బోధించు చుంటిమి. ఒక రోజున ఒక సోదరి మాతో ఇట్లనెను: "చదువుకొన్న స్త్రీలు తమ విద్యాబలము పైన ఘోషా విడిచిపెట్టి బయట తిరుగ గలరు. కాని మేము ఏ బలము చూచుకొని తిరుగుబాటు చేయ గలము ?" నేనీ మాటలను బాబాతోచెప్పగా, వారు "ఆత్మబలముపైన తిరుగుబాటు చేయవచ్చు" నని సమాధాన మిచ్చిరి. ప్రయాణము చేయుచుండగా నేనీరోజున బాబాను ఇట్లడిగితిని: "తూర్పు దేశీయులు

తమ సంస్కృతి, గౌరవమును తెలిసికొందురు. కాని తూర్పుదేశముల లోనేఉన్న స్త్రీల స్థితిగతులు ఇంత అధ్వాన్నముగానుండుటకు కారణ మేమి ? పిల్లవాడు పుట్టగానే ఉత్సవము చేసికొందురు. బాలిక పుట్టిన దనగానే పెదవి విఱిచెదరెందువల్ల ?''

బాబా : ఆ ఉత్సవము జరుపుకొనుటలోను, ఆ పెదవి విఱు చుట్టలోను ఆర్థిక సమస్య గర్భితమయి యున్నది. బాలిక పరాయి యింటికి వెడలిపోవుచున్నది. బాలుడు ముసలితనములో ఆధారము కాగలడు. అదిగాక స్త్రీల స్థితి నీ వనుకొన్నంతగా చెడియుండలేదు. హిందుస్థానములోని ప్రతి యింటిలోను స్త్రీల రాజ్యమే జరుగుచుం డును. స్త్రీని "లక్ష్మి" అని చెప్పుచుందురు. అందు సంపత్తి అర్థము (Property sense) లేదు. అది గుణవాచకశబ్దము. బాలునికూడ'రత్న' మని చెప్పుదురు. శాకుంతలములో శకుంతలా వివాహ సందర్భమున "ఆహుతి అగ్నిలో వేయబడినది" అని చెప్పబడినది. అది కేవలము ఉపమాలంకారము. అందు కవి కల్పనాశక్తి ఇమిడియున్నది. వాస్తవ మునకు ఇక్కడ స్త్రీలకు అప్రధాన స్థానము లేదు. భారత దేశములో వేదాంతమందలి తత్త్వజ్ఞానము అంగీకరింపబడుచున్నది. అందువలన అందఱిలోను ఆత్మ సర్వసమానముగా నున్నదన్న భావన జనుల హృదయసీమలలో ఆరూఢమయిపోయినది. ఇక్కడి మహిళలకు వోటు హక్కు సంపాదించుటకుగాను ప్రత్యేకముగా ఆందోళనను జరుప వలసిన అవసరము గలుగలేదు. కాని ఇంగ్లాండులోని స్త్రీలు ఆ వోటు హక్కును సంపాదించుటకుగాను బ్రహ్మాండమయిన ఆందోళనను జరుపవలసిన వారయిరి.

ఈనాటికిని యూరపులోని అత్యంత సభ్యదేశములలో కూడ స్త్రీలకు వోటు హక్కు లేదు. కనుక మీరు తూర్పు దేశీయులను విమర్శించునప్పుడు తూర్పు దేశములలో ఆధ్యాత్మిక సమానతను పాటించుచుందురన్న సంగతిని మఱచిపోకండి."

నేను : ఈనాడు మన తత్త్వజ్ఞానమునకును, జీవితమునకును ఉత్తర, దక్షిణ ధ్రువములకున్నంత దూరమున్నది కాదా ?

బాబా : అవును. ఆ మాట నిజమే. ( మరల కొంత ఉద్వేగముతో ) మన తత్త్వజ్ఞానమంతయు గౌరీశంకర శిఖరముపైననే నిలిచియున్నది. ఇప్పటివఱకును అది క్రిందకు దిగిరాలేదు. భారత దేశములోని మహాపురుషులు ఇతర దేశములలోని మహాపురుషుల కంటె గొప్పవారు. కాని ఇక్కడనున్న సామాన్య జనులు ఇతర దేశముల జనులవంటివారే. ఇక్కడనున్న మహాపురుషులకును, సామాన్య జనులకును గల అంతరము చాల యెక్కువగా ఉన్నది.

మొన్న మొన్ననే 'సిక్కిము' లో సంచారము ముగించుకొని వచ్చిన ఒక పార్లమెంటు సభ్యుడు బాబాతో ఇట్లనెను : "అక్కడి స్థితిగతులు పాడు, పాడుగా నున్నవి. దాని మూలమున దేశమున కంతకును ఉపద్రవము కలుగునా యనిపించును. అక్కడి భూమి యావత్తు గొప్పవారి చేతిలో నున్నది. జనులు గర్భ దరిద్రులు. కమ్యూనిస్టులు మిక్కిలి జోరుగా ప్రచారము చేయుచున్నారు. అదియుగాక ఉత్తర సరిహద్దు ఆవలనుండి వారికి ధారాళముగా సహాయసంపదలు లభించుచున్నవి."

ఈ విషయమయి ప్రసంగించుచు బాబా తమ ప్రవచనములో ఇట్లు చెప్పిరి: "ఉపద్రవ స్థితి ఇప్పుడే ఉన్నదని జ్ఞాపకముంచుకొనవలెను. కాని మనది అహింసామార్గము, శాంతిమార్గము అయి యున్నది. మనము సేనను ఆధారము చేసికొని ఈ ఉపద్రవమును, ఆక్రమణను ఎదిరింపజాలము. మన దేశములో అహింసాయుత సమాజ నిర్మాణము వల్లనే దానిని ఎదిరింపగలము." ఆ సోదరుడు నాతో ఇట్లనెను: "మీ మార్గము వేఱొకటి. మాకు ఉపద్రవము ఎక్కడనైనను కనబడిన యెడల సేనతోనే దానికి ప్రతీకారము చేసెదము." నేనతనితో ఇట్లంటిని : "సేన సహాయముచే సామ్ర్యవాదము నెదిరింప

జాలము. మీకీ ఉపద్రవమునుండి తప్పించుకొనగోరిన యెడల భూదానముల ద్వారా భూమి సమస్యను శీఘ్రాతిశీఘ్రముగా పరిష్కరించుటకు సాయపడవలెను. మనమందఱమును కలిసి పనిచేసిన యెడల భూదానయజ్ఞము సఫలమయ్యే తీరును."

వసంత పురములో కార్యకర్తలతో సభలో మాట్లాడుచు వినోభాజీ ఇట్లనిరి: "జిల్లాలోని ప్రతి ఠాణానుండియు కనీసము ఇరువది మంది కార్యకర్తలయినను నాకు కావలెను. బిహారునందంతట పది మాసములకు నాకు పదివేలమంది కార్యకర్తలు కావలెను. ప్రతిజ్ఞా పూర్వకముగా భూదానకార్యము సాధించిన యెడల బీహారులోని భూమి సమస్య పరిష్కారమయితీఱును. నా కోరిక ఏమంత గొప్ప కోరిక కాదు. రష్యాలోను, చీనాలోను క్రాంతి నిమిత్తము వేల కొలది జనులు జీవితము ఉన్నంతవఱకు పనిచేయుచుండిరి. ఆ లెక్కను చూచిన యెడల నా కోరిక చాల తక్కువది. కారణమేమనగా భూదానకార్యము క్రాంతి కార్యమయి యున్నది. రష్యాలో భూమి సమస్యను పరిష్కరించుటకు 17 లక్షల మంది జనులు హత్య చేయబడిరి. హిందుస్థానములోగూడ ఆ ప్రకారము తలకాయలు తీసివేయు కార్యక్రమము సాగించిన యెడల ఆ పనికి గాను ఎంతమంది జనులవసరమయ్యెదరో కొంచెము లెక్కకట్టి చూడండి. కాని మనము ప్రేమతోను, శాంతితోను పని సాధింపవలెనని చూచుచున్నాము. ఈ ఉపాయము వల్లనే అన్నిటికంటె వేగముగాను, శ్రేష్ఠముగాను ఈ పని కాగలదని నమ్ముచున్నాము."

కార్యకర్తలలో ఒక మిత్రుడు, "మేము భూదానకార్యములు చేయగోరుచున్నాము. కాని జిల్లా బోర్డు మెంబరు, అసెంబ్లీ మెంబరు కావలెనని మా మహాత్వాకాంక్ష" అనగా, అందుకు బాబా "దానిని మహాత్వాకాంక్ష అనకండి. క్షుద్రాకాంక్ష అనండి" అనిరి. నేటి క్రాంతి కార్యమునందు తమ్ము తాము సమర్పణ చేసికొనుటయే

అన్నిటికంటె గొప్ప మహోత్వాకాంక్ష అని మన కార్యకర్తలకు ఎన్నడు తెలియునో గదా !

మసరఖ్ గ్రామము పోవుచుండగా పాళీభాషలో ఎం. ఏ. డిగ్రీ పొందిన సోదరు డొకడు బాబాతో చర్చించెను. ఒకటి రెండు వాక్యములలోనే అతనికి గల పాళీ భాషాజ్ఞానము పరీక్షింపబడెను. అతడు 'ధమ్మ పదము' లోని నాలుగు శ్లోకములను గూడ తిన్నగ పలుకలేక పోయెను. బాబా సింహాళీభాషలో గల ధమ్మపదమును పంపవలసినదని అతనితో చెప్పిరి. ఇక 'త్రిపిటక' శబ్ద మెట్లు ఏర్పడెను అన్న విషయమై బాబా ఇట్లనిరి : "ఇందు గల మూలసిద్ధాంతములు మూడు వేదములకు సంబంధించినవి. కాని బౌద్ధ సాహిత్యమంతయు మూడు పెట్టెలలో పెట్టబడి యుండుటవలన 'త్రిపిటక' శబ్దము ప్రయోగింపబడెను."

అనంతరము బాబా ప్రతి భాషలోను గల రామాయణమును గుఱించి తెలియబఱచిరి. "ఏ సాహిత్యకర్త రచించిన వైనను ఒకటి రెండు కళాకృతులు (అవి ఎంత చిన్నవయినను పరవాలేదు) సామాన్య జనుల హృదయసీమలందు స్థానమును సంపాదించుకొనగలిగినయెడల అతడు అమరుడు కాగలడు. Grey's Elegy, Goldsmith's Vicar of Wakefield, సానే గురూజీ రచించిన "శ్యాంచీ ఆయీ" అటువంటివి. బంకించంద్రుని భారతదేశము మఱచిపోవచ్చును. కాని 'వందే మాతరము' ద్వారా అత డమరు" డయిపోయెను.

దారిలో సమాజవాదమిత్రులు నినాదములతో స్వాగతమిచ్చిరి. బాబా వినోదముగా వారితో "నినాదములతో నాకేల స్వాగతమిచ్చెదరు, భూదానములతో ఆ పనిచేయండి" అనిరి. అనంతరము ఆ మిత్రులు బాబాకు అందమైన ఎఱ్ఱని పూలను కానుకగా సమర్పింపగా, బాబా మందహాసము చేయుచు "రక్తవర్ణము ప్రీతిని సూచించురంగు" అనిరి.

మాతో ఉన్న సమాజ మిత్రులను బాబా, "ఓయి ! ఎఱ్ఱటోపీ" అని పిలుచుచుండిరి. ఈ రోజున బాబా ఇట్లనిరి : "నేను ఎఱ్ఱటోపీని ఒక వినోద సాధనమని యెంచుచున్నాను. ప్రతి ఒక్కరును వినోదము కొఱకు ఎఱ్ఱటోపీ, నల్లటోపీ, తెల్లటోపీ, ఇంకను అన్ని టోపీలను ధరింపవలెనని నేను కోరుచుందును." వారు నవ్వుచు తివారీజీతో ఇట్లనిరి : "సామాన్యముగా ఎఱ్ఱటోపీని చూచి గొప్పవారు భయపడు చుందురు. దానిని ఎఱ్ఱజెండా **(Red Signal)** గా భావింతురు. గొప్ప వారి యొద్దకు పోవునప్పుడు ఎఱ్ఱటోపీ తీసివేసెదవా ?"అని అడుగగా అత డవుననెను. అంతట బాబా, 'సెబాష్ ! అది తెలివిగల మాట. కానిచో టోపీకూడ బ్రాహ్మణుని యజ్ఞోపవీతము వంటిదే కాగలదు,' అనిరి.

సాయంకాల ప్రార్థన సభయందు వినోబాజీ ప్రవచనము సాగు చుండెను. "ఆనాడు కూడ అక్టోబరు 17 వ తేదీ అయియుండెను. 12 సంవత్సరముల క్రిందట ఈరోజున బాపూజీ ఆజ్ఞానుసారము నేను ప్రథమ సత్యాగ్రహిగా వ్యక్తిగత సత్యాగ్రహము నారంభించియుం టిని. ఆసమయమున ఇట్లుతోచినది: ఈదేశమునకు ప్రతినిధి కానున్నాను గనుక భారతదేశములోని సామాన్యజనులతో ఏకరూపత సాధించుటకు గాను, ఈ దేశములోని భాషలనన్నిటిని నేర్చుకొన మొదలుపెట్టితిని. నేటి రోజు నా కొక గొప్ప సుదినము."

నాకు ప్రాతఃకాల దృశ్యము జ్ఞాపకము వచ్చినది. మేము మసరఖ్ గ్రామము పోవుచుంటిమి. ప్రాగ్దిశా కపోలములందు రక్త వర్ణము ప్రసరించియుండెను. మహోన్నతములయిన వృక్షముల మధ్య ఆకాశము నేడు ధ్యానమం దాసీనుడయిన మహర్షివలె గంభీర ముద్రతో కనబడుచుండెను. క్రమ క్రమముగా తూర్పుదిక్కు విప్పారు చుండెను. తరువాత హఠాత్తుగ సూర్యబింబము క్షితిజము నుండి తొంగిచూడసాగెను. అది చూచినప్పుడు మనస్సు మంత్రముగ్ధమయి

పోయెను. సూర్యోదయము నయనాభిరామముగా నుండెను. ఇది నిత్యము కనబడునట్టి దృశ్యమే యగుగాక ! కాని అందు నిత్య నూతనత్వము, నిత్యానందము, నిత్య సౌందర్యము గానవచ్చుచుండును. ప్రతిరోజు సూర్యోదయము చూచినప్పుడు నేత్రములకు సంతోషము గలుగుచుండును. కాని రేపటిదినమున మరల దానిని చూడవలెననియే కుతూహల మేర్పడుచుండును.

## గీతా ప్రవచనము - భూదానము

*దేవరియా, అమనౌర్, పరసా*

18, 19, 20 అక్టోబరు, 1952.

గీతా ప్రవచనము, భూదానమును గుఱించి ప్రసంగించుచు బాబా ఇట్లనిరి : మీరు గీతాప్రచార మెందుకు చేయుచుందురు. భూదానమునకును దానికిని సంబంధమేమి? అని తరుచుగా జనులు నన్నడుగుచుందురు. పైపయిన చూచినయెడల సంబంధ మేమియు కనబడదు. కాని భూదానకార్యములు సాధించునప్పుడు మోహము విడిచిపెట్టవలసి వచ్చుచున్నది. తన్నావరించిన మోహమును విడిచిపెట్టవలెను. ఎవరినుండి భూమిని కోరుచుందుమో, అతడు మనవాడే యగుచున్నాడు. కనుక అక్కడకూడ మోహము ప్రవేశించుచున్నది. అర్జునుడు నిర్భయుడయిన వీరుడు. కాని శత్రుసేనా మధ్యమున అతడు అందఱను తన బంధువులనే చూచినప్పుడు మోహాగ్రస్తుడయి పోయెను. నేను యుద్ధమునుండి తొలగిపోదు ననుమాట మాట్లాడెను. శత్రుసేనలో ఇతరులే ఉండియున్నయెడల అతడు వేగముగా బాణములు విడిచియుండెడివాడే. కనుక అతనికి మోహమును పోగొట్టి కర్తవ్య ముపదేశించుటకు శ్రీకృష్ణ భగవానుడు గీతను బోధింపవలసి వచ్చెను. ఈ విధముగానే మన మోహము పోవుటకుకూడ ఈ గ్రంథము

మిక్కిలి ఉపయోగకరమయినది. మోహము నశింపగానే భూదాన కార్యములు అతివేగముగా సాగిపోవును. ఈనాడు కార్యకర్తలందరు మోహగ్రస్తులయి యున్నారు." మేము మా యిలాకాలో దాన ములు కోరలేము కనుక బయటకు ఎక్కడకయిననుపోయి భూదాన కార్యములు సాధించెదము, అని చాలమంది కార్యకర్తలు చెప్పు చుండగా చూచుచున్నాము.

ఆనాడు దీపావళి పండుగ. బాబా ఉపన్యాసములో దీప ప్రశాంతి ప్రకటిత మగుచుండెను. నేటి ఉపన్యాసము హృదయములో నాటుకొని పోవునట్టిదిగా నుండెను. బాబా ఇట్లనిరి : 'నాకు నాలు గేండ్లనాడు జరిగిన వృత్తాంత మొకటి జ్ఞాపకము వచ్చుచున్నది. ఆనాడుకూడ దీపావళియే. అది సాయంకాల సమయము. ఒక గ్రామ సమీపమున ఒక కుటీరములో అంధకారము వ్యాపించియుండుట చూడగలిగితిని. ఇంటిలో తినుట కాహార వస్తువులు లేకుండెను. అట్టి తటి దీపము వెలిగించుకొనుటకు చము రెక్కడిది. అక్కడనుండి 15 మైళ్ళ దూరమున పట్టణ మొకటి యుండెను. పట్టణములో ప్రవే శింపగానే నాలుగువంకల దీపములు వెలుగుచుండుట చూడగలిగితిని. జనులు ఆనం దోత్సవమున మునిగి తేలుచున్నారు. నా నేత్రముల నుండి కన్నీటిధారలు ప్రవహింపసాగెను. ఆ రెండిటికిని సంబంధమే లేదా ? వారికి భారతీయతాసంబంధమును, మానవతాసంబంధమును లేవా ? దీపావళినాడు ఆనందముయొక్క ఆభాసను నిర్మించు కొనవలె నని ప్రయత్నము చేయుచుందుము.' ఆ ఉపన్యాసమువలన అందఱును ఆత్మ విలోకనము చేసికొనసాగిరి.

సభానంతరమున నేను బాబా గదిలో దీపములు వెలిగించుటకు పోయియుంటిని. అప్పుడు ఏమి చేయుచున్నావని బాబా అడిగిరి. అంతట మహాదేవి తాయీ 'నిర్మలకు ఇల్లు జ్ఞాపకము వచ్చియుండ వచ్చును. అందువలన ఇంటిలోవలెనే దీపావళి జరుపుకొనుచున్నది'

అనగా బాబా, 'మంచిదే' అనిరి. బాబా దీపము లన్నిటిని ఆర్పివేయ వలసినదని చెప్పరుగదా అన్నంత భయము గలిగినది. వారిగదిలో దీప ములు వెలిగించుటకు నా కదియే మొదటి దీపావళి.

అన్నివంకలను, దీపములు మంద మందముగాను, మనో హరముగాను, ప్రశాంతముగాను వెలుగొందుచుండెను. అంతట నేను పేటు కన్యను, 'ఇటువంటి దీపావళిని ఎన్నడయినను చూచినావమ్మా!' అని అడుగగా, ఆమె మా విద్యా పీఠములో భారతీయ విద్యా ర్థులు ఇటువంటి దీపావళినే జరుపుకొను చుండెడివా రని సమా ధానము చెప్పినది.

దీపావళి పండుగ యగుటవలన ప్రతిఒక్కరికిని యిల్లు జ్ఞాపకము వచ్చుచుండెను. మేము బసచేయుచున్న స్కూలులో ఒకరేడియో కూడ ఉండెను. నేను నాగపురస్టేషనునకు తగిలించితిని. దైవవశమున ఆ సమయములో మా తల్లి మాట్లాడుచుండెను. నాగపురములో దీపావళిని గురించి ఆమె ఉపన్యాస మిచ్చుచుండెను. ఇట్టి కల్యాణ దినమున నేను నా తల్లి కంఠస్వరమును వినగలుగుదు నని స్వప్న ములోకూడ ఊహించియుండలేదు. యాత్రీదళములోని జనులందరు నన్నుచూచి, 'ఏమమ్మా! మీ అమ్మగారు నీకు·దొరికినారే' అనుచు నవ్వింపసాగిరి. అటుపిమ్మట మదరాసుస్టేషనుపయిన దక్షిణాది సంగీ తము విని వెంకటేశయ్య అమితానందమును పొందెను.

రెండవదినమున మార్గమధ్యమున వినోబాజీ ఇట్లనిరి: "నేను భూదానములు పొందుటకంటె జ్ఞానదానముచేయుటలో అధిక సంతో షమును పొందుచుందును. ఒక కాలములో వేలకొలది పరివ్రాజకులు, సన్యాసులు దేశమంతట నిరంతరము సంచారము చేయుచు జ్ఞాన ప్రచారము చేయుచుండిరి. ఈ రోజున భూదానముకొఱకు నేను మీకు సర్వోదయ తత్త్వమును బోధించుచున్నాను. సర్వోదయములో నేనందఱికంటె కడసారివాడ నని గుర్తుంచుకొనవలెను. మనుష్యునకు

రెండు విధములయిన కోరిక లుండును. (1) చిత్తశుద్ధికి సంబంధించిన కోరిక. (2) శరీరావసరములకు సంబంధించిన కోరిక. చిత్తశుద్ధి విషయములో నే నందరికంటె అధికుడనుగా నుండగలుగుదు నను కోరిక ఉండదగినదే. తన చిత్తమును శుద్ధము చేసికొను విషయములో అన్నిటికంటె గొప్పప్రయత్నము చేయవలెను. అటుపిమ్మటనే ఇతరులకు చిత్తశుద్ధిని గుఱించి బోధింపవలెను. శరీరావసరముల విషయములో ముందుగా ఇతరుల అవసరములు తీరవలెను. అటుపిమ్మట నా అవసరములు తీరవలెను. ముందుగా ఇతరులకు అన్నము దొరకవలెను. తరువాత నాకు దొరకవలెను. ఇట్టి చిత్తవృత్తి వలన సర్వోదయ మేర్పడును.''

మేము ప్రతిదినము రెండుజాముల వేళ మహిళాసభను పిలుచుచుంటిమి. అందు కొద్దికొద్దిగా మాకు సఫలత గలుగుచుండెను. ఒక గ్రామములో సభలోనికి వచ్చిన స్త్రీల నందఱను ఊరేగింపు చేయించి మేము వారిని మహాసభలోనికి తీసికొనిపోయితిమి. వారిలో కొందఱు స్త్రీలు ఆ బాటను తమ జీవితములో మొదటి పర్యాయము చూచియుండిరి. వోట్ల రోజులలో కూడ వారు ఘోషా బండ్లలో ఎక్కించబడి వోట్లు వేయుటకు తీసికొని పోబడుచుండెడివారు. వంద, వంద పాతికమంది గజగామినులను ఊరేగింపు చేయించి మేము వారిని తీసికొని సభాస్థలికి పోయినప్పుడు ఏదో మహా యుద్ధమున గెలుపొందినట్లు సంతోషించితిమి. స్త్రీలు పది గీతాప్రవచన గ్రంథములను కొనియుండిరి. గొప్పగొప్ప కుటుంబములలో నున్న స్త్రీలు గూడ నిరక్షరులగుట వలన గ్రంథములను కొనజాలరయిరి.

నేడు బాబా కన్నులకు బాధగానుండెను. అంతట వారు నన్ను చూచి వినోదముగా, 'మొన్నటి రోజున ఈమె నా గదిలో దీపములు వెలిగించినది. దాని కాంతివలన ఇప్పుడు నా కన్నులకు బాధ ఏర్పడి

వది' అనిరి. చాల రోజుల క్రిందట వారు మహాదేవి తాయీతో కూడ 'నీవిచ్చిన తేనెవలన నాకు దగ్గుపుట్టిన' దన్నమాట జ్ఞాపకమువచ్చినది. దీపము యొక్క సౌమ్యప్రకాశము వలనను కన్నులకు నొప్పి పుట్టుటయు, తేనె వలన దగ్గు పుట్టుటయు ఎట్లున్నవనగా, ఒకానొక రాజకన్య ఏడు పరుపులు ఒకదానిపైనొకటి వేసికొని పవ్వళించియుండగా పరుపులన్నిటిక్రిందనున్న సెనగగింజ ఆమెకు గ్రుచ్చుకొన్నదట. ఈ కథ కూడ అట్లున్నది. ఆ రాజకుమారికథ బాబాకు చెప్పుదునా అని నాకనిపించెను.

ఇది గంగాతీర ప్రదేశము. అందువలన కంకరరాళ్లు గాని, గులక రాళ్లు గాని పేరుకయినను లేకుండెను. నాలుగువైపుల మఖమల్లువంటి మట్టి పఱచబడి యుండెను. ఆ మట్టి తాకుటకు ఎంతో కోమలముగాను, స్నిగ్ధముగాను, సుఖకరముగాను ఉండుటవలన దానిపైన వట్టి కాళ్ళతో నడచిపోవుదుమా అని బుద్ధి పుట్టుచుండెను.

# క్రాంతికి పునాది – హృదయ పరివర్తనము

*శీతలపురము, సోనపూరు*

21, 22 అక్టోబరు, 1952

నడక ప్రయాణము సాగుచుండగా నాకును, పేట్ కన్యకును సంభాషణ కూడ సాగుచుండెను. పేట్ కన్య తన కథను వినిపించినది. ఆమె ఒక బీదరైతు కూతురు. ఆమె పనులు చేసికొనుచు, చేసికొనుచు విద్యా సముపార్జన చేసికొని యుండెను. కళాశాలలో చదువుకొనుచుండగా, లోకములో నాలుగు వంకల అశాంతి, అంధకారము వ్యాపించియున్నట్లు తెలిసికొనెను. అది చూచినప్పుడు మానవుని భవిష్యమును గుఱించి ఆమెకు నిరాశ గలిగెను. అప్పుడామె శాంతి కొఱకును, ప్రకాశము కొఱకును గాంధీజీ భారతదేశములోనికి వచ్చి

నది. 'ఇప్పుడు లోకము సామ్యవాదము నైనను పరిగ్రహింపవలెను. లేదా అహింసనైనను పరిగ్రహింపవలెను' అనుచున్నది.

నేను : నీవు అమెరికాకు తిరిగి వెళ్ళిన తరువాత అహింసా ప్రచారము చేయవలసినది.

పేట్ : అమెరికా అహింసా ధర్మమును ఈ సమయములో స్వీకరింపగలదని నాకు తోచదు. దానికొఱకు కొంత కాలము పోనియ్యవలెను.

నేను : నీకు యశస్సు రానీ, రాకపోనీ ప్రచారము మాత్రము చేయుచుండుము. ఎప్పుడో ఒకప్పుడు అమెరికా వాసులు అహింసా ధర్మము నంగీకరింపవలసియే యుందురు. కాలముకూడ అటువంకకే సాగిపోవుచున్నది.

పేట్ : నాకు యశస్సు గడింపవలె నను కోరిక లేదు. కర్మ చేయుటలోనే నా కానందమున్నది. నాకు చేతనైన పనిని చేయనే చేసెదను.

ఈ మాటలు విన్నప్పుడు నాకు చాల సంతోషము గలిగినది. అంతట నేనిట్లంటిని : "నిజమయిన అహింసా సైనికునకు ఇటువంటి చిత్తవృత్తియే ఉండదగును. నేటివఱకు తెల్లజాతివారు నడచిన నడకను బట్టి, తూర్పు దేశీయులకు వారిని గుఱించి మంచి భావములు లేవు. నీవంటివారు ఈ విధముగా గ్రామగ్రామము తిరుగుచుండుట వల్లను, మీ తపస్సు వల్లను ఉన్న అపోహాలన్నియు తొలగిపోగలవు. మీ తపశ్చర్యవల్ల తూర్పు, పడమర దేశములు సన్నిహితములు కాగలవు."

అంతట ఆమె చిఱునవ్వునవ్వుచు "కాని నావంటివారు మిక్కిలి అరుదు" అన్నది.

వినోబాజీ శీతలపుర గ్రామములో ఇచ్చిన ప్రవచనములో ఇట్లనిరి : "వ్యక్తి హృదయ పరివర్తనము, సంఘ నిర్మాణములో పరి

వర్తనము, ఈ రెండిటి ఆధారము క్రాంతిపైన ఏర్పడును. ఎద్దు వశము నందున్న యెడలను, బాట మంచిదిగా నున్న యెడలను బండి చక్కగా సాగిపోగలదు.'' ఇందు ఎద్దునకును, వ్యక్తికిని సామ్యము చెప్పబడినది. అందువలన నా మనస్సులో చాల శంకలు పుట్టినవి. తదుపరి నేనా శంకలను గురించి బాబాతో నివేదించినప్పుడు వారిట్లనిరి : ''ఎద్దునకును, బాటకును నేను చెప్పిన ఉపమానములో మనుష్యుడు చేతనుడని, సంఘ నిర్మాణము జడమని చెప్పుటయే నా ఉద్దేశము. ఇదే దాని గూఢార్థము ''

నేను : అవును. ఇది మంచిమాటే. కాని వ్యక్తిని ఎద్దుతో పోల్చుట వలన ముందు ముందు వ్యక్తికి స్వతంత్రము లేదని చెప్పుచు విపరీతార్థములు లేవదీయువారు బయలుదేరవచ్చును గదా. ముందు తరమువారు మన సిద్ధాంతములను తలక్రిందులు చేయకుండాను (Exploit), వాని శుద్ధ స్వరూపము చెడగొట్టకుండాను ఉండుటకయి మనము జాగరూకులమయి యుండవలెను గాదా? లోకములో ఎన్నో మంచి సిద్ధాంతములకు వికృతరూపము ఏర్పడియున్నది.

బాబా : అవును. ఈ మాట మిక్కిలి సరియయినది. క్రాంతికి పునాదియే హృదయ పరివర్తనమని మన వాదము. వ్యక్తి హృదయములో పరివర్తనము కలుగగానే సమాజ భావములలో క్రాంతి వచ్చి తీరును. దానిని ఆధారముచేసికొని సమాజ నిర్మాణములో పరివర్తన తీసికొనిరావలెను. క్రాంతికి ఇదే సరియయిన ప్రక్రియ. ముందుగా సమాజ నిర్మాణములో పరివర్తనగలుగవలెననియు, ఆ సిద్ధాంతములను అమలుచేయుటకు గాను బలవంతముగా వ్యక్తిని ఆ మూసలోనికి చొప్పించవలెననియు, ఎద్దునకు చెప్పిన ఉపమానార్థము కానేకాదు.''

ఇట్లు చెప్పుట వలన నా శంకలన్నియు తీరిపోయినవి.

సోనపురము పోవునప్పుడు మరల ఈ చర్చయే ప్రారంభమయ్యెను.

నేను : భూస్వామిత్వమును పోగొట్టుట యనగా ఆర్థిక రంగములో అరాజకము నేర్పఱచుటయే. ఆ పక్షములో దానితో పాటు శాసనములు కూడ లేకుండజేసి రాజకీయరంగములో కూడ అరాజకమును అమలుజరిపించుట అవసరమా!

వినోబా : రాజ్యము (State) లేకుండపోవుటకు కొంతకాలము పట్టును. నిజమయిన గ్రామ రాజ్యము స్థాపితమయిన యెడల ఆ గ్రామము వఱకు రాజ్యము అంతరించినట్లే. అట్లయినను గ్రామములకు గ్రామములకు గల సంబంధమును నియమించుటకు ఇంకను కొంతకాలము వఱకు రాజ్యము యొక్క అవసరము ఉండగలదు.

నేను : భూమి గ్రామ యాజమాన్యములోనిదని చెప్పుటవల్ల సామూహిక యాజమాన్యము (Social ownership) ద్యోతకమగుచున్నది. భూమి పరమేశ్వరునిదని చెప్పుటవల్ల అసలు యాజమాన్యమే ఎగిరిపోవుచున్నది. ఈ రెండు భాషా ప్రయోగములలో ఏ భాషా ప్రయోగము మంచిది?

బాబా : ఈ రెండును ఒకేవస్తువునకు భావాత్మక (Positive) రూప మొకటి, అభావాత్మక (Negative) రూప మొకటి అయియున్నవి.

మరల కొంచెము సేపు మౌనముద్ర వహించి బాబా ఇట్లనిరి: 'భూమి పరమేశ్వరుని దని చెప్పుటలోనే ఎక్కువ ఔచిత్య మున్నది. అయితే అప్పుడు పరమేశ్వరు డున్నాడా, లేడా యను ప్రశ్న యొక్కటియే మిగులగలదు.

నేను : భూమి పరమేశ్వరునిదని చెప్పుటయే నాకును ఇష్టము. ఇంతకు మునుపు మీరు చెప్పినట్లుగా భూమి గ్రామ యాజమాన్యమునకు చెందిన దని అంగీకరించినయెడల ఒకగ్రామములో భూమి ఎక్కువగా నుండుటవల్లగాని, మంచిభూమి ఉండుటవల్లగాని ఆ గ్రామవాసులు మిక్కిలి ఎక్కువ ధనవంతులు కావచ్చును. మరియు ఇతర

గ్రామములవారిని తమ గ్రామములోనికి రానియ్యక పోవచ్చును. అనగా గ్రామ గ్రామములకు జగడములు పుట్టవచ్చును.

మరల నేను మరియొక ప్రశ్న అడిగితిని : నవ్యభావము ననుసరించి ఈనాటి సంఘ నిర్మాణములో మార్పువచ్చిన తరువాతకూడ నవ్యభావములు ఉద్భవ మగుచునే యుండును. ఈనాడు నూతన భావములను ప్రవేశపెట్టినవారిని హత్య అయినను చేయుదురు. లేదా సంఘమునుండి బహిష్కరింప నయినను బహిష్కరించెదరు. మహారాష్ట్రములో "ఆగర్కరు" ను చేసినట్లు.

బాబా : ఆ రెండును ఒకటే. బహిష్కారముకూడ హత్య వలెనే భయంకరమయినది.

నేను : ఈ రెండుపనులు జరుగకుండ సమాజ నిర్మాణము చేయవచ్చునా ?

బాబా : ఆ. తప్పక చేయవచ్చును.

నేను : విజ్ఞాన శాస్త్రములో నేటి సిద్ధాంతము రేపటి ప్రయోగమువల్ల తప్పు అయిపోవచ్చును. అనగా నేడు దేనిని సత్య మనుచున్నామో, అదికూడ అంతిమ సత్యముకాదు. కేవలము ప్రయోగ మాత్రమే. రేపు మరియొక వైజ్ఞానికుడు తన ప్రయోగములవల్ల నేటి సత్యమును తప్పు అని ఋజువుచేయవచ్చును. సమాజ నిర్మాణము విషయములో కూడ ఇటువంటి ప్రవృత్తినే కలిగి యుండవచ్చునా ?

బాబా : కూడదు. సమాజ ధారణలో కొన్ని మూలతత్త్వము లున్నవి. అవి త్రికాలాబాధితములయిన సత్యములు. సత్యము, ప్రేమ, అహింస, న్యాయము మొదలయిన తత్త్వములు శాశ్వత సత్యములు. ఈ మూలతత్త్వమును విడిచిపెట్టి మిగిలినవాని విషయములో వైజ్ఞానిక దృష్టి పెట్టుకొనవచ్చును. ఏ మయినను ఒరపిడి రాతిమీద ఒరసి చూచినపిమ్మటగాని ఏ నవ్యభావమునయినను గ్రహించుట సమాజమునకు మంచిదికాదు."

ఇప్పుడు గుజరాతునుండి నారాయణదేశాయి ఉత్తరము వచ్చినది. దానిలో ఈ సంగతి అడుగబడెను. "కపట సాధువులను గుఱించి సమాజములో ఏర్పడిన శ్రద్ధను చూచినప్పుడు విచారము కలుగుచుండును. జనులు భూదాన విషయమయికూడ శ్రద్ధచూపుచుందురు. అయితే ఆ శ్రద్ధకును, ఈ శ్రద్ధకును గల భేదమేమి ?" అటువంటి ప్రశ్న వేయువారి కేమని సమాధానము చెప్పవలెనని నేను బాబా నడుగగా వా రిట్లనిరి : "సాధువేషము కనబడినంత మాత్రాననే జనుల హృదయములో శ్రద్ధ యేర్పడుచున్నది. ఇక నిజమయిన సాధువే కనబడినయెడల ఎంతశ్రద్ధ గలుగునోగదా ! ఈ దృష్టితో ఆ ప్రశ్నను చూడవలెను."

ఇప్పు డిప్పుడే బెంగాలునుండి వచ్చిన సోదరు డొకడు బాబాతో "జను లందరు సజ్జనులని మీరు చెప్పుచుందురు. కాని మాకు నాలుగు వైపుల అందఱు దుర్జనులే కనబడుచున్నారు," అనగా బాబా ఉచ్చస్వరమున ఇట్లనిరి : "నేను నేటివఱకు ఒక దుర్జనునికూడ చూచియుండ లేదు. నే నిట్లన్నందుకు 'వినోబా సాధుజనుడు కనుక వ్యవహారము విషయములో మూర్ఖుడు. వ్యవహార విషయములో సామాన్య మనుష్యుడు వినోబాకంటె ఎక్కువ తెలివయినవాడు' అని మీరు తలచిన యెడల తప్పక మీరు అటువంటి అభిప్రాయమునే కలిగియుండవచ్చును. కాని జనులందరు చెడ్డవా రను అభిప్రాయము గలవారు మా పనిని ఎన్నడును చేయజాలరు."

ప్రశ్న : ఒక వేళ మీకే పనిని పూర్తిచేయకుండ వెడలిపోయిన యెడల ఏమి కాగలదు ?

బాబా : అట్లయినచో ఈ పని చేయుటకుగాను భగవానుడు మఱియొకనిని ప్రేరణ చేయును. గాంధీజీ అనంతరము, ఈశ్వరుడు నాకు భూదాన ప్రేరణ చేయునని ఎవరయినను ఊహించినారా ? కాని పరమేశ్వరుడు ఎల్లప్పుడును ఎవరినో ఒకరిని పంపుచునే

యుండును. అత డేపనిని చేయదలంచునో, దానిని ఎవరివల్లనో ఒకరివల్ల చేయించనే చేయించును.

సోనపురనగరము గండక నదీతీరమున నిలిచియున్నది. ఇక్కడ హరిహరేశ్వరుని దేవాలయమున్నది. గజేంద్ర మోక్షణ మను అపూర్వ కథకు స్థానమియ్యదియే. గజగ్రాహముల యుద్ధములో ఎవరోడిరి అను ప్రశ్న పుట్టుచున్నది. అందువలన ఈ స్థానమునకు "కోన్‌హారా", అను నామధేయ మేర్పడెను. ఇక్కడ ప్రతి సంవత్సరము ఒక గొప్ప ఉత్సవము జరుగుచుండును. అందు గొప్ప ఏనుగుల వ్యాపారము జరుగుచుండును. బీహారులో ఏనుగులు చాల యెక్కువగా కనబడుచుండును. జమీందారులు తమ ద్వారముల చెంత ఏనుగును కట్టివేసికొనుట గౌరవమని భావింతురు.

బాబా : బౌద్ధ సాహిత్యములో ఏనుగు తోడి ఉపమానము మాటిమాటికి వచ్చుచుండును. దీనికి కారణమేమో ఇప్పుడర్థమయినది.

గండక నదీ ప్రవాహము అత్యంత వేగవంతముగా నుండెను. దానిలో కొంచెముసేపు ఈదితిమా స్వర్గమునకు ప్రయాణము కట్టినట్లే.

సోనపుర ప్రవచనములో వినోబాజీ రాజకీయ పక్షీయులతో ఇట్లనిరి: "శివుని, శక్తిని జంటగా ఉపాసన చేయండి. కేవలము శక్తిని ఉపాసించినట్లయిన మనము రాక్షసులమయి స్వవినాశనము చేసికొందుము. దానివలన లోకమంతయు నాశమయిపోవును."

ఎనిమిదవ భాగము

# పాటలిపుత్ర సమీపమున

పాట్నా

23, 24, 25 అక్టోబరు, 1952

అది అరుణోదయ సమయము. పూర్వ క్షితిజముపైన ఎఱ్ఱని కాంతితో సూర్యబింబము ప్రకాశించుచుండెను. అది గంగా గండక నదుల సంగమస్థలము. మా నావ ముందునకు కదలిపోవుచుండెను. రెండు మహానదులు ఎంత సరళముగా ఒకదానితోనొకటి కలిసిపోయి రెండును తమతమ అస్తిత్వములను పోగొట్టుకొని విలీనమయిపోయినవో గదా! నిన్నటి దినమున సోనపురములో గండకనదీ మహా వైశాల్యమును జూచియుంటిని. మఱియు ఈనాడు మెదలకుండ గంగలో ఆత్మార్పణమగుట. కాని మనుష్యుడు తన క్షుద్రమగు అహంకారముతో తిరుగుచుండును.

దూరమునుండి పాటలీపుత్ర నగర శోభ గానవచ్చుచుండెను. ఆ నగరము గంగకు ఒక ఒడ్డున పదునాలుగు మైళ్ళ దూరము విస్తరించి యున్నది. నావ సమీపమునకు రాగానే జనులు ఇట్లు గర్జింపసాగిరి:

"ఘుర్ ఘుర్ సే ఆయీ ఆవాజ్, సంత వినోబా జిందాబాద్
సంత వినోబా కరే పుకార్, దో జమీన్ కా ఛఠవాఁ భాగ్"

నావ ఒడ్డునకు చేరగానే అట్టాలికల నుండి పుష్పవర్షము కురిసెను. పసుపువన్నె వస్త్రములు గట్టుకొన్న బాలకులు వేదమంత్ర పఠనముతో స్వాగతమిచ్చిరి. "సువర్ణము యొక్క ఆవరణచే సత్య

మను పాత్ర కప్పబడియున్నది. నేను మిమ్ము సువర్ణ మోహమునుండి విముక్తుల చేయుటకే వచ్చితిని'' అని బాబా అనిరి.

అతి వేగముగా నడచిపోవుచున్న వినోబాను చూచినప్పుడు అశోక చక్రవర్తి నగరములో మరల నొక పర్యాయము బుద్ధభగవానుడు ప్రవేశించెనా అనిపించెను. కన్నుల యెదుట వినోబా కాకుండ స్వయముగా తథాగతుడే కనబడుచుండెను. వారితో గలిసి నడచుచున్నందుకు ఎంతో ఆనందము గలుగుచుండెను. బహుశా తథాగతుని ప్రథమ శిష్యులకు గూడ ఇటువంటి ఆనందమే గలిగియుండవచ్చును. ఒక కవి ''ఈ ఏకాంత పథికుని చరణములతో పాటు ధర్మచక్రము తిరుగుచున్నది'' అనెను. కవివాణి దేనినయినను చెప్పుటకు సమర్థయయినది. కాని ఈ ఏకాంత పథికుని చరణచిహ్నముల నాశ్రయించి నడచుటలో గల దివ్యానుభవము శబ్దాతీతమయినది. ఆ దైవీ అనుభూతిని వ్యక్తముచేయదగు శక్తి మానవభాషయం దెక్కడ ?

దారిలో ప్రతిచోటను వినోబాజీ రేఖా చిత్రము గానవచ్చుచుండెను. ''స్వయముగా బాపూయే నా శరీరము ద్వారా పనిచేయుచున్నా''రని వారు తఱచుగా అనుచుందురు. ఆ చిత్రములో కళాకారుని కుంచె ద్వారా కూడ ఈ భావమే వ్యక్తమగుచుండెనని నేను చూడగలిగితిని.

నగరములోని కోలాహల జీవితము ప్రారంభమయ్యెను. అందఱ కంటె ముందుగా చర్చి ఫాదరు కలిసికొనుటకయి వచ్చెను. బాబా అతనిని మూల హిబ్రూ బైబిలు ఇవ్వవలసినదని కోరిరి. వెడలిపోవునప్పుడు ఫాదరు భూదానోద్యమము నాశీర్వదించెను. అటుపిమ్మట దినమంతయు భిన్న భిన్న కార్యరంగములలో పనిచేయు వారందఱు కలిసికొనుటకు వచ్చుచుండిరి. జమీందారుల ప్రతినిధులు తమ కష్టములను వెళ్లబోసికొనుచు ఇట్లనిరి : 'మా భూమి ఎట్లయినను పోకతప్పదు. కాని స్థితిగతుల మార్పుల ననుసరించి జీవితమును సరిదిద్దుకొనుటలో

కొంతకాలము గడచిపోవుచున్నది. భూమి శాసనములు చేయవద్దని మీరు సర్కారువారితో చెప్పండి. ఇదే మా ప్రార్థన.'

వినోబా : మీరు ఉదారచిత్తులయి భూదానములు ఇచ్చినయెడల సర్కారువారికి శాసనములు చేయవలసిన అగత్యమే ఉండదు. కాలాను సారమయిన కోరికలు పాటించండి. భూదానములిచ్చినందువలన మీకే శుభమగును.

రెండు జాముల సమయమున సాహిత్యపరులు, కళాకారుల సమావేశములో వినోబాజీ యిచ్చిన ఉపన్యాసము సన్యాసుల ఉపన్యాసముగా లేదు. కళామర్మజ్ఞు డిచ్చిన ఉపన్యాసమా యన్నట్లుండెను. భావాభివ్యక్తినే జీవిత లక్ష్యముగా గల కళాకారులు కూడ బహుశా ఏ వస్తువును అభివ్యక్తము చేయజాలరో, అద్దానిని నేడు వినోబాజీ వ్యక్తము చేసియున్నారు. "నేను సాహిత్యపరుడను" కానని చెప్పుచున్నప్పటికిని సాహిత్యపరునివలె తమ అంతస్తలములోని ఒక్కొక్క ఆవరణనే సుకోమలముగా బహిర్గతము చేయుచు గంభీరమగు అంతరంగములోని హితములైన సూక్ష్మ, గూఢ భావములను వ్యక్తము చేయుచుండిరి.

వినోబాజీ సాహిత్యపరులను 'దేవర్షు' లని పిలుచుచుండిరి. "లోకము ఎవరిని శ్రేష్ఠ పురుషులని చెప్పుచుండునో వారెట్లయినను మహాపురుషులే. కాని లోకము ఎవరిని గుర్తించియుండదో వారు పై వారికంటె కూడ మహాపురుషులు. మానవుని నేత్రము సూర్య కిరణములోని ఏడు రంగులను మాత్రమే చూడగలదు. కాని సూర్య కిరణములో మానవ నేత్రమునకుకూడ కనబడని రంగులు గలవనియు, అవి అధిక గుణములు గలవనియు విజ్ఞానము చెప్పుచున్నది. అదే విధముగా లోకములో కొందఱు మహాపురుషులుందురు. వారిని లోకము గుర్తింపజాలదు. కాని వారు అవ్యక్తరూపమున మనలను ప్రేరేపణచేయుచుందురు.

"కళాకారుడు ఎవరి ఆజ్ఞవల్లను కళానిర్మాణము చేయడు. ఏమియు వ్రాయకుండ ఉండజాలడు గనుకనే అతడు వ్రాయుచుండును. అందువలన భూదానమును గుఱించి వ్రాయండి, అని మేము మిమ్ము కోరము. కాని ఈ విషయము మీకు ప్రేరణ ఇవ్వగలిగినదని మాత్రము చెప్పదలచియున్నాము. నిఱుపేదలు వచ్చి తమ హృదయ ఖండ సమానములగు భూముల నిచ్చిన ఘట్టములెన్నో జరిగినవి. గ్రుడ్డివారు కూడ దానము లిచ్చియున్నారు." చివరకు వారిట్లనిరి: "దేవతలలో వైవిధ్యము, వైచిత్ర్యము ఉన్నట్లు సాహిత్యపరులలో గూడ ఆ లక్షణములున్నవి. ఒక దేవతకు గరుడుడు ఇష్టుడయినచో, వేఱొక దేవతకు మూషికము. మీ సాహిత్యపరులకు దేవతయయిన గణపతి ఎలుకపైననే కూర్చుండును. మిమ్ములను నాతో పాటు సంచారము చేయవలసినదిగా కోరుచున్నాను."

ఉపన్యాసము విన్నమీదట బీహారులోని ప్రసిద్ధ సాహిత్యపరుడు వేణీపురీజీ "నేను కొన్నిరోజులు వినోబాజీతో తిరుగ గోరుచున్నాను" అనెను. నేనా సంగతి వినోబాజీతో చెప్పినప్పుడు వారు చిఱునవ్వునవ్వి "అవును వారు ఎలుక నెక్కి రాగలరు" అనిరి.

సాయంకాల ప్రార్థన సభయందు వినోబాజీ సంపత్తిదానయజ్ఞమునుగుఱించి ప్రకటించిరి. ఆ యజ్ఞమువల్ల సువర్ణముపై మోహము పోయి సత్యదర్శనము గలుగగలదు.

విశాల జనసముదాయమును చూచినప్పుడు మేము ప్రాచీన ధర్మ ప్రచారకుని నిష్ఠయు, ఆధునిక క్రాంతికారుని ప్రచార తంత్రమును అవలంబించి వినోబా సాహిత్యమును ప్రచారము చేయుచుండుము. "గీతా ప్రవచనము తీసికొనండి" అని మేము కేకలు వేయునప్పుడు దీనదశ యందున్న లోకమునే మఱచిపోవుచుందుము. 'ఎవరెక్కువ పుస్తకము లమ్మగలరు' అని పోటీలు పడి అమ్ముచుండుము. ఆ సమయములో మా హృదయ మిట్లు పాడుచుండును.

"వీరోంకీ యహ్ బాత్ హై భాయీ, కాయర్ కా నహీం కామ్
సర్ పర్ బాంధ్ కఫన్ జో, నికలే బిన సోచే పరిణామ్"

పాట్నాలో మూడు దినము లుండవలెను. కనుక మఱునాడే ఉఠ్ చలనా, పరఖాతరే' అన్నమాట లేదు. అయినను బాబా ఉదయము నాలుగుగంటలకే విహారమునకయి బయలుదేరిరి. అందువలన ఈ రోజున మాకు విశ్రాంతియోగము లేదు. కాలి నడకలో జ్ఞానచర్చ సాగినందువల్ల ఉదయము నిద్రపోగొట్టుకొన్న విచారము మాకేమాత్రము కలుగలేదు. మహారాష్ట్రమునుండి ఒక సోదరుడు వచ్చి 'క్రాంతికరమగు శాసనము' అని చెప్పగా బాబా అది విని "క్రాంతి ఎన్నడయినను శాసనమువల్ల సంభవమా" అని యడిగిరి.

అటుపిమ్మట వారిట్లనిరి: "భూదానకర్మ కేవలము పది, పదిహేను దినములాడుకొను క్రికెటు ఆట వంటి దనుకొంటిరా ? ఈ కర్మ కొఱకు జీవితము నాహుతి చేయవలెను." అనంతరము నేపాలునుండి వచ్చిన కర్మఠ రచనాత్మక కార్యకర్త తులసీ మేహెర్జీ బాబాను నేపాలునకురావలసినదని ఆహ్వానించెను. అప్పుడు ఇట్లనిరి: "ముందుగా మీరు కొంత పనిచేసి కొంత భూమిని ప్రోవుచేసి, అక్కడి సర్కారు వారి సానుభూతిని సంపాదించండి. అట్లు కానియెడల, ఈ మనుష్యుడు వచ్చి అశాంతిని కలుగజేయుచున్నాడని సర్కారునకు తోచవచ్చును. ఈ మనుష్యుడు అశాంతి యను అగ్నిని చల్లార్చుటకే వచ్చినాడనియు భూదానకర్మ అందఱి కల్యాణము కొఱకేర్పడినదనియు అందఱకును తెలియవలెను."

నేపాలునకు పోవలె నను భావన నాకెంతో ఆకర్షణీయముగ తోచెను. బీహారులోని భూమి సమస్య పరిష్కరింపబడిన మీదట భారత దేశములోని ఇతర ప్రాంతములకు పోవుటకంటె నేపాలునకు పోవుట మంచిదని నా హృదయమునకు తోచెను. ఉత్తర దిశయందు ఎక్కడ నైనను ధర్మచక్రము ప్రవర్తింప సాగినయెడల అది ఎంతో ప్రచండ

వేగమున తిరుగగలదు. దాని మూలమున లోకమంతటిని ఉత్పాత లూగింపగల మహత్తరమయినశక్తి ఉద్భవింపగలదు. నేపాలు, టిబ్బతు (టిబెట్టు), చీనా, అటుపిమ్మట ? ఈ విధముగా మనస్సు గగన విహారము చేయసాగెను. కాని పాదములు నేలమీదనే ఉండెను. మన తరములోని యువకులు జీవితమంతయు భారత సమస్యలను పరిష్కరించుట యందే గడపుట సంభవింపవచ్చును. కాని రాబోవు తరముల యువకులు భారత తత్త్వజ్ఞానమును గ్రహించి సందేశ వాహకులయి లోకములోని మూల మూలలకును పోగలుగుదురు.

ఉదయము 7 గంటల నుండియే సంయోగములు, సమావేశములు మొదలయిన కార్యక్రమము ప్రారంభమయ్యెను. సమాజవాదీ కార్యకర్తల సమావేశములో ఒక కార్యకర్త, రైతులపయి జరుగుచున్న అత్యాచారములను గుఱించి వివరించెను. అది విని వినోబాజీ యిట్లనిరి : "ఎక్కడైనను అన్యాయము అధికముగా జరిగిన యెడల సహింపవద్దు. అహింసామార్గముతో దానికి ప్రతీకారము చేయండి. ఎక్కడయినను నిప్పంటుకొన్న యెడల, మేము భూదానకార్యములు సాధించుచున్నాము. కాబట్టి నిప్పు చల్లార్పుటకు రాజాలమని చెప్పరాదు. అటువంటి ఉపద్రవకర స్థితులలో తప్ప, మిగిలిన కాలములో మీరు భూదాన కార్యములనే చేయుచుండవలెను. ఈ సమయమున, మీ యావత్కాలమును భూదానమునందు కేంద్రీకరించినప్పుడే క్రాంతి కాగలదు. 'ఒక్కటి సాధించిన, సర్వమును సాధింపగలము' అన్న సూక్తిని మఱువరాదు."

ప్రశ్న : మీరు బీదలనుండి ఏల దానములు గ్రహించుచున్నారు?

వినోబా : నేను నా సేనను తయారు చేసికొనుచున్నాను. ఒక వేళ రేపటి దినమున అహింసా సంగ్రామమే ప్రారంభమయినయెడల ఈ రోజున తమ హృదయఖండములను (కొద్దిపాటిభూములు) ఇచ్చిన వారే మన సేనలో సైనికులుగా నుండగలరు. కాని అటువంటి సంగ్రా

మమునకవకాశము ఉండదనియే మన విశ్వాసము. అట్టి యుద్ధముతో పని లేకుండగనే ఈ సమస్య పరిష్కరింపబడగలదు.

సమాజవాద మిత్రులు "మేము మీ సలహా ప్రకారము పని చేయుదుము" అని చెప్పిరి.

అనంతరము బీహారు గవర్నరు దివాకర్జీ వచ్చిరి. మొన్న మొన్ననే జపాను వెళ్లివచ్చిన ఒక యువకుడు చెప్పిన అనుభవములను గురించి చెప్పసాగిరి. "జపానులో భూమి చిన్నచిన్న ఖండములుగా చీలియున్నది. అక్కడ చిన్న చిన్న యంత్రముల ద్వారా చేతితో వ్యవసాయము చేసికొనుచున్నారు. అట్లయినను అక్కడ ఉత్పత్తి ప్రవర్ధమానముగా నున్నది. హిందుస్థానములో భూమిని ఖండఖండములుగా చేసినయెడల ఉత్పత్తి తగ్గిపోవుననువారు కొంచెము జపాను వంకకు చూచుట మంచిది."

వినోబాజీ ఇట్లనిరి: "కాని ఈ రోజులలో మనవారి చూపు అమెరికా, రష్యాల మీద ఉన్నది. ఈ రెండుదేశముల స్థితిగతులు అన్ని విషయములలోను మనకంటె భిన్నమయినవని వారు గుర్తింపనే గుర్తింపరు."

అటుపిమ్మట ప్రాంతీయ కాంగ్రెసు కార్యకర్తల సమావేశము జరిగినది. అందు ప్రాంతీయ కాంగ్రెసు కమిటీ పక్షమున బీహారు నిమిత్తము నిర్ణయింపబడిన ప్రాథమికాంశము (Quota) నాలుగు లక్షల యకరములు పూర్తిచేయుటకు తీర్మానింపబడెను. ప్రాంతీయ కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు పండిత ప్రజాపతిమిశ్ర "భూదాన కర్మ వల్ల మనకు శుద్ధి ఏర్పడగలదు. ఈ పనియందు తమ సర్వస్వమును ధారపోయగల కార్యకర్తలు మనకు కావలెను. మనము బౌద్ధ భిక్షువుల వలె పనిచేయదగుదుము" అనిరి. ఇప్పుడు బీహారు ప్రాంతీయ కాంగ్రెసు సంఘమువారు ప్యాసుచేసిన తీర్మానమువంటి తీర్మాన

మును మఱి యే సంస్థవారును నేటివఱకును అంగీకరించియుండలేదు. ఇప్పటివఱకును భిన్న భిన్న సంస్థలలో ఉన్న కార్యకర్తలు వ్యక్తిగతముగా భూదాన కార్యములు సాధించుచున్నారు. కాని ఇప్పుడో, ఇక్కడ నున్న కాంగ్రెసువారు సంస్థపక్షమున భూదాన కార్యములు సాధింపదలచియున్నారు. ఈ విషయమును ప్రశంసించుచు వినోబాజీ ఇట్లనిరి : "బీహారు కాంగ్రెసు కమిటీవారు ఇప్పుడే ఒక సంకల్పమును చేసికొని దేశమున కంతకును ప్రమాణమును చూపియున్నారు. నేటి వఱకును మేము మహాత్యాగములు చేసియున్నామని అనకండి. క్రొత్త త్యాగముల కొఱకు సిద్ధముగా నుండండి. అట్లు కానిచో "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" కాగలదు. మీరు దేశకార్యములు సాధించుట యందు ఆఱితేఱినవారు. ఇప్పుడు నేను మీకు క్రాంతి పతాకమును చేతికిచ్చుచున్నాను." ఈఉపన్యాసము వినగానే సభ్యులలోఉత్సాహము పొంగి పొరలిపోయెను. ఒక మంత్రి 'మరల 1921 కాలము వచ్చి నట్లున్న' దనెను. స్వరాజ్యాందోళన కాలములో ఉన్న చైతన్యము, ఆనందము, ఉత్సాహము ఇక ఎన్నటికిని రాజాలవని తలచుకొన్నప్పుడు అప్పుడప్పుడు దుఃఖము గలుగుచుండును. కడచిన దినములు ఇక ఎన్నటికిని రాజాలవు. వినోబాజీ మనకు క్రాంతి కార్యము నొప్పగించి మనలో మరల ప్రేరణ గలుగజేసి యున్నారు. ఒక సమాజవాద నాయకుడు "ఈ క్రాంతి నిమిత్తము మేము పక్షభేదముల నన్నిటిని మఱచి కాంగ్రెసువారితో బుజముబుజము కలిపి పని చేయుటకు సిద్ధముగా నున్నా" మనెను.

రెండుజాముల వేళ యాత్రీదళమును కొందఱు సోదర సోదరీమణులు పాటలీపుత్రములోని భగ్నావశేషములను చూచుటకయి పోదలచి యున్నారు. మరల ఎంచుకొనవలసిన అవసరమేర్పడెను. కారణ మేమనగా ఆ సమయములోనే ఒక భూదాన సమ్మేళనము జరుగనయి యుండెను. కాని అశోకుని పాటలీపుత్ర నగర మను పేరు

విని కొంతకాలము ఆ భగ్నావశేషముల సాంగత్యములో కాలము గడపుట మంచిదని నిర్ణయించుకొంటిని.

సమీపములో ఉన్న కుంహారార్ గ్రామములో త్రవ్వపని జరుగుచుండెను. గొప్పగొప్ప స్తంభములు, ఇటుకలు, విగ్రహములు, మొండిగోడలు మొదలయినవానిని చూచినప్పుడు మనస్సు వర్తమానమును మఱచి యుండెను. అక్కడ ఉన్న ప్రతి వస్తువు వలనను అనంతమయిన విషయములు స్మృతిపథమున తగులుచుండెను.

అశోకుడు, సంఘమిత్ర, మహేంద్రుడు, తిష్యరక్షిత...కన్నుల యెదుట ఈ చరిత్ర అంతయు చిత్రపటమువలె గానవచ్చెను. తథాగతుని సందేశమును ప్రతివాని హృదయమునకును ఎట్లు అందివ్వవలెనను విషయమును ఆలోచించుచు అశోకుడు ఈ భూమిపైనతిరుగుచు ఎన్నో రాత్రులు గడిపి యుండవచ్చును. ప్రాణములకంటె అధిక ప్రియురాలగు కుమార్తె సంఘమిత్రను, కుమారుడు మహేంద్రుని ధర్మప్రచారమునకయి విదేశములకు పంపుదునన్న నిర్ణయము అతడిక్కడనే చేసియుండును. ఈ నిర్ణయము చక్రవర్తిగాను, సామ్రాజ్యాధిపతిగాను చేసియుండలేదు. తథాగతుని భక్తిచే పరవశుడయిన ఒక తండ్రి చేసిన నిర్ణయమది. చిన్నబాలిక యగు సంఘమిత్రకు దీక్ష యిచ్చునట్టి ఘట్టమది. నిన్నటివఱకు దిగంత సామ్రాజ్యమున కధిపతి యగు చక్రవర్తికుమార్తె యామె. ఈనాడామె ఒక భిక్షుణి. "బుద్ధం శరణం గచ్ఛామి" అని సంఘమిత్ర సుకోమల కంఠమునుండి గంభీరముగ వినవచ్చినది. ఒక్క క్షణముసేపు అశోక చక్రవర్తి మనస్సులో ఒక సన్నని నొప్పి బయలుదేరెను. నేటివఱకు మహదైశ్వర్యభోగము లనుభవించిన నా కూరిమి బిడ్డ సంఘమిత్ర ఇప్పటినుండి ఎన్నెన్ని కష్టము లనుభవింపనున్నదో! ఇల్లు, వాకిలి, తల్లి, దండ్రిని విడిచి ఆమె దూరదేశములకు పోవలసి యున్నది. "ధర్మం శరణం గచ్ఛామి" ఆమె ముఖమండలమున అపారశాంతి, సీమారహితమగు సమాధా

నము గానవచ్చుచుండెను. లోకములోని తుచ్ఛ సుఖములను విడిచి ఆమె శాశ్వతానందమార్గమును చేపట్టినది."సంఘం శరణంగచ్ఛామి." ఇప్పుడామె అశోక పుత్రిక కాదు. తథాగతుని శిష్యురాలయినది.

పందొమ్మిది వత్సరముల బాలిక సామ్రాజ్యాధిపతి రాజభవనమును విడిచి ధర్మచక్ర ప్రవర్తన కొఱకు కాషాయ వస్త్రములు ధరించి లంకవంటి దూరదేశములకు పోయి అక్కడి జనుల మనములను చూఱగొన్నది. ఆ సంఘమిత్రయే ఈనాడు "మీరేమి చేయుచున్నా" రని యడుగుచున్నది.

ఉదయము సరిగా అయిదుగంటలకు బాబా వెంట రాజభవనములో ప్రవేశించితిమి. బాబాను రావలసిన దని గవర్నరు నిన్నటి దినముననే ఆహ్వానించియుండెను. రాజభవనము ఎదుట ఒక భవ్య విగ్రహ మొకటియుండెను. గాంధీ విగ్రహము కానోపునని మాలో కొందరుమిత్రులు సాష్టాంగ దండ నమస్కారములు సయితము గావించియుండిరి. కాని ఉదయముకాగానే కన్నులువిచ్చి చూతుము గదా, మా అందఱిభ్రమ తొలగిపోయినది. ఆ విగ్రహము గాంధీజీది కాదు. ఇంగ్లండు రాజుది. కానయితే చిన్న విషయమే కావచ్చును, కాని అందెన్నో విషయములు గర్భితమైయున్నవి.

స్వతంత్రము రాగానే బాపూజీ ఇట్లనిరి :. ఆంగ్లేయులు తమ వైభవ దర్పములను చూపుటకుగాను అధునిక సదుపాయములతో అలంకృతములయిన రాజభవనములు మొదలగు మహాభవనములను నిర్మించియుండిరి. ఇప్పుడు వాని నన్నిటిని ఆసుపత్రులుగా, మ్యూజియములగా మార్చివేయవలెను అని. బాపూజీ రౌండుటేబిలు కాన్ఫరెన్సుకు ఇంగ్లాండు పోయినప్పుడు, అక్కడనున్న జనులను 'మాదేశములోని జనులకు ఒంటిపూట అన్నము దొరకుటయే కఱవుగానున్నప్పుడు ఒక బీదదేశపు వైసురాయికి ఇంత పెద్దపెద్ద జీతములు ఇవ్వగలమా?' అని అడిగిరి. ఈ విషయ మంతయు జ్ఞాపకము వచ్చినది. కాని బాపూజీ

ఎన్నో సంగతులు చెప్పియుండిరి. ఇప్పుడు వానినన్నిటిని జ్ఞాపక ముంచు కొనవలసిన అవసర మేమివచ్చినది ?

రాజభవనము ఆంగ్లేయుల కాలములో ఎట్లుండెనో, ఇప్పుడును అట్లేయుండెను. అవును, ఒక్క సంగతి. ఇప్పుడు ప్రతిగదిలోను బాపూజీ చిత్రపటము వ్రేలాడ దీయబడియున్నది. భారతీయులమయిన మనము జాతిలో భగవానుని దర్శింపగలము. అట్టితటి భగవానుని హాయిగా నిర్మించుట మనకు సులభమేగదా !

రాజభవనమునుండి తిరిగిరాగానే మాకు అనంతమైన కార్య క్రమములు సిద్ధముగానుండెను. ప్రతి జిల్లానుండి వచ్చిన కార్యకర్తలు తమ మండలమందలి స్థితిగతులు వర్ణించుచు ముందుకార్యము నిమి త్తము వినోబాజీని మార్గదర్శనము కోరుచుండిరి. బీహారులోని ముఖ్య మంత్రి తన మంత్రిమండల సదస్యులను వెంటబెట్టుకొని వినోబాను కలిసికొనుటకై వచ్చెను. ఇక్కడనున్న మహిళా కార్యకర్తలతోను, శాసన సభ్యులతోను చర్చలు సాగింపబడెను. వినోబాజీ స్త్రీలతో 'ఘోషాపద్ధతి కృత్రిమ బానిస లక్షణము. దానిని రూపుమాపుటకు ఇంటింటను సత్యాగ్రహములు జరుగవలెను' అనిరి.

పాట్నా నివాసమున కిది ఆఖరుదిన మగుటవలన వచ్చేపోయే జనులసంఖ్య చాల అధికముగా నుండెను. నేటి వీడ్కోలు ఉపన్యాస ములో వినోబాజీ 'జీవితములోని సమస్య లన్నింటిని గురించి గంభీర ముగా చింతన చేయవలెను' అనిరి. నేటి ఉపన్యాసములో వర్ణాశ్రమ ధర్మములను మరల ప్రతిష్ఠించుట, వానప్రస్థాశ్రమ మహత్త్వము, కూలీలకు వారి పనియే పూజ, ఈ మొదలగు విషయము లుండెను. రాత్రికి పత్రికా విలేఖరుల సమ్మేళనము జరిగెను. 'మీరు సత్యా గ్రహము ఎందుకుచేయరు' అని తరుచుగా బాబాను ప్రశ్నించుచుందురు. నేడు బాబా ఆ ప్రశ్నకు సమాధాన మిచ్చుచు ఇట్లనిరి: 'లోకములో నా కేదయినను ప్రతిష్ఠ ఉన్నయెడల అది సత్యాగ్రహికి సంబంధించి

నదే. సత్యాగ్రహ తంత్రమును నేను నిండుగా ఎరుగుదును. కాని నేనీ నాడు చేయుచున్న పనికూడ సత్యాగ్రహమే. నిరంతరము కాలి నడకను తిరుగుచుండుట, భావప్రచారము చేయుచుండుట, బీదలనుండి దానములు గ్రహించుట-ఈ మొదలైనపని అంతయు సత్యాగ్రహమే. కాని మీరు దేనిని సత్యాగ్రహ మనుచున్నారో అట్టి స్థూలసత్యాగ్రహ మున కవసరము గలిగినయెడల దానిని సయితము చేయగలను."

పాట్నాలోని మూడు దినముల కార్యక్రమములోను ధర్మ చక్ర ప్రవర్తన మనుపేరు ప్రత్యేకించి ఉచ్చరింపబడక పోయినప్పటికిని, దాని కృతి మాత్రము స్పష్టముగా గోచరించుచుండెను. ఇక్కడ పునాది వేయుపని ప్రారంభమయ్యెను. పునాది నిమిత్తము ఒక్కొక్క ఱాతిని ఏరుకొని కోరుకొని తెచ్చుచుండిరి. దానిని చెక్కి, సవరించి ఆకారము తేల్చుచుండిరి.' పాలఱాతిమీద శిల్పకారుని సుత్తిదెబ్బ పడుచుండును. ఆ దెబ్బనుండి ఏదో విగ్రహ మొకటి తయారగుచుండును. ఈ సంగతి ఆ పాలఱాతికి తెలియదు. చివర కది ఱాయియేగదా ! ఎన్ని సుత్తి దెబ్బలు పడినను అది మెదలకుండ సహించుచుండును. ఇదే దాని తపస్సు. ఇంత తపస్సు చేసినమీదటనే అది అసంఖ్య మానవుల శ్రద్ధకు పాత్రమగుచున్నది. 'నేను మీకు నూతన త్యాగమునకు, తపస్సునకు సందేశ మిచ్చుటకై వచ్చియున్నాను' అని వినోబాజీ ప్రకటించి యున్నారు. కాని దీనికొఱకు మనము ఱాతి ఆదర్శమును మనస్సులో నుంచుకొనవలెను.

## స్త్రీలకు సంపత్తిపై అధికారము ఉండవలెను.

పున్‌పున్, మసౌఢీ, (పాట్నా)

26, 27 అక్టోబరు, 1952.

పున్‌పున్ గ్రామము పున్‌పున్ నదీతీరమున నిలిచియున్నది. ఇది తీర్థ స్థానమని చెప్పుదురు. పిండ ప్రదానములు చేయుటకు గయ

వెళ్ళునప్పుడు ముందుగా పున్‌పున్‌లో పిండప్రదానములు చేయవలసి యుండును. ఈ రోజున గాలిలో చల్లదన మేర్పడుటవలన నేను పున్ పున్ నదిలో స్నానముచేసి, పుణ్యమును సంపాదించుటకంటె ఉష్ణోదకములో స్నానము చేసినందుకు సంతోషించితిని.

మసౌఢీ గ్రామసభలో వినోబాజీ ఇట్లు ప్రశ్నించిరి: 'దేనికి ప్లాను వేయవలెను? ముందుగా ఢిల్లీకా లేక పల్లెకా? అన్నిటికంటె ముందుగా పల్లెను చూడవలెను. కాని ఈరోజులలో అంతయు తల క్రిందులుగా నడచుచున్నది.

ప్రస్తుతము వినోబాజీ 'ధమ్మ పదము'ను చదువుచుండిరి. వారు అనేక పర్యాయములు "నేను బుద్ధ భగవానునివలె ఒంటరిగా తిరుగ గోరుచున్నాను. అట్లు చేయుటవలన నాకు శాంతియు గలుగును ఆరోగ్యమునూ బాగుపడును" అనుచుందురు. "ఏకలా చలోరే" (ఏకాంతముగా పొమ్ము) అన్న భావనలోగల కావ్య సౌందర్యము, భవ్యత, ఉదాత్తత మనస్సును హరించునట్టివిగా నుండును. ఏమైనను బాబా ఒంటరిగా తిరుగుటకు మన స్సంగీకరింపదు. శంకరాచార్యులు, బుద్ధుడు ఒంటరిగానే సంచారము చేసిరి. బాపూజీకూడ చివరి దినములలో నవకాళీలో ఒంటరిగానే తిరిగియుండిరి. అందువల్లనే కాబోలు ఈరోజులలో బాబా మనస్సు ఏకాంత సంచారముపై లగ్నమయి యుండెను.

ఒకదినమున మేము గ్రామీణుల సంభాషణను వినియుంటిమి. వారిలో ఒక సోదరుడు, 'గాంధీజీ ఇంగ్లీషువారితో "భారతమును విడిచి పొండి" అని చెప్పగా వారక్లే విడిచిపోక తప్పినదికాదు. ఇప్పుడు వినోబాజీ 'భూమి పంపిణీ కాగలదు' అనగా అయియే తీరును' అనెను. అది విన్నప్పుడు ఈ గ్రామీణుల నోటినుండి కాలమే ఇట్లు పలుకుచున్న దని నాకు తోచినది.

ఒకసారి ఒకసోదరుడు వినోబాజీని కలిసికొనుటకువచ్చెను. అతడు హిందూకోడ్ బిల్లు, విడాకులు, స్త్రీలకు సంపత్తిపయిన అధికారము ఈ మొదలయిన విషయములను గురించి ప్రశ్నించెను. వీనికి వినోబాజీ చెప్పెడి సమాధానము విని అతడు ఆశ్చర్యపొందగల డని నేనూహించితిని.

వినోబా : సతీపతులందు అన్యాయము, అనాచారము, అత్యాచారము, పరస్పర ద్వేషము ఉన్నయెడల సంతానమునకు బాధ గలుగును. ఇట్టి స్థితిగతులలో విడాకుల హక్కువలన ఇబ్బందిలేదు. ధర్మ మంతయు స్వేచ్ఛపయిన నిలిచియున్నది. శాసనముపయిన కాదు. ధర్మము ఆజ్ఞ చేయునట్టిదికాదు. అనుజ్ఞ ఇచ్చునట్టిది. కనుక విశేష స్థితిగతులలో విడాకులకు అధికారముండుట ఉచితమే. దీనిమూలమున చాలమంది విడాకులే యివ్వగలరని ఎవరయినను చెప్పినయెడల అది ధర్మమును గురించి న్యాయము చెప్పినట్లుకాదు. అవును. విడాకుల నిమిత్తము కొన్ని షరతులు ఏర్పఱచవచ్చును. అట్టిస్థితి గత్యంతరము లేనప్పుడే జరుగునట్లు చేయవచ్చును. మూల సిద్ధాంతములను స్థిరపఱచుచు, ఉదారబుద్ధిని కనబఱచుచు, విడాకులను సయితము అంగీకరింపవచ్చును."

"ఇప్పుడు స్త్రీలకు ఆస్తిపై అధికార మున్నదా, లేదా అన్న విషయమును దీసికొనుడు. ఈ పద్ధతివల్ల అన్న చెల్లెండ్రలో ప్రేమ ఉండదని చెప్పుదురు. ఇట్లనుకొనుట తప్పు; యాజ్ఞవల్క్య స్మృతిలో స్త్రీ హక్కు అంగీకరింపబడినది. కుమారునియందు తండ్రి గుణరూపశీలాదులు లక్షితములయినట్లు కన్యలోకూడ లక్షితము లగుచున్నవి. పరమేశ్వరుడు కూతురునందును, కొడుకునందును భేదము ఏర్పఱుపడు. దీనిపయిన కన్య పరాయి యింటికి పోవునుగదా, అట్టితఱి ఆమెకు తండ్రిఆస్థి రావలెనా, లేక భర్తఆస్థి రావలెనా, అని కొంద ఱడుగుచుందురు. కాని ఇది వ్యవహార విషయము. కన్యకు ఆస్తిపై

హక్కుగల దన్నమాట అంగీకరింపవలసియే యుండును. దీనివల్ల అన్న చెల్లెండ్రకు ప్రేమ చెడిపోదు. అట్లయినచో నేడుకూడ అన్నదమ్ముల యందు ప్రేమ ఉండుటలేదుగదా! అయినను తండ్రిహక్కు కొడుకు లందఱకు ఎందుల కియ్యబడుచున్నది. అందువల్ల తండ్రిఆస్తి సోదరులకు పంచిపెట్ట గలిగినప్పుడు అన్న చెల్లెండ్రకు మాత్రము ఏల పంచిపెట్టరాదు? ఈ రోజులలో స్త్రీలకు వోటుహక్కు వచ్చియున్నది. ఆపక్షములో వారికి ఆస్తిలో వాటా యెందు కివ్వరాదు? స్త్రీలకు ఆస్తిపై అధికార మిచ్చినయెడల హిందూ ధర్మము చెడిపోవునని ఎవరయినను చెప్పినయెడల, అది తప్పు. హిందూమతము చాల దృఢమయిన మతము. అది బుద్ధునికూడ అవతార మని అంగీకరించినంతటి ఉదారమయిన మతము. కనుక దానిని సంస్కరించుటకు అవకాశ మున్నది.''

''స్త్రీలకు బ్రహ్మచర్యమునకుగాని, సన్యాసమునకుగాని అధికారము లేదని మీరు చెప్పుచుందురు. కాని అట్లేల చెప్పవలెను? స్త్రీలకు వోటింగుఅధికారము ఇవ్వగలిగినయెడల, సన్యాసాధికారము మాత్రమేల యివ్వరాదు? అధికార మిచ్చినంతమాత్రాన స్త్రీలందరును బ్రహ్మచారిణులు అయిపోయెద రనుటకల్ల. పురుషులును మీరావజాలరు. వారికి అధికారము ఇచ్చియున్నారు. కాని స్త్రీలను అడ్డగించుట యెందులకు? అందువల్లనే మన అభ్యుదయము ఆగిపోయినది. స్త్రీ, వైశ్యుడు, శూద్రుడు, మఱియెవరుగాని మోక్షమును పొందగలరని శ్రీకృష్ణ భగవానుడు గీతలో చెప్పియున్నాడు. అట్టి స్థితిలో మీరు స్త్రీలకు అధికార మివ్వము అని చెప్పుట భయంకర విషయమే కాగలదు. మనము మాటలుమాత్రము ఆత్మజ్ఞానమును గురించి చెప్పుచుందుము. ఆత్మ విషయములో స్త్రీపురుష భేదములేదు. ఈ భేదము దేహ సంబంధమయినది. మోక్షము ఆత్మ సంబంధమయినది. స్త్రీలకు వేదాధ్యయనము చేయు అధికారము లేదని మీరు చెప్పుచుందురు.

కాని వేదకాలమందు వందలకొలది స్త్రీలు ఋషులుగానుండి స్వయముగా మంత్రములు చెప్పుచుండిరి. కనుక ఈనాడు స్త్రీలకు వేదాధ్యయనమునకుగాని, సన్యాసమునకుగాని అధికారములేదని ఎవరయినను చెప్పినయెడల వారి ఆధ్యాత్మిక హోదా తగ్గిపోవును. దాని వల్ల హిందూమతము వికాసము పొందజాలదు. అందరిలోను ఒక్కటే ఆత్మ నివసించుచున్నది అని అది బోధించుచున్న దన్నమాటయే. కాబట్టి మనము ఏవిధమయిన భేదమును ఎంచరాదు. వ్యాపకమయ్యిన ఉదారమైన బుద్ధివల్లనే ఏమతమయినను వృద్ధిపొందగలదు. ఈరోజులలో ప్రతిమతములోనివారు ఆత్మనిరీక్షణ చేసికొని పరిశుద్ధులు కావలసియున్నారు.''

బాబా నోటినుండి నేనీ మాటలు విన్నప్పుడు నాకుగలిగిన ఆనందమునకు పారములేదు. కాని వారు స్త్రీలకు ఆస్తిపై అధికారము ఉండవలెనని ఒకవంక చెప్పుచున్నప్పటికిని, వేరొకవంక ఆస్తిపై అధికారములే ఉండరాదని చెప్పుచుందురు. ఆస్తిపై ఏవ్యక్తికీ అధికారము ఉండరాదు. కాని ఆస్తిఅంతయు శ్రీరఘురామదేవునిదిగానే ఉండవలెను. ఇది వారి భావన.

## సమాజాయ ఇదమ్, నమమ

జహానాబాద్, మఖదుమ్‌పూర్

జేలా, టికారే, రాజపూర్ (గయా)

28, 29, 30, 31 అక్టోబరు, 1 నవంబరు, 1952

బుద్ధభగవానుని తపోభూమియయిన గయలో ప్రవేశించితిమి. దారిలో ఒక మిత్రులు బాబాకు పువ్వులు కానుకగా సమర్పింపగా బాబా ''నాకీ పిల్లలతో (పువ్వులతో) పనిలేదు. ఈ పిల్లలతల్లితో (భూమితో) నాకు పనియున్నది'' అనిరి. అటుపిమ్మట వారు ధమ్మ

పదములోని శ్లోకమును చదివి వినిపించిరి. అందిట్లున్నది: "ఎవరి చిత్త వృత్తి పువ్వుల వెంటబడు భ్రమరమువలె ఉండునో, వరదనీటివల్ల నిదురించు గ్రామము నశించిపోవునట్లు అతడుకూడ నశించిపోవును." దానియందు పూలయందుండు ఆసక్తి ప్రతీకాత్మకమయినది. దానివల్ల భోగవిలాసప్రవృత్తి సూచింపబడినది.

గయాజిల్లాలో సమాజవాదుల ప్రాబల్యముగలదని విని యున్నాము. జనరలు ఎన్నికలలో వారికి బాగా గెలుపుగలిగినదని కూడ వినియున్నాము. ఇక్కడ ఎఱ్ఱజెండాలు, ఎఱ్ఱటోపీలు ఎక్కువగా కనబడుచుండెను. ఈ జిల్లాలో ఎఱ్ఱకమలములతోనిండిన చెఱువులు కూడ అధికముగా కనబడుచుండెను. దానిపైన దామోదర్‌జీ సరసముగా "ఇక్కడనున్న సృష్టికూడ మీకు అనుకూలముగానున్నదే" యనిరి. స్వాగతముకొఱకు అమర్చబడిన ద్వారములుకూడ ఎఱ్ఱని కమలములతో అలంకృతములై యుండెను. ఎఱ్ఱని కమలములతో కట్టిన దండలు చూచినప్పుడు మనస్సునకు చెప్పరాని ఉల్లాసము గలుగుచుండెడిది.

మా యాత్రీదళములోని ఒక సమాజవాద మిత్రుడు పెద్దపెద్ద కేకలతో గీతాప్రవచనమును అమ్ముచుండెను. అది చూచి సమాజవాద నాయకుడొకడు సరసముగా, "ఏమండీ! మాకు గల మంచి కార్యకర్తను అపహరించుకొని పోరుగదా, యను భయము గలుగుచున్నదండీ" అనెను. ఆ మాట నందుకొని దామోదర్‌జీ "మేము జయప్రకాశ నారాయణునే చంకబెట్టుకొని పోగలిగినప్పుడు ఇక సామాన్య కార్యకర్తలను గుఱించి చెప్పనేల" అని వినోదముగా పలికెను.

ఒకచోట బాలురు కొందఱు "సంత వినోబా అమర్ హో" అని నినాదములు చేయుచుండగా, వినోబా ఆగి నవ్వుచు, "మీరు భూమి ఏమయినను ఇచ్చెదరా? లేకపోయినచో వినోబా అమరుడెట్లు కాగలుగును?" అనిరి.

కేంద్ర సర్కారువారు కంట్రోళ్లు రద్దుచేయుటకు నిర్ణయించు కొన్నారని ఇప్పుడిప్పుడే వార్తలు వచ్చినవి. ఆ విషయమయి సర్కారును ప్రశంసించుచు వినోబాజీ ఇట్లనిరి : "కంట్రోళ్లు ఎత్తివేయుటకు ధైర్యమును, ఉపాయమును రెండును కావలెను." కేంద్రీయ యోజనను గుఱించి మాట్లాడుచు వారిట్లనిరి : "కేంద్రీయ యోజనవల్ల జనుల కెన్నడును సుఖము గలిగియుండలేదు. అధికారము, ప్లాను, బుద్ధి- ఇవి వికేంద్రీకృతములు కావలెను. అప్పుడే దేశము యొక్క శక్తి పూర్తిగా వినియోగపడగలదు. మఱియు ప్రత్యేక గ్రామము తన సుఖము నిమిత్తము ప్లాను వేసికొనగలదు."

"బేలా" గ్రామ సమీపమున లోమశ ఋషి గుహలున్నవి. లోమశ మహర్షి యుధిష్ఠిరునకు వనవాసములో మార్గదర్శకుడును, మిత్రుడు నయియుండెను. ఈ గుహలు అతి ప్రాచీనములయినవి. అశోక చక్రవర్తి వానిని ఉత్ఖననము చేసియుండెను. మాలోనుండి ఒక దళమువారు భూదాన గీతములు పాడుకొనుచు ఆ గుహలు చూచుటకు పోయియుండిరి. ప్రతి గుహలోనికి పోయి మేము గంభీర స్వరముతో "బుద్ధం శరణం గచ్ఛామి" అని మంత్రమును పఠింప సాగితిమి. ఈ మంత్రోచ్చారణలో ఎంత అద్భుతశక్తి ఇమిడియున్నదో యేమో ! కేవలము ఆ శబ్దములు పలికినంత మాత్రముననే బుద్ధ భగవానుని నిమిత్తమయి సర్వార్పణ చేసికొందమా అనిపించు చుండెను. వేలకొలది సంవత్సరములు దాటిపోయిన తరువాత, అశ్రద్ధతో గూడిన నేటి యుగములో నివసించునట్టి వ్యక్తి మనస్సులో గూడ ఆ మంత్రము శ్రద్ధాభావన గలుగజేయుచున్నదనగా ఆ కాలములో అదెంత శక్తివంతమయి యుండెడిదో గదా ! ఆ దినములలో "బుద్ధం శరణం గచ్ఛామి" అన్న గంభీర ఘోష వినగానే లక్షలకొలది వ్యక్తులు తెలిసిగాని తెలియక కాని బుద్ధ మతములో చేరిపోయి యుందురు. నేటికి కూడ క్షణకాలము వఱకే కావచ్చుగాక, జీవిత

ములో శాశ్వతసుఖము, శాంతి, తృప్తి కలిగించు గుణము ఆ మంత్రములో గర్భితమై యున్నది. అట్టి స్థితిలో ఆ కాలములో ఈ మంత్రము ఎందటి జీవితములలో మార్పు తెచ్చియుండవచ్చునో గదా! కామక్రోధాదులకు వశుడై, క్షుద్ర భోగములలో చిక్కుకొనియున్న మానవుడు, ఈ మంత్రమును వినగానే శాశ్వత సుఖమును పొందగలిగియుండవచ్చును. మంత్రశక్తి ముందు లోకములోని ఏ శస్త్రాస్త్రశక్తియు పనికిరాదని చెప్పుచుందురు.

టికారీ గ్రామములో అక్కడ ఉన్న రాణీసాహెబా మాకు చాల భూమిని దానముగా ఇచ్చెను. ఈ రోజులలో మాకు భూదానములు ఎక్కువగా దొరుకుచుండెడివి. టికారీ గ్రామ సభలో టికారీ రాజా బాబాకు ఒక స్వాగతపత్రమును సమర్పించెను. అందీ విధముగా చెప్పబడెను: "కాలము యొక్క కోరికను జమీందారులమయిన మేము గుర్తింపవలెను. వినోబా వంటి సాధుపుంగవుల ఆదేశమును పాటించి మేము అత్యధికమైన భూమిని దానముగా ఇచ్చినప్పుడే మాకు శుభము కలుగగలదు."

టికారీ గ్రామములో ఇచ్చిన ప్రవచనములో వినోబాజీ భూదానము లోని తత్త్వజ్ఞానమును గుఱించి తెలియజేయుచు ఇట్లనిరి: "మూలభూతములగు భావనలు అనగా తత్త్వజ్ఞానము ప్రతి మతమునకు ప్రతిష్ఠ గలుగజేయును. ఆ తత్త్వము నాధారము చేసికొని ఆ మతము లోతుగా చొచ్చుకొనిపోవును. ఆ తత్త్వజ్ఞానము లేకుండ ఏ మతమును నిలువజాలదు. నామూలగతభావనకు అపరిగ్రహమని పేరు. దానికి వ్యతిరేకముగా ఈనాడు లోకములో నడచుచున్న భావనకు అపహరణమని పేరు... మనము లోకమునకు అపరిగ్రహమును ప్రసాదించుచున్నాము. భగవంతుడు మనకిచ్చిన సంపత్తి, బుద్ధి, శక్తి మొదలయిన గుణములు మన నిమిత్తము కావు; సమాజ సేవ కొఱకు ఏర్పడియున్నవి. ఏ విధముగా ఋషులు యజ్ఞకాలమున

ఆహుతి చేయునప్పుడు "ఇంద్రాయ ఇదమ్, నమమ" అనుచుందురో, ఆ విధముగానే మనము "సమాజాయ ఇదమ్, రాష్ట్రియ ఇదమ్, నమమ" అనుచుండవలెను. మన దగ్గఱ నున్నదంతయు కృష్ణార్పణము చేయవలెను. సమాజమునకు అర్పణచేసివేయవలెను. మరల సంఘము నుండి మనకేది ప్రసాదరూపముగా లభించునో దానిని గ్రహించు చుండవలెను."

టికారీ గ్రామములో బాబాకు రాత్రి ఒంటిగంటకు నిద్ర మెలకువ వచ్చెను. అనంతరము వారు చింతన చేయసాగిరి. ఆ సమయములో వారికి ప్రేరణ గలిగెను. గయా జిల్లా బుద్ధ భగవానుని తపోభూమి గదా. కనుక ఈ జిల్లాలో మొదటి వాయిదా క్రింద ఒక లక్షయకరముల భూమిని కోరవలెను అని.

మఱునాడు రాజాపుర గ్రామములో సమావేశమయిన కార్యకర్తలతో వారు ఒక లక్షయకరముల భూదానము కావలెనని కోరియుండిరి. కార్యకర్తలు ఆ కోరికను ఉత్సాహముతో స్వీకరించిరి. తులసీదాసుగారి బాందాజిల్లాలోకూడ బాబా యీవిధముగానే ఒక లక్షయకరములు కావలెనని కోరియుండిరి. నేటివఱకు మనము మన పూర్వుల గౌరవమును గుఱించి గర్వపడుచుండెడివారము. కాని ఇప్పుడు బాబా మన అందఱి గర్వమును పరీక్షచేయునట్టి ఉపాయమొకటి కనిపెట్టియున్నారు. ఇప్పుడు అసలుసంగతి యేమో, నకలుసంగతి యేమో, తేలిపోగలదు.

బాబా : బుద్ధభగవానుని ప్రేరణవల్ల నేనీపనిని పైన వేసికొంటిని. ఇప్పుడు నేను వారిప్రేరణవల్లనే వారితపోభూమినుండియే ఈ కోరికను కోరుచున్నాను.

రాజాపురము బొత్తిగా చిన్నగ్రామము. ఒక ప్రయిమరీ పాఠశాలలో బాలతరగతిలో మాకు బస ఏర్పాటుచేయబడెను. మాకుచాల సమీపములో ఎదురుగా ఒకచిన్న పుష్కరిణి ఉండెను. అందు

మూతులు ముడుచుకొని రెండు కలువ మొగ్గలు నిలిచి యుండెను. గదిలో కూర్చుండియే ప్రకృతి సౌందర్యమును చూడగలుగుచుంటిని. పచ్చ పచ్చని చేలు, దూరమువరకు వ్యాపించియున్న కొండల వరుసలు, స్వచ్ఛమైన, నిర్మలమయిన నీలాకాశము, ఆ కలువ మొగ్గలు. పని పాటులన్నియు విడిచిపెట్టి ఆ సౌందర్యమును నిరీక్షించుచు కూర్చుండెనా, అనిపించుచుండెను. "చిన్నగ్రామములోనే నాకు పరమసంతోషము గలుగుచుండు"నని బాబా తఱుచు చెప్పుచుందురు.

సాయంకాలము చంద్రోదయము కాగానే కలువలు వికసింప సాగెను. చంద్రునికాంతి నలువంకల ప్రసరింపగానే అవి ఆనంద మగ్నములయి తలలాడింపసాగెను. కుముద పుష్పములు వికసించు చుండగా చూచినప్పుడు, చిరకాలమునుండి నే చేయుచుండిన తపస్సు పండినదా. యనిపించెను. సూర్యకిరణములు లోకమున కంతకు జీవన దానము చేయుచున్నవి. ప్రకృతిఅంతయు ఆనందపారవశ్యముతో ఆ కిరణములకు స్వాగతమిచ్చుచున్నవి. కాని కుముదములకు చంద్రుడే అధికప్రియుడు. చంద్రప్రకాశములో లోకమంతయు నిద్రావస్థలో కూరియున్నప్పుడు కుముదములు వికసించి, నాట్యముచేయ నారంభించును.

## సర్వోదయము లేదా సర్వనాశము

*బోధగయ, గయ*

**2, 3 నవంబరు, 1952**

ప్రాతఃకాల మగుచుండెను. అయినను పూర్ణిమ చంద్రుడు షోడశకళాపరిపూర్ణుడయి తన వైభవమును చాటుచుండెను. నక్షత్రములు ... వరును తేజోహీనులు చేయ లేరన్నట్లు మెఱసిపోవుచుండెను. సూర్యో దయమయిపోయినప్పటికిని, అతడు తన ఓటమి నంగీకరించునట్లు

లేదు. సూర్యుడెంతదూరము సాగిపోయినప్పటికిని చంద్రుడు తన చోటున కదలక మెదలక నిశ్చలుడయి నిలచియుండెను.

మొన్నటిదినమున టికారీ గ్రామములో బాబా తమ ఉపన్యాసములో 'సమాజాయ ఇదమ్, రాష్ట్రియ ఇదమ్ నమమ' అని చెప్పియున్నారు. అది నాకు తిన్నగా అర్థము కాకపోవుటవల్ల ఈనాడు నడకసాగుచున్నప్పుడు నేను బాబాతో ఇట్లంటిని: "హేగెలు తత్త్వజ్ఞానమునుండి "అక్రామిక రాష్ట్రివాదము" పుట్టినట్లు "రాష్ట్రియ ఇదమ్" అను నీ తత్త్వజ్ఞానమునుండికూడ అటువంటి రాష్ట్రివాదమే పుట్టునట్టి భయము లేదా ?"

బాబా : బొత్తిగా లేనేలేదు. ఇందు వ్యక్తి స్వేచ్ఛాపూర్వకముగా తనకున్నదంతయు సమాజమునకు అర్పణ చేయుచున్నాడు. ఈ సమర్పణ అన్నభావన కేవలము భిన్నప్రకారమయినది. తల్లి తన బిడ్డని కొఱకయి సర్వస్వము త్యాగముచేయుచున్నది. అందు సమర్పణయే గర్భితమయి యున్నది. తల్లిపాలుగాని, దాదిపాలుగాని, పిల్లవానికి పాలే దొరకుచున్నవి. కాని దాది డబ్బుతీసికొని పాలిచ్చుచున్నది. కనుక ఇద్దఱియందును ఏనుగునకు, దోమకుగల అంతరమున్నది. ఆ విధముగానే వ్యక్తిచేత సమాజముకొఱకు బలవంతముగా త్యాగము చేయుటలోను, వ్యక్తి స్వేచ్ఛగా సమాజముకొఱకు చేయుటలోను అట్టి భేదమే ఉన్నది.

సామాన్యముగా ధనవంతుల బిడ్డలకు తల్లిపాలు లభింపవు. వారి నొసటను దాదిపాలు త్రాగవలసినదనియే వ్రాయబడియున్నది.

నేను : కాని ఇది ప్రతిష్ఠకు లక్షణమని చెప్పుకొనుచున్నారుగదా!

బాబా : శ్రీమంతుల బిడ్డలు నిర్భాగ్యులని నా వాదము. వారిని ఆగర్భ శ్రీమంతు లనరాదు. ఆగర్భ దరిద్రు లనవలెను. ఎందు కనగా వారికి తల్లి పాలును లభింపవు; వాత్సల్యపూర్ణమయిన తల్లి చేతిభోజనమును లభింపదు. ఇంతకంటె దౌర్భాగ్యమింకేమి కావలెను?

అనంతరము బాబా తమ జీవితములోని కొన్ని పురాతన విష యములను వినిపించిరి. వారిట్లనిరి : "నేను పిల్లలకు చదువు చెప్పి యున్నాను. కేవలము చదువు చెప్పుటయేగాక వారికి వంట చేసిపెట్టి తినిపించియున్నాను కూడ. ఈ వల్లభస్వామి మొదలగు నా విద్యార్థులు నా చేతి వంటను ఆరగించినవారే.

జెయిలులోకూడ నేను జెయిలును ఆశ్రమముగాచేయ దలపెట్టి నప్పుడు వంటపనినే మొదలు పెట్టితిని.

దీనిపయిన రామదేవుబాబు వినోదముగా "ఆ పక్షములో అంద ఱకు చప్పిడి భోజనము పెట్టియుందు" రనెను.

బాబా : అవును. నేను చప్పిడి వంటనే చేయుచుందును. మొదట, రాజకీయఖైదీలలో కేవలము పది, పదిహేనుమంది మాత్రము చప్పిడి తినుచుండిరి. మిగిలిన వారందఱు ఉప్పు కారము తినుచుండిరి. కాని క్రమక్రమముగా అందఱును చప్పిడినే తినసాగిరి. కేవలము అయిదాఱుగురు మాత్రమే ఉప్పుకారము తినువారుగా ఉండిపోయిరి. అనంతరము దొంగతనము చేసిన ఖైదీలు కూడ చప్పిడి తినసాగిరి. నేను వంట చేయుచుండుటయే దానికి కారణము. కాని తరువాత దొంగ ఖైదీలకు వంట చేసిపెట్టు పూచీ నన్ను పెట్టుకొనవద్దని జెయి లరు నన్ను ప్రార్థించెను.

గయ సమీపింపగానే నగరవాసుల గుంపు అధికమయ్యెను. ఆ గుంపును ఆపుట కష్టమయిపోయెను. శంఖనాదములు, పుష్పవృష్టి, జయఘోషలు, సర్వత్ర ఆనందోత్సాహములు వెల్లివిరియుచుండెను.

భూదేవి అంకతలమున మెఱుపుతీవ వంటి గమనముతో ముందు నకు సాగిపోవుచున్న బాబాను చూచినప్పుడు, ఆమెకేదో జ్ఞాపకము వచ్చినట్లయ్యెను. ఈ చరణస్పర్శ చిరపరిచితమయినట్లు ఆమెకు తోచెను. ఆమె ఇట్లు ఆలోచింపసాగెను: మానవ కాలగణ ననుసరించి రెండువేల అయిదువందల సంవత్సరములు గడచిపోయినప్పటికిని,

నిన్న జరిగిన వృత్తాంతము వలెనే ఆమెకు తోచెను... ఒక విశాల వృక్షచ్ఛాయను ఆమె ప్రియపుత్రు డొకడు ధ్యానస్థుడై కూర్చుండి యుండెను. దినములు గడచిన కొలదిని భూదేవిమనస్సున కారాటము పెరుగజొచ్చెను. ఒక క్షణమున ఆమె తన ప్రియపుత్రుని చూచుకొన్న ప్పుడు ఆనందము పొందుచుండును. కాని మఱుక్షణమున, ఆతని ఘోర తపస్సు, క్లేశములను చూచినప్పుడు ఆమెకు దుఃఖము గల్గు చుండును. ఆమె తన ప్రాణముల నన్నిటిని కన్నులలో పెట్టుకొని పెక్కు దినముల వఱకు అతనిని చూచుచునుండెడిది. ఈ మార్గము నుండి ఆతనిని చలింపజేయుటకు కామక్రోధాదిశత్రువులు వచ్చినప్పుడు తల్లి మనస్సునకు ఎంతో భయము గలిగెను. కాని కుమారుని ముఖ సీమను పరమశాంతి నృత్యముచేయుచుండగా చూచి ఆ తల్లి నిర్భయు రాలుగా నుండెను. మరల అతడు నలువది దినముల కడపటి ఉపవా సము మొదలుపెట్టెను. దానిని తలచుకొన్నప్పుడు నేటికిని భూదేవి అంగములు గజగజ వణకిపోవుచుండును. కామదేవుని పరాభూతుని చేయగల ఆతని దేహము క్రమక్రమముగా క్షీణింపజొచ్చెను. తన కన్నుల యెదుటనే తన కోమల పుష్పము వాడిపోవుచుండెను. ఈ విషయము నామె విస్ఫారిన నేత్రములతో చూచుచునేయుండెను. కాని ఆమె హృదయమున ప్రగాఢమగు విశ్వాసముండెను. కనుకనే ఆమె నలుబదియొకటవ దినమును చూడగలిగెను. ఆ దినమున అతడు కన్నులు విచ్చి చూచినప్పుడు, వేలకొలది యోజనముల దూరమున నివసించునట్టి సూర్యుడు ఈ రోజున ఇంత సమీపమునకు ఎట్లువచ్చెనా యని, భూదేవి అబ్బురపడజొచ్చెను. కాని ఆ తేజస్సు, తపశ్శాలియగు. తన పుత్రుని నేత్రములనుండి వచ్చినదని తెలిసినప్పుడు ఆమె హృదయ ములో హర్షోల్లాసములు తరంగితములు కాజొచ్చెను. అతడు కన్నులు తెఱవగానే నాలుగువంకల మైత్రి, కరుణ కనబడసాగిరి. అతడు ఆసన మును విడిచి మొదటిసారి భూమిపైన పాదము మోపగానే అతనికి

భూదేవి ఆశీర్వాదము లభించెను. ఇక యుగయుగములనుండియు పీడింపబడుచున్న మానవుని దుఃఖ విముక్తికయి మార్గము చూపుట కతని సంచారము ప్రారంభమయ్యెను.

నేడుకూడ ఆ దృశ్యమంతయు ఆమె కన్నులయెదుట సాక్షాత్కారమయ్యెను. ఆమె అతని ముఖమును చూచుచుండెను. చాల కాలము క్రిందట విదేశములకు పోయివచ్చిన కుమారుని గుర్తించుటకు తల్లికి కూడ కొంతకాలము పట్టును. కాని భూదేవి అతనిని గుర్తించినది. 'అతడే తిరిగివచ్చినట్లు ఆమెకు తోచినది. కాని ఈసారి ఆతని నేత్రములయందు గాంభీర్యము వాసము చేయుచుండెను. ఆమె కుమారుడు నేటివఱకు జ్ఞానవిజ్ఞానములను సముపార్జించియుండెను. ఈ గాంభీర్యము అందువలన కాబోలునని ఆమె తలంచియుండెను. ఆతని భాషయందు చాల మార్పువచ్చినట్లు కనబడెను. మైత్రి, కరుణ, ధర్మచక్ర ప్రవర్తనము ఇవి పురాతన శబ్దములే. కాని సామాజిక క్రాంతి, సర్వోదయము, హృదయ పరివర్తనము ఈ మొదలయిన శబ్దములు క్రొత్తవి. తల్లి కర్ణములకు క్రొత్తవియేయయినను స్వరము మాత్రమదే. "భూమి హీనులకు హక్కు, కాలము యొక్క కోరిక" మొదలయిన మాటలు పలుకునప్పుడు అతని స్వరము గంభీరమై, నిశ్చితమైనట్లు తోచుచుండెను.

"భూమిదానయజ్ఞమును సఫలము గావించెద"మని జనులు జయఘోష చేయసాగిరి. "ఆకాలములో అతడు యజ్ఞనిషేధముచేసియుండెను. కాని ఈరోజున ఏదో క్రొత్తయజ్ఞమును మొదలుపెట్టినారే" అని ఆమె ఆలోచించుచుండెను. "భూమి అందఱకు తల్లి" అని మరల జయఘోష ప్రారంభమయ్యెను. ఎటువంటి యజ్ఞమో ఇప్పుడామెకు తెలిసిపోయెను. "నేనితరులవల్ల నిర్మింపబడుదానను కాను. నేను నిన్ను గుర్తించితిని. నీవు అతడవే. నా ఆశీర్వాదము పొందుటకు ఒక్క నిమేషము నిలబడుమని" ఆమె కుతూహలవర్ధక

మగు చిత్తముతో పలికెను. కాని ఆతడు బాణమువలె రివ్వున కదలి పోవుచుండెను. "పొమ్ము! ఈవిధముగానే ముందునకు సాగిపొమ్ము. ధర్మచక్రగమనము కుంఠితమగుట నేను చూడజాలను. నీ యీ నవ్య తపస్సువల్ల మరల నొక్కమాఱు దానికి గమనవేగము కలుగనిమ్ము. లోకమునందంతట మరల నొక్కమాఱు ధర్మచక్రప్రవర్తనము జరుగుగాక!" అని భూదేవి పలికినది.

"సంత వినోబా అమర్ హో" అని జనులు మరల జయఘోష చేసిరి.

"నహి వేరేణ వేరాణి సమంతీధు కుదాచన
అవేరేణచ సమంతి ఎసధమ్మో సనంతనో"

(వైరమువల్ల వైరము నశింపదు; నిర్వైరమువల్ల నశించును. ఇదే సనాతన ధర్మతత్త్వము.)

మొదటిసారి బుద్ధవాణి ఈ ప్రకారముగా వ్యక్తమయినప్పుడే అతడు అమరుడని ఆమె తెలిసికొనియుండెను. మనుష్యుడు సంచలించిన సంచలించును. గాక! కాని పతితుడు కాజాలడు. గాంధీ రాగలడు. వినోబా రాగలడు. వారి ముఖమునుండియు ఈ వాణియే బయలుదేరును. " ముందునకు సాగిపొమ్ము. నీవమరుడవు."

నివాస స్థానమునకు చేరగానే వినోబాజీ 'గయజిల్లానుండి నాకు ఒక లక్ష యకరములు కావలెను. బుద్ధభగవానుని - తపోభూమి అహింసాక్రాంతికి ప్రయోగశాల కావలెనని నా ఆశయము' అనిరి.

ఫల్గునదీ తీరముననే మేము యాత్ర సాగించుచుంటిమి. ఈ నది యొడ్డుననే భగవానుని తపస్స్థాన మయిన బోధగయ నిలిచియున్నది. సుజాత ఇచ్చిన ఈ ఫల్గునదీ ఉదకముననే త్రావి, భగవానుడు తన అంతిమ ఉపవాసమును సమాప్తి చేసెనని చెప్పుచుందురు... ఉదయము కావచ్చెను. పక్షుల కలకలరవములు ప్రారంభమయ్యెను. ప్రాచీ దిశాముఖము ఉజ్జ్వలమయ్యెను. వినోబాజీ చింతన చేసి

కొనుచు ముందునకు సాగిపోవుచుండిరి. మేముకూడ మౌనముద్ర ధారులమై నడచి పోవుచుంటిమి. తటాలున తాటిచెట్ల చాటునుండి భగవానుడగు సూర్యరశ్మి ఉదయాచలము నధిష్ఠించెను. ఆ సమయమున అత డపూర్వ తేజోవంతు డయియుండెను. బాబా చటుక్కున ఆగి, ఏకాగ్ర చిత్తముతో సూర్యునివంక చూడసాగిరి. అంతట వారు ఉషస్సునకు సంబంధించిన వేద సూక్తములను చదువసాగిరి. వినోబా చదువుచున్న వేదమంత్రములతో, స్తుతి మంత్రములతో, స్వాగత మంత్రములతో సంతుష్టు డయినవాడయి సూర్యనారాయణుడు అధిక తేజోవంతుడయి నయనాభిరాముడయి వెలుగజొచ్చెను. ఆ దృశ్యము మఱపునకు రానిది.

బోధగయకు సమీపంలో బల్లపరుపు ముఖములు, చప్పిడి ముక్కులు, చిన్న కండ్లుగల యాత్రికులు కనబడసాగిరి. బోధగయ బౌద్ధులకు అన్నిటికంటె గొప్ప పవిత్రస్థలము. బౌద్ధధర్మ మందలి స్నేహానురాగములవల్ల ఆసియావాసు లందరు మనకు సమీపస్థులయి నారన్న భావనయే మా కెంతో సంతోషము కలిగించెను. "భారత సందేశమును లోకమున కందజేయుచున్న బౌద్ధ భిక్షువులు మనకు మహోపకారము చేసియున్నా" రని బాబా తఱుచుగా చెప్పు చుందురు.

ఈరోజున మేము బోధగయలో మహంతుని అతిథిశాలయందు విడిది చేసితిమి. మహంతు అయిదువందల యకరముల భూదానము నిచ్చియుండెను. శంకరాచార్యులు బౌద్ధులను ఓడించుటవల్ల, వారి అనంతరము, వారిశిష్యులు బౌద్ధ మందిరముల నన్నిటిని స్వాధీనము చేసికొనిరి. కనుక ఈరోజున బోధగయలోని మహంతు హిందువుడు. బోధగయలోని దేవాలయము విషయమై హిందువులును, బౌద్ధులును చాలకాలము జగడమాడిరి. కాని ఈనాడు ఆ దేవాలయము ఉభయ పక్షములతోకూడిన ఒక జాయింటు కమిటీ చేతిలోనున్నది. ఇప్పు డెటు

వంటి తగాదాలును లేవు. శంకరాచార్యుని వేదాంతము, బుద్ధభగవానుని భూతదయ, కారుణ్యము- ఈ రెంటిసమన్వయమే 'సర్వోదయ దర్శనము'లో సాక్షాత్కారమయినది.

బోధగయలోని దేవాలయము అశోకునిచే నిర్మింపబడిన అతి ప్రాచీన దేవాలయము. ఏ అశ్వత్థ వృక్షముక్రింద కూరుచుండి బుద్ధ భగవానుడు తపస్సుచేసి జ్ఞాన మార్జించెనో, ఆ చెట్టుక్రిందనే ఆ దేవాలయము నిలిచియున్నది. ఈచెట్టుకొమ్మనే ఒకదానిని తీసికొని అశోకుని కుమార్తె సంఘమిత్ర లంకకు పోయియుండెను. అశోక చక్రవర్తి వారమున కొకసారి యిక్కడకువచ్చి, గత వారము దినములలో జరిగిన వృత్తాంతమును లెక్కవ్రాసికొని ఇక్కడ బుద్ధ భగవానునకు నివేదించి ఇక్కడనుండి ప్రేరణపొందిన వాడయి తిరిగి పోవుచుండెను.

దేవాలయమునకు సమీపములో మహాబోధి సొసయిటీవారు విదేశ యాత్రికుల నిమిత్తం ఒక సత్రమును, ఒక పుస్తకాలయమును కట్టించిరి. సమీపములోనే టిబెట్టువారు కట్టించిన ఒక దేవాలయమున్నది. అక్కడ బుద్ధభగవానుని విగ్రహమును, మాయాదేవి విగ్రహమును, ఒక అఖండ దీపమును ఉన్నవి.

సాయంకాలమున బౌద్ధ దేవాలయమున కెదురుగానున్న మైదానములో ప్రజాసభ జరిగింది. వినోబాజీ ఇట్లుపన్యసించిరి : "మనము బుద్ధభగవానుని తొమ్మిదవ అవతారముగా పరిగణించుచున్నాము. ప్రభు రామచంద్రుడు, కృష్ణభగవానుడు, బుద్ధభగవానుడు ఈ ముప్వురును మనలను నిర్మించియున్నారు. ప్రభు రామచంద్రుడు మనకు సత్యనిష్ఠను, గుణశీలములను; కృష్ణభగవానుడు నిష్కామ కర్మయోగమును; బుద్ధభగవానుడు దీనజన సేవయు నేర్పియుండిరి. ఎదురుగానున్న ఈ మహావృక్షమును చూచినారా? ఇక్కడ బుద్ధభగవానుడు తపస్సు చేసియుండెను. ఈ స్థలము అత్యంత పవిత్రమైనది. లోకములోని అన్నిదేశములనుండియు ఇక్కడకు యాత్రికులు వచ్చు

చుందురు. అందువలన ఇక్కడ పరిశుభ్రత ఎక్కువగానుండవలెను. విదేశములనుండి వచ్చిన యాత్రికులను మన మత్యంత ప్రేమతో చూడ వలెను. వారికి భారతీయుల ప్రేమానురాగములు అతిథిపూజ, మొద లయిన సద్ధర్మములన్నియు వెల్లడికావలెను.''

నేటి ఉపన్యాసమునందు వినోబాజీ నవభారతముయొక్క వైదేశిక నీతిని బోధించుచుండెనా యన్నట్లుండెను. అశోకచక్రవర్తి వైదేశిక నీతి కూడ అదే గదా! అస్తమించుచున్న సూర్యుని కిరణ ములు బౌద్ధదేవాలయ కలశముపైన "ధర్మచక్ర ప్రవర్తనము" అను వాక్యమొక్కటియే వ్రాసిపోయినట్లు తోచెను.

సూర్యాస్తమయమయ్యెను. కాని దీప సమూహముల సౌమ్య కాంతులవల్ల బుద్ధదేవాలయము నవ్యతేజస్సుతో ప్రకాశింపజొచ్చెను. హారతికి వేళఅయినది. గంట మ్రోగుచుండెను. బుద్ధభగవాను డా సమయములో నాలోని నాస్తికత్వము నంతటిని పోగొట్టెను. నాకు తెలియకుండగనే భక్తిచే, నేను చేతులు మోడ్చి నమస్కరించితిని. రంగూన్ విద్యాపీఠములో చదువుచున్న బర్మా విద్యార్థిని ఒకామె నా ప్రక్కను కూర్చుండి మెల్లగా, "బుద్ధం శరణం గచ్ఛామి" అను చుండెను. ఆ మంత్రము నా వీనులలోను, హృదయములోను ప్రతి ధ్వనించుచుండెను. అశోక కుమార్తెయయిన సంఘమిత్ర ధర్మచక్ర ప్రవర్తన కొఱకు, ఈ మంత్రమునే ఉచ్చరించుకొనుచు ఏ మందిరము నుండి వెడలిపోయినదో, ఆ మందిరము ఇదే. "నీవేమిచేయుచున్నా" వని సంఘమిత్ర నన్నడుగుచున్నట్లు తోచినది.

ఈనాడు కాలము, "నీకేమి కావలెను, సర్వోదయమా? సర్వ నాశనమా?" అని మానవు నడుగుచున్నది. ప్రతి వ్యక్తియు ఈనాడే ఈ ప్రశ్నకు సమాధానము చెప్పితీరవలెను.

"నీవు నీ హృదయమందిరమున అహింసాదేవిని ప్రతిష్ఠించుకొన్న యెడల, అహింసా ధర్మము నీ జీవితములోని ప్రతి రంగమునందును ఉపయోగించుము." "వ్యక్తి యొక్క చిత్తశుద్ధి, సామాజిక క్రాంతి— ఈ రెండును ఒక్కటే, అభిన్నములయినవి."

"నీవేమి చేయుచున్నా" వని సంఘమిత్ర మాటిమాటికి అడుగుచున్నది.



పదయాత్ర చేయడంలో దమ్మిడీ కూడా ఖర్చు గాదు. ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి వెళ్ళి పరిచయం సంపాదించుకోవాలంటే పదయాత్రను మించిన ఉత్తమ సాధనం వుండబోదు. యువకులు రెండేసి నెలలు, మూడేసి నెలలు యిలా పదయాత్ర చేస్తే నిరీక్షించి గమనించడం పెరుగుతుంది. ప్రేమ భావం వర్ధిల్లుతుంది. జ్ఞాన ప్రచారం అధికమవుతుంది. ఈ విధంగా మనదేశంలో యిదివరకు పర్యటించేవారు. నానక్, నామదేవ్, మాణిక్యవాచర్, శంకరాచార్యులు, రామానుజాచార్యులు, చైతన్య మహాప్రభు యీవిధంగా వందలకొలది ఉదాహరణలు మనముందు ఉన్నవి. దీనివల్ల మీరు వెనుకబడెదరని భావించకండి. పదయాత్రలో చైతన్యలక్షణ ముంది. దానివల్ల మనిషికి దీర్ఘాయువు లభిస్తుంది. కాలినడకన వెళ్ళుటలో సమయం ఎక్కువపడితే ఆయువు పెరుగుతుంది. "మా దగ్గర సమయం లేదు. పనులు త్వరత్వరగా కావాలంటే దేవుడుకూడా తనపనిని త్వరత్వరగా చేస్తాడు. షుప్పయి సంవత్సరములు రాగానే ఇక బయలుదేరు అంటాడు. నల్భై సంవత్సరాలకే యీ ప్రపంచమును వీడవలసి వస్తుంది. మానవుడు నిద్రించునపుడు కలియుగంలో వుంటాడు. పక్కవదలి లేచి కూర్చుంటే ద్వాపరయుగం లోనికి వస్తాడు. లేచి నిలుచుంటే త్రేతాయుగంలోనూ, నడవడం ప్రారంభిస్తే కృతయుగంలోనూ వుంటాడని మన స్మృతులు చెప్పాయి. అందుచేత మనం దేశంలో కాలినడకన ప్రచారం చెయ్యాలి. పదయాత్ర భారతీయ ప్రచార రీతి."

— వినోబా.

# సర్వోదయ భూదాన సాహిత్యము

| | | |
|---|---|---|
| గీతాప్రవచనములు | వినోబా | 1-0-0 |
| వర్తకులకు పిలుపు | ,, | 0-1-0 |
| గిరిప్రవచనము | ,, | 0-1-0 |
| మనఐక్యత-గ్రామ ఆరోగ్యము | ,, | 0-3-0 |
| పవిత్ర సన్నివేశములు | మృదుల మూందడా | 0-8-0 |
| వినోబాజీ జీవితం | లవణం | 0-3-0 |
| విద్యార్థులారా రండి ! | ,, | 0-2-0 |
| భూదాన ఆరోహణము | నారాయణదేశాయి | 0-12-0 |
| సంపత్తిదానము | కృష్ణదాస్ జాజూ | |
| జీవనదానము | జయప్రకాశ్ నారాయణ్ | |
| సామ్యయోగపథముపై | దాదా ధర్మాధికారి | |
| భూక్రాంతి వెల్లువ | మనమోహన చౌదరీ | |
| సర్వోదయ చరిత్ర - శాస్త్రము | శంకరరావ్ దేవ్ | |
| శ్రమదానం | శివాజీభావే | |
| శిక్షణవిచారధార | వినోబా | |
| సాహిత్యం - సాహితీవేత్తలు | ,, | |
| కాంచీపుర సందేశం | ,, | |

ధరలు వేసిన పుస్తకములు అచ్చు అయిఉన్నవి. మిగిలినవి త్వరలోనే వెలువడ నున్నవి.

సర్వోదయ సాహిత్య ప్రచార సమితి

భూదాన కుటీరం, హైదరాబాదు - 1.



ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి.

1950



[వెల 1—8—0

శ్రీ

# వంగవిజేత

ఇది

శ్రీ రమేశచంద్ర దత్తు గారి వంగభాషలోని మూలగ్రంథమునకు
గావింపబడిన కర్ణాటక పరివర్తనము నుండి
వేంకట పార్వతీశ్వర కవులచే
నాంధ్రీకరింపఁబడినది.

II

శ్రీ రామచంద్ర

# వంగవిజేత

## మొదటి ప్రకరణము

Whil the ploughman near at hand,
Whistles O,er the furrowed land,
Aud the milk maid singeth blithe,
And the mower whets his Scythe,
And every Shepherd tells his tale,
Under the hawthorn in the dale.
Milton.

క్రీస్తుశకము పండ్రెండువందల నాలుగవసంవత్సరమున వంగ బిహారు దేశములందు హైందవపరిపాలనము లోపించి పోయెను. అది మొదలుగఁ బదునేనువందల యిరువదినాలుగవసంవత్సరము వఱకును మూడువందల యిరువదివత్సరము లాదేశముల నాఫ్ఘనులో, పఠానులో పరిపాలించుచుండిరి. వారుకూడ నొక్కొకప్పుడు ఢిల్లీశ్వరు నకు లోఁబడియుండుట కంగీకరించుచుండిరి. కాని సమయము దొరకి నప్పుడు మరల స్వాతంత్ర్యమును వహించుచుండిరి. వారి రాజ్యతంత్ర మనేక విషయములందు యూరపుదేశీయుఁ డగు ఫ్యూడల్ రాజ్య తంత్రమును బోలి యుండెను. రాజ్య సింహాసనము శూన్యమై యున్నచో నొక్కొకవేళ రాజపుత్రులును రాజులగుచుండిరి. ఒక్కొ క్కకాలమున సేనానాయకులే తమ బాహుబలమువలన సింహాసనా రూఢు లగుచుండిరి. దేశాధీశ్వరుఁడగు నాతఁడు సర్వోత్కృష్ట మగు నొక మండలమునుమాత్రమే తన యధీనమున నుంచుకొనుటచే మిగిలిన మండలములు దండనాథుల యధికారమునకుఁ జేరుచుండెను.

దండనాయకులు తమతమ మండలములయందలి భూములను తమకు లోఁబడియున్న కృషికుల కొసంగుచుండిరి. ఆదండనాయకులు నిజముగ వంగదేశాధీశ్వరునకు లోఁబడకుండుటయే కాక సమయము దొరకి నప్పుడు తమ మండలమునకుఁ దామే ప్రభువులై స్వతంత్రపరిపాలనము చేయుచుండిరి.

పఠానుల ప్రభుత్వమునందు హిందూజమీందారులకు విశేషాధికారములును, ప్రభుత్వములును లభియించి యుండెను. పఠాను ప్రభువులలో నొక హిందూప్రభువుకూడ నుండెను. క్రీస్తుశకము పదుమూఁడువందల యెనుబదియైదు సంవత్సరమునందు గణేశరాజను నాతఁడు వంగదేశమున నేడు సంవత్సరములవఱకును తన ప్రభుత్వమును స్థాపించి నిరపాయముగ రాజ్యమును బరిపాలించి యుండెను. ఆతఁడు మొట్టమొదటఁ జిన్న జమీనుదారుఁడై యున్నను, బాహుబలంబునను సాహసమునను వంగదేశసింహాసనము నవలీలగ సంపాదించెను. తరువాత నాతనికుమారుఁడు మునల్మానుమతము నవలంబించి యాతఁడును నాతని వంశమువారును నలువదియేండ్లు పర్యంతము వంగదేశమును పరిపాలించిరి.

మొగలాయీలు వంగదేశమును జయించినప్పుడు జమీందారులయొద్దనున్న సైన్యమంత స్వల్పముగానుండలేదు. ఎనిమిదిలక్షల కాల్బలమును, నిరువదిమూఁడు వేలగుఱ్ఱపుదళమును, నాలుగు వేలయుద్ధ పడవలను నుండెను. ఆజమీందారులలోఁ జాలమంది కాయస్థులై యుండిరి. వారే యీ దేశమునకుఁ బ్రభువులై యుండిరని చెప్పవచ్చును. [illegible] కృషికులును, ప్రజలను సంపూర్ణముగ వారియధీనమునందే యుండిరి. ప్రజలలోఁ బరస్పరాభియోగవ్యవహారములు లున్న యెడల వానిని జమీందారులుగాని, వారలకుఁ గార్యనిర్వాహకులు [illegible] గాని తీర్చుచుండిరి. చోరుల మొదలగువారిని బట్టి

వారే శిక్షించుచుండిరి. ప్రతిగ్రామమునందును వారే శాంతి నెలకొల్పి ప్రజలను కాపాడుచుండిరి. ప్రజలకందఱకును వారే తల్లిదండ్రులై యుండిరి. మొత్తముమీఁద జమీందారులే ప్రజలకుఁ బరిపాలనకర్తలును, విచారణకర్తలు నై యుండిరి. వారే ప్రజలకు రక్షకులును, రాజులు నై యుండిరి. ఈవిధముగాఁ బఠానులయధీనమునందున్న వంగదేశమున హిందువులపరిపాలనమే ప్రబలమైయుండెను.

క్రీస్తుశకము పదునేనువందల డెబ్బదిమూఁడవ సంవత్సరమునఁ బఠానుప్రభుం డగుదాయూదుఖానుఁడు వంగదేశసింహాసనమునధిష్ఠించెను. ఆమరుసటిసంవత్సరముననే యక్బరుమహా దేశమునుజయింప నిశ్చయించి స్వయముగా వచ్చి పాట్నానగరమును స్వాధీనపఱచుకొని మనాయిమఖాను నచ్చట సేనానాయకునిగా నొనరించి మరల డిల్లీకిఁ బోయెను. మనాయిమఖానుఁ డచ్చట నామమాత్రదండనాయకుఁడుగనే యుండెను. క్షత్రియచూడామణి యగుతోడరుమల్లుఁడు దాయూదుఖానుని మాటిమాటికి నోడించి తుట్టతుదకు కటకముకడ జరిగిన మహారణమున సంపూర్ణవిజయలాభమునందెను. అందువలన దాయూదుఖానుఁడు భయపడి పదునేనువందలయిరువదినాలుగవసంవత్సరమున వంగబీహారుదేశములను మొగలాయీలకు వదలివైచి "బిహిస్సా" ప్రదేశమును మాత్రము తనయధీనమునం దుంచుకొనియెను ఈప్రకారము సంధిజరిగినతరువాత తోడరుమల్లుఁడు డిల్లీకి బయలుదేరిపోయెను ఇట్లుజరిగినతరువాత దాయూదుఖానుఁడు సమయము దొరకినదని యెంచి సంధిమాటయే మఱచి దేశమును మరల స్వాధీనపఱచుకొనియెను. పదునేనువందలడెబ్బదియాఱవసంవత్సరమున నక్బరుమహా హుసన్‌కులీఖానుని సేనానాయకునిఁ జేసెను. అతఁడు పేరున మాత్రము దండనాయకుఁడై యుండెనుగాని తోడరుమల్లుఁడే [illegible] స్వతంత్రముగ రెండవసారి వంగదేశమునకు వచ్చి [illegible]

మహారణముచేసి దాయూదుఖాను నోడించెను ఆఘోరయుద్ధమునందు దాయూదుఖానుఁడు మరణించెను. అప్పుడు డిల్లీశ్వరుఁడగునక్బరు హుసన్‌కులీఖానుని వంగబీహారుదేశములకు శాసనకర్తనుగా నియమించెను. తోడరుమల్లుఁడు తిరిగి డిల్లీకిఁ బోయెను. పదునేనువందలయెనుబదియవవత్సరమునమరలవిద్రోహానలముప్రజ్వలించినది. జమీందారులుకూడ విద్రోహులై కట్లుకట్టి తిరుగఁబడిరి. అక్బరుమహావిశేషబుద్ధిమంతుఁ డగుసార్వభౌముఁడు మొట్టమొదట రెండుసారులు శత్రువులగుపఠానులను జయించినవీరుఁడు హిందూసేనానాయకుఁడే యగుటవలన హిందువులుక్కా నితరజాతివారు వంగదేశప్రతినిధులయినచో దేశీయులసాహాయ్యమునుతీసికొని రాజవిద్రోహులనడఁగింపఁజాలరని యక్బరు బాగుగ గ్రహించి పదునేనువందలయెనుబదియవసంవత్సరమున తోడరుమల్లు నచ్చటసేనానాయకునిగను శాసనకర్తగను నియమించి వంగదేశమునకుఁ బంపెను. నిర్భీకుఁడగునావీరపురుషుడు మూఁడవసారి వచ్చి వంగదేశమును జయించి ఒరిస్సావంగబీహారుదేశములను పరిపాలించినరెండుసంవత్సరములలోను జరిగినచర్యల నవలంబించి యీగ్రంథము వ్రాయఁబడుచున్నది కావున నాసమయమునందు హిందువులకును ముసల్మానులకును, జమీందారులకును, ప్రజలకును, పఠానులకును, మొగలులకును గలపరస్పరసంబంధమునుగూర్చి ప్రప్రథమమున సంక్షేపముగఁ దెలుపవలసివచ్చినది.

ఒక దినమునఁ బ్రాతఃకాలమునం దొక బ్రహ్మచారి నదియామండలమునఁ బ్రవహించుచున్న యిచ్ఛామతీనదీతీరమునందున్న రుద్రపురమనునొకపల్లెటూరి కభిముఖుఁడై పోవుచుండెను. నలుదెసలను పచ్చనిపైరులతో నిండియున్నపొలములు దృగ్గోచరము లగుచుండెను. ప్రభాతమందమారుతము చల్లగ నల్లనల్లన వీచుచు నాసస్యముల నాడుచుండెను. మనోజ్ఞములై శ్యామలవర్ణసంశోభితంబు లగు [illegible]

ములుకూడ మెల్లమెల్లగఁ జలియించుచు నాప్రభాత వాతములతోఁ నాడుకొనుచున్నట్లుండెను. చాలదూరమువఱకువ్యాపించియున్న యాపొలములకవ్వలఁ జేసిచాటుననొకటిరెండుపల్లెలున్నట్లు కానవచ్చుచుండెను—ఇండ్లగపడుటలేదు. అందందు దట్టముగఁ బెరిగియున్న చెట్లగుంపులు లోచనగోచరము లగుచుండెను. ఆకాశము నీలవర్ణమునుదాల్చియుండెను. కలవిహంగములు గానముచేయుచుండెను. పల్లెనుండివెలువడిన రైతులుకూడ మార్గమధ్యమున నత్యుత్సాహముతో గానము చేయుచుండిరి. ఆమార్గమధ్యమునఁ బోవుచున్న బ్రహ్మచారి యొకమార్గస్థునిం జూచి "రుద్రపుర మింకెంతదూర మున్నది?" అని యడిగెను.

మార—ఎంతయోదూరము లేదు. ఒక్కమైలున్నది. అదిగో! ఆయెదుటనున్న చెట్లగుంపు దాఁటినచో నూరగపడును.

ఆమార్గస్థునకు నలువదివత్సరముల వయసుండవచ్చును. జాతియం దాతఁడు కైవర్తుఁడు ఆతఁడు బ్రహ్మచారికి నమస్కరించి "సామీ! మీరు రుద్రపురమునకుఁ బోయెదరా? నేనాయూరివాఁడనే-మీతో గూడ వచ్చెదను. మీనామధేయ మేమి? మీ దేయూరు?" అని ప్రశ్నించెను.

బ్రహ్మ—నాపేరు శిఖండివాహనుఁడు నేనిచ్ఛామతీనదీతీరమునఁ దున్నమహేశ్వరమందిరమునుండి వచ్చుచుంటిని. నీపేరేమి?

మార్గ—నాపేరు నవీనదాసుఁడు. ఇక్కడ నాకుఁ గొంతపొలమున్నది. దానిని చూచుకొన పోవుచుంటిని.

శిఖం—ఈసంవత్సరమునఁ బైరులు, పంటలు నెట్లున్నవి?

నవీ—స్వామీ! ఇప్పుడు నాకు నలువదియేండ్లున్నవి. ఈయేఁడుపండినంతపంట నేనెన్నఁడును చూచియుండలేదు. ఈసంవత్సరమునఁ బరమేశ్వరుని పరిపూర్ణవాత్సల్యమునకు మేరయే లేదు.

ఇట్లు చెప్పి నవీనుఁడు కొంతసేపూరకయుండిమరల "స్వామీ! మా జమీందారునికుమారుని సంగతి యెట్లున్నదో వింటిరా?" అనియెను.

శిఖం—లేదు. ఎట్లున్నది?

నవీ—అతఁడొకవిధముగ పిచ్చివానివాలె నైపోయెను. కారణమేమియో యెవ్వరికిని దెలియలేదు. అతని యారోగ్యముం గూర్చి వలయునని వైద్యులు మిగుల శ్రమపడుచున్నారు కాని యందువలన నేమియును లాభము గనపడుట లేదు. మీరు చాలఁ దెలిసినవారివాలె నగపడుచున్నారు. అతని పిచ్చి కుదురుటకేమైన నుపాయము చేయఁగలరా?

శిఖం—శాస్త్రములయందు పిచ్చియనురోగము సంభవించుటకనేక కారణములు తెలుపఁబడియున్నవి. బంధువియోగమో భామాప్రణయమో—

నవీ—అట్టివేవియును కావు. రాజకుమారుఁ డెల్లప్పుడు నేమేమో పరస్పరసంబంధము లేని మాటలాడుచుండును. ఆమాటలకు సమయము సందర్భము లేదు. తుది మొదలు లేదు చాలఁ జదువుటచే మతిచెదరినదని యనుకొందును.

శిఖం—అతఁడు నిరంతరము నెట్టిమాటలాడుచుండునో చెప్పఁగలవా?

నవీ—అతఁ డొకసారి 'వైరినిర్యాతనమే పరమసుఖము' అనియు, నింకొకసారి 'సతీరత్నమే సర్వోత్తమరత్నము' అనియు, మఱియొకసారి 'బంధుహత్య పరమపాతకము' అనియు, వేఱొకసారి 'ప్రజలకష్టములను చూచుచు నూరకుండుటకంటెఁ బ్రాణముల త్యజియించుటయే మేలు' అనియుఁ బలుకుచుండునని నేను విని యుంటిని.

శిఖం—(చాలసేపాలోచించి) అతఁ డేదియో యతిదారుణంబగు నొక పాపకృత్యము నాచరించి యుండును. మహాపాపము చేసినచో మనోవైకల్యము కలిగి తుదకుఁ బిచ్చియెత్తుటకూడఁ గలదు.

నవీ—ఆతఁ డెట్టిపాపకార్యమైన నెన్నఁడైన జేసియుండు నని నేను నమ్మఁజాలను.

అనిచెప్పి నవీనదాసుఁ డేదియో పూర్వవృత్తాంతమును జ్ఞప్తికి దెచ్చుకొనువానివలెఁ గొంతసేపూరకుండి పిమ్మట మరలఁ జెప్ప నారంభించెను 'స్వామీ! ఆతనియంతఃకరణ మతిదయాశీతలమైనది. అంతటిభూతదయాపరవశుఁ డగువాఁ డెట్టిపాపము చేయగలఁడు? ఇప్పటికిఁ బ్రెండువత్సరములకు ముందు నేనొకసారి మారాజధాని యగునిచ్ఛాపురమునకుఁ బోయి యుంటిని. అప్పుడు నలుగురైదుగురు పేదరైతులు తమపాలముపన్ను చెల్లింపఁజాలక చెఱసాలయం దుంపఁ బడిరి. మారాజకుమారున కప్పటి కెనిమి దేండ్లయీడుండవచ్చును. అప్పుడాతఁ డెవ్వరు నెఱుఁగకుండఁ గారాగారద్వారముకొద్దకువచ్చి తలుపులను దెఱచి లోనికిఁ బోయి యొక్కొక్కరైతునకు రెండేసిరూపాయల నిచ్చెను. అప్పు డారైతులు తమపన్నులను చెల్లించి బంధవిముక్తులై పరమానందమున నిండ్లకుఁ బోయిరి.

శిఖం—తరువాత?

నవీ—పిమ్మట నందఱకు నాశ్చర్యము కలిగెను. ఈ పేదరైతులకుఁ బన్ను చెల్లించుటకు ధనమెచ్చటనుండి వచ్చినది? ఎవ్వరిచ్చియుందురు? అని సందేహించిరి. కాని యెవ్వరిని బోధపడ లేదు. తుదకు రైతు లందఱును వారియిండ్లకుఁ బోయినతరువాత రాజకుమారుఁడు భయముతోఁ దండ్రియొద్దకుఁ బోయి తాను చేసినదంతయు నాతని కెఱింగించెను. తండ్రియగునగేంద్రనాథుఁ డాసంగతి విని కుమారు నెత్తికొని తొడలపైఁ గూరుచుండఁబెట్టుకొని ముద్దాడెను. ద్వారము నొద్ద నిలిచియున్న నేనప్పు డంతయుం జూచి యానందబాష్పముల విడిచితిని.

ఇట్లు సంభాషించుకొనుచు వారిరువురును రుద్రపురమునఁ బ్రవేశించిరి. ఆగ్రామమునకుఁ జుట్టును వివిధములగువృక్షములు విశాల

శాఖాప్రకాండములచే మిన్నుముట్టి వెలుపలనున్నవారి కట నొక యూరున్నదని గ్రహియించుట కవకాశము లేకుండఁ జేయుచుండెను. తరుప్రాంతరాళంబులనుండి సూర్యకిరణంబులు వెలువడి క్రిందబడి యున్న జీర్ణపర్ణతరంగములమీఁదను, గ్రామమునకుఁ బోవుచున్న మార్గముమీఁదను ప్రసరించుచుండెను. తరుశాఖలపై వివిధంబులగు సుందరవిహంగములు గానముచేయుచుఁ దమతమహృదయోల్లాసములను సూచించుచుండెను. అక్కడక్కడనున్న పుర సరోవరములయందున్న సరోజముఖకుసుమంబులు వికసించి పరిమళించుచు సరసౌందర్యముల నతిశయింపఁజేయుచుండెను. ఒక్కొక్కచో దరుషండములయందొకటి రెండుగుడిసెలు కానవచ్చుచుండెను. అందొకరిద్దఱుకృషికులు నిరాతంకముగఁ బాడుకొనుచు దారిపట్టి పొలములకుఁ బోవుచుండిరి. కృషి యువతులు జలప్రపూర్ణంబులగు మృణ్మయ పాత్రములను సందిట నిరికించుకొని గ్రామవృత్తాంతములం గూర్చి సంభాషించుకొనుచు మెల్ల మెల్లగ నిండ్లకుఁ జేరుకొనుచుండిరి.

శిఖం—"మహాశ్వేత" యను పేరుగలవిగతభర్తృకయగు నొక కాంత యీగ్రామమునందున్న దని వినియుంటిని. ఆమెయిల్లెక్కడ?

నవీ—ముందునకు నడవవలయును. నే నామెగృహమును చూపించెదను.

ఇరువురును కొంతదూర మరిగినతరువాతనవీనుఁడు మహాశ్వేత గృహమును నాబ్రహ్మచారికిఁ జూపించెను,

శిఖండిహావాసుఁడు మహాశ్వేత యింటియతిథి యయ్యెను. నవీనదాసుఁడు బ్రహ్మచారికి నమస్కరించి యాతని పాదపరాగమును తనశిరంబునఁ దాల్చుకొని సెలవంది వెడలిపోయెను.

---

## రెండవ ప్రకరణము



She stole along, she nothing spoke,
The sighs she heaved were soft and low,
And naught was green upon the oak,
But moss and rarest mistletoe:
She kneels beneath the huge oak tree,
And in silence prayeth she,

Coleridge,

ఒకటి రెండువారములు గడచియుండవచ్చును. నాఁడు శుక్లపక్ష చతుర్దశి. కాని, మేఘము లాకసమున మూసికొనియుండెను. గ్రామము, భూమి, వనము మొదలగునవి యన్నియు నంధకారమున మునిఁగిపోయియుండెను. ఖద్యోతమాలికలు తరులతాదులపై నున్న నిబిడాంధకారమును మెఱయించుచుండెను. ఇచ్ఛామతీనది కూలంకషము గనిండి తరంగ మాలికలచేఁ దోలఁకుచుఁ బ్రవహించుచుండెను. నిశామారుతవేగమునఁ దరంగహారము లెగసి పడిపోవుచుండెను. సాంద్రారణ్యమునందలి పొదలనుండి గాలి రివ్వురివ్వున వీతెంచుచుండెను. ఆ వాయునిస్వనమును, తరంగశబ్దమును తక్క మఱియెట్టిధ్వనియును వినవచ్చుట లేదు. జగమంతయు నిద్రాముగ్ధమై యుండెను.

అట్టిగాఢాంధకార సమయమున నంతటిచలిగాలిలో శుభ్రవసనధారిణియగు నొక కాంత యేకాకినియై నదిలో స్నానము చేయుచుండెను. ఆమె యేదియో యొకవ్రతము నాచరించుచున్నట్లు తోఁచుచుండెను. ఆయంధకారమున నామె ధరించిన తెల్లనివస్త్రముతక్క మఱి యేమియు నగపడుట లేదు. ఆమె స్నానముచేసినతరువాత వనమునందలిపుష్పములను గోసికొని వచ్చి సమీపముననున్న పురాతన వటవృక్షముక్రింది శివాలయములోనికిఁ బోయి తలుపులు మూసికొనియెను.

ఆ దేవాలయమున శ్వేతశిలానిర్మితంబగు చిన్న శివలింగము కలదు. ఆ దేవుని పార్శ్వమున నొక దీపము ప్రజ్వలించు చుండెను. ఆ వెలుతురామె మేనిమీఁదను, వస్త్రముమీఁదను ప్రసరించు చుండెను. ఆమెకు యౌవనావస్థ గడచి చాలకాల మైనది. నలువది యేండ్లకు మించియుండవచ్చును. కళావిహీనమై వాఁడియున్న యామె శరీరమును; తలయందలి యొకటిరెండు శ్వేతకుంతలములను చూచి నచో నామె కేఁబదియేండ్లు మించినను మించియుండ వచ్చునని తోఁచును. శరీరము కాంతి విహీనమైనను సమున్నతమై, కోమలమై యుండెను. లలాటమున్నతమై ప్రశస్తమై యున్నను చింతారేఖలచే గంభీరముగఁ జిహ్నితమై యుండెను. విరిసినకుంతలములు కపోలము లను, వక్షమునను గుచ్ఛగుచ్ఛములుగఁ బడియుండెను. ఆమె నేత్ర ములకుఁ గలకాంతి తరుణీమణుల కన్నులయందుఁగూడ నుండఁబోదు. కాని యది యువతీనేత్రద్యుతి వంటిది కాదు. హృదయచింతానల స్ఫులింగములు నేత్రములనుండి యుట్టిపడుచున్నట్లుండెను. పెదవులు చిన్నవయ్యును దృఢప్రతిజ్ఞను సూచించుచుండెను. ఆపాదమస్తక మును గంభీరమై యున్నతమై వితంతువుల కుచితంబగు వస్త్రముచే నావృతమై యతి పవిత్రతాద్యోతకమై యుండెను. ఆమె తాను తెచ్చిన వనపుష్పములచే దేవునిం బూజించి సాష్టాంగదండప్రణామ మాచరించెను.

ఆమె యట్లే చాలసేపు పూజ చేయుచుండెను. వాయువేగము క్రమక్రమముగఁ బ్రబలమగుచుండెను. అప్పుడప్పుడా దేవాలయ ద్వారకవాటములు గణగణకొట్టుకొనుచుండెను. తైలశూన్యంబగుటచే నాలయమునందలి దీపము క్రమముగ హరించుచుండెను. కాని, యామె మొగమునఁ గొంచెమేని వైలక్షణ్య మగపడుట లేదు. కన్నులు మూసికొని నిశ్చలావయవయై స్థిరహృదయముతో జాము